ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# భాగవతకథ

## 39వ భాగము

గ్రంథకర్త - శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారి

అనువాదం - శ్రీ కుందుర్తి వేంకట నరసయ్య

భాగవతకథా గ్రంథమాల 39వ పుష్పము

# భాగవతకథ

[శ్రీకృష్ణుని బాల లీలలు]

శ్లో॥ వ్యాసశాస్త్రోపవనతః సుమనాంసి విచిన్వతా,
కృతా వై ప్రభుదత్తేన మాలా భాగవతీ కథా॥

ప్రకాశకులు :

భాగవతకథా గ్రంథమాల,
బుద్ధాం. P. O. (గుంటూరు జిల్లా)
బ్రాంచీలు: బందరు. తణుకు. లక్కవరం.

[వెల : 12-00

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :

నటరాజ పబ్లికేషన్సు
ఏలూరు రోడ్డు ✳ విజయవాడ-2

# విషయసూచిక

# 39 భాగం

# శ్రీకృష్ణుని బాలలీలలు

## గోకులమునకుఁ బూతన యేతెంచుట

(రాగిళి)

శ్లో॥ కంసేన ప్రహితా ఘోరా పూతనా బాలఘాతినీ।
శిశూంశ్చచార నిఘ్నంతీ పురగ్రామ వ్రజాదిషు॥
సా ఖేచర్యేకదోపేత్య పూతనా నందగోకులమ్।
యోషిత్వా మాయయాత్మానం ప్రావిశత్ కామచారిణీ॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౬అ. ౨, ౩, శ్లో॥

సీ॥ కంసుపంపున బాలఘాతిని పూతన
పల్లెల మందలఁ బట్టణముల
నిల నెల్లచో బాలహింసఁ గావించుచు,
జనుచు నెవ్వనిపేరు శ్రవణవీథిఁ
బడినయంతన సర్వభయనివారణమగు,
నట్టి దైత్యాంతకుం డవతరించి
యున్న నందుని పల్లెకొకనాఁడు ఖేచరి,
యైవచ్చి యందు మాయాప్రయుక్తిఁ

తే. గామరూపిణియై చొచ్చి కానకుండ
నరిగి యిల్లిల్లుఁ దప్పక యరసికొనుచు
నందగృహమున బాలుని నాదమొకటి
విని ప్రమోదించి సుందరీవేష యగుచు॥

శ్రీమదాంధ్ర భాగవతము

ఒక్కొక్కప్పుడు సంకోచవశమునఁబరిణామమున నొకటి చేయఁబోయిన నింకొకటి అగుచుండును. భ్రమవశమున నొకఁడొకటి యనుకొనిన నింకొకఁడింకొకటి యనుకొనును. ఒకదొంగ గురుసమ్ముఖమునఁ దా నసత్యమును బలుకనని ప్రతిజ్ఞ నొనర్చెను. రాజుకడకు మిక్కిలి ప్రయత్నముతో దొంగిలింపఁబోయెను. మంచి వస్త్రభూషణములను ధరించి నిర్భయుఁడై పోయెను. కావలివాఁడు 'నీవెవఁడ' వని యడిగెను. అతఁడు నిర్భయుఁడై నేను చోరుఁడ ననెను. దైవవశమున నారోజులలో మహారాజుయొక్క బావమఱఁది వచ్చెను. కావలివాఁడిట్లనుకొనెను:— "చోరుఁడైనచో నిట్లు నిర్భయముగఁ బోఁజాలఁడు. చోరుఁడనని చోరుఁడు తన నోట నెట్లు చెప్పగలఁడు? నిశ్చయముగ నతఁడు రాణియొక్క తమ్ముఁడై యుండవచ్చును," ఈ సంకోచములోఁబడి వాని నడ్డుపెట్టలేదు. అతఁడు నిర్భయుఁడై ప్రవేశించి మంచిగుఱ్ఱమును హరించుకొని అట్లే వచ్చివేసెను. ఇట్లే భ్రమవశమున ననేకములగు పొరపాట్లు జరుగుచుండును. పరిస్థితిని బట్టి అడుగుట సంభవింపదు. వెంటనే అవిశ్వాసమును జెందుటయును జరుగదు. ఇట్టి పరిస్థితులందు దుస్సాహసులగువారు తమ స్వార్థములను సిద్ధింపఁజేసికొనుట కనువేర్పడును.

సూతుఁడిట్లనెను:— "మునులారా! నందునకు వసుదేవుని మాటలను వినఁగానే అనుమానము కలిగెను. ప్రేమము నందడుగడుగునకును ననిష్టశంక యుండును. నాబిడ్డకనిష్టము జరుగునని వసుదేవుఁడు దేనినిఁబట్టి చెప్పియుండును? నేను వ్రజ మందరునుఁ గుశలముగ నుండఁగా వదలివచ్చితిని. మా యింట నాఱుదినములనుండి అవిచ్ఛిన్నముగ నుత్సవము జరుగు

చుండినది. ఇంతలోనే గోకులమందేమి యుత్పాతము సంభవింపఁగలదు? వసుదేవుఁడు సాధారణుఁడు కాఁడు ఆతని కేదైన నాభాసమాత్రముగాఁ దెలిసియుండవలెను. నేనిచట మార్గమున నున్నాను. ఏమి చేయఁగలను? ఈవిధముగ నాలోచించుకొనుచు నందుఁడు మార్గమునఁ బోవుచుండెను. ఆతని కేమియునుఁ దోచక పోవఁగా నాతఁడు శ్రీహరిని శరణు వేఁడెను. విశ్వపాలన మొనర్చువాఁడును, చరాచరప్రాణుల రక్షించువాఁడునగు వాఁడెవఁడో ఆతఁడే నాపిల్లవాని నుత్పాతముల నుండి రక్షింపఁగలఁడు. ఈవిధముగ నాతఁడు మనస్సును సమాధానపరచుకొనుచు శీఘ్రముగా గోకులమునకుఁ బోవుచుండెను.

ఇచ్చటఁ గంసుని మంత్రిణియుఁ గంసునిచే నక్కాయని పిలిపించుకొనునదియునగు బూతన వ్రజమందుగల పదిరోజుల లోపు బాలురను బది దినములలోపలఁ జంపఁగలనని ప్రతిజ్ఞను చేసెను. కంసుఁడిట్లడిగెను:– "అక్కా నీకొఱకెట్టి రథమును సిద్ధమొనర్పవలయును. వ్రజ మెనుబదినాలుగు క్రోసులున్నది. పాదచారివై నీవెచ్చటెచ్చటికని పోఁగలవు?"

పూతన యిట్లనెను:_ "అక్కఱలేదయ్యా! నాకు జలయానము గాని, స్థలయానము గాని, వాయుయానము గాని అక్కఱలేదు. నీవు పూర్వజన్మమునఁ గాలనేమియను నసురుఁడవెట్లో అట్లే నేనును పూర్వజన్మమందు రాక్షసిని. నేనిచ్చట వ్రజమందు మానవయోనియందు జన్మించినను నాకు రాక్షసవిద్యలన్నియును దెలియును. నేను కామచారిణిని. నా యిష్టమువచ్చినట్లు రూపమును మార్చుకొనఁగలను, ఆకా

మున నెగురగలను. అన్నిటికంటె గొప్ప రూపమును గాని, అన్నిటికంటె చిన్న రూపమునుగాని, అందరకంటె సుందర రూపమును గాని, అన్నిటికంటెఁ గురూపమును గాని నేను ధరింపఁగలను. నేను భోజనమైనతరువాతఁ గుచములకుఁ గాలకూట విషమును బూసికొనియింటింటికిపోయెదను. పసిపిల్లలకు విషమిశ్రితమగు దుగ్ధమునొసంగి చంపివేయుదును. నీకు శత్రు వుండిన వ్రజములోనే యుండవలయును. పిల్లలందరితోబాటుగా నాతఁడు కూడ చావఁగలడు."

కంసుఁడిట్లనెను:- "అయితే నీకార్యక్రమ మేమి?"

పూతన యిట్లనెను:- "నాకార్యక్రమ మత్యంతగుప్తముగ నుండును. నేనేదివమున నేదిశలోఁ బ్రయాణ మొనర్తునో ఇది నేనెవరికినిఁ జెప్పను"

కంసుఁడిట్లనెను:- "ఈ యుపాయము బాగున్నది. మనశత్రువు నశింపగలడు. ప్రజావిద్రోహమును కలుగదు. నీవు సద్యోజాత శిశువులను జంపుట కారంభించుము."

ఇది విని పూతన వ్రజమంతటను తిరిగి పసిపిల్లలకు విషమిశ్రితపయఃపాన మొనరింపచేయుచు చంపుచుండెను. సమస్త గ్రామములందలి బాలకులు చంపబడగాఁనే ఆమె యిట్లను కొనెను:- నందవ్రజమునందు గోపకుల గ్రామములు జాలగ గలవు. గోకులమందు లక్షలకొలది గోపకులు నివసించు చుందురు. పోయి వారిపిల్లలను జంపెదను." అని గోకులము నైపున కేగి రెను.

అంతశౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! భగవంతుని మూలమునఁ జాలమంది నిరపరాధులగు శిశువులు వ్యర్థముగఁ

జంపఁబడిరి. సద్యోజాత శిశువులేమి యపరాధము నొనర్చిరి ? వారివధ భగవంతుని కిష్టము కాకుండినచో నామెబుద్ధి నాతఁడేల మార్చియుండఁగూడదు? మొదటి దినముననే ఆమె గోకులము వచ్చునట్లు ఆమె బుద్ధిని మార్చి యుండినచో మొదటి దినముననే తాను జేసినదానికి ఫలమనుభవించెడిది. ఏడుదినములు భగవంతుడు చిన్నచిన్న బాలకుల నేలఁజంపించినాఁడు?

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను;- "స్వామీ! ఈప్రశ్న జన్మము శ్రేష్ఠమని నత్యంతావశ్యకమనియును, మరణము నికృష్టమును ననాంఛనీయమునని భావించు వారలకే కలుగును; కాని యెవని దృష్టిలో జనన మరణములు రెండును నావశ్యకములు, నుపయోగ కరములో వారికీ ప్రశ్న మహత్వములోనిదికాదు. తోటమాలి తాననేక మొక్కలను నాటును. ఆమొక్కలతోబాటుగాఁ జాల ననావశ్యకములగు మొక్కలును నుత్పన్నములగును. ఇందులో నే మొక్కలవసరములో ఏ మొక్కలనావశ్యకములో ఉద్యాన వనమును రక్షించు తోటమాలికిఁ దెలియును. ఏవి రక్షణీయములో, ఏవి యుపేక్షణీయములో తెలియును. అతని కేమొక్కయందును ద్వేషము లేదు. కాని తోటను సుందరముగఁ నుంచుట ఆతని కార్యము. ఏమొక్కచేఁదోటసౌందర్యమునకు భంగము కలుగునో, పుష్పించి ఫలించు మొక్కల కేగడ్డిగాదములను, గలుపును, బెరుగకుండ చేయునోవానిని, గంటకవృక్షములను నాతఁడు కొట్టివేయును. కొన్నిటినిఁ బుట్టగానే పెరికి వేయును, కొన్నిటిని బెరుగనిచ్చి అవిపెద్దనైన తరువాతఁగోసి వేయును. కొన్నిటి కొమ్మలను నరుకును. కొన్నిటిని నొకటా

కటికలిపి అంటును గట్టును. ఈ విధముగనే విష్ణు భగవానుని కార్యము ప్రాణులను రక్షించుటయే. జగత్ప్రవాహమును స్థిర ముగనుంచుట. దీని కే యసురుడైనను రాక్షసుడైనను, పశు పక్ష్యాదులైనను, మానవుడైనను బాధను గలిగించినచో వారిని వినాశ మొనర్చును. కొందఱను బెంచి చంపును. కొందఱను బుట్టఁగానే చంపును. ఆ దినములలోఁ గంసపక్షమును ప్రబలమొనర్చుటకై అసంఖ్యాకులగు నసురులు వ్రజమందుద్భవించి నట్లు తోఁచుచున్నది. భగవంతు డిట్లనుకొనెను:_ "ఇప్పుడీ సద్యోజాత శిశువులమీద నేనేమి చేయు చేసికొందును. పూతన ద్వారానే వీరిని ఇతి(శ్రీ) యొనర్చెదను. ఈమె నావద్దకు పారితోషికమునకై వచ్చినపుడీమెకు మోక్ష మార్గమును చూపెదను. ఈమెకు సాంసారిక బంధ విముక్తి నిఁ గావించెదను. మోక్షమే ఉత్తమ పరమ పురుషార్థము. దీనినే నేనామె కొసంగెదను." అందువలన భగవంతుని ప్రేరణము చేతనే యీామె అసురరూపమునఁ బుట్టిన బాలకులను జంపు చుండెను. ఈమెకు గోకులము జ్ఞాపకమునకు రానే రాలేదు. ఇప్పుడసుర శిశువులందరును జావఁగానే ఆమెభగంతుని కడకు వచ్చెను. పూతనయొక్క విషమిశ్రిత పయఃపానమొనర్చికంస పక్షీయులగు నసురులే చచ్చిరి. కృష్ణపక్షీయులగు బాలకుల వైపున కామె కన్నులనెత్తియైనను జూడలేదు"

అంత శౌనకుఁడిట్లనెను:_ "సూతా! భగవంతుని ప్రతి లీలయందుఁను అనంతగూఢ రహస్యమిమిడియున్నది. ఈజగత్తు భగవంతునికి క్రీడాస్థలము. భగవంతుఁడు దీనియందేదైననుజేయ వచ్చును. శివుని చేష్టలలో నేదియు నశివముకాదు. ఆనంద

స్వరూపునిలీల యేదియు నిరా నందమైనదికాదు, మానవుఁ డహంకారమునకువశీభూతుఁడై యిదిజరుగలేదు, అదిజరుగలేదను చుండును. దీనివిషయములో భగవానుఁడు సరిగాఁజేయలేద నును. భగవంతుడెరింగినది మంచితప్పు యింకొకటి యెరుగడు. మిఠాయినమ్మువానివద్ద మిఠాయియేయుండును. విషమునమ్మ దుకాణము వేరుగానుండును. సరే, తర్వాత నేమైనది?"

సూతుడిట్లనెను:– "ఇఁకవినుఁడు స్వామీ! పూతన యెగిరి గోకులము ఊరిబయటకుఁ జేరుకొనెను. ఆమె అచ్చటఁ జాలమంది గోపకులు కావలి కాయుచుండుటను గాంచెను. ఆమెతన యథార్థ స్వరూపముతో లోపలికిఁ బోఁజాలదు. ఆమె తన యిచ్ఛాను సారమున రూపమును ధరింపఁగలదు. కావున నామె ఒక అత్యంత సుకుమార సుందరరూప మును ధరించెను. మడిమల వరకామె జడ వ్రేలాడుచుండెను. దానిలో మాలతీ, మాధవీ, మల్లికా, యూధికాది సుందర సుగంధిత పుష్పమాలలు తురుమఁ బడెను. ఆమె యులి పిరి పట్టుచీరలోఁగుండా ఆమె రూపయౌవనములు చిందె వ్రజములోని గొందులలోఁ బడు చుండెను. ఒక చేయిపొడుగు గల ముసుఁగులోనుండి ఆమెముఖము లేత వెలిమబ్బుచేఁ గప్పఁబడిన చంద్రునివలె నుండెను. ఆమె నడుమతి సన్నము. అది లతవలె నూగుచున్నట్లుండెను. నితంబభాగము స్థూల ముగ నుండెను. ఈకారణమున బోవునపుడు వ్రజవీథులలో నామెమడిమలు చప్పుడగు చుండెను. కచముచే బిగింపఁబడిన నామె పీన పయోధరములు చంచల మీనములవలెఁ గదలు చుండెను. ఆమె ధరించిన లంగా, రవిక, ముసుఁగు మొద

లగు వస్త్రములన్నియును సుందరములును, మెఱయునవిగను, బహుమూల్యములుగ నుండెను. ఆమె కమలముఖము మీద నున్న నుంగరములు దిరిగిన వెండ్రుకలు సువర్ణపంకజము మీద నల్లని తుమ్మెదల సమూహము కూర్చుండ వాయువునకు ఊగు చున్నట్లుండెను. కర్ణములకలంకరించుకొనిన కమనీయకనక కుండలములూగుచు ముఖము మీఁద వ్రాలుచుండిన యీఁగలను దోలు రెండువిచిత్ర వ్యజనములా యనునట్లుండెను. అవి ఆమె కపోలములను బ్రకాశింపఁజేయుచు వాని శోభ నినుమడించుచుండెను. కావలికాయుచున్న గోపకులుచాలజాగ్రత్త కల వారు. నందుడు వెడలు నపుడనేక విధముల జెప్పిపోయెను. అందువలన వారపరిచిత వ్యక్తిని సాధ్యమగునంత వరకు గృహ ములోపలికి వెడలనిచ్చుటలేదు. కాని అంతఃపురమున స్త్రీల నెవరడ్డగింప గలరు? ఎవరూ అడ్డగింపలేదు. ఏదైన సాధారణ స్త్రీయైనచో నీవెవరు ? ఎచ్చటికి వెడలు చున్నావు ? ఎచ్చట నుండి వచ్చుచున్నావు ? ఏమిపని కల దని అడిగి తెలిసికొనువారే కాని ఈమె అలంకరించుకొనెను. ఈమె ప్రభా వముచేతనే వారందరును బ్రభావితులైరి. ఎవ్వరును నామె నడుగుటకు సాహసింపజాలకపోయిరి. ముసుగు చాటుననుండి కాటుకకన్నులతో నొక్కసారిక్రీగంటి చూపులు సారించునప్ప టికి గోపకులు తన్మయులైరి. మనోహరమగు దనమందహాసము చేతను కుటిలకంటక కటాక్షముచేతను, చిత్తమును హరించు సౌందర్యముచేఁ జతురుల చిత్తములను గూడ హరించుచు, అందరను దనరూపజాలమున బడవేయుచు యౌవన మదమున మదించుచు గులుకుచు నటు నిటు దనచంచల నేత్రములతోఁ

జూచుచు గజ్జల మ్రోతతో వ్రజపథమును ముఖరిత మొనర్చుచు బూతన నంతఃపురములోనికిఁ బోయెను.

ఇట్టి పరమ సుందరియును, రూపవతియును, నాగరిక యువతియునగు నామెను గాంచి గోష్ఠముననున్న గోపికలు సంభ్రమమునఁబడిరి. వారు వెంటనే లేచి నిలుచుండిరి. అచ్చట రోహిణియునుండెను. ఆమె శ్రీకృష్ణుని తాతముత్తవ్వలయింటి యేమేన త్తయో యనుకొనిరి. రోహిణి సఖియే మోనని యశోద భావించెను. ఆమెమధురనుండి వచ్చియుండుననుకొనిరి. అందు వలన నత్యధికముగ నిద్దరును నామెనాదరించిరి. కూర్చుండుటకు బీటనువై చిరి.

పిల్లవాడు కొంచెము దూరమున నుయ్యాలలోఁ గునుకు చుండెను. ఆతఁడువక్రదృష్టితో నానవలలనామణియగునాసుందర యువతినిగాంచెను. ”

శౌనకుఁడిట్లడిగెను:— సూతా ! భగవానుఁడు వక్రదృష్టితో నేలఁజూచినాడు?

నవ్వి సూతుడిట్లనెను:— “ స్వామీ! ఆతని మనస్సునఁ గల యథార్థభావము నెవ్వఁడెరుగగలడు ? అందరును వారివారి దమతమ బుద్ధికి వచ్చినట్లూహించుకొనుచుందురు. కొందరిట్లం దురు;— ఏలననగా నీమె వక్రబుద్ధితో వచ్చినది, భగవానుని ప్రతిజ్ఞ ‘ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్ ” ఎవ్వరు నన్నెట్టిభావముతో భజించెదరో నేనువారి నట్టిభావముతో భజించెదను అని ప్రతిజ్ఞ నొనర్చియున్నాడు. అందువలన వక్రదృష్టితోఁ జూచినాఁడు. కొందరిట్లందురు భగవానుఁడిట్లనుకొనెను :— ఈమె తల్లియై వచ్చినది, పని

మాత్రము తల్లి పనికి విపరీతముగ నున్నది.'' అందువలన వక్ర దృష్టితో జూచినాడు. కొందరిట్లందురు;– ''భగవానుడు ఋజు దృష్టితో జూచియుండిన నామెయును ఋజుత్వమును వహించె డిది. అందువలన నామె వక్రత్వమునుగాంచి వక్రముగానే యుండనిమ్మనుకొనెను?'' కాని మా అభిప్రాయమిది. 'ఈ వంకర కళ్ళవారందరకునునన్నియును వక్రములుగనే యుండును. పై ఖరియెల్లప్పుడును వంకరగనేయుండును. ఒక్కొక్కచోట సరిగానుండియుండును; ఒక్కొక్కచోట వక్రత్వమును గలిగి యుండును. అందువలన నాతడొక్కసారి చూచిన వెంటనే కన్నులను మూసికొని కూర్కసాగెను'.

అంతశౌనకుడిట్లడిగెను:– ''సూతా! భగవానుడు పాలీ యల వచ్చిన ఆమెను గాంచి కన్నులనేలమూసికొనినాడు?''

అంత సూతుడిట్లడిగెను:– ''స్వామీ! ఈ నల్లనాని చైయిము విషయములో నెవడును నిదమిద్ధమని సాధికార ముగ జెప్పజాలడు. వారివారి మనస్సులలో నూహించు కొనుచుందురు. కొందఱిట్లందురు:– ''ఈమె యింతటి యలం కారమును జేసికొని నాకు బాలీయ వచ్చినదే. నేనీమెకు బ్రాణములను దీయబోవు చున్నానే' యని నందనందనునకు సిగ్గుకలిగినది'' కొందఱు 'నన్నభయదాత యందురు. నా వలన నీమెకు భయము కలుగునను సంకోచముచే జూడలే దందురు. కొందఱిట్లందురు:– ''నాకీమెపాలీయవచ్చినది, దీనికి బదులుగ నీమెకేమి యొసంగుదు'నని భగవానుడు కన్నులను మూసుకొని ఆలోచించు చున్నాడు. చాలమంది యిట్లందురు ''ఈరాక్షసిపైన నేను గన్నుతెరచేసితినా, అప్పుడామె నన్ను

గన్నులారఁగాంచెనా; ఆమె తనలోఁ దానుండదు. శరీరమును మఱచి పోగలదు. ఆసమయమున నీమె మాయావిరూపము నశించును, గోపికలును, తల్లులిద్దరును భయపడిపోయెదరు. వ్రజమందు గోలాహలము చెలరేగును. ధనుర్బాణములను ధరించి గోపకులు వచ్చెదరు. అంతయు రసభంగము కాఁగలదు. నేనీమెకీయఁదలఁచిన గతి గోపకుల వలన మరణించిన నీ మెకు గలుగదు''

కొందఱిట్లందురు:— "ఈమె చెడ్డభావము కలది. లోపల దుర్వాసనలు నిండియున్నవి. పైకిమాత్రము సుందరిగనైనది. విషపూరితకనక కలశమువలె నున్న నీమెను జూచుటేమిట'ని యేవగింపుతో భగవానుఁడు కన్నులను మూసినాఁడు'' మఱి కొందఱిట్లందురు:— "భగవానుఁడీమెవిషసమ్మిళితములగుపాలను ద్రావినచో మనమందఱమును స్వాహా అయిపోవుదుమే యని యాతనిబొజ్జలోనున్న ననసంఖ్యాకములగు బ్రహ్మాండము లన్నియును భయపడుచున్నవేమోనని ఆతఁడులోనికి జూచు కొనెను. తనదృష్టినంతర్ముఖము కావించి అందఱకును, నే చింత యును లేదు విషప్రభావమును నేను గలుగనీయనులే యని ధైర్యము చెప్పుచున్నాడాయనునట్లుండెను.

కొందఱిట్లందురు:— " భగవంతునకు విషమును ద్రాగు నలవాటు లేదు. సదాపాలనే త్రాగెడువాఁడు. ఇప్పుడీమె విష మును ద్రావింపనచ్చినది. విషమును త్రాగుట శంకరునకుఁ దెలియునని, కన్నులను మూసికొని శంకరుని ధ్యానించు చున్నాఁడు.'' కొందరిట్లందురు:— " కన్నులను మూసుకొని భగవానుఁడు పూతనయొక్క యుత్సుకతనినుమడించుచుండెను.

పసివాడు చేతులను జాచి చంకలోనికి వచ్చినచో నానందము లేదు. కొన్నాళ్లాడి, పాడి. ఉపేక్షను ప్రదర్శించినచో వానినిఁ దీసికొనుటకు ఉత్కంఠత కలుగును. అందువలన నుత్కంఠతా వృద్ధికొఱకు గూర్కుచుండెను.”

కొందరిట్లనిరి:– ‘ భగవానుఁడిట్లనుకొనెను– ఈమె వేషము వేసుకొని వచ్చిన అమ్మ. ఇది నా పూత (పుత్రుడు) నా=కాదు. నాపుత్రుఁడు కాఁడను చున్నది. నేను నీపుత్రుడను నీపుత్రుఁడ నను చున్నది, తల్లిదండ్రులను పుంనామ నరకమునుండి తరింపఁజేయువాడే పుత్రుడు. పెద్దవాఁడనై నేనీమెను దరింపఁజేసెదను. ఈలోగా మాఅమ్మ నాకు భూతావేశము వచ్చినదనుకొని భయపడఁగలదు. ఈమెకు నాకు పాలీయవలయునను కోరికగూడ కలదు. ఈకోరిక యీామెకిట్లేనిలిచి పోయినచో వానినిఁదీర్చుకొనుటకై మరల నీమె జన్మింపవలసి యుండును. కావున నీమె పాలను త్రాగుచునే మొదలకుండ ఈమె ప్రాణములనుగూడ త్రావెదను. అప్పుడు నన్నెవరును శంకింపరు. ఈమెకు సద్గతియును గలుగఁగలదు. ఇట్లాలోచించు చుండఁగనే శ్యామసుందరునకు శేషశయ్యజ్ఞాపకము నకు వచ్చినది. అప్పుడు యోగనిద్రలోఁ గూర్కుచుండెను.”

కొందరిట్లనిరి;– ‘ భగవానుఁడిట్లనుకొని యుండును– నేను కన్నులను దెఱచినచో నీమె తన భావమును గప్పిపుచ్చుటకై నా వైపునకుఁజూడక అటునిటుఁ జూడఁగలదు. ఈసంగతిని సంకర్షణుఁడగు బలరాముడు కనిపెట్టెనా, ఆతఁడు కోపమున చీల్చునెడల జంగమవిషముచే స్థావరవిషము దిగిపోగలదు. ఈమె విషహీనకాఁగలదు. ఈ సుందరిని గాంచగనే గోపకులు

నేనీమెను బెండ్లాడెదను, నేనీమెను బెండ్లాడెదనని జగడమాడు కొనఁగలరు. అప్పుడు గోపవంశమందీ వర్ణసంకరతను గలిగింపఁ గలదు. కావున నీమెను ఇతిశ్రీకావింప వలయును.'

సవ్వి శౌనకుడిట్లనెను;–"సూతా! ఇట్లు చెప్పుచుబోవు చున్నావు. దీనికేమైన నంతమున్నదా ? లేదా ? ఎవరోయేదో చెప్పిరను చున్నావు. నీవేమందువు? నీఅభిప్రాయమేమి? భగవానుఁడు పూతననుగాంచి యేలఁ గన్నులను మూసు కొన్నాడు?"

సూతుడిట్లనెను:– "స్వామీ! నాబుద్ధి కేమియును విశేష కారణము కనఁబడుట లేదు. బాల సులభ భంగిమము. చిన్న పిల్లలు కొంచెము చూచి మరల వెంటనే కన్నులను మూసి కొందురు. అట్లే యశోదానందనుఁడును శిశు సులభ లలిత లీలల ననుసరించినాఁడు."

శౌనకుఁడిట్లనెను:– సూతా! ఈ భావనే బాగున్నది. సరియే, ఆబాలమూర్తియొక్క భావము నెవరును దెలిసికొన లేక పోవుటేమి?

సూతుడిట్లనెను –; స్వామీ! అచ్చటఁ దెలిసికొనుట కవకాశ మెక్కడిది? అందఱును బిల్లవాని జన్మోల్లాసమందు దమ్ముఁదాము మఱచిరి. ప్రతిదినము వేలకొలఁదిగ స్త్రీ పురుషులు కానుక లొసంగుటకును, పిల్లవానినిఁ జూచుటకును వచ్చుచుందురు. గ్రామములోని గోపికలిట్టి సుందరస్త్రీని జూడనేలేదు, ఈమెచేతిలోఁ గ్రీడాకమలమును బట్టుకొని సాక్షాత్ లక్ష్మివలెఁ గనఁబడుచుండెను. పోగొట్టుకొనిన దన

పతిని నింటింట వెదుకుచున్నట్లుండెను. అట్టియెడ నామె నేవ శేల సందేహించెదరు?

ఆమె మందహాసమొనర్చుచు యశోద తోడను ఇతర గోపికల తోడను నిట్లని పలుకుట కారంభించెను;- "మీరు నన్నెఱుఁగుదురు. మాయిల్లుమధురలో నాయెను. నేనొక వేదపాఠియగు విప్రుని పెద్దభార్యను, వృద్ధావస్థలో నందుని రాణికి పుత్రుఁడుకలిగినాఁడనియు, అందఱకునుగావలసిన వస్తువు లను బంచుచున్నదనియు వినియుంటిని. నారాయణుని దయ వలన నాకేకొదువయును లేదు. నేనేమియును యాచింప రా లేదు. బాలకు నాశీర్వదింప వలయును. అందువలన నేను బరు విడి వచ్చినాను.

యశోద యిట్లనెను:- "పండితురాలా! మీరు చాల కృపఁజూపితిరి. మీయాశీర్వాదముచేతనే వీఁడు బ్రతికి బట్టకట్ట వలయును."

చేతులతో సైగఁజేయుచుఁ గనుల గ్రీగంటఁజూచుచుఁ బూతన యిట్లనెను."నీకొడుకు యుగయుగములు జీవించుఁ గాక! ఈతనికిఁ జాలపెండ్లిండ్లగుగాక! లక్షలకొలఁది కొడు కులు గలుగుదురుగాక! కాని ఒక్కమాట నేను జెప్పలేను. నాఱొమ్మున నెన్నిపాలు గలవో నీవుచూచుచున్నావుగదా! పిల్లవాడు నాపాలనుత్రాగి అజరామరుఁ డగుగాక!

సూతుడిట్లనెను;- "మునులారా! ఒకానొక అపరిచిత స్త్రీ తమబుజ్జిబాబు పాలిచ్చుట యశోదకుగాని రోహిణికి గాని యిష్టములేదు. కాని ఆమె చక్కగ నలంకరించుకొని గొప్పయింటి యందలి భద్రమహిళవలె గోచరించుచుండెను.

ఆమె తన రూప ప్రకాశముచే నంద భవనమును ప్రకాశిత మొనర్చుచుండెను, ఆమె తేజమునకు లొంగిపోయి, యిష్టము లేకున్నను యశోదా రోహిణులిద్దరును బాలీయవలదని తమ యసమ్మతిని ప్రకటింపజాలకుండిరి. వారుమౌనముగనుండుటను గాంచి, మాయావియగు నామహిళ శయ్యపైనిద్రించు చుండిన శ్యామసుందరునిరహస్యమయ దృష్టులతోఁ గాంచెను. ఈమె దుష్టజనుల కాలస్వరూపుఁడీతఁడని యెఱుఁగదు. అతఁడు శిశువురూపమున నివురు గప్పిన నిప్పువలె నుండెను. చను గొనలకు హాలాహల విషమును రాచుకొనిన దన పుష్టము లైన చనులను రెవికనుండి బయటకుదీసి త్వరగా మంచము లోనుండినఁ బిల్లవానినిఁ దీసికొనెను. కృష్ణుఁడు తనతల్లియే తన్నెత్తు కొన్నదనునట్లుగ నమాయకుడుగ నుండెను, ఏడ్వనులేదు. చంకకు వచ్చుటకు గాదనను లేదు. అతనినెవ రెత్తుకొన్నను వారికడకుఁ బోవును. పూతనవడిలోఁ బిల్లవాడు పరుండెను. ఆమె పరుండబెట్టుకొనెను.



# పూతనాపయఃపానము

(రాగిణి)

శ్లో॥ తస్మింస్తనం దుర్జరవీర్యముల్బణమ్
ఘోరాంకమాదాయ శిశోర్దదావథ।
గాఢం కరాభ్యాం భగవాన్ప్రపీడ్య తత్
ప్రాణైః సమం రోషసమన్వితోఽపిబత్॥

శ్రీభాగ — ౧౦స్కం — ౬అ, ౧౦ శ్లో॥

సీ॥ మేల్కాంచి తెఱగున మెల్లన కనువిచ్చి
కిఱ్ఱుగంటఁ జూచుచుఁ గిదికి నీల్గి
యావులించుచుఁ జేతులాదరంబునఁజూచి
యొదికిలి యాఁకొన్న యోజనూఁదిఱ్ఱి
బిగిచన్నుఁగవగేలఁ బీడించి కబళించి,
గ్రుక్క గ్రుక్కకు గుటుగుటుకు మనుచు
నొకరెండు గ్రుక్కల నువిదప్రాణంబులు,
సైతము మేనిలో సత్త్వమెల్లఁ

తే॥ ద్రావె నదియును గుండెలు తల్లడిల్లఁ
జిమ్మఁ దిరుగుచు నిలువక శిరము వ్రాల
నితర బాలురక్రియ వాఁడ వీవు గావు
చన్ను విడువుము విడువుము చాలుననుచు॥

శ్రీమదాంధ్రభాగవతము.

## అర్థము

భక్తులను గలిసికొనుటకు భక్తవత్సలుడగు భగవానుడు సదాతృష్ణను జెందియుండును. భగవంతునకు వసుపులకు —

లేదు. ఇచ్చట నవి విలువైనవా, సాధారణమైనవియా యను నర్థముతో పనిలేదు. ఆతని దృష్టిలో నన్నియును విలువగలిగి నవే. అన్నియును సాధారణమైనవే. ఆతని కేబదియారు పిండి వంటలను నివేదన మిడుడు, ఒక్క తులసీదళము నర్పింపుడు. రెండువస్తువులనుండి భావమును గ్రహించును. వాస్తవమున కాతఁడు భావబుభుక్షువు. ఆతనికిసాత్త్వికభావముతోనెవరర్పిం చెగరో సాత్త్వికుఁడై గ్రహించును. రాజస తామసులై యర్పిం చినచో రాజస తామసుఁడై గ్రహించును. ఎవరాతని నెట్లు భజించెదరోవారినాతడట్లుభజించును. రోషముతోడను;గపటం తోడను నాతని సమ్ముఖమునకు నుపహారములను దెచ్చి ఇచ్చి నచో నా యుపహారములను గపటవేషముతో, రోషముతో, గ్రహించును. కాని పరిణామమున నందరకు మంచియే కలు గును. భగవంతుని కడకేభావముతో వచ్చినను నది మంగళ ప్రదమే యగును. వానికి దుర్గతికలుగక సుగతియే కలుగును.

సూతుఁడిట్లనెను:– “ మునులారా! కన్నులను మూసు కొని పరుండిన పిలవానిని(జూడఁగనే పూతనకు భ్రమకలిగెను. ఆతఁడును సద్యోజాత సాధారణ గోపబాలకుడే, యితరబాల కులకెట్లు తనవిషయుక్తమగు పాలనొసంగి చంపినదో అట్లే చంప వచ్చుననుకొనెను. ఇట్లనుకొని కృష్ణుని నిద్రించుచున్న సర్ప మును త్రాడనుకొని యెత్తుకొన్నట్లాతని చంక నెత్తుకొనెను. చుట్టుకొనిన తేలును మూల్యముగల మణి యనుకొని యెత్తు కొన్నట్లును, మోసగాండ్రచేఁ బడవేయబడిన మాయబంగారు కణికను సువర్ణమని మార్గమునుండి తీసుకొనుసట్లును, విష మిశ్రిత మోదకములను స్వాదిష్టమగు మిఠాయియని కైకొను

నట్లును, తేలుమణిచెట్టును మంచికూరమొక్కయని చేతితో బికినట్లును నెత్తుకొనెను. కృష్ణుని స్వభావము, ఆతని నెవరెట్లు పిలిచినను వారికడకుఁబోవును. ఎవరు ప్రేమించెదరో వారిని వేయిరెట్లుగ ప్రేమించెదరు. ఆతని నెవరు మోసగించెదరో వారినట్లే వేయిరెట్లుగ మోసగించును. పూతన పైకి చాల అందముగ నుండెను. ముఖమున మాధుర్యముట్టిపడుచుండెను. కాని హృదయము విషసంస్తికములగు బాణములవలె దీక్ష్ణము లుగ నుండెను. ఎవరైన దీక్ష్ణకరవాలమును సుందరమగు పట్టు గుడ్డతో జుట్టి వరలోఁబెట్టినఁబైనఁజూచిన బాలుడు దానినొక సుందరమగు నాటవస్తువుగ భావించును కాని దానిని తెరచి చూచినచో జేతులును గాళ్ళును దెగిపోవును. పైకి ఆమె శ్రీకృష్ణుని ముఖమును మాటిమాటికిని ముద్దిడుకొనును. వాక్కులతో బిడ్డా! బిడ్డా! యనుచుండునుకాని లోలోన ఆమె కోతను సాగించుచుండెను. లోపలనాతని దనశత్రువుగా భావించుచుండెను. విషమును ద్రావించుట కుపక్రమించుచుండెను.

కృష్ణుడు కునుకుచుండెను. అప్రస్ఫుటితములగు రెండు కమల కళికలవలె నాతని గుండ్రని, యెఱ్ఱని రసయుక్తము లగు నోష్ఠములు మూఁతబడి యుండెను. ఆదుష్ట మంచిచెడ్డలు లేక తన కఠోర స్తనములను నోటిలోనికిఁ బెట్టెను. దానికి కృష్ణునకు మిక్కిలి కోపము వచ్చెను.

శౌనకుఁడిట్లనెను :– "సూతా! భగవానునకు రోష మేల వచ్చినది? "

సూతుడిట్లనెను :– " స్వామీ! రోషమునకు గారణ మిదియే. ఇప్పుడే తల్లి పాలిచ్చి యుయ్యాలలో బరుండబెట్టినది

ఇంతలోనే యీకుటిలవచ్చినది. కృష్ణునకుఁబొట్టనిండియుండెను. నిండుకడుపున నెవనికైనఁ దిండిని వివశతతోఁ బెట్టినచోఁ గ్రోధము రాదా యేమి? ఇంకొకవిషయమేమనిన గృష్ణునకింకను పండ్లు రాలేదు. ఆతని పెదవులు బంధూకపుష్పకళికలవలె నత్యంత కోమలములై యాతని యధరమును నోష్ఠమునుండెను. దానిలో నామె బిల్వమువలె నత్యంతము కఠినుగ నుండిన దన చను మొనలను జొనిపించెను. ఇది యెంతటి అసాధ్యపు స్త్రీయని ఆతనికి గోపమువచ్చెను. మూడవ కారణ మింకొకటి కూడ యుండవచ్చును. విషము నామె స్తనములకు బైననే రాచు కొన్నది. విషముయొక్క స్వభావము తమోగుణము. మును ముందుగా నోష్ఠములకు విషస్పర్శయైనది. అందువలన దమో గుణ రోషమువచ్చినది. పైనఁ బాలుండి లోపల విషముండి యుండిన ముందుగా నవ్వు నచ్చెడిదే. కాకున్న రోషమునకు గారణమిదియునై యుండవచ్చును. భగవానుఁడిట్లనుకొనెను. " ఇదెంతటి దుష్టరాక్షసి, ఆడుపాము, అత్యంతవ్యభిచారిణి యగు స్త్రీతప్ప యేతల్లియును తనబిడ్డను జంపబూనదు. ఈమె పాలొసంగుచు మాతృపదమును గళంకిత మొనర్చుచున్నది. నేనీమెకు దీని ఫలము నొసంగవలయును."

లేకున్న రోషకారణ మిదియైన నైయుండవచ్చును. పాలిచ్చునధికారము మాఅమ్మకైననుండవలయును. లేక దాదికైన నుండవలయును. మాఅమ్మ ఈమెను దాదిగా చేయ లేదు. ఈమె తనకుఁ దానే దాది యైనది. ఎట్టిదేవత కట్టి పూజనే చేయవలయును. ఈమె బలపూర్వకముగ నన్ను గౌఁగిలించుకొనినది. నేనును బలపూర్వకముగ గట్టిగవత్తి

యీమెకుఁ బారితోషిక మొసంగుమును. లేక నాయభిప్రాయ మున నిట్లుతోచుచున్నది. దుగ్ధభరితములగు స్తనములను గాంచఁగనే బాలకృష్ణుఁడు వత్సమునవలెఁ గుమ్మిచు, నిన్ని పాలను నీలోబెట్టుకొందువా నన్నుఁద్రాగనీయవా యనికోప గించు కొన్నాడాయనునట్లుండెను. బాలకుడు పాలు ద్రాగు నపుడు తల్లియొక్క స్తనములను గట్టిగా బట్టుకొనును. అందువలన పెద్దపెద్ద స్తనములను దసకోమల పల్లవ సదృశ ములగు కరములతోబట్టుకొని చుపుకుచుపుకు మనుచు గృష్ణుడు మాయదానియొక్క పాల నుత్సాహముతో ద్రావ సాగెను. పాలతో బాటుగా నామె ప్రాణములనుగూడ త్రావ సాగెను"

శౌనకుడిట్లనెను;- "సూతా! పూతన భగవానునకు విషమును పాలను అనగా రెంటిని ద్రావింప వచ్చినది. భగ వానుడామె ప్రాణములనేల ద్రాగెను. ఇది అధర్మమును లోభమును గాలేదా? భగవానుడీమని వస్తువుపై బలవంత ముగ నధికారమునేల వహించినాడు?"

సూతుడిట్లనెను;- "స్వామీ! ఈభగవంతునిలో విశేష తయే యిది. ఆతనికి గొంచె మొసంగబోయిన వాని సర్వస్వ మును గ్రహించును. బలిచక్రవర్తి మూడడుగులు నేల నొసం గుటకు సంకల్పించెను. వానిసర్వస్వము నపహరించెను. ఈతడు కొంచెమున కాశపడడు. తనవానిగా జేసికొనినవాని సర్వస్వమును గ్రహించును. కాగా దానమునకు తోడుగా దక్షిణయుండవలెను. కూరల వానివద్ద కూరలను గొనినచో గొసరడుగుచుందురు. పాలను విషమును నామె స్వేచ్ఛగా

నొసంగినది. ప్రాణములను భగవానుడు కొసరుగ దీసికొని నాడు.

శౌనకుడిట్లడిగెను;– "సూతా! భగవానుడు పయః పానముతో బాటుగా నామె ప్రాణములను గూడ పానము చేయుచుండ నామె యేమియును బలుక లేదా?"

సూతుడిట్లనెను;– "ఎందుకుస్వామీ! ఎందులకు పలుక లేదు. ఇది చెప్పుడు స్వామీ! ఎవరైన తన యిచ్ఛకు విరుద్ధముగ నెవని ప్రాణములనైన బానముచేసినచో గేకలువైచి యేద్వారాయేమి? భగవానుడు సముద్రమును విషముకొరకు మందరాచలముచే మధించునపుడు సముద్ర మెగురుచుండెను. అది తన తరంగములద్వారా అహారహారమ్మని శబ్దమొనర్చుచు నజిత భగవానుని వలదనుచున్నను భగవానుడాతని కరుణా క్రందనమును లక్ష్యపెట్టనేలేదు. మధించి విషమునుదీసెను. నేడును నాతడుసముద్ర స్థానమున బూతన స్తనమును సుమేరు శిఖరమును, తనముఖమును కవ్వముతోడను నోష్ఠములను రజ్జువుతోడను మధించుచుండెను. ప్రాణములను బానమొనర్చుటచే బూతన శరీరముయొక్క మర్మస్థానము లందన్నిటను బాధకలుగ సాగెను. అది బలిసిన బఱ్ఱెవలె దనస్తనములను విదిలించుకొనుచు జేతులతోడను గాళ్ళతోడను దన్నుకొనుచు నటుసిటుపరుగిడసాగెను. ఆమె "ఓరీ వదలరా! వదలరా?" యనుచుండెను. ఆసమయమున బాలకృష్ణుడు ఆమె స్తనములనట్లే పట్టుకొని గొప్పపనసచెట్టునకు బనసపండు వ్రేళ్ళాడునట్లు వ్రేలాడుచుండెను. ఆమెకు బాధభరింపరాని దెనపుడు బయనెక్కువైనపుడలసి నేలకూలిన గుఱ్ఱమువలె

నామె వివశయై క్రిందబడి 'వదలరా, వదలరా' యని అఱచుచు నేలకూలెను."

బాలకృష్ణున కిప్పుడేడు దినములే, ప్రత్యుత్తరమెట్లియ గలడు? చను మొనను నోటియందక్లే గట్టిగా బట్టుకొని చూచుచుండెను. ఆచూచుట యిట్లు చెప్పుచున్నట్లుండెను. "పెద్దమ్మా! నేనస లెవరిని బట్టుకొననే పట్టుకొనను. పట్టు కొంటినా యిక వదలుటలేదు. పట్టుకొనివదలుట నేను నా గురువు వద్ద నేర్వనే నేర్వలేదు."

ఇప్పుడు రాక్షసి యేమిచేయగలదు? ఆమె మాటిమాటికి గాళ్ళుచేతులు కొట్టుకొన సాగెను. ఏడ్చి మొత్తుకొనసాగెను. ఆమె గ్రుడ్లువెళ్ళుకొని వచ్చెను. శరీరమంతయును జెమట లచేత ముద్దముద్దయ్యెను. ఆమె ముఖమునుండి చీత్కారము లతో భయంకర శబ్దము వెలువడసాగెను. అత్యంత భయం కరమగు నాశబ్దముచే బర్వతములతో భూమి కంపింపసాగెను. అంతరిక్షమున గ్రహ, నక్షత్ర, తారకాదులు తమతమ స్థాన ములు తప్పెను. సప్తపాతాళములు వికలతను జెందెను. దశ దిశలు మారుమ్రోగుచుండెను. ఎక్కడనో వజ్రపాతము జరిగి యుండునని జనులనుకొను చుండిరి, ఆశబ్దముచే ననేకులు మూర్ఛితులై భూమిమీద బడిరి,

సూతుడిట్లనెను:- "మునులారా! అత్యంత వ్యాకుల తతో నారాక్షసి తన మాయా స్వరూపమును రక్షించుకొన జాలక పోయెను. అడావిడిలో దాని మాయ నశించెను. ఆమె యిప్పుడు తనరాక్షస రూపమున బ్రకటమయ్యెను. ఆ సమయమున నామె యాకృతి అత్యంత భయానకముగ

నుండెను, ఆమె ముఖము పర్వత కందరము వలెనుండెను. ఆమె కోరలు నాగలి కర్రులున్నట్లుండెను, ముందు కోరలు మేకులవలె నుండెను. ఆమెచెవులు చేటలవలెనుండెను. పర్వత గుహాలనలె ఆమె గ్రుడ్లుండెను. ఆమెనాలుక విశాలమైనదె యుండెను. దానినామె చప్పరించుచుండెను. కాళ్ళను చేతులును దన్నుకొనుచుండెను. అత్యంత పీడ కలుగుటచే నామె విఱిగిన పర్వతమువలె ధడక్కున నేలమీద బడెను. ఇంద్రుని వజ్రముచే వృత్రాసురుడు మరణించినట్లు గోష్ఠమందు పడుటచే నామె వెంటనే చచ్చిపోయెను. ”



# చచ్చిన పూతన భయంకరత

( ౨౫౦ )

శ్లో॥ పతమానోఽపి తద్దేహస్త్రిగవ్యూత్యంతరద్రుమాన్
చూర్ణయామాస రాజేంద్ర మహదాసీత్తదద్భుతమ్॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౬అ. ౧౪ శ్లో॥

క॥ ఆజరభీరండరక్కసి,
నైజశరీరంబు నేల నవియం బడినన్
యోజనమున్నర మేర ధ,
రాజంబులు నుగ్గులయ్యె రాజవరేణ్యా ॥

శ్రీమదాంధ్రభాగవతము.

సత్యమును, మాయయును రెండును జూచుట కొక్కటి గనే యుండును. కాని భేదమేమనగా సత్యము సనాతనమైనది. అదిసదాఒకేరీతిగ నుండును. మాయ అధికకాలముండజాలదు. ఆపత్తులును, విపత్తులును వచ్చినపుడును, సంకటములు సంభవించినపుడును సత్యము అధికాధికముగ నిలువబడును, కాని మాయ అల్పసంకటమునకు బయటపడును. కృత్రిమ పాదములు కృత్రిమములుగనే యుండును. కొంచెము జారినా అవి యూడిపోవును. కావున మాయాప్రభావము క్షణికముగా నుండును. సత్యము యొక్క ప్రభావము స్థిరముగనుండును. మాయ చాల దినములు గడువదు. కృత్రిమము బయటఁబడు నెడల బాగుగా బయటపడును. అప్పుడది లోకులకు భయంకరముగ నుండును. ఓహో! ఇది విషముతో నిండిన కనక కలశమే యని తోచును. పైకి మెఱయుచుండును. లోపల భయానకము. భగవానుడు మాయాపతి. ఆతనికడ మాయజేసినవారి

కిని మేలే యొనర్చును. ఒకకథ కలదు - ఒకానొక రాజ కుమారి భగవంతునకుఁ బూజ చేయుచుండెడిది. ఇంకొక రాజ కుమారుడు ఆమెను వశపరచుకొనఁ దలఁచెను. ఆతఁడనేకో పాయముల నొనర్చెను కాని రాజకుమారి ఆతనివైపు చూడ నైన చూడలేదు. అప్పుడాతఁడు మాయనాశ్రయించెను. ఆతఁ డొక కృత్రిమ గరుత్మంతునిఁ జేసెను. తానింక రెండు కృత్రిమ చేతుల నేర్పాటుఁ జేసికొనెను. కిరీట మకుటములను ధరించి విష్ణువేషమును వైచుకొని ఆతఁడేదో విధముగ రాజకుమారి కడకుఁబోయెను. రాజకుమారికి మిక్కిలి యానందముకలిగెను. ఆమె ఆతనినిఁ బూజింపసాగెను. ఇట్లు చాలదినములు గడిచెను. ఎవరో రాజునకీసమాచారమును అనఁగా రాజకుమారి యెవరి తోడనో మాటలాడుచున్నదనిరి. రాజు దాగి అంతయును గమ నించెను. ఆతఁడు చేత ఖడ్గమును దూసి, యెవఁడో వచ్చి యుండవచ్చునని క్రోధముతోఁ బోయెను. రాజకుమారుఁడు భయముచేఁ గంపింప సాగెను. ఆతఁడు సర్వాత్మ భావముతో భయమున భవభయహారియగుభగవానునిఁ బ్రార్థింపసాగెను. వాని చిత్తైకాగ్రతచే నానిర్జీవమగు గరుత్మంతుడు సజీవుఁడై వానినిఁ దీసుకొని యెగిరిపోయెను. వాని వేషము కృత్రిమమై నది; కాని భగవానుని వేషము. ఆతనికి భగవానునితో సామ్య సంబంధము కలదు. కావునఁ దన వేష గౌరవమును నిలుపుటకై భగవంతుఁడాతని రక్షించెను. దైత్యులు భగవంతుఁడు శత్రు వని క్రోధముతో నాతని స్మరించెదరు. ఆతనితో యుద్ధ మొన ర్చెదరు, ఏ భావముతోనైనఁ గానిండు ఆతని సంబంధము భగ వానునితోఁ గలదు. భగవంతుఁ డాసంబంధము తోడనే వారిని

దరింపజేయును. ఆతఁడు క్రోధ, దుర్గుణ, మాయల వైపు చూడనే చూడడు.

సూతుఁడిట్లనెను:— "మునులారా! పూతన బ్రతికి యుండగా మిక్కిలి సుందరియై వచ్చినది. చావఁగానే ఆమె మిక్కిలి వికరాళయైనది. ఆమె శరీరము భూతమువలెను, కామ వాసనవలెను, లోభియొక్క ధనేచ్ఛవలెను, దూదిలో పడిన నగ్నివలెను వృద్ధిపొందసాగెను. బ్రదికి యుండఁగా నామె వేల కొలది బాలకులనుజంపియుండెను. చచ్చినపుడు పడుచుపడుచు నామె వేలకొలఁది లక్షలకొలఁదిగ వృక్షములను నుగ్గు నుగ్గుగావించినది. ఆమె శరీరము ఆరు క్రోసులుండెను. దానిలో నెన్ని వృక్షములుండెనో అవి నుగ్గైనవి. రాక్షసిశరీరమారు క్రోసులుండుటను, దాని క్రిందబడిన వృక్షములు నుగ్గు నూచై ముక్కలు ముక్కలగుటయును గాంచి అందరును దానినిఁ గాంచి పరమాశ్చర్యమును చెందిరి"

అంత శౌనకుఁడిట్లడిగెను :— "సూతా! గోకులమునకును, మధురకును రెండు క్రోసులు కూడను లేవు. అటులయిన మధురాపురియును నుగ్గు అయివుండవలెను. యమునాప్రవాహ మాగిపోయి యుండవలెను."

అంత నవ్వి సూతుఁడిట్లనెను ;— "స్వామీ! భగవానునివలన నీపొరపాటు జరుగునా? గోకులమునకు మధుర ఉత్తరమున నున్నది. భగవంతుఁడు పాలను త్రావి, తల్లిగాఁ జేసికొనిన ఆమె తనముఖమును జచ్చునపుడు ఉత్తరపు వైపున కెట్లు పెట్టును? ఆమెకు సద్గతి యెట్లుకలుగును. భగవంతుఁ డామెను దక్షిణము వైపుగా — ముఖముపెట్టి విసరెను. అచ్చటకంసునిది

ఆరు క్రోసుల విస్తీర్ణముగల ఒక సుందరోద్యానవనము కలదు. వానిక్రమే పగులగొట్టినది వానితలనే. ఆతోటలోనికి విస రెను. దీనిచే మామయొక్క దట్టమైన నాతోట బెళ్ళంగోడాడు టకు స్వచ్ఛమగు స్థానమయ్యెను. ”

శౌనకుడిట్లనెను :- “ సరే, అది మధురవైపుగా విసర కుండిన మధురనుండి వచ్చునపుడు నందాది గోపకులకు దాని మృత శరీరము మార్గమందెట్లున్నది? ”

సూతుడిట్లనెను ;- “స్వామీ! తలమాత్రముఆగ్నేయ మూలగాబడెను. కాళ్ళుఉత్తరము వైపుగా నుండెను. నందాది గోపకులు యమునను దాటివచ్చునప్పటికి పర్వతమువలెఁ బడి యుండిన నాపూతన కనఁబడెను. ”

శౌనకుడిట్లడిగెను :- “ ఏమనవలెను. ఆరుక్రోసులు పొడుగుగల నాడుదానిని నేమింతవరకు చూడనే చూడలేదు. నీవు శాస్త్రీయ విషయమును జెప్పుచున్నావు. మేము దానిని ఖండింపజాలకున్నాము. ”

సూతుడిట్లనెను ;- “ స్వామీ! అదిస్త్రీసాధరణకాదు. రాక్షసి.మాయచేస్త్రీయైనది. దానిముఖముపాతాళవివరమువలె నుండెను. దాని కోరలు నాగేటి కఱ్ఱలున్నట్లుండెను. నాసిక సుమేరుపర్వతమునకున్న రెండు గుహలున్నట్లుండెను. దానిస్తన ద్వయము అంజనపర్వతముయొక్క రెండుముక్కలు పడినట్లుండెను. కరుకైన నెర్రని వెండ్రుకలు మొక్కజొన్న కండెలలో నుండి తీసిన పీచును నొక పర్వతముమీద పరచినటులుండెను. ఆమె కన్నులు నీరులేని రెండుబావులవలె నుండెను. మూడు క్రోశములు పొడువుగల నామెతొడలు మహానదియొక్క రెండు

శరత్కాల తటములవలె నుండెను. తొడలక్రింద మోకాళ్ళకును బాదములకును బైనబడియుండిన రెండుచేతులు నదిపైఁ బీపాల వంతెన నెత్తుపల్లములతో గట్టినట్లుండెను. గొప్ప పొడవును, వెడల్పును గలిగి చచ్చుటచే పొట్టఁబడిన నామె పొట్ట యెండిన సరోవరమువలె గనబడుచుండెను. ”

పూతనయొక్క యీ భయంకర శరీరమును గాంచి సమస్త గోపగోపీగణము భయకారణమున గడగడ వణకుఁ చుండిరి. అందరు నాశ్చర్యచకితులై అటునిటు రహస్యమయ దృష్టులతో బరస్పరము ఒకరినొకరినిఁ జూచుకొనసాగిరి. వారి నోటివెంట నేమాట రానంతగా వారు భయపడిరి. భగవానుడామె ప్రాణములను బాలతో గూడ కలిపి త్రాగుచుండగా నామె గొప్ప కేకవైచెను. కర్ణకఠోరమగు నాభయంకర చీత్కారముచే సమస్త ప్రజవాసుల హృదయము మొదటనే వ్యథితమయ్యెను. అందరకును జెవులు దిబ్బిళ్ళుపడెను. తల తిరుగసాగెను. ఇప్పుడా యద్భుత భయంకరరూపమును గాంచగనే వారికిదివరకున్న ధైర్యము సడలిపోయెను.

అందరును భయభీతులైరి, కాని బాలకృష్ణుడామె వక్షః స్థలమున నిర్భయుడై పడియుండెను. ఆతని నోరు ఆమె చను మొనను బట్టుకొనియేయుండెను. మామపంపిన నాటబొమ్మతో నాడుకొన్నట్లుగ నాతడు చేతులను బాదుకొనుచు నాడుకొను చుండెను. తనపుత్రుడు విపన్ముఖమున నుండుటను గాంచిన వినెంతటి గొప్ప విపత్తైనను మాతృహృదయ. మాగఁజాలదు. విపత్తును దలనుదన్ని తల్లి తన సంతానమును రక్షించును. ఈ

పాలీయవచ్చిన విధవముండ రాక్షసియని యశోదకు దెలియగానే ఆమె బాలకుని దెచ్చుటకు బరువిడెను.

ఇంతలో రోహిణీదేవికిని తెలివివచ్చెను. యశోద రాక్షసి వైపునకుఁ బరువిడుటను గాంచి రోహిణియును ఆమె వెను వెంటనే పరువిడెను. ఇంటిలోని దాసీలును నాగలేదు. ఆయిద్దరు తల్లులకంటె ముందే పరువిడి రాక్షసి రొమ్ముమీాద నెక్కిరి. వెంటనే పిల్లవాని నెత్తుకొని, అగ్నిహోత్రము నుండి పిల్లవానిని రక్షించుటకెత్తుకొని పరుగెత్తునట్లు పరువిడిరి.

రాఁగానే గోపికలు పిల్లవానిని తల్లిచంక కందించిరి. కృష్ణుడు చంకలో నుండుటను గాంచగానే అందరిభయములు పోసాగెను. ఏలననగాఁ బ్రభువు అభయదాత వారికి తమ విషయమున భయములేదు. బాలకుని విషయమున వారికి భయముండెను. పిల్లవానికేమైనదో? ఈరాక్షసి యేమి మాయ లొనర్చినదోయని అందరకునుభయమే?

సూతుఁడిట్లనెను:— " మునులారా! విశ్వబ్రహ్మాండము లన్నిటిని రక్షించు విశ్వంభరునకు గోకులమందలి గోపికలు గోపుచ్ఛాదులచే రక్షలు కట్టసాగిరి.



# జగద్రక్షకుని గోపికలు రక్షించుట

( ౮ ౫ ౮ )

శ్లో॥ అవ్యాదజోఽంఘ్రి మణిమాంస్తవ జాన్వథోరూ
యజ్ఞోఽచ్యుతః కటితటం జఠరం హయాస్యః।
హృత్కేశవస్త్వదుర ఈశ ఇనస్తు కంఠమ్
విష్ణుర్భుజం ముఖమురుక్రమ ఈశ్వరః క్రమమ్ ॥

శ్రీభాగ. ౧౦ స్కం, ౬అ. ౨౨ శ్లో॥

వ:— మరియు నంతటం దనియక గోపిక లాచమనంబులు సేసి దక్షులయి మునుపుగాఁ దమకు రక్షాకరంబగు బీజన్యాసంబు సేసికొని చిన్నియన్న నీయడుగు లజుండును, జానువు లనిలుండును, హృదయంబు గేశవుండును ముఖం బురుక్రముం డును, శిరం బీశ్వరుండును రక్షింతురు.

శ్రీమదాంధ్రభాగవతము.

ఒకసాధువుండెను: ఆతని కడకొక జిజ్ఞాసువు వెళ్ళి యిట్లడిగెను.— "సాధుపురుషా! భగవానునిఁ బొందు టెట్లు? సాధువు, చెరకు మొక్కల నొక ప్రక్కనుండి తీసి యింకొక పొలమున నాటుచుండెను; ఆతఁడు సరళముగ నిట్లనెను:— భగవంతునిఁ బొందుటకు ప్రయాసయేమున్నది? మనస్సు నిచ్చ టనుండి అచ్చటఁబెట్టుము. మనస్సింతవరకు స్త్రీ, పుత్ర, పతి, మిత్ర, సఖా, స్వామ్యాదులందు లగ్నమై యున్నది. దానినట్లే తీసుకొని పోయి భగవంతునియందుంచుము.

మాట బాగుగనే యున్నది. కాని సాధువునకెంత సరళ ముగ గనబడుచున్నదో, సాధారణ జీవులకంత సరళమెనది

కాదు. మనము భగవద్రూపమును జూడనేలేదు. భగవంతుని స్పర్శను మనమనుభవింపలేదు. సాంసారిక రూపమును మనము చూచినాము. దానిలో మనమనస్సు లగ్నమైనది. స్త్రీ పుత్ర స్పర్శసౌఖ్యమును మనమనుభవించితిమి. భగవంతుని గూర్చి యూహించుటకైనను వీలులేనట్లుగ మనస్సు సాంసారిక విషయములందాసక్తిని జెందినది. మనము మన పుత్రునెంతగా ప్రేమించుచున్నామో అట్లే భగవంతుని ప్రేమించిన బంధనమే తీరిపోవును. సాంసారిక సౌందర్యమును గాంచిన నేత్రములచట నిలిచిపోవును. కాని భగవద్విగ్రహమును దర్శించినహృదయము ద్రవింపదు. ఏవిధముగనైనను భగవంతునితో నేసంబంధముచేనైనను నాతని రూపమునందు సాంసారికము వలెనే ఆసక్తిని జెందినచో భగవంతుడట్లేయగును. జ్ఞానులును, యోగులును భగవంతుడు సర్వగతుడనియు, సర్వవ్యాపకుడనియు, ఈశ్వరుడనియు జెప్పెదరు. కాని సర్వవ్యాపక దర్శన మీచర్మచక్షువులకు గోచరింపదు. దానికి దివ్యచక్షువుకావలెను. దివ్యదేహము కావలెను. ఈ ప్రాకృతదేహమందు ఆతనియెడలఁ బ్రేమ కలుగవలెను. ఇది యైశ్వర్యముచే జరుగజాలదు. మాధుర్యముచేత దీనియనుభవముకలుగును. ఐశ్వర్యమందునిరుక్త ప్రేమయుండదు దానియందు భయముండును. హృదయపూర్వకముగఁ బ్రేమింపజాలరు. హృదయములు కలిపి తన ప్రేమాస్పదునిఁ గలిసికొనజాలరు. మాధుర్యమునందన్నియును జరుగగలవు. భగవంతునితో నేదో సంబంధమును బెట్టుకొని చేయు రాగానుగ భక్తియందైశ్వర్యముండదు. కృష్ణుడుమహాసంబంధి. ఈసంబంధముయొక్క సుఖకల్పన ఆరసమునందుఁ బ్రవేశించిన వారే తెలిసికొనగలరు

అచ్చటైశ్వర్య గంధమైననుండదు. ఈతడు సర్వేశ్వరుడు, లక్ష్మీపతి. యీతనికి మనమేమీయగలము? అని అనుకొనరు. కాని మాధుర్యమునందు నాల్యముండును. వాత్సల్యరసమందు శ్రీకృష్ణుని సర్వవిధముల రక్షింపవలసియుండును. ఒక కథ కలదు. ఒక వృద్ధకు గోపాలునియందు వాత్సల్యము కలదు. ఆమె గోపాలునితనపిల్లవానిగాఁ జూచుకొనుచుండెను. కొంత కాలము సాధన చేయుగాఁజేయగా గోపాలుడామెతో మాటలాడసాగెను. ఆవరణముందటు నిటు మాకాళ్ళమీద బారకాడుచుండెను. వృద్ధురాలు దినమంతయును నాతనిని గనిపెట్టుకొని యుండెడిది.' నాబిడ్డడు కొంచెము చిలిపివాడు. అటునిటు బోయి పొయ్యిలోఁ జేయిపెట్టునేమో, అటునిటు పోవునేమో. ఆమె ఆవుపాలను దీసిన గోపాలుని కొరకే. ఏ పని చేసినను కృష్ణుని నిమిత్తమే. ఊరిలోనికొక తోడేలు వచ్చినదని ఆమె వినియుండెను. వృద్ధ భయభీతయై తోడేలు తనపిల్లవానినిఁ బట్టుకొని పోవునేమోననియనుకొనెను. ఆమె మిక్కిలి నిర్ధనురాలు. ఇల్లు పడిపోవుచుండెను. గోడలు పడిపోయిన నీ యింటిలోనికి తోడేళ్ళు వచ్చునేమోనని ఆమెకు భయము. అందువలన రాత్రియంతయును నిద్రించెడిది కాదు. కఱ్ఱను బట్టుకొని కూర్చుండెడిది.

భగవానుడిట్లనుకొనెను:- అయ్యో! ఈ ముసలిదానికి విపత్తు వచ్చిపడినదే" అనుకొని రాత్రియందాతఁడు చతుర్భుజ రూపమును ధరించి వచ్చి తలుపును గొట్టి యిట్లనెను:—
"అవ్వా! తలుపును దెరువుము."

ముసలిదిట్లనెను:— "నీవెవరవు ?"

భగవానుడిట్లనెను:— "నేను విష్ణువును. నీకు వర మీయవచ్చితిని."

వృద్ధురాలిట్లనెను;— "నాకు విష్ణువుతోడను, గిష్ణువు తోడను నేమిపని ? నీవు తోడేలువేమో, మాఅబ్బాయినిఁ గొనిపోవుటకు వచ్చితివేమో ? నేను తలుపు తెరువను."

భగవానుఁడెంతో చెప్పెను. ముసలిది తలుపును దెర చెను. చతుర్భుజరూపమున భగవంతుఁడు దర్శనమిచ్చి వరమును గోరుకొమ్మనెను.

వృద్ధురాలిట్లనెను:— "నిజముగ నీకు వరమొసంగు సామర్థ్యమే యున్నచో నా బిడ్డను తోఁడేలు కొనిపోకుండునట్లు వరమొసంగుము." ఇది విని భగవానుఁడు సంతోషించి యిట్లనెను;— "అమ్మా ! తోడేలింకెక్కడనున్నది. అది పాఱిపోయినది." అప్పుడు వృద్ధకు సంతోషమయ్యెను. ఇదియే శుద్ధ మాధుర్యభావోపాసనము. విశ్వరక్షకునికి పిల్లి, కుక్క, భూత, ప్రేత, పిశాచములనుండి రక్షణ జరుగవలయునని వ్యగ్రత కలిగి యుండుటయే వాత్సల్యభావముయొక్క పరాకాష్ఠ. వ్రజమందు తప్ప ఇంకొకచోట యీ భావము కలుగుట చాల కఠినము.

సూతుడిట్లనెను:— "మునులారా ! పూతన చచ్చి ధడక్కున నేలపైఁ బడఁగానే ఆ శబ్దముచేతనే గోపగోపీగణ ములు మూర్ఛితులైరి. తల్లియగు రోహిణి బాలునిఁ బట్టుకొను టకుఁ బరువిడెను. కాని ఆమె ప్రేమవిహ్వలయై మార్గమందు పడిపోయెను. యశోదయునుఁ బరువిడెను. కాని యింతలో నొకానొక గోపిక పరువిడి పిల్లవాని నెత్తుకొని యశోద కొసం

గెను. పిల్లవాఁడు కన్నులను మూసుకొని యుండెను. రెండు గుప్పిళ్ళు పట్టుకొనెను. అది పూతనవలన దాన దక్షిణలను బట్టుకొన్నట్టుండెను. ఇప్పుడందఱును బూతనను నఱికిరి. కలిసి అంగఱును యశోదకు, నాల్గువైపులను జుట్టుకొనిరి. యశోద రోహిణీ సమీపమునకుఁబిల్లవానినిఁ దీసికొనిపోయెను. పిల్లవానినిఁ జూడఁగానే ఆమె హర్షమునకు మేరలేకుండెను. గోపికలందరును వాత్సల్య భావములో మునిగి పోయి బాల కృష్ణుని రక్షావిషయమున నానావిధములఁ జర్చించుచుండిరి. ఒకర్తొక ఇది మారిఅనియు, ఇంకొకయామె భూతమనియు, మరియొకతె డాకిని, శాకిని, రాక్షసి, యాతుధాని మొదలగు బాలఘాతిని గ్రహముగఁ జెప్పుకొనుచుండిరి. కొందరు వేప మండలతో నిసరుమనుచుండిరి. కొందరుభూతవైద్యుని మంత్ర శాస్త్రజ్ఞులను బిలిపించుమనుచుండిరి. ఇంతలోనే ఒక వృద్ధ గోపిక యిట్లనెను. "మనకు భూతప్రేతోపద్రవము లెట్లుండ గలవు. మనమందరమును వైష్ణవులము. శ్రీమన్నారాయణో పాసకులము. గోవులే మనకుఁ బరమ దేవుడు. తమ నిత్యకర్మ లందు, భక్తులకు భర్తయగు భగవానుని సుమధుర భగవన్నా మములను గీర్తింపకుండినను, ఆతని త్రైలోక్య పావనమగు యశోగానము నొనర్పకున్నను నట్టి స్థానములందు రాక్షసులకు బలము వృద్ధినిఁ బొందును. భగవంతుని నామ గుణకీర్తనములను శ్రవణమును, సమస్తభయములను దూరము గావించును. వాని సమ్ముఖమున నీరాక్షసులేమి చేయగలవు? ఆవుతోకను ద్రిప్పి వెంట్రుకను రక్షకట్టుడు. ఆవుపేడను నొసటనుబెట్టుడు. మాడు మీాద గోరజమునుంచుడు. అంగములందు భగవంతుని నామ మంత్రములను బఠించినచో నన్నియును సరికాగలవు."

అత్యంత దీనతా స్వరమున నశ్రువులను రాల్చుచు యశోద ఆవృద్ధగోపికతో నిట్లనెను :– " పిన్నీ ! నీవే పెద్ద దానవు. మంత్రతంత్రములు, దిగదుడుపులు మొదలగువాని నెరిగినదానవు. మాఅబ్బాయి కెట్లుచితమని తోచిన నట్లు చేయుము. నీవందఱ దానవు. వీడేదోవిధముగబాగుండవలయును.

వృద్ధురాలు తనవిషయమున నమ్మకముతో నిట్లనెను· " ఇటు దెమ్మా. అందఱమును గలసిచేయుదము. పదండి. అంద రును ఆవుల కొట్టములోనికి పదండి. " ఇట్లు పలుకగానే గోపి కలు గుంపులు గుంపులుగా నావుల కొట్టములలోనికి బోయిరి. అచ్చట నామె అందరికంటె ముందుగా భాగ్యవతియగు నొక కపిలగోవు కడకుఁబోయి దానితోకతో బిల్లవానినిఁ గొట్టెను. చాలతడవలు ఆవుతోకను బాలకృష్ణునిశరీరమంతటను ద్రిప్పెను. అంత సుందర సుగంధితమగు గోమయమును దీసికొని శరీరము నకు రాచెను. అంత గోమూత్రముచే స్నానమును జేయించెను. మరల శరీరమంతటను గోఖుర రజము నలదెను. అంతట లలా టమునందును, కంఠము, నాభి, హృదయము, కుడి యెడమ పార్శ్వములు, మూర్ధము, వీపు, కుడియెడమ చెవులు, రెండు భుజములు ఈపండ్రెండు స్థానములందును గోమయ తిలకము నుంచిరి. అంత నందరును శుద్ధయమునాజలముచే నాచమనము గావించి అజ, మణిమాన, యజ్ఞపురుష, అచ్యుత, హయగ్రీవ, కేశవ, ఈశ, సూర్య, విష్ణు, ఉరుక్రమ, ఈశ్వరాది ఏకాదశ బీజమంత్రములచే అంగన్యాస కరన్యాసములు కావించిరి. ఏల ననగా దాను దేవతయై దేవుని పూజింపవలయును. ( దేవో భూత్వాయజేద్దేవమ్ ) పిల్లవానికిగూడ ఇట్లే అంగన్యాసమును గావించిరి. అంత భగవన్నామములతో నాతనిసమస్తాంగములను

రక్షింపవలసినదని ప్రార్థించిరి. గోపికలు భగవానుని నామ మంత్రములను బఠించుచు ప్రతిఅంగముపైనను చేతిని పెట్టుచు ప్రార్థింపసాగిరి. నాయనా! నీయుక్కాయుణ కోసుల చరణసరోజములను నజుడు రక్షించుగాక! నీజానువులను మణిమంతుడు రక్షించుగాక! ఊరువులను యజ్ఞపురుషుడును, సింహామధ్య సదృశముగుగటి నచ్యుతుడును, అశ్వత్థపత్రమునంటి ఉదరమును హయగ్రీవుడును, హృదయమును కేశవహరియగు కేశవుడును, వక్షస్థలము నీశుడును, కంఠమును సూర్యనారాయణుడును, భుజములను విష్ణువును, వటువు నీముఖమును, ఈశ్వరుడు శిరమును రక్షించుగాక! బిడ్డా! నీముందు చక్రమునుగైకొని చక్రి పోవుచు రక్షించునుగాక. వెనుకను గదనుధరించిన గదాధరుడును రక్షించుచు నరణ్యమృగములు వెనుకనుండి వచ్చిన గదచేత దలను పగులగొట్టుగాక! నీయెడమ పార్శ్వమును ధనుర్బాణములను ధరించిన మధుసూదనుడును, కుడిపార్శ్వమును ఖడ్గధారియగు నజుడు రక్షించుగాక! నాలుగు మూలలందును నురుగాయుడు రక్షించుగాక!

మాతండ్రీ! పైనుండి ఉపేంద్రుడును, క్రిందనుండి తన రెక్కలను గొట్టుచు గరుడుడు నీభారమును వహించుగాక. భూమిమీద హలమును ధరించు హలధరుడు రక్షించుగాక. అన్నిదిక్కులనుండి పరమపురుషుడు నిన్ను పూర్ణముగ సమస్త సంకటములనుండి రక్షించుగాక! నాయనా! నీయింద్రియములను హృషీకేశుడును, ప్రాణములనునారాయణుడునురక్షించుగాక! చిత్తసార సంహారమును శ్వేతద్వీపాధిపతియగు భగవంతుడు గావించుగాక! మనస్సును యోగేశ్వర భగవానుడును, బుద్ధిని పృశ్నిగర్భియును, అహంకారమును షడ్గుణైశ్వర్య సంపన్నుడగు

బరమాత్మయును రక్షించుగాక! నాయనా! నీవు వ్రజవీధు లందు మాకందరకును సంతోషమును గలిగించుచుండ నిన్ను గోవిందుడు రక్షించుగాక! నీతల్లి చిచ్చినిఁ గొట్టుచు "నిదురబో నాతండ్రి నిదురబోతండ్రీ!" అని జోలపాడునపుడును, నిద్రించినపుడును నిన్ను మాధవుడు రక్షించుగాక! నీవు "శెప్పుప్పుగోనె, ఊరగాయగోనె" అని పోవునపుడు నిన్ను వైకుంఠుడు రక్షించుగాక. నీవుకూర్చుండినపుడు శ్రీపతి నిన్ను రక్షించుగాక! మాతల్లి 'బువ్వతినుబుజ్జిబాబని' భోజనముపెట్టు నపుడు సమస్త క్రూరగ్రహముల భయమునుండి యజ్ఞభుక్ నిన్ను రక్షించుగాక! నీకు డాకినీ, శాకినీ, యాతుధాని, కూష్మాండాది బాలఘాతినీ గ్రహములు పట్టినను, భూత, ప్రేత పిశాచ, యక్ష, రాక్షస, వినాయక కోటరా, రేవతీ, జ్యేష్ఠా, పూతనాది క్రూరగ్రహములావేశించినను, శరీరేంద్రియ ప్రాణములను నాశనమొనర్చు నున్మాదము, అపస్మారము మొదలగు రోగములు నీశరీరమందు బ్రవేశించినను, స్వప్నములోకనుపడు నుత్పాతములు నిన్ను బాధించుచుండినను, బాలగణకగ్రహము గాని, బాలగణక గ్రహముగాని యెచ్చటి నుండియైనఁ బాఱి పోవుచు నీశరీరమున నావేశించినను, అవన్నియును విష్ణునామ స్మరణము చేయగనే వెంటనే నశించిపోవును. నీసుందర శరీరమునువదలి యీగ్రహములన్నియును నుత్పాత, రోగ, శోకాదు లిచ్చటి నుండి పారిపోవుగాక! "విష్ణవే నమః, విష్ణవే నమః, విష్ణవేనమః!" అని పలికి గోపికలు చప్పట్లను జఱచి శ్రీకృష్ణుని ముఖమువైపునకు జూచిరి.

తన నామములతోఁ దనకు రక్షపెట్టుటను గాంచఁగనే

గోపాలునకు నవ్వువచ్చెను. అతఁడు తన సుందర బాల చంద్ర ముఖమును దెరచి నవ్వెను. పిల్లవాఁడు నవ్వఁగనే అందరి హృదయములు వికసించెను.

ఆ వృద్ధగోపిక యశోదతో నిట్లనెను:- "యశోదా! నీవుపిల్లవానికిఁ బాలీయుము. పిల్లవాడు భయపడి యుండ వచ్చును. పాలనుత్రాగప్రారంభించినచో వానిభయముపోయిన దని అనుకొన వచ్చును. పిల్లలు క్షణములో భయపడుచుం దురు. క్షణములో మరల నావిషయమును మఱచిపోవుదురు."

ఇదివినగానే యశోద వెంటనే దుగ్ధ పూర్ణములగు మాతృ స్నేహ భరితములగు తన స్తనమును రవికనుండి తీసి పిల్లవాని నోటపెట్టెను. స్తనము చిక్కఁగనే అతఁడు చుబుక్కు, చుబుక్కు మని త్రాగసాగెను. పిల్లవాడు పాలుత్రాగగా గోపి కల హర్షమునకు మేరలేకుండెను. వారు మిక్కిలి యుల్లాస ముతో "శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే! హేనాథ! నారాయణ! వాసుదేవా! యని కీర్తింప సాగిరి."

సూతుడిట్లనెను;- "మునులారా! పిల్లవాడు పాలు త్రాగగానే తల్లి వానిని మెత్తని శయ్యమీద నిద్రబుచ్చి, తన్నుతాను మరచి గీతములను బాడసాగెను.



# పూతనకు సద్గతి

శ్లో॥ పూతనా లోకబాలఘ్నీ రాక్షసీ రుధిరాశనా ।
జిఘాంసయాపి హరయే స్తనం దత్త్వాప సద్గతిమ్॥
(శ్రీభాగ. ౧౦ స్కం. ౬ అ. ౩౫ శ్లో॥)

క౦॥ హరి దన మీఁదంబదములు
గరములు నిడి చన్నుఁ గుడిచి కదిసిన మాత్రన్
హరిజనని పగిదిఁ బరగతి ,
కరిగెను దురితములఁ బాసి యసురాంగనయున్॥

ఎవనికే స్వభావముండునో వాఁడుదానినివదలుదమన్నను వదలజాలడు. పరశువేదియొక్క స్వభావము లోహామునుబంగారమొనర్చుట. ఇచ్ఛచేఁగానిండు, అనిచ్ఛచేఁ గానిండు, పగలు కానిండు, రాత్రికానిండు. క్రొత్తది కానిండు పాతదికానిండు శుద్ధమైనది కానిండు, అశుద్ధమైనది కానిండు. ఎట్లైనఁగానిండు అదిలోహామునకుతాకెనా బంగారమైతీరును. మధ్యలో వ్యవధానముండెనా పరశువునకు దగ్గఱనున్నను దాని నానుకొన్న లోహాము సువర్ణముకాదు. అనావృతభావముతో, వ్యవధానశూన్యమై ఉన్మక్తభావముతో పరస్పరము కలిసికొనవలయును. ఒకడు తనసాధనద్వారా భగవానుని కడకుచేరును. ఇంకొకని భగవానుడు బలవంతముగ తనవైపునకు లాగుకొనును. ఎట్లైన కానిండు భగవానునితో కామముచేతనో, క్రోధము చేతనో, ద్వేషముచేతనో, భక్తిభావముననో, సంబంధముననో మనస్సు లగ్నమగుచో, నాతనిసమీపమునకుపోయిన భగవంతునకిష్టము లేకున్నను నాతని నుద్ధరింపనలయును. రేవుయందు నొకను దీసికొని నదిని దాటించు పల్లెవాడున్నాడు. దానిలో నొకడు

కేవునిచ్చి కూర్చుండును, అట్లు డబ్బులేనివాడు అనునయ విన యము లొనర్చి, దీనతనుజూపించి పడవవాని కృపచే కూర్చుం డును. ఒకనిని నైనర్తకుడు బలవంతముగ పట్టికట్టి అటునై పడవ మీందపడవేయును. వాడుకూడ నావలకు దాటవలసినదే. ఇప్పుడానౌకలో గట్టపడిన వానినిష్టము లేకున్నను దాటింప వలసినదే. మధ్యలో వదలుటకు వీలులేదు. ఇదేవిధముగ జప, తప, యజ్ఞానుష్ఠాన సమాధ్యాది కఠిన సాధనలద్వారా భగ వంతుని ప్రసన్నునొనర్చు కొనినవారు సంసార సాగరమును దాటుదురు. విద్యా, బుద్ధి, ధనాద్యన్య సాధనములు లేక ధన హీనులై సాధనహీనులైనవారేడ్చి, ఆతనినామమును గీతించి ఆతని కృపాలాభమును బొంది దాటిపోగలరు. కొందఱకు బోట్లాడుట తెలియును. అట్టివారలను భగవానుడుతన యస్త్ర శస్త్రములతో చంపి దాటించును. దాటుట అందరును దాటె దరు; కాని దాటుటలో భేదము కలదు. ఒకనియెడల ప్రేమ కలిగెను. అట్టివానిని స్వీయునిగా స్వీకరించెను. ఒకనిని తరణ తారణుని కావించెను. ఇంకొకనిని దాటించినదలి నేయును. ఇంతకు సారాంశమేమనగా భగవానుని కడకేవిధముగ చేరినను ఏవిధముగానైన మనస్సాతనివైపున కాకర్షింపబడిన నికకల్యా ణము విషయమున సందేహముండదు.

సూతుడిట్లనెను;- “ మునులారా ! ఇచ్చట బాల కృష్ణుడు తల్లిపాలను ద్రావిసుఖముగ నుయ్యేలలో నిద్రించెను. అచ్చట నందుడత్యంత శీఘ్రముగ శంకితచిత్తముతో నారా యణస్మరణ మొనర్చుచు వ్రజము వైపునకు వచ్చుచుండెను. ఆతనికి వసుదేవుని యొక్క వాక్యములొక్కటైనను మరపు నకు వచ్చుటలేదు. ఆతడు యమునను దాటగనే పూతన యొక్క

విశాలమగు మృతశరీరము పడియుండి కనబడెను. చూచి గోప కులందరును జకితులైరి. ఇదేమి యేదో రాక్షసి కనబడు చున్నది. నందుడత్యంతాశ్చర్య విస్మయ భయభంగిమము లను బ్రదర్శించుచు గోపులతో నిట్లనెను:- "నాయనలారా! వసుదేవుడు సిద్ధుడను సంగతి మనకు దెలియదు. నిస్సందేహ ముగా వసుదేవుడు సాక్షాత్తుగ ఋషియని మనకు విదితమగు చున్నది. ఆతడు మనుష్యరూపమును ధరించి భూమండలమున నవతరించినాడు. ఆతడు మథురలో కూర్చిండియే ఉత్పాతము లను గురించి చెప్పినాడు. మా పిల్లవాని మీదకేదో రాక్షసి వచ్చియుండ వచ్చును. గోపకులీమెను జంపియుండ వచ్చును కాని యీమె శరీరము నందు బాణముల గాయములులేవు. ఇంకొక విధముగ నీమె చచ్చియుండవచ్చును. ఇప్పుడీమె నిచ్చ టనే పడియుండ నిచ్చెదమా?"

వ్రజవాసు లమాయకులుగ నుందురు. వారిలో నొక గోపకుడిట్లనెను:- "బాబూ! సర్పము మరణించినను, పక్షియు వాయువు సోకినచో మరల బ్రదుకగలదు. మరల నీ రాక్షసి బ్రతుక కుండునట్లు నాయభిప్రాయమున దీనిని ముక్కలుగ నఱికితగులబెట్టుట మంచిది. వెనుకేలేకుండిన వేణువేమ్రోగదు.

నందుడిట్లనెను;- "సరే, అట్లే చేయుడు. కంత మూరు క్రోసులలో పడియున్నది. దీని శరీరము నంతను ముక్కలు చేసి, యేర్చి చితిపేర్చి దానిమీద వాని నుంచుడు.

గోపకులు తాము చెట్లనుకొట్టు గొడ్డండ్రను దెచ్చి ఖండింప మొదలిడిరి. కొట్టునపుడందరకును దివ్యచందన సుగం ధము రాసాగెను. దానిని నరకి శరీరమును గాల్చుచుండగా దానిలోనుండి వచ్చిన పొగ అగురువాసన కొట్టుచుండెను.

అంతశౌనకుడిట్లడిగెను;- "సూతా! లక్షలకొలది పసిపిల్లలకు విషమునొసంగి, అసంఖ్యాకులగు ప్రాణుల రక్తమును పానమొనర్చిన సర్పిణియొక్క పాపమయ శరీరమునుండి దివ్యమగు నగురు సుగంధమెట్లు వెలువడినది?

సూతుడిట్లనెను;- "స్వామీ! ఇప్పుడిక నామె యేమి పాపిని. పరశువేది తగిలిన మీందటగూడ యినుము యినుముగనే యుండునా? స్వామీ! ఆమెచేసిన జన్మజన్మాంతరముల లోని పాపములన్నియును భగవానుడు స్తనపానము చేయగనే వెంటనే నశించినవి. మరణ కాలమున హృదయములోనికి భగవంతుని మనోమయమూర్తి వచ్చినచో, అంతయును రానక్కరలేదు. కేవలమాతని చరణకమలములఛాయకనబడినచాలును. ప్రాణి సంసార సాగరమునుండి దాటి బయటఁ బడఁ గలఁడు. మనోమయమగు మూర్తి యేమిటి? మరణ సమయమున భగవంతునిఁ బ్రత్యక్షముగ దర్శించి యుండెను. ఆతని బుడిబుడి పాదములను దనహృదయమున దర్శించెను. ఎవతె చనుమొనలను నోటబెట్టుకొని కృష్ణుడు పయఃపాన మొనర్చెనో, అరుణపల్లవములకంటెను గోమలములగు దన చిట్టిచేతులతో నేయమ స్తనములను బట్టుకొని నతెనో అట్టి యామెకు సద్గతి లభించుటలో సందేహముండునా యేమి? చచ్చినపుడామె దేహాభిమానియగు జీవి దివ్యచిన్మయ సూక్ష్మశరీరమునందు బ్రవేశించెను. ఆసమయముననే ఒక దివ్యమయమగు విమానము వచ్చెను. అది సమస్తవిధములగు సుందరవస్తుసామగ్రిచే నలంకరింపబడెను దానియందనేకులు భగవత్పార్షదులు కూర్చుండియుండిరి. వారు మిక్కిలి ఆదరముతో పూతనను గూర్చుండబెట్టి భగవద్ధామమునకు గొనిపోయిరి. ఇఁక మిగిలిన నిష్పాపమగు శరీరము నుండి

అగరు సుంగధము వచ్చుట స్వాభావికమే కాగలదు. ”

అత్యంతాశ్చర్యమును బ్రకటించుచు శౌనకుడిట్లడిగెను— “ సూతా! దేవతలచేతను పూజనీయుడును, లోకవంద్యుడును, భక్తులహృదయములందు నిరంతరము నివసించువాడునగు భగవంతుని చరణకమలములు మరణకాలమున నామె హృదయమున నుండుటకు పూతన చేసిన పూజలేమి?

నవ్వి సూతుఁడిట్లనెను:— “ ఏదోపుణ్యమువలన నిట్టి సౌభాగ్యమెవరికో ప్రాప్తించుచుండును. భగవంతుని యందు భావనయుండుటచేతనే ఇట్టి సుయోగము లభించును. భగవంతుని యెడల నెవడు యెట్టి భావమును గలిగి యుండునో భగవంతుడు వానికట్టి గతి నొసంగును. ”

శౌనకుఁడిట్లనెను :— “ భగవంతున కీమె స్తనపానమొనర్పవలయునని భావన యెట్లుకలిగినది? ఈమెకుభగవంతుని దర్శన మెచ్చటనైనది?”

సూతుడిట్లనెను :— “ భగవానుడు వామన రూపమును ధరించి బలిని మోసగించుటకాతని యజ్ఞమునకు బోయినప్పుడాతని సుందర సుకుమార సుసౌష్ఠవ సుమనోహరమగు చిన్న శరీరము మిక్కిలి మనోహరముగ నుండెను. ఆతనిఁ గాంచిన స్త్రీలెల్లరును నాతని దమ పుత్రునిగా భావించి కౌగిలించుకొనవలయు ననుకొనుచుండిరి. బలి పత్నియగు వింధ్యావళి కడుపున బుట్టిన నొక కన్యక రత్నమాల యను పేరుకలది ఆయజ్ఞమండపమునందుండెను. పొట్టి వడుగగు వామనుని గాంచగనే ఆయువతి కీతనికిఁ బాలీయవలయునను కోరిక కలిగెను, ఆమె యీతడు భగవానుడని యెరుగకున్నను నాతని సుకుమార

రూపమును గాంచి మోహపడెను. మనస్సులో నేదైన సంకల్పము కలిగెనా అది యెన్నటికైనను నెఱవేరి తీరును. పైగా భగవంతుని విషయమున జేసిన సంకల్ప మవశ్యము నెరవేరి తీరును. భగవంతుడా విషయమును లోలోన దెలిసికొని, ఆమె సంకల్పమును నెరవేర్పదలచెను.

ఆ చిన్నపిల్లవాఁడు భూతము వలెఁ బెరుగ సాగఁగానే ఆ బలిపుత్రికయగు రత్నమాల ఆతడు. మోసగాడని భావించి కోపమును జెందెను. ఆమె వామన వటువును జంప బరువిడెను. అసురుని పుత్రిక మిక్కిలి బలవంతురాలు. తాను వామనుని జంపగలనను గర్వమామెకుండెను. కాని బలిచక్రవర్తి మిక్కిలి ధర్మాత్ముఁడు. ఆతఁడామె నిట్లు కసరెను. ఏమి చేయబోవు చున్నావు. నేనాతనికిచ్చుటకు మాట నొసంగితిని. ఆతనికవశ్య మిచ్చెదను. పోయి కూర్చుండుమచ్చట. ”

కూతురై ఆతనిమాట నెట్లు కాదనగలుగు? వధించుటను విరమించినదికాని బాలకునిఁ జంపుట కాతనిపైన గోపించు సంకల్పము అట్లే నిలచియుండెను. చిత్రమును దీయు యంత్రము సమ్ముఖమున నీవు నవ్వుచు నిలుచుండుము. చిత్రములో నవ్వినట్లే పడును. ఏడ్చుచున్నటులో లేక కోపగించుచున్నటులో నిలుచుండుము. అటులే పడిపోవును. భగవంతుడు పుత్రుడు కావలయునని సంకల్పింపుము. ఆతడు పుత్రుడగును. శత్రువగు నట్లు సంకల్పించిన శత్రువే కాగలడు. రత్నమాలయొక్క ఆ సంకల్పమును గూడ శ్రీహరి యంగీకరించెను. ఈ బలిపుత్రికయగు రత్నమాల వ్రజమందు పూతనయై జనించెను పూర్వ జన్మభావనలను నెరవేర్చుటకై భగవానుడామె స్తనమును గూడ

పానమొనర్చెను. తన్ను జంపుటకుఁ బ్రయత్నమును గావింప జేసెను. చివరకు సద్గతి కలిగెను. ”

శౌనకుఁడిట్లనెను :— “ సూతా! భగవంతుని దర్శన మైన నిక జన్మయుండదని మేమువింటిమి. రత్నమాల తెలిసియో తెలియకయో భగవంతుని దర్శించెనుగదా! ఆమెకీరాక్షస జన్మ మరల నెట్లు వచ్చినది? ”

సూతుఁడిట్లనెను :— “ స్వామీ! భగవంతుని దర్శన మైన నికసంసారచక్రముండదు. అయినను నవతారరూపమందు సాకారుడై భగవంతు డవతరించినపు డెవరెవరి కాతని దర్శన మైనదో వారి కర్మబంధములన్నియును నశించును. కాని భగ వంతునిఁజూడగనే యేభావముత్పన్నమగునో ఆభావముల పూర్తి కొరకు భగవాను డొకటిరెండు శరీరముల నొసంగి వారిభావ ములను నెరవేర్చును. వారి మనోభిలాషలను నెరవేర్చును. వారి యీ జన్మకర్మలు భోగముల ననుభవించుటకు గాదు కాని తమ భావనానుసారముగా భగవల్లీలాస్వాదన రసమును భోగిం చుటకే. బలి శిరస్సుమీద భాదమునుఁ బెట్టి వానిని గొలిచెను. కాని ఆతని కింద్రుడు కావలయునను వాసనకలదు. రాబోవు మన్వంతరమున నింద్రుడు కాగలడు. అంతఁ బరమ పదమును పొందును. దండకారణ్యఋషులు రఘునందన రూపమున ఆ రాఘవేంద్రు నాశీర్వదించిరి. ఆతని కాతిథ్య మొసంగిరి. అయి నను వారి కాతనిఁ గౌగిలించుకొన వలయుననియు, నాతనితో రమింపవలయుననియు కోరిక అట్లే యుండెను. వారికి గోపికా శరీరముల నొసగిరమింపజేసెను. తననిత్యలీలలలోనికి బ్రవేశింప జేసెను. భగవానుడు వాంఛాకల్పతరువుగదా! ఆతడందరియొక్క

సమస్తకోరికలను నెరవేర్చును. ఆహార, నిద్రా, భయ, మైథునములందు సుఖానుభూతి కలవారలకు ఆతడే యొసంగును. వారిని గర్మచక్రములో ద్రిప్పును. భగవద్దర్శన మైనతరువాత కర్మబంధనముండదు.

శౌనకుడిట్లడిగెను;- "తరువాత నేమైనది?"

సూతుడిట్లనెను;- "స్వామీ! ఆ రాక్షసియొక్క మృత శరీరము యొక్క ధూమగంధమును వాసనచూచి గోపులందఱును బరమ విస్మితులైరి. వారీ రహస్యమును దెలిసికొనం జాలక పోయిరి. నందుని హృదయము దడదడ కొట్టుకొను చుండెను. ఆతని కడుగడుగునను దన ప్రియపుత్రునకేమైన ననిష్టములు కలుగునను శంకయే యుండెను. ఆతడు గోకులమునకు రాగానే గోపకుల నోట పూతనాగమనమును గూర్చియు, పిల్లవానికి పాలిచ్చుటను గూర్చియు, సది చచ్చి పడిపోయిన విధమును వినెను. విని యాతడు మిక్కిలి వ్యాకులమును జెందెను. చేతులను గాళ్ళనుం గడుగుకొనకయే ఆతడంతఃపురములోనికిం బరువిడెను. తనబిడ్డడు క్షేమముగానున్నాడని తెలిసికొనగానే ఆతనిమనస్సునకు సంతోషము కలిగెను. ఇంతటి పూతనయెట్లు చంపబడినదని ఆతనికి మిక్కిలి విస్మయము కలుగుచుండెను. ఈవిధముగ ద్వైధీభావమున భావించుచు ఆతడింటిలోనికి బోయెను. పిల్లవాడొక ఉయ్యాలలో బరుండి కునుకుచుండెను. తల్లి ఆయుయ్యాల నూపుచు, ఆతని మనోహర ముఖకమలమును తదేక దృష్టితోం జూచునంతలో వ్రజరాజు పోయి పిల్లవాని నుయ్యాలనుండి తీసికొనెను. మాటిమాటికిని నాతని గుండ్రని చిన్న చిన్న కపోలములను ముద్దిడుకొనెను. మృత్యుముఖమునుండి బయటపడిన తనపుత్రుని ముద్దుపెట్టు

కొనుటలో తృప్తితీరలేదు. హఠాత్తుగా తన ప్రాణనాథునిగాంచి యశోద యులికిపడెను. తలను వంచుకొని ఆమె తన పైటను సవరించుకొని లజ్జించుచునిట్లనెను :- "నాథా! మీరు మథుర నుండి యెప్పుడు వచ్చితిరి? ఇచ్చట గొప్ప యనర్థము జరిగినది. నారాయణుడే రక్షించెను. లేకున్న మనమెవ్వరమును నుండెడి వారము కాము. యుగయుగములనుండి చేసిన సాధనముచే పొందిన నిధిని మనము నేడు కోల్పోయెడివారమే. మీరు రుదాసీనులుగ నుందురు." అని యిట్లు పలికి నందుని పత్ని యశోద యేడ్చియేడ్చి వ్రజరాజు చరణములమీద పడెను. ఒకచేతితో పిల్లవానిని పట్టుకొని వ్రజరాజు తన ప్రాణప్రియను లేవనెత్తి అత్యంత ప్రేమతో నామెవీపునుజఱచి యిట్లనెను :- "ప్రియా మనసర్వస్వము శ్రీమన్నారాయణుడే. అతడే సర్వత్ర మంగళము లొనర్పగలడు. మన దేమున్నది? ఈపిల్లవాడునారాయణుని పిల్లవాడు. ఆతడే యిచ్చినాడు. ఆతడే సంకటముల నుండి రక్షింపగలడు. పెంచి పెద్దవానిని చేయగలడు."

సూతుడిటనెను ;- "మునులారా! భగవంతుడెంతటి దయామయుఁడు! పూతన రాక్షసి. మాయామాతృ వేషమును మాత్రము ధరించెను. ఆమె వేషమునకు సంతసించి భగవానుడామెకు ఉత్తమగతిని ప్రసాదించెను. అట్టియెడ సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుని తల్లివలె తమ ప్రేమనంతను గ్రుమ్మరించి శ్రద్ధాభక్తులతో నాతడు కోరిన వస్తువులను ప్రసాదించిన నాగోపికలకేమిగతి నీయవలయును. ఈవిషయమున నాబుద్ధి విమూఢమగుచున్నది. చూడుడు. పూతన సుకృత కర్మల నేవియును జేసి యుండలేదు. పసికూనలను వధించినది. ఆమె భగవంతునకు నైవేద్యముదైననిడి తినెనా? అదియును లేదు. అది రాక్షసి.

పచ్చిరక్తమును ద్రావును. భగవానునికైనను నది విషపాన మొనర్పజేయ వచ్చినది. స్తనపానమును మోసగించెను. కాని యేవిధముగ నయినను స్తనపానముచేయించినది. ఈ స్తనపానము వలన నామెకు ముక్తిని ప్రసాదించెను. పాలుత్రాగు నెపమున నామెకు పరమపద మొసంగెను. భగవంతుడు నేపరి ప్రేమను ద్రావెనో ఆతల్లులను గూర్చియు, గోవులను గూర్చియు చెప్ప వలసిన దేమున్నది? వారికింక నజ్ఞానజన్యమగు సంసారప్రాప్తి సంభవించునా? ”

శౌనకుఁడిట్లనెను:— “ సూతా ! నీవు మాకీ పూతన యొక్క మోక్షకథను నద్భుతముగా చెప్పితివి. ఇది వినగానే భగవానునిదయాళుత, భక్తవత్సలత, శరణాగత ప్రతిపాలకతను వినిన నేడ్పు వచ్చుచున్నది. సరే యీలీల యొక్క శ్రవణ మాహాత్మ్యమును గూడ చెప్పుము. ”

సూతుఁడిట్లనెను;— “ స్వామీ! ఎవడు చిన్నారిపొన్నారి యగు నేడుదినముల బాలకృష్ణుని యీ పూతనా మోక్ష కథ యను నద్భుత లీలను శ్రద్ధాభక్తులతో నేకాగ్ర చిత్తముతో శ్రవణముచేయుచున్నాడో వానికి శ్రీకృష్ణచంద్రుని చరణార విందములందు భక్తి జనించును. ఆతని పాదపద్మము లందు ప్రగాఢప్రేమ కలుగును. ఈవిషయమున సందేహము లేదు. మునులారా! ఈ కథనుజెప్పి మాగురుదేవులు శ్రీశుకమహర్షి మెదలకుండెను. శుకభగవానుడు మెదలకుండుటను గాంచి శ్రీకృష్ణలీలారసికుడునగు పరీక్షిన్మహారాజాతనిని మరలఁ బ్రశ్నించెను. ఆతఁడేమి ప్రశ్నించెనో నేను ముందుచెప్పెదను. మీరు సావధానులరై వినుడు, ”

7)

# శ్రీకృష్ణ జన్మనక్షత్రోత్సవము

( ౮౬౦ )

శ్లో॥ ఔత్థాని కౌత్సుక్యమనా మనస్వినీ
సమాగతాన్ పూజయతీ వ్రజౌకసః
నైవాశృణోద్వై రుదితం సుతస్య సా
రుదన్ స్తనార్థీ చరణా వుదక్షిపత్ ॥

శ్రీ భాగ. ౧౦స్క. ౭అ. ౬శ్లో॥

సీ॥ బాలకుండాదికిలఁబడ నేర్చెనని జన్మ,
నక్షత్రమందొకనాఁడు నందు
పొలఁతి వేడుక బోర్కానోయ వ్రేతలఁ జీరి,
వాదిత్ర గీతారవంబు సెలఁగ
విప్రులతోఁగూడ వేదమంత్రంబుల
నభిషేచనాదిక మాచరించి
వారి దీవనలొంది వారికి మొదవులు,
నన్నంబుఁజీరలు నడిగినట్టు

ఆ॥ లిచ్చి బాలుఁదియ్య మెసఁగఁబానుపుసేర్చి
నిదుర పుచ్చి గోప నివహా మునకు
గోపికలకుఁ బూజఁ గొమరారఁ జేయుచు
జనని కొడుకు మరచె సంభ్రమమున ॥

శ్రీమదాంధ్రభాగవతము.

తల్లులకు తమ సంతానము యొక్క క్షేమము విషయ ములో నత్యధిక చింతయుండును. తమ సంతానమునకు మంగళ ములు కలుగవలయునని తల్లి జప, తప, పూజా, పారాయణ,

దేవతా, పితృ, భూత, ప్రేత, శీతలాదుల నెందఱనో పూజించు చుండును. ఎందరెందరకో మ్రొక్కుకొనుచుండును. ఏదైనా మొదటికార్యము నుండి దానికొరకై ఉత్సవము. ప్రథమస్నానోత్సవము, ప్రథమ నలుగుపండుగు, తైలమర్దనోత్సవము, ఉగ్గుత్రావించు నుత్సవము, బోర్లపడినప్పుడుత్సవము అన్నప్రాశనోత్సవము, ఉత్సవములే ఉత్సవములు. పిల్లవాని సుఖమే ఉత్సవము. ఉత్సాహమునను, మాతృప్రేమచేతను దల్లికి స్తనములకుఁజేపు వచ్చును తల్లులకు సంతానము కొరకు చేయుటలోగల ఆనందము తనశరీరము కొరకు చేసినరాదు. సంతానము హృదయము లోపలనొక భాగము. ఆతడుబహిః ప్రాణము తల్లియొక్క సజీవ హృదయమును, మూర్తీ భవించిన ఉల్లాసమును, సాక్షాత్ప్రసన్నతయు సంతానమే.

సూతుఁడిట్లనెను ;— " మునులారా! పూతన కథను దాని ఫలస్తుతినిఁ జెప్పి వ్యాసనందనుడగుశుక దేవుడు మౌనము వహింపగా నులికిపడి పరీక్షిత్తు ఇట్లు పలికెను :— " ఏమి స్వామీ! మీరూరకుంటిరేల? భగవానుని బాలలీల సమాప్తమైనదా యేమి? ప్రభూ! భగవానుని లీలలన్నియు సుఖదములే అన్నియును కర్ణరసాయనములు. ఏలననగా భగవానుఁ డేయవతార మెత్తినను, ఆయాయవతారములలో నేలీల నొనర్చినను, నవియన్నియును సుఖప్రదములుగనే యుండును. ఏలననగా నాతడు సచ్చిదానంద సుఖస్వరూపుడు. ఆతని కథలన్నియును మనస్సున కౌషధి స్వరూపములు. "

శ్రీ శుక దేవుఁడిట్లనెను :— రాజా! భగవంతుని లీలలు మనస్సున కౌషధమని యెట్లు చెప్పగలవు? "

పరీక్షన్మహారాజు ఇట్లనెను :- " స్వామీ! మీకన్నియును దెలిసియు నన్నిట్లు ప్రశ్నించుచున్నారు. అనేకజన్మ వాసనల వలనఁ బ్రాణుల హృదయ ఫలకమున నజ్ఞాన జవనిక పడును. దానివలన మనో మాతంగము తన విశుద్ధ ధామమును మరచి విషయతృష్ణయను గహనవనమందుఁ దిరుగుచుండును. శ్రవణ సుఖదములగు భగవల్లీలను వినుటచే చిత్తమలమును దాని మూలమునకుఁ గారణ భూతమగు విషయ తృష్ణయును శాశ్వతముగా ఛిన్న భిన్నమైపోవును. మనస్సుపైనుండు మాయా మోహమును, అజ్ఞానావరణమునుఁ దొలిగిపోగా మనోబుద్ధి చిత్తాహంకారములను నీమనోవృత్తులు విశుద్ధములగును. అజ్ఞానావృతమైన నశుద్ధాంతఃకరణమే మరల మరల సంసారమును గలిగించుచుండును. అజ్ఞానావరణము తొలగిపోగానే ఆ విశుద్ధాంతఃకరణము నందు భగవద్భక్తియును, భగవదీయులం దనురక్తియు నుత్పన్నమగును. ఇట్టి బరమాత్మ యొక్క పరమ పవిత్రమగు విశుద్ధచరిత్రమును మీకుచితమని తోచిన నాకింకను జెప్పుడు. "

శ్రీశుక దేవుఁ డిట్లనెను ;- " రాజా భగవల్లీలల కంతములేదు. అవి అనంతములు. వానిని నేనెంతని వినిపింప గలను ? "

పరీక్షన్మహారాజు ఇట్లనెను ;- " స్వామీ! మీరెంత వరకు చెప్పగలరో అంతవరకు చెప్పుడు. ఒకటి రెండు లీలలు వినిన నాకు తృప్తి కలుగుట లేదు. మిక్కిలి ఆకలిని చెందిన వాని కత్యంత స్వాదిష్టమగు పదార్థమును మూడు నాలుగు గ్రాసము లొసంగిన వాని ఆకలి యింకను పెరిగిపోవును. శ్రీకృష్ణభగవానుడు మర్త్యలోకమునం దవతరించి మానవ జాతి

యొక్క లీలల నన్నిటి ననుకరించెను, వానిలో మీరెన్నిటిని వినిపింపగలరో పరమాద్భుతములగు నన్ని బాల లీలలను చెప్పుడు. ఏలననగా నాతని బాలలీల లత్యంత సరసములై నవి యును, మనస్సును మోహింప జేయునవియు నై యున్నవి. వానిని మీరు నాసమ్ముఖమున కృపతో వర్ణింపుడు.”

సూతుఁడిట్లనెను :- “మునులారా! ఉత్తరానందనుడగు పరీక్షిత్తు శుకుని భగవల్లీలలకు సంబంధించిన ప్రశ్నమును నుత్సాహముతో ప్రశ్నింపగా నాతడు శకట భంజన లీలను చెప్పదొడంగెను. ఆతడిట్లనెను :- “రాజా! యశోదమ్మ సదా బాలకృష్ణుని తన కన్నుల కెదుటనే యుంచుకొను చుండెడిది. పూతనాసంఘటనము జరిగినప్పటినుండి ఆమె మిక్కిలి శంకించు చుండెను. ఒక దినమున కృత్తికానక్షత్రము. తల్లి యుయ్యాలలో పిల్లవానిని పరుండబెట్టి యూపుచుండెను. మెల్లమెల్లగా జోల పాడుచుండెను. ఆతనికి నిద్రరావలయునని ఆమె యుద్దేశ్యము. ఇంతలోనే కృష్ణుడొత్తిగిల్లెను. నేటికి కృష్ణుని కిరువదేడు దిన ములు. మొట్టమొదటగ నేడాతడు తనకుతానే వత్తిగిల్లెను. తల్లియానందమునకు మేరలేకుండెను. ఆమె అక్కడనుండియే రోహిణిని “ ఏమమ్మా! అక్కా! ఏమిచేయుచున్నావని పిల చెను.

పూతనాసంఘటనము జరిగినప్పటినుండి రోహిణిచిత్తము సదా శంకించుచునేయుండెను. యశోద తొందరగాఁ బిలుచు టను గాంచి రోహిణి అదరిపడెను. ఆమె యిట్లనుకొనెను:- “పూతనకుఁ దోడుగా నింకొకతె రాలేదు కదా !” ఆమె పరు విడి యశోదకడకు వచ్చెను. అత్యంతోల్లాసముతో యశోద

రోహిణితో నిట్లనెను:- "అక్కా! సంతోషవిషయము. నేడు మాపిల్లవాఁడో త్తిగిల్లినాడు.

ఇది విని యానందమును ప్రకటించుచు రోహిణి యిట్లనెను;- "అట్లైన రాణి! ఉత్సవము చేయవలయు నమ్మా! ఇది మిక్కిలిగ నానందింపఁదగిన విషయము."

యశోదయు నట్టే యనుకొనుచుండెను. ఆమె యిట్లనెను:- "చేయుము. నాతోఁజెప్పవల దేమున్నది. చేయుదానవు చేయించుదానవును నీవే."

ఇంకేమున్నది ? వెంటనే పురోహితుఁడు పిలువఁబడెను. పురోహితుఁడు తలగుడ్డను జుట్టుకొని, చొక్కాను దొడుగుకొని ఉత్తరీయమునందు పంచాంగమును గట్టుకొని వచ్చెను. నందుఁడు పురోహితుని పాదములంటి కూర్చుండుట కాసనము నొసంగెను. ఆశీర్వదించి పురోహితుఁడాసనముపైఁ గూర్చుండెను. ఐదు సువర్ణముద్రలను దల్లి పంచాంగముమీఁదఁ బెట్టి యిట్లనెను;- "పండితప్రవరా! ఇప్పుడే పిల్లవాఁడో త్తిగిలినాడు. దీని కుత్సవ మెప్పుడు చేయువలయును ? పంచాంగమందు ముహూర్తమును గాంచుఁడు.

పండితుఁడు పంచాంగమును దెఱచెను. మేషవృషభములను, అశ్వనీ భరణులను లెక్కించి యిట్లనెను;- "సరే, రేపు పిల్లవానికి జన్మనక్షత్రము రోహిణి కూడ జన్మనక్షత్రమునకును నుత్సవ మొనర్పవలయును. ఒత్తిగిలిన ఉత్సవమును జన్మనక్షత్రోత్సవమును రేపు చేయవచ్చును."

ఇది వినఁగానే యశోదకు మిక్కిలి యానందము కలిగి యిట్లనెను. "రేపు పిల్లవాని జన్మనక్షత్రమను సంగతిని నేను

మఱచితిని. దానికిని ఉత్సవము చేయవలయును. రెంటినిఁ గలిపి చేయవలయును." అని పలికి ఆమె వెంటనే పేరంటమునకు బిలుచు నామెను బిలిపించి యిట్లనెను;- "నీవు వ్రజమంతటికిని బోయి రేపు ఒత్తిగిలిన ఉత్సవమును, జన్మనక్షత్రోత్సవమును చెప్పి రమ్ము."

ఇది విని యామె యింటింటికినిఁ బోయి వాఁకిటనుండియే యిట్లరచుచుండెను;- "సుబ్బమ్మా! యశోదమ్మ యింట రేపు ఒత్తిగిలిన ఉత్సవమును, జన్మనక్షత్రోత్సవమును రండమ్మా!"

అప్పుడామె యిట్లడిగెను:- "ఏమే, ఏమి పేరంట మమ్మా ?"

పేరంటమునకు బిలుచునామె యిట్లనెను;- "కృష్ణుడు నేఁడొత్తిగిలినాఁడు. అందువలన రాజభవనమున నందఱకును బేరంటము." ఈ విధముగ వ్రజమంతయును బిలువఁబడెను. ప్రాతఃకాలము నుండియే వనితలందఱును షోడశశృంగారములను గావించుకొని గోపికలు నందభవనమువైపునకు దళకు బెళుకు లతో వయ్యారముగ గీతములను బాడుకొనుచుఁ గానుకలను, ఇతరవస్తువులను దీసికొని వచ్చుచుండిరి. నందభవనమంతయును గోపికలతో నిండిపోయెను. వచ్చి గోపికలుత్సవమును ప్రారంభించిరి. కొందఱు నాట్యము చేయుచుండిరి. కొందఱు గీతములను గానము చేయుచుండిరి. ఢోలకును మృదంగములను వాయించుచుండిరి. స్త్రీలకు పాడుట, వాయించుట, ఆడుట యనినను, వివిధములగు మంగళకృత్యములనినను మిక్కిలి యానందము కల్గును. పండితులు వచ్చి మంత్రములను బఠించిరి. దివ్యౌషధముల చేతను, మహౌషధముల చేతను కృష్ణునకు

స్నానము చేయించిరి. విధ్యుక్తముగ నాతని కభిషేకించిరి. పూజనమును చేయించి బాలుని మంగళము కొఱకై తల్లి ఆతని చేతిచే స్పర్శింపఁ జేయించి అన్న, వస్త్ర, మాలలను, మంచి మంచి నత్నములతోఁగూడిన పాడియావులను దాన మొసంగెను. ఎవరేవస్తువు నడిగిన తల్లి యావస్తువును మిక్కిలి యుదారముగ సంతోషముతో నొసంగెను.

చిన్నపిల్లలకు స్నానము కాఁగానే నిద్రవచ్చును. తల్లి దాన మిప్పించుచునే యున్నది. పిల్లవాడు పాలు త్రాగుచునే కూర్కుచుండెను. పిల్లవాని కూర్కులను గాంచి తల్లి కొంచెము సేపు చిచ్చికొట్టెను. పిల్లవాడు నిద్రించఁగనే మెల్లఁగా వానినిఁ బక్కమీఁదఁ బరుండఁబెట్టెను. పేరంటాండ్రు అపారముగ నుండిరి. ఇల్లంతయును నిండియుండెను. ఇంటిముందొక కొట్టమునందొక శకటము నిలిచియుండెను. ఆ శకటము చాల పెద్దది. దానిమీఁద నూఱుమణుఁగుల బరువు వేయుచుందురు. మంచి బలిష్ఠములైన నెనిమిది యెద్దులు దానిని లాగును. కొన్నాళ్ళనుండి నందుఁడు దానిని కొట్టమునఁ గట్టివైచెను. అనొకవిధముగ నొక యిల్లువలె నుండును. అందువలన దాని మీఁద నొంటె చర్మముతోఁ జేయఁబడిన వంపలకొలది నేతి తిత్తు లుంచఁబడెను. పాలు, పెరుగుతో నిండిన పూర్వపు పెద్ద పెద్ద బానలు కూడ ఉంచబడెను. తల్లి దానిక్రింద పిల్లవాని ఉయ్యాల నుంచెను. పిల్లవాని నచ్చటనే నిద్రబుచ్చెను. తాను తన యింటికి వచ్చిన గోపికలను బరామర్శించుటలో లగ్నమై యుండెను. కొందఱు ముసుగులు వేసుకొని వచ్చి యశోదను బరామర్శింపగా యశోద యిట్లనును. "వేయేండ్లు బ్రదుకుమమ్మా ! నీకు పిల్లలు కలిగి నీ భర్త నీకనుకూలుఁడై

యుండి యిద్దరును వరిల్లుదురు గాక !"

ఇంకొకర్తె నవ్వుచు నిట్లనెను :- "అమ్మా! ఇప్పుడే ముసలివాండ్రగునట్లాశీర్వదించుచున్నావా? నిన్ననే యీమె పెండ్లిచేసుకొని వచ్చినది."

అంత యశోదమ్మ ఇట్లనెను :- "ఇప్పుడేకాదు. పది పదునైదుగురు పిల్లలు పుట్టినతరువాత."

ఇంకొక యామెను యశోద యిట్లడిగెను ;- "నీపిల్ల పెద్దదైనట్లున్నది. దానికి సంబంధము కుదిరినదా?" ఇంకొకతెతో పిల్లవాని వివాహము సంగతి యడుగును. స్త్రీలకు మూడేవిషయము లుండును. ఆహార పానీయములు, తనభర్త స్వభావమునుగూర్చియు, నాడుపిల్లల వివాహమును గూర్చియు నుండును. ఈప్రసంగము వచ్చిన వారు శరీరస్పృహను గూడ మరచి మాట్లాడుకొనుచుందురు.

ఇచ్చట యశోద ఉత్సవమునకు వచ్చిన వ్రజ గోపికలకు స్వాగతసత్కారము లొనర్చుటలో లీనమై యుండెను. అచ్చట శ్యామసుందరుని నిద్ర భంగమయ్యెను.

చిన్నపిల్లల కల్పకాలముననే ఆకలి వేయును. అల్పకాలముననే నిద్రించెదరు. నిద్రించి లేవగనే వారికి మరలఁ నాకలి వేయును. ఇట్టి చిన్నపిల్లలారేడు జాములు నిద్రించెదరు. కనులను తెరచి కృష్ణుడటు నిటు చూచెను. తల్లి ఆతనిదగ్గరలో లేకబోవునప్పటికి ఆతనికి కోపము వచ్చెను.

శౌనకుడిట్లడిగెను ;- "సూతా! తల్లిపైన భగవానునకు కోపమేలవచ్చెను? తల్లిమీద కోపము మంచిదికాదే."

సూతుఁడు నవ్వియిట్లనెను :- " స్వామీ! ఇదేమి కోపము! ఇది ప్రేమకోపము. 'నాకొరకై తల్లి యుత్సవము చేయుచున్నది. నన్నొంటరిగ తల్లి యిచ్చట పరుండబెట్టి నది. మంచిది. తల్లికి నాలీలలను జూపింపవలెనని భగవానుఁడు అనుకొనెను.

అంత శౌనకుడిట్లడిగెను :- " మంచిది సూతా! తల్లి పిల్లవాని నొక్కక్షణమైన విడచి యుండదుకదా! నేడు కృష్ణుని తల్లి ఒంటరిగా బండిక్రింద నుయ్యాలలో నేల నిద్రపుచ్చినది?

అంత నవ్వి సూతుడిట్లనెను :- " స్వామీ! పిల్లవాని నిచ్చట నేకాంతమున నిద్రబుచ్చి వదలివేయవలయునని తల్లికి లేదు. తొందరలో నీసందడినుండి రక్షించుటకై బండిక్రింద నుయ్యాలలో పిల్లవాని నిద్రబుచ్చి, కొంచెము సేపటికే తీసి కొని రావలయు ననుకొనెను. కాని యీతల్లులకు సంభాషణ మనిన మిక్కిలియానందము. పది పదునైదుగురు స్త్రీలొక్క చోట జేరిరా వారికిఁ పురుషులు కూడ జ్ఞాపకమునకు రారు. వృద్ధస్త్రీలు తమ వివాహమునాటి ముచ్చట్లను చెప్పుచుందురు. మాటలలో వారు పిల్లలకు పాలిచ్చుటను కూడ మరచెదరు. దూరదూరములనుండి గోపికలు వచ్చిరి. వారి ఆదర సత్కార ములో తల్లి కృష్ణుని మరచెను. "

ఇప్పుడు కృష్ణుడేమి చేయగలడు. " బాలానాం రోదనం బలం " ఏడ్చుటతప్ప వారు పిలుపను గూడ పిలువజాలరు. అందువలనఁ కాళ్ళు తన్నుకొనుచు నేడ్వ నారంభించెను. కాని అచ్చట నగారా శబ్దములతోఁ దూతు శబ్దము నెవరు వినెదరు? స్త్రీలు నాట్యగానములందును, వాద్యములందును

దల్లీనులై యుండిరి. అచ్చట యుత్సవములో నుండిరి. కొందరు పిల్లలాడుచుండిరి. తల్లి వారితో మీరుపిల్లవానిని జూచుచుండు డని చెప్పియుండెను. మేల్కొనిన తనకు జెప్పుమనెను. కాని పిల్లలు పిల్లలేకదా? పరస్పరము పోట్లాడుకొనువారు పిల్లలు. పిల్లలుతమలోతాము పోట్లాడుకొనుచుండిరి. వారుపిల్లవాడేడ్చుటను జూడనే చూడలేదు. అప్పుడు భగవానుడిట్లనుకొనెను ;- "ఈయుత్సవములో నన్నెవరును చూచువారులేరు. తల్లి యివ్వేళ తనలోతాను లేదు. అందరకును స్వాగతసత్కారము లొనర్చుటకై ఆత్మవిస్మృతిని చెంది యున్నది. నేనింతకంటె నెక్కుడుగా గోలచేసితినా వీరందరును గానమును, వాద్యములను, నాట్యమును, మరచి నావైపునకే పరువిడెదరు "

సూతుఁడిట్లనెను ;- " మునులారా! ఇట్లాలోచించుకొని భగవానుడటునిటు చూచెను. గోల చేయుటకులాయని చూచుచున్నట్లుండెను.



# శకటాసుర భంజనము

(రా-౧)

శ్లో॥ అథః శయానస్య శిశోరనోఽల్పక
ప్రవాలమృద్వంఘ్రిహతం వ్యవర్తత ।
విధ్వస్తనానారసకుప్యభాజనమ్
వ్యత్యస్త చక్రాక్షవిభిన్నకూవరమ్ ॥
శ్రీభాగ. ౧౦స్కం. ౭అ. ౭శ్లో.

కం॥ నిదురించిన శిశు వాఁక్రొని,
కిసుకుచుఁ జనుగోరి కెరలి కిసలయవిలస
న్మృదుచక్రచాప రేఖా,
స్పదపదమునఁ దన్నె నొక్కబండిన్ దండిన్॥

కం॥ శకటము హరి దన్నిన దివిఁ
బ్రకటంబై యెగసి యిరుసు భరమునఁ గండ్లున్
నికటంబుగ నేలం బడె,
నకటా యని గోపబృంద మాశ్చర్య పడన్ ॥
శ్రీమదాంధ్ర భాగవతము.

లోకుల నాకర్షించుటకుఁ గొందఱ అనేక విధములగు నుపాయములను జేయుచుందురు. చాల గుంపు చేయుటకుఁ గొట్లాడుకొనుచుందురు. కొందఱద్భుతాశ్చర్య విషయములను పలుకుచు మానవుల మనసులను దమవైపున కాకర్షించుచుందురు. కొందఱు విస్మయోత్పాదకమగు నద్భుతఘటనమును ఘటింపఁజేసి అందఱి మనస్సులు నాఘటనము వైపునకు బలా

అత్యంత భయంకరమైనదియు, నపూర్వమును విస్మయోత్పాదకమునగు ఘటనమును గాంచుట కందఱు మనస్సులను దహతహ లాడుచుండును. అందఱును దాని కారణమును నెఱయుటకు సముత్సుకతను జెంది యుందురు. అందరును దమతమ కార్యములను వీడి ఆవైపునకుఁ బరువిడెదరు. గొప్ప ప్రభావశాలుర ముందట నల్పప్రభావశాలుల ప్రభావము తగ్గిపోవును. గొప్ప దుఃఖముముందు కొద్ది దుఃఖము మఱపునకు వచ్చును. ఇదే విధముగ గొప్పధ్వని సమ్ముఖమున దానికంటెఁ జిన్న ధ్వనులు దానిలో విలీనములగును. ఆసమయమున నాచిన్న ధ్వనుల కేమియును మహత్వముండదు. అవి గొప్ప ధ్వనిలోఁ గలిసిపోవును. ఒకవ్యక్తి చిన్నగీతను గీచి దానిని తుడుపకయే, పొడిగించకయే చిన్నది చేయవలయు ననెను.

అతఁడు మిక్కిలి యాలోచనలోఁబడి తుడుపకయే యిది చిన్నదెట్లు కాఁగలదనుకొని, తన కసాధ్యమనుకొని ఒక బుద్ధిమంతునకుఁ జెప్పెను. బుద్ధిమంతుఁడగు పండితుఁడిట్లనెను:— "ఒక్కపనినిఁ జేయుము. ఈ గీతకు పైన నింకొకటి పెద్దగీతను గీయుము. ఇది తనకు దానే చిన్నదై పోగలదు."

సూతుఁడిట్లనెను:— "మునులారా! ఆ బండిక్రింద నుయ్యాలమంచమునందు బరుండిన శ్యామసుందరుఁ డావిశాల శకటముపై దృష్టినిఁ బఱపెను. ఆతఁడిట్లనుకొనెను:— "ఈశకటమును బోర్లద్రోసినచో నాపెద్ద శబ్దమునకు మాతల్లియే కాదు గోపికలందరును బరువిడి నాకడకు రాఁగలరు."

ఇట్లనుకొని ఆతఁడు తన కుసుమకోమలములై, రావి మఱ్ఱి చిగురుటాకుల కంటెను, కోమలములై సుందర రక్త

వర్ణముగల తన కోమలములైన చిట్టిపాదములను వానికుండిన నైదు వ్రేళ్ళయొక్క నఖములు మణిఖండములవలె మెఱయు చుండ నా బండిని దాఁకెను. చరణములు తాకుటతోడనే బండి వెంటనే అడడడ ఢమ్మని తలక్రిందులుగఁబడెను. దానిపై నుంచిన పాలు, పెరుగు, నెతి కుండలన్నియును బగిలిపోయి నేయి క్రిందఁ బ్రవహింపఁజొచ్చెను. వెన్నముద్దలు దొర్లుచుం డెను. పెరుగు చిందిపోయెను. పాలు కాలువలుగపారుచుండెను. ఆ శబ్దముచే దశదిశలును బ్రతిధ్వనించెను. వ్రజమండల మందు గోలాహలము వ్యాపించెను. శత్సవమునకు వచ్చినస్త్రీ లటు నిటుఁ బరువిడఁజొచ్చిరి. కొందరు పిడుగుపడినదనుకొనిరి. కొందరు మెఱుపు మెరిసినదనిరి. కొందరు ప్రళయము వచ్చిన దనుకొనిరి. స్త్రీలు పాఱిపోఁజొచ్చిరి. ఒకరినొకరు నెట్టుకొనుచు నింటికిఁ బరువిడసాగిరి. ముసలివాండ్రు పడి నలిగిరి. అందరకును వారివారి ప్రాణములమీఁద దీపి, కాని యశోదమ్మ చిత్తము మాత్రము తన శ్యామసుందరుని మీఁదనే లగ్నమైయుండెను. ఈమె అటునిటు నేవైపునను జూడలేదు. ఆమె బాణమువలె శకటము వైపునకుఁ బరువిడెను. యశోద పరువిడుటను గాంచి దాసదాసీజనము లావైపునకే పోయిరి. రోహిణికూడ ఆవైపు నకే పరువిడెను. అందరును నటు పారిపోవుటను గాంచి మిగిలిన వ్రజాంగనలకే పరువిడిరి.

ఆచ్చటికిఁ బోయి తల్లియును, ఇతర వ్రజాంగనలును, జూడగా వారి యాశ్చర్యమునకు మేర లేకుండెను. పాలు, పెరుగు, నేయి, వెన్న బానలన్నియును బగిలియుండుట నంద రును గాంచిరి. బండి తలక్రిందులై పడెను. దాని యిరుసులు చక్రరంధ్రములనుండి బయటకువచ్చి అటునిటు విరిగి పడియుం

డెను. చక్రములు అస్తవ్యస్తములుగ పడియుండెను. ఇరుసు,పరము విరిగి దూరముగ పడిపోయెను. కృష్ణుడు ఉయ్యాలమంచములో పరుండి చేతులను, కాళ్ళను తన్నుకొనుచు, హాహాహాఅని యేడ్చుచుండెను. తల్లి పరువిడి వెంటనే పిల్లవాని నెత్తుకొని హృదయమునకు హత్తుకొనెను. నాబిడ్డడు కుశలముగా నున్నాడను స్మృతియే ఆమెకు పరమసుఖముగ నుండెను. ఇంతలోనే నందుడు చాలమంది గోపకులను దీసికొని పరువెత్తుకొని వచ్చెను. గోపకులు వచ్చుటను గాంచి గోపిక లొక ప్రక్కకు తొలగిరి. చాలమంది ముసుగులు సవరించుకొనిరి. వృద్ధగోపికలు తమ యువకపుత్రులతోడను, మనుమలు కొడుకులతోడను నిట్లనిరి ;— "నాయనలారా! ఇదేమి? ఇంతటి పెదబండి తలక్రిందు లెటులయినది? దానంతట అది తలక్రిందులు కాజాలదు."

అంత గోపకులిట్లనిరి ;— "పిన్నీ! మాబుద్ధికినీ నీవిషయము తోచుట లేదు." కొందరు నందరాజు నిట్లడుగుచుండిరి. "బాబూ! మీరుపెద్దవారు, వృద్ధులు, మీరే చెప్పుడు గాలి, వాన, సుడిగాలి లేకయే యీబండి యెట్లు తలక్రిందులైనదో?"

నందుఁ డత్యంత చకితుడును, విస్మితుడునై, గోపకుల వైపునకు చూచుచు నిట్లనెను ; "ఈ విచిత్రాద్భుత వ్యాపారమునకు కారణము నాబుద్ధికిని తోచుటలేదు." ఇట్లందరును నాశ్చర్యచకితులై యాలోచించుచుండిరి. కాని యెవ్వరును దీనికి వేరుకారణమును నిశ్చయముచేసి చెప్పజాలకుండిరి.

అచ్చట నాడుచుండిన పిల్లలను వారితలు లడిగిరి. గోపకులును వారిని వడిలోనికిఁ దీసికొని ప్రేమతో నడిగిరి;— "నాయనా! ఈబండి యెట్లు తలక్రిందులైనదో చెప్పుఁడయ్యా!"

అంత బాలకులందరును నొకే స్వరమున నిట్లు చెప్పిరి:- "మేమిచ్చట నాడుకొనుచున్నాము. మేము చూచుచుండఁగనే యీ కృష్ణుఁడే యేడ్చుచు నేడ్చుచుఁ దన కాళ్ళతో దీనిని తలక్రిందు లొనర్చెను.

తల్లు లిట్లనిరి;- "ఓరీ పొండు! ఇంత చిన్నపిల్లవాఁ డింత పెద్దబండి నెట్లు తలక్రిందు లొనర్పఁ గలఁడు ?"

పిల్ల లిట్లనిరి;- "నీతోడమ్మా! మేము మాకన్నులారఁ జూచినాము. ఈతఁడే తలక్రిందులొనర్చినాఁడు. ఇందినుమంతైన సందేహము లేదు."

గోపగోపికా జనమున కీయసంభవ విషయము మీఁద విశ్వాసమెట్లు కలుగును. వారందరును మాధుర్యోపాసకులు. శ్రీకృష్ణుని యైశ్వర్య ప్రభావముల వారింతవర కెరుఁగనే యెరుగరు. మాటిమాటికిని బాలకులు ఒట్టును బెట్టుకొని చెప్పుచున్నను వారు బాలకుల మాటలను విశ్వసించుటలేదు. పిఁడు పిల్లవాడని వారి మాటలను దిరస్కరించుచుండిరి. వారు యథార్థమును దెలిసికొనక చెప్పుచున్నారను చుండిరి.

యశోద యిట్లనెను;- "ఎట్లైన తలక్రిందులు కానిండు. పిల్లవానికేమియును హాని కలుగలేదు. ఇది నారాయణుని కృప. కాకున్న శకటము తల్లక్రిందులైనప్పు డెట్టి యనర్థములు కలిగెడినో" ఇట్లు పలికి ఆమె వెంటనే బ్రాహ్మణులను పిలిపించెను. ఏ గ్రహమును నావేశింపకుండుటకై వారిచేత వేదమంత్రముల ద్వారా శాంతి పాఠమును జేయించెను. దానదక్షిణల నొసంగెను. అంత నొక వృద్ధగోపిక యిట్లనెను. "రాణీ! పిల్లవాని ముఖము మీఁద పైఁటను వైచి పాలిమ్ము.

పిల్లవాడు పాలను త్రాగినచో వానికి భయము పోయినదని గ్రహింప వలయును."

సూతుం డిట్లనెను:—"మునులారా! పిల్లవానికి భయము లేనేలేదు. ఆతడు భయమును గూడ భయపెట్టువాడు. తల్లి పాలీయం గనే చుబుకు,చుబుకు మని పాలను త్రాగెను. అప్పుడు తల్లిమనస్సు కుదుట పడెను."

నందుడు బలవంతులగు నందలకొలది గోపకులను బిలిపించి వాని నన్నిటి నెత్తించి, బండినెప్పటి యట్లుంచెను. పగిలి పోయిన కుండలను బాఱవైచిరి. బాగున్నవాటిని మరల దాని మీంద నుంచిరి. పిల్లవాని నుయ్యాల మంచములోం దల్లి పాలిచ్చి నిద్రబుచ్చెను.

నందుండిట్లనెను:_ "నాయనలారా! నేడు మన పిల్ల వానికి పునర్జన్మ. కావున గొంచెముగ నుత్సవమొనర్పవలెను. దానపుణ్యము లొనర్పవలయును. ఇట్లు పలికి ఆతండు బ్రాహ్మ ణులను బిలిపించెను. బ్రాహ్మణులువచ్చి శాంతిహోమమును గావించిరి. దధి, అక్షత, కుశోదకములచేం బూజనమును గావిం చిరి. నందుడు స్వయముగ కృష్ణు నెత్తుకొని బ్రాహ్మణుల ముందు కూర్చుండెను. బ్రాహ్మణులు ఋగ్వేద, యజుర్వేద, సామవేద మంత్రముల ద్వారా సంస్కృతమై, పవిత్రౌషధ ములు కలిసిన జలముచేం గృష్ణున కభిషేక మొనర్చెను. తదనంతర మేకాగ్రచిత్తముతో స్వస్తివాచన పాఠమును గావించెను. నందుడును బ్రాహ్మణులకు పంచభక్ష్య పరమాన్నములతోడను, ఘృతముతో వండిన వివిధరకములగు స్వాదిష్ట పదార్థములచేతను భోజనమును బెట్టించెను. యథేష్ట

ముగ స్వాదిష్ట భోజనమును జేసిన తరువాత బ్రాహ్మణులు పొట్ట మీంద జేతితో నిమురుకొనుచు పెద్దగా త్రేపుచు నిట్లా శీర్వదించిరి:— "నందరాజా! నీకుమారుని గుణగానము ప్రపంచమున సదా జరుగుచుండుంగాక! ఈతని పేరుఅజరామరమగుంగాక! ఈతడు సదా సాధువులకు సుఖమొనర్చు వాడగును."

నందుండు తలను వంచి బ్రాహ్మణులయొక్క అమోఘాశీర్వాదమును భక్తిభావముతో గ్రహించెను. వారికి భోజనమైన మీందట దక్షిణలో జిత్రవిచిత్రములగు వస్త్రములను. సువర్ణమాలలతో నలంకరింపబడి సర్వగుణ సంపన్నములగు జాలగోవులను వారి కొసంగెను. ఇంతలో నొక గోపుండిట్లనెను;— "బాబూ! ఈ కొంచెము పనికి మీరింతగా దానధర్మము లేల చేసితిరి?"

నందుండిట్లనెను:— 'ఓరీ! ఈబంగారు వెండి నాణెములదేమి లెక్క? మాకృష్ణున కభ్యుదయము కలుగవలయును గాని దీనికొఱకై సర్వస్వమునర్పింపంగలను. బ్రాహ్మణుల యాశీర్వాదములు లభించుటకంటె లాభమే మున్నది?"

ఆ తార్కిక గోపకుండిట్లనెను:— "బ్రాహ్మణుల యాశీర్వాదములలో నేమున్నది? చాలమంది బ్రాహ్మణులు చదువు సంధ్యలు లేకయే దానములను బట్టుటకుం దిరుగుచుందురు."

నందుండిట్లనెను:— 'ఎల్లెన్నండిరుగనిండు. వారు బ్రాహ్మణులే. పాలీయని గొడ్డుబోతావు కూడ గోవనియే పిలువంబడును. కాని అసూయ మిథ్యాభాషణము, దంభము, ఈర్ష్య, హింస, మానరహితులగు విశుద్ధ బ్రాహ్మణులయొక్కయు, సత్యశీలురగు, బ్రాహ్మణుల యొక్కయు నాశీర్వాద మెన్నటి

కిని విఫలము కాదు. నీవీమాటను నమ్ముము. నేను మరల చెప్పుచున్నాను. గట్టిగాఁ జెప్పుచున్నాను. విశ్వాసముతో జెప్పుచున్నాను. వేదవేత్తలును యోగయుక్తులునగు బ్రాహ్మణుల యాశీర్వాద మెన్నటికిని నిష్ఫలము కాదు. ఇది స్పష్టము ధ్రువ సత్యము."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! నేను మీకు శకటభంజనలీలను జెప్పితిని."

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! భగవానుఁడు పెరుగు పాలు, నేతితో నిండిన శకటమును వ్యర్థముగ నేలఁబడఁద్రోసెను. దీనివలన లాభమేమి?

సూతుఁడిట్లనెను;- "స్వామీ! బాలకులు మంచి అందమైన నాటవస్తువులను ఘట్టని పగులఁగొట్టెదరు. వారికిందులో నేమి లభించును. అది ఆటయే, అసలు విషయమిది. ఉత్కచుఁడను పేరుగల నొక యసురుఁడుండెను. అతఁడు వాయువులో నెగిరి, తన పూర్వజన్మవైరానుసారముగ భగవానునిఁ జంపుటకు ఆ శకటమందవ్యక్తరూపమున దాగియుండెను. ఆయసురునిఁ జంపి వాని నుద్ధరింప వలసియున్నది. శకటము తలక్రిందులగుటచే నా ఉత్కచాసురుఁడు చచ్చిపరమపదమును బొందెను. భగవంతుని లీలయు జరిగెను. బ్రాహ్మణులకు దక్షిణాదులును ముట్టెను. గోలయునయ్యెను. ఉత్కచోద్ధరణము నయ్యెను. ఒక్కబండిని బోరగిల ద్రోయుటచే నెన్నిపనులైనవో చూడుడు. ఆయన యే భావమున నే క్రీడ నొనర్చునో అట్టి భగవల్లీలలు నెవరెఱుఁగగలరు? ఇదేవిధముగనొక యసురుఁడు కాకియయ్యె, ఇంకొకఁడు బ్రాహ్మణుడయ్యె

భగవానుని కడకు వచ్చెను. వీరిద్దరిని గూడ భగవంతుఁడుద్ధరించెను. ఈ యిద్దరి కథలను నింక నితరాసురుల నుద్ధరించిన కథను నేను ముందు చెప్పెదను మీరు దత్తచిత్తులై శ్రవణ మొనర్పుఁడు.



# అన్య అసురులను ఉద్ధరించుట

(౨౬౨)

శ్లో॥ దైత్యో నామ్నా తృణావర్తః
కంసభృత్యః ప్రణోదితః ।
చక్రవాతస్వరూపేణ
జహారాసీన మర్భకమ్ ॥

(శ్రీ) భాగ. ౧౦స్కం. ౭అ. ౨౦ శ్లో.

కం॥ ఖరుఁడగు కంసుని పంపున
నరిగి తృణావర్తుఁడవని కవచాటముగా
సురగరువరియై బిసబిస
నరుదరుదనము సరి విసరి హరిఁ గొనిపోయెన్ ॥

శ్రీమదాంధ్రభాగవతము.

భగవంతుఁడు సాకారరూపమున నవనిపై నవతరించినపుడు అవతారమును ధరించినపుడు సమస్తవిధముల ప్రాణుల నుద్ధరించుచుండును. త్రిగుణములను సృష్టించినది శ్రీహరియే.

సాత్త్వికులు కానిండు, రాజసులు కానిండు, తామసులుకానిండు అందరను భగవంతుఁ డుద్ధరించును. ఎవఁడైనఁ గానిండు. ఏ భావముతోనైన రానిండు. భగవంతుని సమీపమునకు వచ్చిన వారందరకును సద్గతి గలిగితీరును. పావన సరస్సునందేది పడినను సువర్ణ మగును. భగవంతుని నిత్యపార్షదు లానందానుభవము నొనర్చెదరు. భక్తులకు శ్రీహరి అలౌకిక భక్తిరసమును ప్రసాదించును. తన్ను శత్రువులుగ భావించు దుష్టులగు నసురులకైనను శ్రీహరి సద్గతినిఁ బ్రసాదించును. ఆతఁడు సర్వేశ్వరుఁ డగును గదా ! అందరకును స్వామి భావానుసారముగ సుఖము నొసంగును.

సూతుఁడిట్లనెను:— "మునులారా! నేను మీకు శకటాసురోద్ధారణమను పరమసుఖదలీలను జెప్పితిని. ఏ ఉత్కచుఁడను నసురుఁడు శ్రీకృష్ణునిఁ జంపుటకై శకటమందు ప్రవేశించెనో ఆతనిని శ్యామసుందరుఁడు శకటమును దల్లక్రిందులొనర్చి వానిని బరలోకమునకుఁ బంపెను.

అంత శౌనకుడిట్లనెను:— "సూతా ! ఈ యుత్కచాసురుడెవడు ? వీని నేకారణమున హరి యుద్ధరించినాడు ? వీని పూర్వజన్మ వృత్తాంతము తెలిసియుండినఁ జెప్పుము."

(శ్రీ) సూతుఁడిట్లనెను;— "స్వామీ ! ఈ యుత్కచుఁడను దైత్యుఁడు హిరణ్యాక్షుని పుత్రుఁడు. చాక్షుషమన్వంతరమునకుఁ బూర్వమీతనికి లోమశమహాముని శాపముండెను. లోమశుఁడు చిరంజీవి. ఆతఁడు ధ్యాననిమగ్నుడై యుండును. ఆతని యాశ్రమము మిక్కిలి అందమైనది. దానిలో వివిధవృక్షములు నాటఁబడినవి. ఒక దినమున నీ యుత్కచ దైత్యుఁ

డామునివరుని యాశ్రమమునకుఁ బోయెను. అసురీస్వభావముగల జీవుల ప్రకృతి యెట్లుండుననఁగా వారు కాచి, పూచియుండు వస్తువులను జూడఁజాలరు. ఫలించి పుష్పించిన నీ సుందరమగు నాశ్రమమును జూడఁగానే అసురునకు మత్సరము కలిగెను. అతఁడాయాశ్రమమునందలి ఫలించిన వృక్షములను విఱువనారంభించెను. వృక్షములు ఋషులకు సంతానము వంటివి. వారలు వాటిని మిక్కిలి ప్రేమతో నీరును బోసి పెంచుచుందురు. తన చేతులతో నాటిన వృక్షములు తన కన్నుల యెదుటనే విరువబడుటను గాంచగనే లోమశమహామునికి క్రోధమువచ్చి ఉత్కచున కిట్లు శాపమొసంగెను:— "ఓరీ! దుర్బుద్ధీ! నీకు శరీరము లేక పోవును గాక!

ఇది వినఁగానే అసురుని మదము దిగిపోయెను. అతడుఁ ముని ననునయ వినయములచేఁ బ్రార్థించెను, మునుల క్రోధము నీటి మీఁద గీత వంటిది. వచ్చిన వెంటనే నశించును. అతని శాపమాశీర్వాదరూపమునఁ బరిణమించెను. మునియిట్లనెను. "వైవస్వత మన్వంతరమందు నీకానందకందుఁడగు శ్రీకృష్ణ చంద్రునితో సంసర్గము కలుగును. అతని ద్వారా నీవు త్రిగుణ రహితుఁడవై పరమపదమును బొందఁగలవు." ఆ యుత్కచాసురుడే శకటమునఁ ప్రవేశించి భగవంతునిచేఁ జచ్చి ముక్తుఁడై నాఁడు. కాకాసురుని ముఖమున నీతఁడు శ్రీకృష్ణుని యద్భుత సామర్థ్యమును విని, అతఁడును గంసుని ప్రేరణముచే శ్రీకృష్ణుని జంప వెడలెను.

శౌనకుఁ డిట్లడిగెను;— ఈ కాకాసురుఁ డెవడు? వీనిని భగవానుఁడెట్లు చంపెను?"

సూతుఁడిట్లనెను:— "స్వామీ! కాకాసురుని భగవాఁనుడు చంపలేదు. వీఁడు భగవానుడేకాంతమున మంచమున బరుండి యుండుటను గాంచి తన యినుపముక్కుచే వానిపై బొడిచెను. బాలకుఁడేమిచేయఁగలఁడని ఆతఁడనుకొనెను కాని యీతఁడేమి బాలకుఁడు, అసురకులఘాతకుఁడు. అచ్చటఁ జూచు వారెవరును లేరు. ఆతఁడు తన చిట్టి లేతచేతులతో బట్టి విసరగా నాతఁడు మూర్ఛితుఁడై కంసుని సభామండపమున నాతనికెదుటనే పడెను. ఆతడు బాలకృష్ణుని అద్భుతపరాక్రమమును వర్ణన మొనర్చెను. దీనిని వినిన నో వాయుపుసంచుఁ జరించు నుత్కచుఁడు వచ్చి నాఁడును శ్రీకృష్ణుని చేత జచ్చెను. ఇదేవిధముగ శ్రీధరుఁడను నొక బ్రాహ్మణాధమునిఁ గూడ దండించెను."

శౌనకుఁడిట్లడిగెను:— "సూతా! శ్రీధరుఁడెవఁడు? భగవంతుఁ డాతని కేమి దండమును విధించెను? ఈ కథను గూడ మాకు కృపతో వినిపింపవలయును."

సూతుఁడిట్లనెను:— "స్వామీ! మధురయందు శ్రీధరుడను నొక వృద్ధబ్రాహ్మణుడుండెను. ఆతడు పుట్టుట బ్రాహ్మణుని యింటఁ బుట్టెను గాని ఆతడు పూర్వజన్మమున నసురుడు. పెద్ద తెల్లని గడ్డముండెను. ఆతనికి గొంచెము జ్యోతిషముకూడ తెలియును. ఒక దినమునఁ గంసుడిటడిగెను:— 'స్వామీ! యోగమాయ నాశత్రువు వ్రజమందెచ్చటనో పుట్టినాడని చెప్పినది. ఆతఁడెచ్చటఁ బుట్టినాఁడు?

శ్రీధరుఁడిట్లనెను;— "నాకు బాగుగాఁ దెలియును. ఆతఁడు నందునింట బుట్టినాడు. కంసుఁడిట్లనెను:— "నీవు వానిని జంపినను జంపించినను నేను నీకర్థరాజ్య మొసంగెదను.

ఇది వినగానే శ్రీధరుఁడు మిక్కిలి సంతసించెను. ఆత డిట్లనెను:— " మహారాజా! మీరు చింతింపకుఁడు. నేనాపిల్లవాని నిప్పుడే చంపి వచ్చెదను."

ఈమాటకు గంసునకు మిక్కిలి ఆనందము కలిగెను. ఆతఁడు తనశత్రువు చచ్చెననియే యనుకొనెను. శ్రీధరుని మిక్కిలిగఁ బ్రశంసించి, అత్యధికముగా సన్మాన మొనర్చి వానిని గోకులమునకుఁబొమ్మనెను. శ్రీధరుఁడు గంససమ్మానితుఁడై గోకులమునకు వచ్చెను బ్రాహ్మణులకును సాధువులకును వేషము వేసికొని నడచెను. శ్రీధరుఁడు లోపలకుఁ బోయెను. యశోదమ్మ ఆతనికి మిక్కిలిగ నాదరసత్కారములను గావించెను. తల్లి వృద్ధబ్రాహ్మణుడని భోజనము చేయవలసినదని ప్రార్థించెను. ఎన్నోవిధముల బ్రతిమాలగా నాతడు భోజనమున కంగీకరించెను. పొయ్యిమీదఁ బాలను బెట్టి దానిలో బియ్యము పోయబడెను. అంత శ్రీధరుడు బిందెను దీసుకొని స్వయముగ యమునాజలమును దెచ్చుటకు బయలు దేరెను. యశోదమ్మ ఆతని నాపి యిట్లనెను;— ' స్వామీ! ఇంతమంది దాసదాసీ జనముండిన మీరు జలమును దేబోయెదరేమి? నేనెంత జలమునైన దెప్పించెదను?

శ్రీధరుని మనస్సునఁ బాపము కలదు. ఆతఁడిట్లనెను:— 'అమ్మా! నేను దాసదాసీజనములచేఁ దేబడిన యమునా జలమును ద్రాగను."

యశోద యిట్లనెను:— " నేను స్వయముగా దెచ్చెదను మారప్పుడు త్రాగవచ్చును గదా!"

శ్రీధరుఁడిట్లనెను:— " అయితే నీవు తెచ్చిన త్రాగ

దను. ఇది వినగానే అత్యంతానందమును బ్రకటించుచుఁ దల్లి యిట్లనెను:- "అయితే నేనే వెళ్ళెదను. మీరు మాపిల్లవానిని చూచుచుండుడు."

శ్రీధరుడిట్లనెను:- "మంచిది. నేను బిల్లవానిని చూచుచుందును. నీవు బిందెను బాగుగా తోమి నీరు తేవలయును."

యశోద అత్యంతానందమును జెంది బంగారు బిందెను దీసికొనిపోయెను, రోహిణియును వేరొక బిందెను దీసికొనెను దాసదాసీ జనములు నవ్వసాగిరి. యశోదశరీరము కొంచెము స్థూలము. ఆమె కనక కలశమును బట్టుకొనినచాల బాగున్నది. పిల్లవాడొంటరిగ నుండెను. అసురప్రకృతిగల శ్రీధరుడాతని సమీపమున నుండెను. భగవానుఁ డేకాంతముననే యుదరించును. ఇప్పుడు శ్రీధరుఁడిట్లనుకొనెను:- "ఈబాలకునిగొంతును బిసిగి వేయుదును." అని యాతడు భగవానుని వైపునకు బోయెను. భగవానుడుయ్యాలలో పరుండి నిద్రించు చుండెను. పైకికన్నులు మూసుకొనెను. లోపల అంతయును తెలియును. ఆతనికడ దాపరిక మేమున్నది? శ్రీధరుడు ముందునకు రాగానే భగవానుడు తన మాయాశక్తిచే జేతినిజాపి యొక్క దెబ్బ గొట్టెను. దానితో శ్రీధరుడు వెల్లకిల క్రిందపడి పోయెను. ఆతని పండ్లన్నియు నూడి పోయెను. నోరు పాము బొక్కవలె నయ్యెను. ఇప్పుడు కృష్ణుడు మెదలకుండ లేచెను. పొయ్యిమీద గ్రాగుచున్న వేడివేడి క్షీరాన్నమును నాతని నోట గుమ్మరించెను. ఆతని గడ్డములును మీసములును పాలతో తడిసిపోయెను, నోరు వేడిక్షీరాన్నముచే గాలిపోవుచుండెను. ఆతఁడు పారిపోవ నుంకించుచుండెను. గాని ఆతని పాదములు నేలకంటుకొని పోయెను. వేడిక్షీరాన్నముచే నోరు మండిపోవుచుండెను.

అటునిటు తన్నుకొనుచుండెను. తలను త్రిప్పుచుండెను. బోసి నోటిని తెరచుచుండెను. ఆతని గ్రుడ్లు వెళ్ళుకొని వచ్చెను. మాట ఆగిపోయెను. శ్రీకృష్ణుడు నవ్వుచుండెను. శ్రీధరుడేడ్చుచుండెను. ఇంతలోనే యశోద యమునాజలమును దీసికొని వచ్చినది. శ్రీధరుని యొక్క యీస్థితిని గాంచి ఆమె భయపడెను. ఆమె యిటనుకొనెను;— "బ్రాహ్మణుడాకలిని జెందినాడు. వేడివేడి క్షీరాన్నమును త్రాగియుండవచ్చును" అందువలన నామె మాటిమాటికి ట్లడుగుచుండెను. "స్వామీ! ఏమైనది? చెప్పుడు. తినుటకింత తొందరెందులకండీ!"

బ్రాహ్మణునకు ప్రాణముపోవుచుండెను. అందువలన ఆతడేమియును మాటలాడజాలకుండెను. వాక్కు యోగమాయాప్రభావమున నాగిపోయెను. ఏ అసురుడైనను నీతనిలో నావేశించెనని తల్లికి భయము వేసెను. ఆమె వెంటనే నందుని పిలిపించెను. విషయమేమియో ఆతడును నిర్ణయింపజాలకుండెను. చివరికాతని కేదైన కానిండు. ఆతనిని వ్రజసీమను దాటింపవలయునని అనుకొనెను. బ్రాహ్మణరూపమున నున్న అసురుడేమో? తన యాసురీలీలను జూపుచున్నాడేమో!" అని యనుకొని ఆతడు నానిని వ్రజమును దాటించి రండని గోపకుల కాజ్ఞాపించెను. ఆతడు యమునాతీరమునకు జేరగానే ఆతడిట్లనుకొనెను ;- "కంసుడు నాకర్థరాజ్య మొసంగెద నన్నాడు. రాజ్యము సంగతి సటుంచుడు. పండ్లు పోగొట్టుకొంటిని గదా!" ఇటూత డాలోచించుకొనునంతలో నాతనికి దప్పిక వైచెను. ఆతడు యమునా జలములోనికి దిగగానే ఆతనికి బంగారు తాబేళ్ళు కనపడెను. ఆతడిటులనుకొనెను ;— నాకచ్చట నేమియును దొరకలేదు. ఈతాబేళ్ళనయినను దీ

కొని పోవుదును ” అని యాతడా తాబేళ్ళ నెత్తగనే ఆ రెండు తాబేళ్ళాతని రెండు చేతులను కొరికి తీసుకొనిపోయెను. ఇప్పుడాతడు రెండుచేతులును లేనివాడై కంసునికడకు బోయెను ఆతని నోరు ఇదివరకే పడిపోయినది. ఆతడేమియును మాటలాడఁజాలక పోయెను. ఈతడు వెఱ్ఱివాడయినాడని కంసుడనుకొనెను. తరువాత భగవద్దర్శనమువలన నాతని యంతఃకరణము శుద్ధమయ్యెను. ఆతఁడు భగవంతుని సుమధుర నామములను పలుకదలచునప్పటికి ఆతనికి వాక్కువచ్చెను. భగవంతుని సేవాపూజలొనర్ప సంకల్పము కలుగునప్పటికి అతనికి రెండు క్రొత్త చేతులు మొలిచెను. అప్పటినుండి ఆతడునిరంతరము వాక్కుచే భగవన్నామోచ్చారణమును, చేతులతో భగవద్విగ్రహ సేవార్చనలును చేయగా నాతడుద్ధరింపబడెను. ఆతడుభక్తుడయ్యెను. ఈవిధముగనే భగవానుడు తృణావర్తునిగూడ ఉద్ధరించెను.

శౌనకుఁ డిట్లడిగెను :- “ సూతా! తృణావర్తుడెవడు? ఆతని నెవరు పంపిరి? ఆత డేరూపమున కృష్ణుని కడకు వచ్చినాడు? ”

సూతుఁడిటులనెను ;- “ స్వామీ! తృణావర్తుడును కంస సేవకుడే. ఆతడిచ్ఛానుసారముగ స్థూల సూక్ష్మరూపములను ధరింపగలడు. ఒకదినమున కంసుడాతనితో ఇటులనెను;- తృణావర్తా! నందవ్రజమందు నాశత్రువు పుట్టినాడని విన్నాను. నేను శ్రీధరుని వానిని చంపుటకు పంపితిని. ఆతడెందులకో పిచ్చివాడయినాడు. వానికి నోరు పడిపోయినది. అతడేమియును చెప్పజాలకున్నాడు. యథార్థముగ నాశత్రు వెవరు? కావున నీవు వ్రజమునకు పోయి నాశత్రువు జాడకనుగొని వీలైతే

వానినెత్తుకొని ఇచ్చటికి రావలయును, లేదా అక్కడనే చంపి రమ్ము."

తృణావర్తుడిటులనెను :- "మహారాజా! మీరేమియును చింతింపవలదు. నీశత్రువు నందవ్రజములోనే పుట్టియుండిన యశోదాగర్భమున బుట్టియుండ వలయును. అటులయిన నేను తప్పక వానిని తెచ్చెదను. అని పలికి ఆతడు మధురనుండి పోయి సుడిగాలిరూపము నెత్తి వ్రజము వైపునకు పోయెను. శ్రీకృష్ణుడొంటరిగా కూర్చుండియుండెను. ఆతడాయన నాకాశమున కెత్తుకొనిపోయెను."

అంత శౌనకుడిటులడిగెను :- " సూతా! భగవానుని దైత్యుడు ఎటులెత్తుకొనిపోయెను?

సూతుడిటులనెను ;- " అయ్యా! స్వామీ! భగవాను నెవరెత్తుకొని పోగలరు? గోపికల యిండ్లన్నియును జూడవలయునని భగవానుని కోరిక. ఇంకను నడిచి పోజాలడు ఆ యసురుని పై కెత్తుకొని పోవువానిగా జేసికొని, వానిమీదనెక్కి ఆకాశమున కెగిరెను. అచ్చట గోపికల గృహములన్నిటిని జూచెను.

శౌనకుడిటులనెను ;- " తర్వాత నేమైనది? ఆ యసురుడు హానియును చేయలేదు కదా! "

నవ్వి సూతుడిటులనెను ;- "స్వామీ! ప్రాణిమాత్రుని కిష్టమైన వానికనిష్ట మెట్లు చేయగలుగుదురు? నేను తృణావర్తునుద్ధరించిన కథను ముందు చెప్పెదను. మీరు దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుడు."

# తృణావర్త సంహారము

(౮౨౩)

శ్లో॥ అహో బతాత్యద్భుత మేష రక్షసా
బాలో నివృత్తిం గమితోఽభ్యగాత్పునః
హింస్రః స్వపాపేన విహింసితః ఖలః
సాధుః సమత్వేన భయా ద్విముచ్యతే॥

(శ్రీ)భాగ. ౧౦ స్కం. ౭ అ. ౩౧ శ్లో॥

కం॥ రక్షణములేక సాధుఁడు
రక్షితుఁడగు సమతఁ జేసి రాయిడులందున్
రక్షణములు వేయి గలిగిన
శిక్షితుఁడగు ఖలుఁడు పాపచిత్తుం డగుటన్॥

(శ్రీ)మదాంధ్రభాగవతము

ఏ సంఘటనము జరుగవలసి యున్నదో దానికి ముందుగనే భూమిక యేర్పడియుండును. లక్షణములను జూచి బుద్ధిమంతుఁడగు వాఁడిట్టి సంఘటన మిప్పుడు జరుగఁగలదని యూహింపఁ గలఁడు. వర్తమానమును జూచి భవిష్యత్తు నూహింపగలము. కాని సర్వజ్ఞుఁడైన వానికి భూతభవిష్యద్వర్తమానములొక లెక్కలోనివి కావు. ఆతఁడున్నతుఁడగుటచే భూత భవిష్యద్వర్తమానములను గాంచఁగలఁడు. మూఁడు కాలములును నాతని కొక్కటే. హఠాత్తుగ నిట్లు జరిగినదని మనము మన యల్పబుద్ధిచే ననుకొందుము. హఠాత్తుగ నేదియును జరుగదు. అన్నియును నిశ్చితరూపమున జరుగుచుండును

శ్రీ సూతుఁడిట్లనెను:— "మునులారా! ఒక రోజున యశోద తన ప్రాణముల కంటెను ప్రియుఁడగు కృష్ణునిఁ బ్రేమ పూర్వకముగ నుయ్యాలలో నుంచి ఊపుచుండెను. జోలపాట మల్హార రాగమునఁ బాడు చుండెను. ప్రేమతో జిచ్చికొట్టుచు బుజ్జగించుచు గుణగుణ ధ్వనితో నవ్యక్తమగు భాషతోఁ దన పసిపాపనితో నేదో మాటలాడు చుండెను. ఆసమయముననే శ్రీకృష్ణుఁడొత్తిగిలెను. ఆతనికి నిద్రాభంగ మయ్యెను. నిద్ర తెలిఁయగనే ఆఁకలి కూడ వేసెను. ఏడ్వ సాగెను. తల్లి వెంటనే పిల్లవాని నెత్తుకొనెను. ఆమె స్తనములకుఁ జేపు వచ్చెను. పిల్లవానికి సుస్థిరమై పాల నొసంగెను. పాలిచ్చి తల్లి పిల్లవాని నాడించు చుండెను. ఆమె చెట్టును జూపించుచు నిట్లనుచుండెను;— "నాయనా! చూడు మాచెట్టెట్లున్నదో! "భగవానుఁడావైపునకు జూచును. మరల యశోద యిట్లనును. కాకమ్మరావే కాకమ్మరావే కొట్టెమీద నున్న వెన్నను దినవే పొడిచినచో నీ రెక్కలు పీకెద — బిడ్డను జేరిన బేయ్ బేయ్ బేకెద" తల్లి యీ విధముగఁ బిల్లవాని నాడించు చుండఁగా రహస్యముగఁ దృణావర్తుఁడచ్చటికిఁ జేరెను. శ్రీహరి సర్వదృక్ ఆయన అన్నియును జూడగలడు. ఆతడాయసురుని గాంచెను. ఆతడాకాశమునకు దన్నుకొని పోవ వచ్చినాడనియును నాతనికి తెలియును. ఆతడనుకొనుట యేమి? ఈతడే అతనినిఁ బ్రేరించి భావమయులగు గోపికల యిండ్లను జూచుటకుఁ బిలిచి నాఁడు యేమి? ముందు వారిండ్ల దొంగతనములు చేయవలసి యున్నది. చోరత్వమును జేయుటకు ముందుగా నేవస్తు వెచ్చట నున్నదో చూడవలయునుగదా! అందు వలన నాతఁడు పైకెగిరి సమస్తమును జూడఁదలఁచెను, కాని దుష్టు

డసమయమున వచ్చెను. తల్లి నన్ను ఒడిలో గూర్చుండ బెట్టుకొని కూర్చుండినది. నేను వీని నుదరింపవలయును. ఈతఁడు నన్నును, నాతల్లిని కూడ పైకి లేవదీసుకొని పోయి నచోఁ దల్లి అమాయకురాలు. సరళ హృదయ. ఆకాశమున కెగురఁగానే భయపడిపోవును, పోనిండు నేనధిక బరువగుచో లేక స్థూలకాయయగు నాతల్లిని నన్ను మోయఁజాలకున్నచో నాతల్లి నుగ్గునుగ్గగును, అప్పుడు నాకు పాలిచ్చి పెంచువారెవరు? ఇంకొక విషయము. వీనిని నేను జంపవలయును. తల్లి ముందే వీని గొంతును నులిపినచో నామె భయపడును. వీఁడునాపిల్లవాడు కాడు. వీని శరీరమం దేదో భూతమో పిశాచమో రాక్షసియో, యావేశించె ననుకొనును.

అప్పుడు పూతన మృత్యువు రహస్యమును గూడ తెలిసికొనగలదు. అప్పుడింతటి వాత్సల్య ప్రేమ లెచ్చట లభింపగలవు. ఐశ్వర్యమునకు సందు చిక్కెనా విశుద్ధ వాత్సల్యముండదు. తల్లి వడినుండి దింపదు. నేనామెతో చెప్పుటకా వీలు లేదు. నెలల పిలవాడు మాట లాడుట కారంభించినచో నందరును వారిని భయపడెదరు. ఒడిలోనుండి దిగనిది లీల జరుగదు'' అని యిట్లాలోచించుచు భగవానుడు సంకటములో పడిపోయెను. ఆ సమయమున సిద్ధులాతనికి సహాయము కావించెను. ఈ పరమ సరస మాధుర్య లీలయందు పరమాత్మకు మనమువసరమగుట మన యదృష్టమని సిద్ధుఁనుకొనిరి.

మనము కూడ ఆతని లీలలో బసికి వచ్చెదము.'' అని అనుకొని గరిమాసిద్ధి తన ప్రభావమును జూపించెను, శ్రీకృష్ణు శరీరము కస్మాత్తుగ యశోదకు పర్వతశిఖరమునవలె భారముగ

ద్రోచెను. ఇప్పుడామె ఆతని నధిక కాలము ఒడిలోనుంచు కొనన సమర్థయయ్యెను. ఆమెశరీరము నొవ్వసాగెను వెంటనే పిల్లవానిని ఒడిలోనుండి దించి నేలపై నుంచెను. ఆతని యుదర మందనేక కోట్లబ్రహ్మాండము లున్నవి. ఆతని భారమును దల్లి ఆతని యిచ్ఛచేతనే యెత్తగలుగును. ఆతనిదే లేకున్నచో శ్రీకృష్ణు నెత్తుకొనుట కమాయకయగు యశోదకు శక్తి యెక్కడిది? శ్రీకృష్ణుడు నేడద్భుతక్రీడను జరుపవలసియుండును అందువలన తల్లి ఆతని భారమును వహింపజాల కుండెను. ఆమెకత్యంతాశ్చర్యమును లజ్జయును వేసినది. ఏలననగా పుత్రుని మోయలేని తల్లి ఒడి యేమి ఒడి! ఈవిధముగ నాలోచించు కొనుచు తల్లి యింటిలోపలికి బోయెను. ఇంటిలో వేరుకార్యములలో నిమగ్న యయ్యెను.

అంత శౌనకుడిట్లడిగెను:— "సూతా మాకుతల్లి యొక్క వాత్సల్యప్రేమ యందు కొంచముగ న్యూనత గోచరించుచున్నది. ఆమెకు సమస్త విధముల లాల్యవస్తువు శ్రీకృష్ణుడైనపుడు, ఆమె సాంసారిక కార్యములలో నేల మునిగినది? శకట భంజన ప్రసంగము నందును నామె పిల్లవానిని బండిక్రింద నిద్రబుచ్చి ఆడుటకును, పాడుటకును, అన్యలౌకిక కార్యములలో నిమగ్నయైనది. ఇప్పుడును బిల్లవానిని భూమిపై గూర్చుండఁబెట్టి అన్యగృహస్థ కార్యములలో నిమగ్నయైనది. అట్టియెడ ననన్యత యెచ్చట నున్నది? విశుద్ధవాత్సల్యరస మెచ్చట నున్నది?"

అంత సూతుడిట్లనెను:— "స్వామీ! ఈ విషయమును మీరు గంభీరముగ విచారింపుడు. శకట భంజన ప్రసంగమునే

తీసికొనుడు. శ్రీకృష్ణునకు ఆమెవడిలో నిద్రవచ్చినది. అప్పు డాతని పరుండపెట్టి సుఖమును గలిగించుట తల్లియొక్క ముఖ్య కర్తవ్యము. ఒడిలోనే యుంచుకొనిన పిల్లవానికి బాగుగా నిద్రయును రాదు. పైగా నాపాటల గోలలో నాతనికి సుఖ మును గలుగదు. అందువలన నేకాంతమందు ఆతని సుఖము కొరకు నిద్ర బుచ్చినది. నిద్రబుచ్చి ఆమె ఆతని సమీపము ననే కూర్చుండిన. వేలకొలది గోపికలు గోపాలు నాశీర్వదించు టకును ఆతని సుఖము కొరకును నాతని జన్మనక్షత్రోత్సవ మందు పాల్గొనవచ్చిరి. వారికడకు వెళ్ళకుండినచో వారంద రిట్లనుకొన వచ్చును:-"మనమెంతో ఉల్లాసముతోడను, నుత్సాహము తోడను వచ్చితిమి. యశోదమ్మ మనను బలుక రింపనైన బలుకరింపలేదు. పిల్లవానినొడిలోబెట్టుకొని కూర్చుం డినది. ఈమెకే కనుక నొక పిల్లవాడు పుట్టినాడు" ఈ విధ ముగ ననాదరము ననుభవించి వారు పిల్లవాని నాశీర్వదింపరు. తనపిల్లవానికది యనిష్టమని ఆమె శరీరముతోవచ్చి గోపికల గీతానృత్యములలో పాల్గొనినది. అవి గ్రామ్యగీతములుకావు. సాంసారిక విషయ భోగములకొరకు రాగరంగము కాదది. శ్రీకృష్ణుని నిమిత్తమై ఆతని అభ్యుదయము కొరకు చేయబడు చున్న ఉత్సవమది. ఇందులో వాత్సల్యము, ప్రేమ యున్నది. దీనిచేననన్యత నశింపదు. కాని యింకను బెరుగును. తల్లి పిల్ల వానిని గూర్చుండ పెట్టి కర్మాంతరమున లగ్నమైనది. నాకర్మ అన్యునికొరకు కాదు. పాలనుగాచి నారాయణునకు నివేదిం చెదను. ఆప్రసాదమును గోపాలున కొసంగెదను. నేనును బ్రసాదమునుస్వీకరించెదను. నాస్తములలోబాలువృద్ధిపొందును.

పిల్లవాని పొట్టనిండును. ఇదంతయును నాతని కొరకేర్పడిన వ్యాపారమే."

శౌనకుడిట్లనెను;- "సూతా! నీవు సత్యము చెప్పుచున్నావు. తల్లియొక్క కాయిక, వాచిక, మానసిక కార్యములన్నియు శ్రీకృష్ణుని ప్రీత్యర్థమే యుండెను. సరే! ఆ తృణావర్తుండేమైనాడు. ఆ కథను చెప్పుము."

సూతుండిట్లనెను:- "స్వామీ! కంస సేవకుడగు నా తృణావర్తుడు ఘాతచేయుటకు వచ్చియుండెను. ఆతడు సుడిగాలి రూపమును ధరించెను. ఎండకాలము పగటిపూట పెనుగాలి వలె సుడిగాలి తిరుగుచు వచ్చునే దానినే పిల్లలు భూతమనుచుందురు. వాడట్లయ్యెను. శ్రీకృష్ణచంద్రుడుకూర్చుండియుండగా నాతని నెత్తి యాకాశమునకు గొని పోయెను. ఆ పెనుగాలికి వ్రజమందలి చాలవృక్షములు విరిగి పోయెను. కప్పు లెగిరి పోయెను.

వ్రజమండలమంతయు దుమ్ము నిండిపోయెను. ఇండ్లలో ధూళి నిండిపోయెను. అందరును తమతమ కన్నులను మూసుకొనిరి. ముఖములందును, చెవులందును, వెంట్రుకలందును, వస్త్రములన్నిటి యందును, శరీరమందును ధూళి నిండి పోయెను. గాలియొక్క రివ్వురివ్వుమను శబ్దము దశదిశలందునను నిండిపోయెను. గోప, గోపీజనమును, గోవులును, నీ భయంకరమగు పెనుగాలికి, తుపానుకు, సుడిగాలికి భయభీతులైరి. రెండుగడియలు వ్రజమంతటను సర్వత్ర ధూళి కప్పివేసెను. ఘోరాంధకారము వ్యాపించెను. కాని తల్లికి శాంతి యెక్కడిది? ఈ పెనుగాలిలోను నామెపరువెత్తుకొని బయటకు

వచ్చెను. చూడగా నచ్చట పిల్లవాడు లేడు. ఆమె మిక్కిలి భయపడెను. మరలమరల లోపలికిపోయి బయటకు వచ్చు చుండెను. అటుపోవును. ఇటువచ్చును. ఆమె యేమియును నిర్ణయింపజాలకుండెను. దాసీలును, ఇతర గోపికలును కన్ను లను మూసుకొని నిలుచుండిరి. సుడిగాలియైన తృణావర్తుడు రేపిన ధూళివలనను ఇసుకవలనను తనవారెవరో పరాయివారె వరో కనుగొన జాలనట్లుగా నుద్విగ్నులైరి. వారా తీక్ష్ణ వాయువు వలనను, భయంకరమగు ధూళివలనను నాత్మవిస్మృతినిఁ జెంది నిలుచుండిరి.

తల్లియొక్క హృదయము దడదడ కొట్టుకొనసాగెను. ఆమె యనిష్టమేమోనని మిక్కిలి భయభీతయై యుండెను పిచ్చిదానివలె తల విరబోసుకొని అటునిటు పరువిడు చుండెను. ఆమె నెవ్వరును చూచుటలేదు. కాని ఆమె చప్పట్లు కొట్టుకొనుచు పిల్లవానిని పిలుచుచుండెను. ఆమె మాటిమాటి కిట్లనుకొనుచుండెను. "అయ్యో! నేనిప్పుడే నీని నిచ్చట కూర్చుండబెట్టి పోతినమ్మా! ఎచ్చటికి పోయినాడో! ఎచ్చటి కయినా కొట్టుకొని పోలేదుకదా! ఎగిరి పోయెనను సంగతి జ్ఞాపకమునకు రాగానే ఆమెకు శోకముచే హృదయ ముప్పొంగుచుండెను. కన్నులవెంట నీరప్రయత్నముగ ప్రవ హించుచుండెను. పుత్రుని జాడ తెలియక పోవుటచే నామె అత్యంత విహ్వల యయ్యెను. శోకము నందు మనోహర మూర్తిని జ్ఞాపకముచేసుకొని ఆమె పెద్దగ నేడ్వనారంభించెను. క్రొత్తగా నీనిన యావు తన లేదూడకొరకెట్లు వ్యాకులయై కొట్టుకొనునో అంతకంటె నింక నెక్కువగా యశోద కొట్టు కొనసాగెను. ఆమె యేడ్చియేడ్చి స్పృహతప్పి నేలపై పడి

పోయెను. ఎవ్వరును నామె కరుణాక్రందనమును వినువారు లేక పోయిరి.

కొంచెము సేపటికి సుడిగాలి శాంతింపఁగానే ధూళి కొంచెము తగ్గెను. అప్పుడితర గోపికలు యశోద యొక్క కరుణాక్రందన మర్మాంతికధ్వనిని వినెను. దానిని విని వెంటనే అచ్చటికి చాలమంది గోపికలు వచ్చిరి. యశోదాంకమునందు గాని ఆదగ్గరలోగాని పిల్లవాడు కనబడకపోగానే వారందరు లోలోన నత్యంత దుఃఖసంతాపములను చెందుచు తల్లియొక్క స్వరమునందు తమస్వరమును గూడ కలిపి కన్నులనుండి అశ్రుధారలను ప్రవహింపచేయుచు నుచ్ఛస్వరమున విలపింపసాగిరి. గోపికల రోదనమును విని సావడులనుండి గోపకులును పరువిడి వచ్చిరి. వారందరును శ్రీకృష్ణుని గాంచక మిక్కిలి దుఃఖించిరి.

ఇచ్చట కృష్ణుని తృణావర్తుడు లేవదీసికొని పోయెను. మొదట భగవాను డాతనితో తిరిగెను. దుమ్ము ధూసరిఅంతయు తగ్గిపోయెను. గోపిక లెవరో, పెరు గెచ్చట నుంచబడినదో, వెన్న నెచ్చట దాచెదరో, ఎవరింట నెన్నియుట్లు వ్రేలాడగట్టబడినవియు నన్నియును కనబడుచుండెను. కృష్ణునకు ఆకాశమున కెగురుటలో మిక్కిలి ఆనందము కలుగుచుండెను. అమాయకపు పిల్లవాడుగా నుండినాడుకదా! పిల్లల కల్లిబిల్లిని త్రిప్పిన చాలఆనందము. భగవానున కంతయును తిరిగిరావలయునని కోరికకాని తల్లియొక్క కరుణాక్రందనమును వినగానే ఆతని నవనీత సదృశమగు హృదయము కరుగసాగెను. ఇతరులకు కష్టమునుకలిగించిన ఆనంద మేమియానందము. నాకొఱకు వ్రజవాసులుఅందరును మిక్కిలి వ్యాకులమును జెందిన

యున్నారు. ఇట్లాలోచించుకొని కృష్ణుడు పైననే భారమును పెంచెను. ఇప్పుడసురుడాతని మోయజాలక పోవుచుండెను. తృణావర్తుని నరములు సడలిపోయెను. ఇప్పుడు శ్రీకృష్ణుని జంపుట అటుంచి తన ప్రాణములు దక్కుటయే కష్టమయ్యెను. ఆతడిటనుకొనెను. "కంసుడు వరదను బోయినను వాని మృత్యువు పొయ్యిలోబడినను నా ప్రాణము దక్కినచాలును. బ్రదికియుండిన బలుసాకు నేసుకొని తినవచ్చును. ఆతడు శ్రీకృష్ణునివదలివేయుదమనుకొనుచుండెను. కాని శ్రీకృష్ణుడాతని నెట్లు వదలును ఆతడు పట్టుకొనినవానిని వదలుట యెరుగడు. పొరపాటుననీతని పట్టుకొన్నను నీతడు గట్టిగా మెడను పట్టుకొనెను. విడువక గట్టిగ పట్టుకొనును. చలికాలమందు గంగయందు బ్రతికిన నెలుగులు కొట్టుకొని పోవుచుండును. ఏసాధువైనను భ్రమవశమున గంబళమని దానినిపట్టుకొనెనా, అదియును సాధువును గట్టిగా బట్టుకొనును. ఇప్పుడు సాధువు కంబళి సంగతి నట్లుంచి, ప్రాణములను గాపాడుకొనుటకుఁ బ్రయత్నించును. ఒకడిట్లనెను.- "కంబళమును వదలుము" ఆతడిట్లనెను: నేనెంతగానో వదలుకొన్నాను కాని కంబళము నన్ను వదలుటలేదు. "తృణావర్తునకిట్టిస్థితియే కలిగెను. ఆతడు శ్యాముని వదలదలచెను. కాని శ్యాముడాతనికంఠమును గట్టిగా కరచి పట్టుకొనెను. ఈతడు విచిత్రబాలకుడని ఆత డసమంజసములో పడిపోయెను.

ఆతఁడు తన శక్తినంతయును ధారపోసెను. కాని శక్తిమంతుని సమ్ముఖమున వీని శక్తి యేమి పని చేయఁగలదు? ఆతని గళము పిసుకబడుచుండెను. హుకు్కహుకు్కనిఊపి్ప

నారంభించెను. గ్రుడ్లువెళ్ళుకొని వచ్చెను. శ్వాసఆగిపోవుటచే నాతడు నిశ్చేష్టుడయ్యెను. వాని వాక్కాగి పోయెను. ప్రాణ హీనుడగుటచే నా విచిత్ర బాలకునితోఁ గూడధభక్కని ఒక పెద్ద ఱాతిపైఁ బడెను. పడఁగానే ఆరాయి పిండిపిండి యయ్యెను. శ్రీకృష్ణుఁడు సరిగా గోపికలు విలపించుచోటుననే తల్లి నోదార్చుచుండ నచ్చటనే వానితోఁ బడెను. ఆకాశమున కెగిరిన పర్వతము పడినట్లును, శివబాణములచేఁ ద్రిపురములలో నేదియో పడినట్లును. లేక ఒక విమానము ఇంధనమై పోవుటచే బడిపోయినట్లును, ఇంద్రుని వజ్రఘాతముచేగిరికూలినట్లును నా యసురుఁడు పిల్లవానితో శిలాఖండముల మీఁదఁబడెను దాని మీఁదఁ బడఁగానే ఆతని సమస్తావయవములు ఖండఖండము లయ్యెను. గోపికలత్యంత విస్మయములతోఁ జూచుచుండంగా శ్రీకృష్ణుఁడు వానిపైఁ బడి నవ్వుచుండెను. తన రెండుచేతుల నాడించుచుండెను.

పిల్లవాని జూడగనే గోపికలు పరువిడిరి. వారు రాక్షసుని గాంచి భయపడలేదు. ఆతని వికరాళముఖమును జూడనే లేదు. వారు వెంటనే దుముకి శ్రీకృష్ణుని లేవనెత్తుకొనివచ్చి తల్లివడిలోఁ బరుండఁ బెట్టిరి. తన ప్రియ పుత్రుని యొక్క సుఖద స్పర్శ తగులఁగనే తల్లికి తెలివి వచ్చెను. నవ్వుచున్న పుత్రుని ముఖమును గాంచగనే తల్లి యొక్క రోమములు నిక్క బొడిచెను. గోపగోపీ జనముల యొక్క హర్షమునకు మేఱలేక పోయెను. వారు తమలో తాము యిట్లనుకొన సాగిరి. "ఎంతటి ఆశ్చర్య విషయము. పిల్లవాని కేమాత్రమును దెబ్బతగులలేదు. ఈ యసురుడే పిల్లవాని నెత్తుకొని పోయినాడని తోచుచున్నది."

అంత యింకొకరు క యిట్లనెను;_ "ఈ దుష్టుఁడే తీసుకొని పోయినాఁడు. తీసుకొనిపోయి దాని ఫలము ననుభవించినాఁడు. లోకోక్తి కలదు. ఇతరుల కొరకు గుంటను దనకొఱకు బావి సిద్ధముగా నుండునని-

క | రక్షణము లేక సాధుఁడు
రక్షితుఁడగు సమత జేసి రాయిడులందున్
రక్షణములు వేయిగలిగిన
శిక్షితుఁడగు ఖలుఁడు పాపచిత్తుండగుటన్॥

అను పురాణ సామెత గలదు."

ఇంకొకతె యిట్లనెను;_ "ఇంతమంది రాక్షసులీ వ్రజమున కెచ్చటనుండి వచ్చిరి? ఏబాలకునిఁ బ్రహరింపరు. శ్రీకృష్ణునకే అన్ని దెబ్బలును వచ్చుచున్న వేమిటి?"

అంత నింకొకతె యిట్లనెను:_ "వీరందరును జావ వలసియున్నారు. మన శ్యాముని చేతిలో నేదియో యీూ మంత్రమున్నట్లున్నది. ఈతఁడే రాక్షసుఁని దాఁకిన నాతఁడు చచ్చి తనకుఁదానే క్రిందబడిపోవును."

సూతుఁడిట్లనెను:_ "మునులారా! పిల్లవాడు సకుశలముగ నుండుటను గాంచి కన్నులనీరు నింపుచు నందుడిట్లనెను;_ 'మనము పూర్వజన్మమున నేమి తప మొనర్చితిమో లేక విధి పూర్వకముగ విష్ణుభగవానునిఁ బూజించితి నేమో లేక యిష్టాపూర్తాది కర్మ, దాన, దయాది సత్కర్మ లేవైన జేసితిమే మో. దాని ఫలస్వరూపముగ సౌభాగ్యవశమున దన స్వజనుల నానంద పరచుటకై మృత్యుముఖమునఁ బడిన మన పిల్లవాఁడు సకుశలముగఁ దిరిగి వచ్చినాడు." ఈవిధముగ

ననేక విధములఁ దనుభాగ్యములను ప్రశంసించుచు వారు వసుదేవుని మాటను సమర్థించుచు నాతని యోగియనియు, సిద్ధుడనియు ఋషియనియు, జెప్పుకొనుచుండిరి. తరువాత తల్లికి దన యద్భుతైశ్వర్యమును గృష్ణుఁడు చూపించిన కథను మీకు ముందు జెప్పెదను. మీరు సావధానులరు కండు."



# తల్లికి విశ్వరూపదర్శనము

యుల్లని నగవుతో నావలించిన బాలు,
వదన గహ్వరమున వారినిధులు
దిశలు భూమియు వనద్వీపశైలంబులు,
నేరులు గాలియు నినుఁడు శశియు

ఆ॥ దహనుఁడాకసంబు దారలు గ్రహములు
నఖిల లోకములు జరాచరంబు
లైన భూతగణము లన్నియు నుండుటఁ
జూచి కన్ను మోడ్చి చోద్యపడియె ”

శ్రీమదాంధ్ర భాగవతము.

పరమపురుషుడు భక్తవశుడని శాస్త్రకారులు మాటి మాటికిని జెప్పుచుందురు. అతని భక్తులెట్లాడించిన నట్లాడును. భక్తులాతనిఁ బుత్రునిఁగా నొనర్చుకొని పాలను ద్రాగఁ గోరుచో, ముద్దుపెట్టుకొనఁ గోరుచో నాతడు పసిపాపఁడై తనకుదాను రెండుచేతులతో స్తనములను బట్టుకొని చుబుకు మని పాలను ద్రాగును. ముద్దుబెట్టుకొనఁదలఁచినఁ దన ముఖమును నామె ముఖమున కందించును. భక్తుడాతనిని మిత్రునిగను జేసికొనినచో నాతడు తనబాహువుల నాతని బాహువుల మీద వైచుకొని ప్రేమతో నాడుకొనును. అనుచరుఁడగును. భక్తులాతనిని పతిగా చేసికొనదలచినచో నాతఁడు మూర్తీభవించిన రసమై వారిముఖావరణమును దొలఁగించి సరసతలో వారినిముంచి తేల్చును. భక్తులు తనకు దాసులై ఆతని సేవలో సమగ్నులగుచో వారికి సేవాభాగ్యము నొసఁగి వారి సేవలను స్వీకరించును. భగవంతుడు భక్తాధీనుఁడు. ఆతడు భక్తుల కమ్ముడుపోవును. ఇది ఆతని భక్తవత్సలత.

సూతుఁడిట్లనెను:— "మునులారా! ఒక దినమున యశోద పిల్లవానిని ఒడిలో గూర్చుండ బెట్టుకొని అన్నమును బెట్టుచుండెను. తల్లి యొక్క హర్షమునకు మేర లేకుండెను. ఆమె వాత్సల్య స్నేహములు పూర్ణిమనాటి సాగరమునవలె నుప్పొంగుచుండెను. ఆమెయొక్క బృహత్ స్తనముల నుండి పాలు వానికవియే స్రవించుచుండెను. పుత్రుని సుఖమును, మందహాసమును, మనోహరమగు మాధుర్యమును బాన మొనర్చుచు మాతకుఁ దనివితీరుట లేదు. అప్పుడప్పు డాతని వినీల కుంతలములను దనకోమలాంగుళులతో నిమురుచుండెను. ఒక్కొక్కప్పుడు చక్కిలిగింతలు బెట్టి ఆతని నవ్వించుచుండెను. ఒక్కొక్కప్పుడు పైకెగుర వేయుచుండెను. ఒక్కొక్కప్పుడు కిచకిచమని కౌగలించుకొనును. ఒక్కొక్కప్పుడు ముఖమును ముద్దుపెట్టుకొనుచు నాతని లేత బుగ్గలను కందునట్లొనర్చును. ఇంకొకప్పుడు రెండు చేతులతో నూగించును.

భగవానుఁడు మిక్కిలి విసుగ్నుఁడయ్యెను. అఖిల బ్రహ్మాండములును నాబొజ్జలో నున్నవి. మాతల్లి నన్ను పసిపాపనిగా భావించుచున్నది. ఈమెకుఁ గొంచెముగఁ జమత్కారమును జూపించ నలయుననుకొనెను. ఆ సమయమున బాలకృష్ణునకు ఆవలింత వచ్చెలను? ఆతఁడు దానిని దెప్పించుకొనెను. తన కుమారున కావలింత వచ్చినదని తల్లి యనుకొనెను. ఈ ఆవలింత ఒక రాక్షసి. ఇది వచ్చినపుడొక చిటికెను వేయవలయును. చిటికె ధ్వనిని వినఁగానే పారిపోవును. ఆవలింత రాఁగానే యెవరు చిటికెను వేయరో వారి నది పట్టును. కావునఁ దన స్వజనులకు, బంధుబాంధవులకును

గురువులకును, రాజులకును నావలింతలు వచ్చినచోఁ దన హితైషులకు, చిటికెలను వేయవలయును. అందువలన యశోద కృష్ణునిఁ జూచి చిటికెను వైచెను. ఇప్పుడు శ్యాముడూర కుండ లేదు. అసలే క్రీడా ప్రియుఁడు కావున నాతఁడిట్లను కొనెను; — "నాబొజ్జలో బ్రహ్మాండము లన్నియును గలవనియు వాని నన్నిటిని నేనే రక్షించు చున్నాననియు, నాకనిష్ట మెవరు చేయగలరనియు నేనిప్పుడు మాతల్లికి జూపింతును" ఆతని యుద్దేశ్యము తల్లి కైశ్వర్యమును జూపించుటకుకాదు. పరమ వాత్సల్య మయయగు తల్లిమీఁద నీ విశ్వరూపదర్శన మేమి ప్రభావము బడునో, ఈమె వాత్సల్యమందు న్యూనత వచ్చునేమో చూతమని యీవినోదమును జేయఁదలఁచెను. అందువలన నాతఁడు నోటినిఁ దెఱచుకొనియే యుండెను. తల్లి భగవానుని తెఱచిన నోటిని జూడఁగా దానిలో ననంతాకాశము, అంతరిక్షము. అసంఖ్యాకములగు జ్యోతిర్మండలములు, దిశలు, అగణిత సూర్యులు, చంద్రుఁడు, ద్వీపములు, పర్వతములు, నదీనదములు, వనములు, అగ్ని, వాయువు, పృథివి, అసంఖ్యాకములగు స్థావర జంగమప్రాణులు ఇవన్నియును సుఖముగ నివసించుచుండెను. అకస్మాత్తుగా దన పుత్రుని నోట నిట్టివి చూచి తల్లి భయపడెను. ఆమె భూతప్రేతముల భయము కలిగెను. మాబాలుని ముఖమున నిట్టి మాయ గారడీ, తమాషా కనఁబడుచున్న దేమి? కోమలాంగి యగు తల్లి భయముచే గడగడ వణఁకు చుండెను. మృగి వలె నున్న ఆమె నేత్రములు భయకారణమున మూతబడిపోయెను. భక్తవత్సలుడగు భగవానుడు తన తల్లి యీ విధముగ భయభీత యగుటను గాంచి నవ్వెను. ఆతడునోరును

మూసుకొనెను. మరల నావలించెను. తల్లి చిటికె వైచెను భక్త వత్సలుడగు భగవానుడు కౌగలించుకొనెను. మరల బాలకొరకై యేడ్వదొడంగెను. తల్లి పాలిచ్చెను. ఆమె విషయమును మరచిపోయి మరలఁ దన పిల్లవాని ముఖమును ముద్దు పెట్టుకొని ప్రేమించుచుండెను. భగవానుఁ డెంతటి భక్తవత్సలుఁడు? తన భక్తుల కొరకును, నాశ్రితుల కొరకును నాతఁడు సమసమును జేయఁగలఁడు. భక్తుల మనస్సులలో నుండుటకే ఆతఁడు క్రీడలొనర్చు చుండును. భీష్మపితామహుని రథపు ఇరుసును తీసికొని చంప పరువిడెను. భగవానుడు తనకొరకశస్త్రగ్రహణము చేయనను ప్రతిజ్ఞనొనర్చియును భంగపరచుచున్నాడే అని అర్జునుడు కృతజ్ఞతాభారమున నలిగిపోవుచుండెను. కాని వాస్తవమున నాతడు భీష్ముని ప్రతిజ్ఞను నెరవేర్చుటకై యీనాటకము నాడెను. భగవంతుని యొక్క భక్తవత్సలత విషయమును, ఆవలించినచిటిక వేయుట మీదను నాకొక దృష్టాంతము జ్ఞాపకమునకు వచ్చినది. మునులారా! మీయాజ్ఞ అయినచో భగవానుడు తనభక్తులకు వారి యిచ్ఛానుసారముగ సేవాసుయోగము నెట్లు ప్రసాదించునో మీకు చెప్పెదను. "

శౌనకుడిట్లనెను :- "సూతా! దృష్టాంతము నవశ్యము చెప్పవలయును. దృష్టాంతముచే విషయము స్పష్టమగును. దృష్టాంత మిుండినచో పిన్నలకును, పెద్దలకును, స్త్రీలకును పురుషులకు నందరకును జ్ఞాపకమునకు వచ్చును. విషయము బాగుగ దెలియును. "

సూతుఁడిట్లనెను :- " అయితే వినుడు స్వామీ!

ఇది త్రేతాయుగము నాటి కథ. రఘుకులమండనుడును, మైథిలి జీవనధనమును, భక్తవత్సలుడగు భగవానుడు రావణుని చంపి అయోధ్యాపురమున రాజ్యాభిషిక్తుడైనప్పుడు, రాజ్యాభిషేకమయిన తరువాత సుగ్రీవ, విభీషణాంగద, నల, నీలులను, మిగిలిన ఋక్షవానరులను భగవానుడు వీడ్కొలిపినమీద కేవలము హనుమంతుడొక్కడే సేవకై నిలచిపోయెను. ఇప్పుడు పృథివియందు శత్రువులెవరును లేరు. రాక్షసుల ఉపద్రవమును లేదు. మొట్టమొదట హనుమంతుడు యుద్ధమందే లగ్నమై యుండెను. ఇప్పుడాతనికి భగవత్సేవఒక్కటి మాత్రమే మిగిలిపోయెను. ఆతని కమి పరాక్రమము ముండెడిది. అద్భుత సామర్థ్యముండెడిది. భగవానుని సంకేతమును తెలిసికొని మనోవేగముకంటె నెక్కుడు వేగమున పోయి పనిని చేసుకొని వచ్చెడివాడు. అంత నిరంతరము సేవలో మునిగియుండెడివాడు భరతునకును, లక్ష్మణునకును, శత్రుఘ్నునకును నింతయెందులకు? మహారాణియగు జానకికిని సేవ మిగిలెడిది కాదు. ఇంక నన్యసేవకులమాట చెప్పనేల? ”

సేవకులయొక్క సంపూర్ణ సేవయందెవడైన నధికారము వహించినచో వారికా సేవకుని యెడల నసూయ జనించుచుండును. స్వాభావికముగ పక్షపాతముండు నీసేవకుని ఎడల దీనివలన రామానుజులకును, జానకికిని మిక్కిలి చింత కలుగుచుండెను. వీరందరును కలిసి ఏకాంతమున గోష్ఠిని గావించిరి.

లక్ష్మణుడిట్లనెను:— “చూడుడు. వనమందు సేవనంతను నేను జేసెడు వాడను. ఇప్పుడీకోతి సమస్తసేవయందు స్వయముగ నధికారమును దీసికొనినాడు. వీని నెట్లైనను సేవనుండి తొలగించవలయును,”

భరతుడు చాల సరళుడు. ఆతఁడు భగవానునివైపు కన్నెత్తియును గాంచఁడు. ఇతఁడెవ్వరితోనైన విరోధించుట యెఱుఁగనే యెఱుఁగఁడు. ఆతఁడిట్లనెను:— "సోదరా! ఎవరి సిద్ధాంతమును ప్రత్యక్షముగ ఖండింపకుము. తన పక్షమును మండన మొనర్చుటయును, దానిని విశ్వాసముతో నాచరించుటయును — వీనిలోనే పరపక్ష ఖండనమున్నది. నీవు హనుమంతుని సేవనుండి తొలగింపకుము. స్వయముగ నను స్వసేవను సంబాళింపుము. భగవంతుని యంగీకారమును బొందుము. నీవు సేవించుట కారంభించినచో హనుమంతుఁడు తనకుఁ దానే సేవారహితుఁడు కాగలఁడు."

ఈ యాలోచన నందరు నంగీకరించిరి. అరుణోదయము నుండి మరల నరుణోదయము వఱకును గల అత్యంతాల్పకార్యమును గూడ వారు పంచుకొనిరి. ప్రాతఃకాలమున లేచి పాదుకలుంచువారెవరో, జలము నిచ్చువారెవరో, ఎవరు లేపెదరో, శౌచమున కెవరు జలము నిచ్చెదరో, మృత్తిక నెవరు తెచ్చెదరో, పాత్రను గడుగున దెవరో, దంతకాష్ఠమును దెచ్చున దెవరో, నలుగుపిండిని, అంగరాగము నెవరు తెచ్చెదరో, స్నానము చేయించుట, ఆసన మేర్పరుచుట, భోజనమును జేయించుట, వాహనమును దెచ్చుట, ఆకులు, ఏలకులు, ఛత్రచామరములు మొదలగునవెన్ని సేవలు కలవో అన్నిటిని బంచుకొనిరి. చాల ఆలోచించి అతిచిన్న సేవలను గూడ వ్రాసుకొనిరి. హనుమంతున కొక్కటియైనను వదలలేదు. వ్రాసి లక్ష్మణుఁడిట్లనెను:— "దీనికి భగవానుని అంగీకారము కావలయును."

భరతుఁడిట్లనెను:— "దీనిని భగవానుని సమ్ముఖమునఁ బెట్టున దెవరు ? నాకు మాత్రము సాహసము లేదు. నేనెన్న డును నాతని యెదుట మాటలాడనైన మాటలాడ లేదు. ఆతని ముందు పడని సేవలను నేను గ్రహించెదను."

అంత లక్ష్మణుఁ డిట్లనెను:— "భగవానుని సమ్ముఖము నకు దీనిని నేనును గొనిపోను."

జానకీదేవి యిట్లనెను;— "మీరలెందులకుఁ జింతించె దరు. భగవానుని సమ్ముఖమున నేను దీని నుంచెదను. సమ్ము ఖమున నుంచుటయే కాదు. దీనిని వారిచే నంగీకరింపఁ జేసె దను." అందరును సంతోషమును బ్రకటించుచు నిట్లనిరి:— "తల్లీ! ఇది బాగున్నది. మీకు మేమందరమండగా నుందుము. మీ మాటను భగవానుఁడు కాదనలేఁడు."

సభ సమాప్తమైనది. రాజసభ కూడినపుడు జానకీదేవి యీ చిట్టాను భగవానుని సమ్ముఖమున నుంచెను. భగవానుడు నవ్వి "యిదేమి" యనెను.

సీతాదేవి యిట్లనెను:— "మాకు సేవకు అవకాశము చిక్కుటలేదు. అందువలన నందరమును నాయీ సేవలను బంచు కొన్నాము. కేవలము మీ యంగీకారమే తరువాయి."

భగవంతుఁ డందర సేవలను జదువుకొనెను. ఆయన కందరవిషయమును దెలియును. వీరందరును హనుమంతుని సేవానంచితు నొనర్పవలయు ననుకొనిరని తెలిసికొనెను. వీరు సూటిగాఁ జెప్పక తబ్రింమటుగ ద్రావిడప్రాణాయామమువలెఁ జెప్పుచున్నారు. కాని యెట్లు కాదనుట ? వీరును భక్తులే. ఆశ్రి తులే. ఆశ్రితుల మనస్సులను గష్టపెట్టుట దయాళుఁడును దీన

బంధువునగు రామునకుఁ దెలియనే తెలియదు. ఏ యుపద్యాంత రమును బెట్టక రాముఁడు తన రాజముద్రను వైచెను. సంతక మొసర్చెను. అంగీకార మొసంగెను. అందరకును మిక్కిలి యానందము కలిగెను.

కార్తికశుద్ధ పాడ్యమినుండి ఇది శాశ్వతముగ జరుగవల యునని నిశ్చయమయ్యెను. చతుర్దశీ, అమావాస్య లందందరును దమ తమ సేవలను గుర్తుపెట్టుకొనిరి. త్రయోదశినాఁ డంగీకా రము వచ్చెను. చతుర్దశినాఁడు హనుమంతుని జన్మదినము. ఆతఁడు మిక్కిలి యుత్సాహముతో భగవత్సేవకొరకు వచ్చెను. ఆతఁడు పాదుకల నెత్తెను. సీతాదేవి యిటులనెను:– "హను మంతా ! పాదుకల మీఁద జేతినిఁ బెట్టకుము. అది నా సేవ." హనుమంతుఁడు తల్లి యాజ్ఞ నెట్లు తిరస్కరింపఁగలడు ? మెదల కుండెను. ఛత్రమును దీసెను. భరతుఁ డిటులనెను;– "ఇది నా సేవ." హనుమంతుఁడు నేఁడు చకితుఁడయ్యెను. అన్ని సేవలను మీరే పంచుకొనినారే? యని ఆతఁడిటులనెను:– "అయ్యా! నా సేవ యేమి ?"

నవ్వుచు లక్ష్మణుఁడిటులనెను;– "మాకు కాఁగా మిగిలిన సేవ నీది."

హనుమంతుడుఁ డిట్లనెను–: చూపుఁడు నాకు సమస్త సేవల సూచికను. వెంటనే లక్ష్మణుఁడు సూచికనుజూపించెను. హనుమంతుఁడు చాలమార్లు మొదటనుండి చివరవఱకు చది వెను. దానిలో నేసేవయును మిగిలినది లేదు. ఆతఁడిట్లనెను–: "ఇందులో నాసేవ యేమియును లేదు"

సీతాదేవి నవ్వి యిట్లనెను:– "నీవా సమయమున

లేకపోయితివి కదా! ఇప్పుడు సేవలన్నిటిని స్వీకరించుటయు నైపోయినది. మహారాజు ముద్రను బడినది. ఇప్పుడు నీకేదైన సేవ కనబడిన నీవే తీసుకొనుము.

హనుమంతుఁడు జ్ఞానులలో నగ్రగణ్యుఁడు. ఆలోచించి యిట్లనెను;- "సరే! భగవానునకు ఆవలింత వచ్చినపుడు చిటి కెను వేయుసేవ యెవరిది ?

ఇది విని అందరును నవ్విరి. భగవానుఁడు కూడ ఊర కుండఁ జాలక పోయెను. ఆతడును నవ్వెను. నవ్వుచు నవ్వుచు సీతాదేవి యిట్లనెను:- "చిటికెలు వేయుసేవ నీది. పొమ్ము నేటినుండి నీవు చిటికెల వాడవైతివి" హనుమంతుడు గంభీ రుఁడై యిట్లనెను;- "నేనింకేమియును గోరను. మీయంద రును నిర్ణయించుకొని వ్రాసికొని నప్పుడు నాది మాత్రము వ్రాయనక్కరలేదా? మహారాజు ముద్రకూడ పడవలయునా.

భరతుఁడు వ్రాయుఁగా, భగవానుఁ డందరసేవల నంగీ కరింపవలయును గావున నాతఁడు దానిమీఁద ముద్రనువైచి సంతకమొనర్చెను. హనుమంతుఁడు చేతులను జోడించుకొని వెంటనే భగవంతుని ముఖసమ్ముఖమున నిలువబడెను. భరతుఁ డిట్లనెను:- "హనుమంతుఁడు కొంచెము వెనుకఁగా నిలు చుండవలెను. మేము సేయుట యెట్లు ?

హనుమంతుఁడు దృఢతాస్వరమున నిట్లనెను;- "మహా రాజా! అందరును వారివారి సేవలొనర్చ వలయును. నాసేవ ముఖసేవ. ఆవలింత నోటినుండియే వచ్చును. భగవంతునకు స్నాన, భోజన, విహారములు మొదలగునవి నియతములై యున్నవి. ఆవలింత కేసమయమును లేదు. ఆవలింత యెప్పుడు

వచ్చునో యెవరికి తెలియును? కావున నేను నోటినే చూచు చుండవలయును ?

ఇదివిని అందరును జకితులైరి. ఈతడు మంచి సేవను కైకొనినాడు. మనమీతనిని సేవచేయనీయ గూడదు. భగవానుఁడు సభముగించి సభనుండి లేచి బయలు దేరగనే ఆతని ముఖము వైపునకు జూచుచు వెనుకగ నడుచుచుండెను. అందరును నవ్వుచుండిరి. కాని సేవకులు సేవా సమ్ముఖమున నెవరి నవ్వులను లక్ష్యపెట్టరు. భగవానుడు రథము మీద గూర్చుండఁగనే సారథివెనుక వెనుదిరిగి హనుమంతుడును గూర్చుండెను. భగవానుడు బంతినాడుచుండిన నాతని ముఖమును జూచుచు ముందుముందుగా బరువెత్తుచుండును. అందరిటులనిరి:- "పెద్ద చిక్కువచ్చినదే. అస్తు. ఏదో విధముగ సాయంకాల మయ్యెను. భగవానుడు మహాలులోనికి బోయెను. ఆహారమును గొనునపుడు తల్లియగు కౌసల్య సమ్ముఖమున గూర్చుండెను.

కౌసల్య ప్రేమతో నిటులనెను:- "వత్సా! ఆంజనేయా! నీవును ప్రసాదమును గ్రహింపుము.

హనుమంతుఁ డిటులనెను;- "అమ్మా ఇప్పుడు నేనిదివరకు భగవానునకు తరువాత గొనునట్లు కైకొనజాలను. నాచేతికి రెండుమూడు ఫలములు నొసంగుము తినుచుందును. భగవంతుని ముఖమును చూచుచుందును. అట్లుచేయకున్న నో నా సేవలో నేను దప్పుచేసిన వాడనగుదును. తల్లినవ్వి, ఆతడడిగిన భోజనమునే నొసంగెను. భగవంతుని యొక్క ముఖమును జూచుచు నాతడు వానిని నోటనేకొనెను. భగవా

నుడు పుక్కిలించి యుమియుబోగా నాతండును ముందుముందు పోయెను. సీతాదేవి 'నీవెదురుగ నడ్డము వచ్చెదవు. తొలఁగవేమి ?

అధికారస్వరమున హనుమంతుఁ డిట్లనెను;- " ఎట్లు తొలఁగుదును? నేను నాసేవలో సావధానముగ నుండవలయును. మీరు మీసేవను జేసికొనుడు. నేను నాసేవను చేసుకొందును.

జానకి నవ్వెను. ఏమిచేయగలదు. భగవానుఁడు భోజన మొనర్చి పైన జిత్రశాల కెక్కుచుండగా ముందు ముందుగా హనుమంతుడును నాతని ముఖము వైపునకు జూచుచు వెడలెను. చిత్రశాలలోనికి ముందుముందుగనే పోయెను. భగవానుడు శయ్యపైఁ బరుండఁగానే సీతాదేవి యిటులనెను:- "నీవిప్పుడైన వదలెదవా ? నాయనా ! పొమ్ము. బయటకు పొమ్ము ?

హనుమంతుడధికారస్వరమున గట్టిగ నిటులనెను:- "బయటకెట్లు పోవుదును? భగవంతునకు ఆవలింత వచ్చినచోఁ జిటికెను వేయువారెవరు? నేనిచ్చటనే కూర్చుండి భగవంతుని ముఖమును జూచుచు కూర్చుండెదను."

జానకీదేవి నోటగుడ్డలను గ్రుక్కుకొనుచు నవ్వుచు నవ్వుచు నిటులనెను:- " నీవు వట్టి ఆటవికుఁడవే. తల్లిదండ్రులు లేకాంతమున నుండగా బుత్రుడచ్చటనుండగూడదు.

హనుమంతుఁడిట్లనెను;- "అది నేనెరుఁగుదును. దానిని నాకుఁ జెప్పనవసరములేదు. కాని రాత్రియందావలింత వచ్చిన జిటికె వేయువారెవరు?"

జానకీదేవి యిట్లనెను;- "పొమ్మ్మా(?)పలకు. చిటిక నీకు బదులు నేను వేసెదను.

హనుమంతుడు దృఢముగ నిట్లనెను:- "మీరెట్లు వేయుదురు? సేవలు పంచబడినపు డెవరి సేవను వారే చేయ వలయును. మీ సేవను నేను దీసికొననప్పుడు నా సేవను మీ రేల హరించెదరు?"

జానకికి హనుమంతుఁడు గారాబుబిడ్డ ఆమె కాతని మీఁద నత్యంత వాత్సల్యము కలదు. ఆమె కసరుచు నవ్వుచు నవ్వుచు నిట్లనెను. "పో నీసేవను బయట చేయవలసినదే" అని పలికి ఆమె చేయి పట్టుకొని హనుమంతుని బయటకు నెట్టి లోపల గడియను వేసికొనెను."

హనుమంతుఁడు మనస్సులో నిట్లనుకొనెను;- మంచిది నాకేమి? లోపల నుండినచో భగవానున కెప్పుడావలింత వచ్చిన నప్పుడు చిటికెను వేసి యుందును. ఇప్పుడు లోపల నెప్పుడావలించునో నాకు తెలియదాయెను. కావున రాత్రి యంతయును గూర్చుండి చిటికెలు వేయుచుండెదను. అని అనుకొని చిత్రశాల పైకెక్కి రెండుచేతుల తోడను జిటికెలను వేయనారంభించెను. అతఁ డఖండముగఁ జిటికెలను సాగించెను.

భగవానుఁడు భక్తవత్సలుఁడు. తన భక్తుఁ డావలింతల కొఱకై చిటికెలను వేయుచున్నాఁడని తెలిసికొని తానును నావలింపఁ దలఁచెను, ఎవరేభావముతో భజించెదరో నేను వారి నా భావముతో భజించెదనని నాప్రతిజ్ఞ. ఇంకేమున్నది భగవానున కావలింత పైన నావలింత రాసాగెను. పైన

నాతని కఖండ చిటికె లెట్లు జరుగుచున్నవో క్రింద భగవానుని కడ నఖండముగ నావలింతలు జరుగుచుండెను. నోరు మూఁత పడుట లేదు. మహారాజున కేమైనదని జానకీదేవి భయపడెను. భగవానుని యొక్క యీ దశను గాంచి ఆమె గడగడ వణఁక సాగెను. భయపడి తడబిడపాటుతోఁ గ్రిందఁ గౌసల్యాదేవి కడకు వచ్చి యిట్లనెను:- అత్తా అత్తా మీ పెద్ద కుమారున కేమైనదో. వారు నోరును మూయుట లేదు." ఇది విని తల్లి యున్నదున్నట్లు పరువిడి వచ్చెను. రాఘవుని యిట్టి స్థితినిఁ గాంచి ఆమె మిక్కిలి భయభీత యయ్యెను. ఆమె యిట్లనెను;- "అయ్యో! మాపిల్లవాని కేదో భూత మావేశించినట్లున్నది. లంకలోఁ జాలమంది రాక్షసులు చచ్చిరి. ఆ చచ్చినవారిలో నెవఁడైన బట్టినాఁడేమో! ఆమె వెంటనే భరత, లక్ష్మణ శత్రుఘ్నులను బిలిచెను. తల్లి యేడ్వ నారంభించెను. భూతనాశకములగు నోషధులను, తాయెతులను, మూలికలను దెచ్చి శ్రీరాముని కంఠమునకు, జేతులకును గట్టెను. నెమలి యీఁకలను గాల్చెను. ఇంకేవో వస్తువులను దెమ్మనెను. మిరపకాయలను దిగదుడిచి నిప్పులో వైచెను. కుంపటిలో నిప్పును దూదిని వైచెను. దేని వలనను లాభము కలుగలేదు. అప్పుడామె లక్ష్మణునితో నిట్లనెను. నాయనా! ఎవరైన భూతోచ్చాటనము గావించువానిని, తాంత్రికుని గాని పిలువుము. ఇది తప్పక భూత బాధై యుండవలయును. ఇది భక్తవత్సలతారూపమగు భయంకర భూత బాధ యని తల్లికి తెలియదు.

లక్ష్మణుఁడిట్లనెను:— "అమ్మా! భూతము లశుచిశరీరుల మీఁదకే వచ్చుచుండును. శ్రీరాఘవుఁడు నిత్యశుచి.

తల్లి గద్దించి యిట్లనెను "నీవన్నియు నిట్లే యనుచుందువు. నీవిట్లు చెప్పియే మాఅబ్బాయిని రాక్షసులతోఁ బోరించితివి. పొమ్ము. నీ వెవరినైనఁ దంత్రమంత్రములనెరిగిన వానిని బిలుచుకొని రమ్ము."

లక్ష్మణుఁ డిట్లనెను:— "నేను గురువుగారినిఁ బిలుచుకొని వచ్చెదను. వారెట్లు చెప్పిన నట్లు చేయుదుము."

తల్లి శీఘ్రముగ నిట్లనెను:— "ఆఁ ఆఁ సరే. పోయి రమ్ము. నీవు మంచిమాట చెప్పినావు. ఆతఁడు గాయత్రీ మంత్రమును బఠించి కుశలతోఁ జలమును బ్రోక్షింపగలడు. భూత, ప్రేత బాధ యంతయును శాంతింపఁగలదు."

లక్ష్మణుఁడు వెంటనే పోయెను. గురువును బిలుచుకొని వచ్చెను. శ్రీ రాముఁడు నోరునుమూయకుండుటను గురువు చూచెను. ఆతఁడాతని శిరస్సుపైఁ జేతితో నిమిరి ప్రేమతో నిట్లనెను:— "రామభద్రా! ఏమిది? నీవు చేయుచున్న లీల యేమి?"

పరుండియే భగవానుఁడు గురుని పాదముల నంటి హాఁహాఁ అనసాగెను. వశిష్ఠుఁడు బిగ్గరగ నవ్వి 'నేఁడేమి లీల నొనర్చుచున్నా' వనెను.

తల్లి యేడ్వ నారంభించెను. గురుని పాదములను బట్టుకొని ఆమె యిట్లనెను:— స్వామీ! పిల్లవాఁడు, అడవులలో నెన్నో భూత, ప్రేత, పిశాచములను, రాక్షసు

లను గూడ యీతఁడు చంపినాఁడు. ఏదో భూతమో, ప్రేతమో, రాక్షసియో యీతని శరీరములోనికిఁ బ్రవేశించినది. మీరు గాయత్రీ మంత్రమును బఠింపుఁడు. కుశలతో జలమును బ్రోక్షింపుడు. కొంచెము విభూతిని పెట్టుఁడు. ఎవరినైనను మ్రొక్కుకొనుమనిన మ్రొక్కుకొందుము. దానపుణ్యములను జేయించుడు. నాపిల్లవానికి బాగుచేయుము. నాయనా!

వశిష్ఠుఁడు నవ్వుచు నవ్వుచు నిటులనెను ;- "మహారాణీ! భూతబాధల విషయము నాకు బాగుగా దెలియును. ఇది భూతబాధావిషయము కాదు. "

తల్లి అత్యంతోత్సాహముతో నిట్లనెను ;- "అయితే యేమిది స్వామీ!"

వశిష్ఠుడిటులనెను :- "ఏభక్తునకో అపరాధము జరిగినది." అంత భరత లక్ష్మణ శత్రుఘ్నులతో నిటులనెను ;- మీరు నేడిమియును క్రొత్తవిషయమును నొనర్పలేదుకదా!"

లక్ష్మణు డిట్లనెను ;- "లేదు స్వామీ! క్రొత్తవిషయమేమియును జరుగలేదు."

గురువిట్లనెను ;- "మీరు హనుమంతు నేమియు ననలేదు కదా!"

మధ్యలో జానకీదేవి యిటులనెను ;- "అవును స్వామీ! హనుమంతునియెడల నీ రన్యాయము నొనర్చినారు. ఆతని సేవనంతయును హరించిరి.

లోలోన ముగ్గురుతమ్ము లిటులనుకొనిరి.;- "ఈమెయో

అంతయు నంగీకరింపజేసినది. అపరాధమంతయును మనమీదకు తోయుచున్నది. చిన్నవారికున్న బాధయే యిది. చిన్నవారగుటయే పాపము. చెప్పినను చివాట్లే. చెప్పకున్నను చివాట్లే. పెద్దవారేమి చేసినను జెల్లును. చిన్నవారు చేసినదంతయు నపరాధమే. కాని ఆనెముందేమందురు. అందరును మెదలకుండిరి.

గురువిటులనెను ;- " అయితే ఆతనికి సేవదొరుకలేదా?

జానకీదేవి ఇట్లనెను ;- " ఆతడు తనకు తానే ఆవలింత వచ్చినపుడు చిటికను వేయు సేవను దీసికొనెను. దానికి భగవాను డంగీకరించెను గూడ. "

నవ్వి గురువిటులనెను ;- " భగవాను డంగీకరించినపుడాతడెప్పుడు చిటికలను వేసిన నప్పుడీత డావలించుచుండును. ఆతడెచ్చటనో చిటికలను వేయుచుండెనని తోచుచున్నది. ఆత డెచ్చట నున్నాడో వెదకుడు "

ఇప్పుడు హనుమంతు నన్వేషించుచుండిరి. భరతుడు చూడగా చిత్రశాలమీద అఖండముగ చిటికెలధ్వని వినబడుచుండెను. వెంటనే ఆతడు పైకెక్కెను. చూడగా కన్నులను మూసుకొని హనుమంతుడు రెండుచేతులతో చిటికెలను వేయుచుండెను.

భరతు డిటులనెను ;- " ఆంజనేయా! ఆంజనేయా! ఏమిచేయుచున్నావు? రమ్ము. గురువుగారు పిలుచుచున్నారు.

కన్నులను మూసుకొనియే మారుతినందనుడిటులనెను. నాతో మాటలాడకుడు. నేను నాపనిలో నిమగ్నుడనై యున్నాను. "

ఇది విని భరతుడు తిరిగివచ్చెను. లక్ష్మణుడు వెళ్ళెను. శత్రుఘ్నుడు వెడలెను. కాని ఆతడెవ్వరిని వినలేదు. అప్పుడు గురువు స్వయముగ వచ్చి యిటులనెను :— " ఓయీ! ఆంజనేయా! నీవేమిది నాటకమాడుచున్నావు? "

గురువును గాంచి అతడు కన్నులను తెరచి చిటికలను వేయుచునే ఆతని పాదముల నంటెను. గురువిటులనెను ;— ఓయీ! చిటికల నాపుము. నీవు చిటికెల నాపునంతవరకు శ్రీ రాముడు ఆవలించునే యుండును. "

హనుమంతుడిటులనెను ;— " స్వామీ! భగవానుడు ఆవలించుచున్నంతవరకు నేను చిటికెల నాపను. అవి నా సేవకు వచ్చినవే. "

ఇంతలోనే సీతాదేవి వచ్చి ఇటులనెను ;— " ఓయీ! మా యపరాధమును క్షమింపుము. సేవలన్నియును నీకే వదలితిమి. నీవేది చేసినను మేము దానిలో జోక్యమును కలుగజేసికొనము. " అనిపలికి ఆమె వానిని పట్టుకొని భగవానుని సమ్ముఖమునకు గొనిపోయెను. గురువు హనుమంతుని చేతిని పట్టుకొని శ్రీరాముని నోరును మూసెను. అందరును చుట్టుకొని యుండుటను గాంచి భగవాను డిటులడిగెను ;— మీరందరేల ఇచ్చట ప్రోగైతిరి? "

నవ్వుచు గురువిటులనెను :— నీభక్తవత్సలతా లీలను చూచుటకు మేము వచ్చితిమి. ధన్యము ప్రభూ! నీభక్తవత్సలత. హనుమంతుడె నీకు నిజమైనసేవకుడు. నీవే యాతనికి నిజమగు స్వామివి. "

అంత భగవంతుడిటులనెను :— హనుమంతుని సేవకు

నేను మిక్కిలి సంతుష్టుడనైతిని. నేటినుండి నీవు ఆంజనేయా! భక్తాగ్రగణ్యుడవైతివి. నీజన్మదివసమునకు మరునాడు దీపావళి నాఁడెవరు నిన్ను నేతితో జేసిన బలీదాతో పూజించెదరో వారియెడల నేను సదా సంతుష్టుడ నగుదును. ”



సూతుఁడిట్లనెను :– “ మునులారా! ఆదినమునుండి దీపావళి దినమున అందరును నేతిలాంగూలమును జేసి క్షీరాన్నమును, పంచదారను కలిపి పిండివంటసుజేసి ప్రతియింటను లాంగూల పూజచేయుదురు. అది ఎవరునుగాదు. హనుమంతుఁడే. లంగూర్ నే లంగూర్ అయినది. నేటికిని నింటింట నాతని పూజ జరుగును. కావున బుధులారా! భగవానుఁడు గొప్ప భక్తవత్సలుఁడు. ఆతని నెవరేవిధముగ భజనచేయుదురో ఆతఁడును నదేవిధముగ ఫలము నొసంగును. ఊరక పోదు. భక్తుల ప్రతిజ్ఞను బూర్తి కావించుటకై ఆతఁడు సమస్తమును జేయఁగలఁడు. అఖిలబ్రహ్మాండముల కధినాయకుఁడగు వాఁడు యశోదమ్మ నడిలో బాలకుఁడై పడియున్నాఁడు. ఈఁగలును దోమలును నాతని క్రీయంగమున వ్రాలినను వాని నాతఁడు తోలుకొనక యేడ్చి యేడ్చి ఈగలను దోలుమమ్మా!” యని ప్రార్థించును. చరాచరమయమగు విశ్వమున కాహార ప్రదాన మొనర్చువాఁడు తల్లి చనుబాల కొరకై యేడ్చును. చంకలోనికిఁ బోపుటకు వ్యాకులము చెందును. ఇట్టి భక్తవత్సలుఁడగు భగవంతుని వదలి యేజీవి యింకొకని శరణువేడునో, అట్టివాఁడు కామధేనువు యొక్క దివ్యములును స్వాదిష్టములు నగు క్షీరములను వీడి జిల్లేడుపాల నాసించినట్లుండును. కల్పవృక్షచ్ఛాయనువీడి ఆముదపుచెట్టు నీడకు బరువెత్తినట్లుండును. గంగాజలమునువీడి యెండమావులలోని జలమునకై పరువిడి

నట్లుండును. ఇది నేనత్యంత సంక్షేపముగ భగవానుఁడు తల్లికి విశ్వరూపమును జూపించిన లీలను జెప్పితిని. ఇప్పుడు మీరింక నేమి వినఁదలచు చున్నారు ?"

శౌనకుఁడిటులనెను;- "సూతా ! నీవు భగవానుని నామకరణలీలను జెప్పనే చెప్పలేదు. భగవానుఁడు సంవత్సర మీఁడు వాఁడయ్యెను. నామకరణము పదిదినముల తర్వాతనే జరుగును, గదా !"

విస్మయస్వరముతో సూతుఁడిటులనెను. "స్వామీ ! లీలలయొక్క ఆవేశమున నేను మరచియే పోయితిని. నేను మరచుటయే కాదు. మా గురువగు శుకమహర్షియును మరచి పోయినాఁడు. ఏమియును ఫరవాలేదు. పంచదారచిలుక నెటుఁ గొరికినను దీపియే. ఇఁక నేనిప్పుడు మీకు భగవానుని నామకరణలీలను జెప్పెదను రండు. మీరు దత్తచిత్తులరై శ్రవణ మొనర్పుడు."



# రామశ్యాముల నామకరణము

(రాటశి)

శ్లో॥ గర్గః పురోహితో రాజన్! యదూనాం సుమహాతపాః ।
వ్రజం జగామ నందస్య వసుదేవప్రచోదితః ॥

శ్రీభాగ. ౧౦స్కం. ౮అ. ౧శ్లో.

వ. అంత నొక్కనాఁడు వసుదేవుపంపున యాదవపురోహితుఁడైన గర్గుండు మందకుం జనుదెంచిన నందుం డతనిం గనుంగొని లేచి నిలిచి కృతాంజలియై.

శ్రీమదాంధ్రభాగవతము.

సమస్త హితకార్యములందును ముందుండువాఁడే పురోహితుఁ డనఁబడును. వేదము నంగీకరించు వర్ణాశ్రమముల కార్యములన్నియును బురోహితుఁడు లేక జరుగవు. ఇంతేకాదు. ఒక ప్రాచీనాచారమేమనఁగాఁ దన పురోహితుని కులమునం దెవరైన నుండునెడల యజమానుఁ డింకొక పురోహితునిచేత ధార్మికకృత్యములను జేయించుకొనఁడు. మహారాజగు మరుత్తు దేవగురు బృహస్పతియొక్క సంవాదమువలన నీవిషయము స్పష్టమగుచున్నది. తన కులపురోహితుఁడు సంతానయోగ్యుఁడు కాకున్నను యజమానుడు వానిని గౌరవింపవలయును. తన కయోగ్యుడగు పుత్రుడున్నచో వానిని ద్యజించెదరా? యజమాన పురోహితుల సంబంధమును గుటుంబ సంబంధము వంటిదే. వైదికకర్మలం బాస లేకపోవుటచే నీ యాచారమును బోయినది. కాలప్రభావము, యుగధర్మము. ఇందెవరి దోషమును లేదు.

సూతుఁడిటులనెను:- "మునులారా! వసుదేవుని శరీరము మధురలో నున్నదన్నమాటే. కాని మనస్సు మాత్రము నందగోకులముననే యున్నది. తన పిల్లవాని కిప్పటి కెన్నిదినములోనని ఆతడు దినములను లెక్కించుకొనుచుండెను. పదవ దినమున నిటులనుకొనెను:- "పిల్లవానికి నామకరణ మొనర్పవలయును. కాని అప్పుడుపద్రవములు జరుగుచుండెను. వసుదేవుడప్పుడు మెదలకుండెను. కొంతవరకు ఉపద్రవములు తగ్గి పిల్లవానికి మూఁడు నెలలు రాఁగానే అప్పుడాతడిటు లనుకొనెను:- "ఇప్పుడు నామకరణము జరుగవలయును. ఏమైనఁ గానిండు. మాపిల్లవాని నామకరణము మాపురోహితుని ద్వారానే జరిగిన బాగుండునని అనుకొనునంతలో నాతని కొక దినమున మార్గమందు గర్గమహాముని కనఁబడెను. వసుదేవుఁడు మిక్కిలి శ్రద్ధాభక్తులతో ముని చరణములకు వందనము గావించి యిటులనెను:- "స్వామీ! ఇప్పుడు మీదర్శనమగుట లేదు. స్వజనులందరును మమ్ములను వదలియే వైచిరి. మీరును వదలినచో మేము జీవించునదెట్లు?

గర్గుడిటులనెను:- "వసుదేవా! నీవేమి మాట మాటలాడుచున్నావు? నీకన్ని పరిస్థితులు తెలియును. నోటితో నేలఁ జెప్పించెదవు? నేఁటిదినముల మనము కలసిమెలసి యుండినచో నేయర్థమును గైకొందురో తెలియదు. సర్వత్ర గుప్తచారులు తిరుగుచున్నారు."

వసుదేవుఁ డిటులనెను:- "అవును స్వామీ! ఇది సత్యమే. మంచిది. రేపెప్పుడైనను దయచేయుఁడు."

గర్గుఁడటునిటుఁ జూచి మెల్లగా నిటులనెను:- "సరే, నేను రేపు రాత్రికి వచ్చెదను."

వసుదేవుఁడు వినయస్వరమున నిటులనెను:- "స్వామీ! మఱచి పోవలదు."

దృఢతాస్వరమున గర్గుఁ డిటులనెను:- "రాజా ! ఎట్లు మరచెదను. తప్పక వచ్చెదను."

ఇట్లు పలికి గర్గుడు వెడలిపోయెను. వసుదేవుఁడు తన యింటికిఁ దిరిగివచ్చెను. మరునాఁడు రాత్రి ఒంటరిగా గర్గుడు వచ్చెను. వసుదేవుఁడాతనికి విధ్యుక్తముగఁ బూజను గావించి, చేతులను జోడించుకొని యిటులనెను:- "ప్రభూ ! మీరు సర్వజ్ఞులరు. జ్యోతిషశాస్త్ర ప్రణేతలు. నా భార్యయగు రోహిణి నందవ్రజమున నున్నసంగతి మీకు తెలిసినదే. ఆమె కొక బిడ్డడున్నాడు. నందునకును నొక బిడ్డఁడున్నాడు. వీరిద్దరికిని మీరు నామకరణసంస్కార మొనర్చి రావలయును."

గర్గుఁడిటులనెను:- "రాజా ! వెళ్ళుటకు నాకేమియును నభ్యంతరము లేదు. కాని వ్రజమునకుఁ బోఁగానే గోల బయలు దేరును. కంసునియొక్క గుప్తచారులంతటఁ దిరుగుచుందురు. నందునికడ వైభవముగ నుత్సవము జరుగుచో సర్వత్ర గోల బయలుదేరును. నీవేల వెళ్ళితివని కంసుఁడు నన్నడుగవచ్చును. నీమీఁదను సందేహింప వచ్చును. దీనివలన మనమీఁదకొక నూతన విపత్తు రాఁగలదు."

అంత వసుదేవుడిటులనెను;- "ఇప్పుడు స్వామీ! దీనిని మీరాలోచింపుఁడు. యజమానియొక్క కర్మలన్నియును కుల పురోహితుని ఆధీనములో నున్నవి. యజమానుని పరివారమునందు కులపురోహితుఁడును నొక యంగమే. పురోహితు

నాకాతని యింటనెవరును లేకున్నచో నాతనికి శ్రాద్ధమునుయజమానిచేయ వచ్చును. ఆతనికా శ్రాద్ధాన్నమును తర్పణ జలమును ముట్టును. అట్లే యజమానుని యింట నెవరును లేకున్నచో నాతని శ్రాద్ధాదులను బురోహితుఁడు చేయవచ్చును. యజమాన పురోహితుల కిట్టి ఘనిష్ఠ సంబంధము కలదు. మీవంటి సర్వజ్ఞులగు పురోహితులు సంపద్విపత్తుల యందును యజమాను నాదుకొందురు. మీరు తప్ప పిల్లలకు నామకరణ మెవరు చేయఁగలరు?

గర్గమహాముని యిటులనెను;- "నాకిదంతయును దెలియును. నామనస్సున నీయెడలఁ బ్రేమకలదు. సరియే. నేను రేపు వెళ్ళెదను. నీవెవరితోడను నీవిషయమును జర్చింపకుము.

వసుదేవుడిటులనెను;- "ఎవ్వరితోనైనను జెప్పుటకు నాకేమి పట్టినది? మీరును జాగ్రత్తగ నుండుఁడు. నందునకును జెప్పకుఁడు."

గర్గుఁడు దీనినంతయును నంగీకరించెను. అతడు వసుదేవుని వద్దనుండి వెడలి ఆరాత్రి తనయింట విశ్రాంతిని దీసికొనెను. రాత్రి యిట్లనుకొనసాగెను. "నా యదృష్టము. రేపు భగవానునిదర్శనము కాఁగలదు. ఆతనినామకరణ సౌభాగ్యము నాకు ప్రాప్తింపఁగలదు. ఆతని కేమి పేరు పెట్టవలెను? ఆతని కనేకనామములుకలవు. ఈవ్యాజముననాకాతని దర్శనముకాఁగలదు. ఈయాలోచనముతోడనేరాత్రిమూఁడుజాములుగడిచెను. రాత్రియే కమండలమునుగైకొని ధోవతి, ఉత్తరీయము జంకలో పెట్టుకొని యమునవైపు గోకుల ఘట్టము వైపునకు బోయెను. ఎవరైన నడిగినచో నేడిచ్చట స్నాన శౌచాదులకు వెళ్ళవల

యునని చెప్పదలచెను. కాని రాత్రియందాతని నెవరును జూడ లేదు. ఆతడు యమునను దాటిసూర్యోదయమునకు బూర్వమే నందగోకులమునకుఁ జేరుకొనెను.

కొట్టములలోని గోవులను గోపకులు మేపుటకుఁగొని పోవు చుండిరి. పదిపదునైదు దినముల క్రిందట జన్మించిన గోవత్సములటునిటు గంతులిడుచుండెను. నందుడరుణోదయ ముననే స్నానమొనర్చి గోష్ఠమున నొక భాగమున సాల గ్రామ పూజ నొనర్చుచుండెను. ఇంతలోనే వెంటనే యెదు రుగా వచ్చుచున్న గర్గమహాముని కనబడెను. ఆతని గాంచ గనే నందుఁడత్యానందమును జెందిలేచి నిలుచుండెను. నేడా తని హర్షమునకు మేరలేకుండెను. స్వయముగ విష్ణుభగవా నుఁడే విప్రరూపమును ధరించి ఆతనిఁ గృతార్థు నొనర్ప వచ్చుచున్నాఁడా యనునట్లుండెను. ఏ సాలగ్రామ మూర్తిని దాను పూజించుచున్నాఁడో ఆతఁడే సాక్షాత్తుగ గర్గరూప మున వచ్చినాడా యనునట్లుండెను. అత్యంత భక్తిభావము తోడను, నమ్రతతోడను జేతులను జోడించుకొని మునికి సాష్టాంగ ప్రణామమును గావించి, కూర్చుండుటకు సుందర మగు నాసనమును వైచెను. భగవత్పూజా సామగ్రి తోడనే అతనిని విష్ణువుగ భావించి విధ్యుక్తముగ పూజించెను.

గర్గమహాముని స్వస్థ చిత్తముతోఁ గూర్చుండి నందు డొనర్చు శాస్త్రీయ మగు పూజను శాస్త్రీయ విధితో స్వీక రించెను. అప్పుడు నందుడత్యంత మధుర వాక్కులతో మునినిఁ బ్రశంసించుచు నిట్లనెను:— స్వామీ! నేడుఁ నేను ధన్యుడ నైతిని. కృతార్థుడ నైతిని. మీసేవ చేయు భాగ్యము

నాకు లభించినది. మీరాప్తకాములు. మిమ్ము మేమేమి సేవింప గలము? మీకు మాసేవాపేక్షయును లేదు. మీ బోటివారు మావంటి దీనచిత్తులమగు గృహస్థుల యిండ్లను మీపదరజముచేఁ బావన మొనర్చెదరు. ఇందులో మీ స్వార్థమేమియు నుండదు. మేమీ గృహకార్యములలోబడి దీనచిత్తులమై కృపణుల మగుచున్నాము. మాబోటి శోక సంతప్తులకు శాంతిమార్గమును జెప్పుచుందురు. మాకు శుభము నొనగూర్చుటకే మీరు విచరించు చుందురు."

గర్గుడిటుల నెను:— "నందా! ఇవన్నియును నీవు పలుకు శిష్టాచారవచనములు. మేమేమి యోగ్యులము? నారాయణ భక్తిచే నిచ్చటనే వైకుంఠసుఖమును భోగించు చున్న నీవే ధన్యుఁడవు?

నందుడు వినీత భావముతో నిటులనెను:— "స్వామీ! మీరిట్టి పలుకులు పలుకరాదు. చదువు సంధ్యలు లేకున్నను సాధారణ బ్రాహ్మణుడైనను పూజనీయుడే. పైఁగా మీరు సర్వజ్ఞులు. ఇంద్రియాతీతమగు జ్ఞానముచే భూతభవిష్యద్వృత్తాంతమును బ్రత్యక్షముగ దెలిసికొనగల జ్యోతిశ్శాస్త్ర రచనమును మీరు కావించిరి. మీరు సమస్త బ్రహ్మవాదులలో శ్రేష్ఠులు. మీచరణ సన్నిధిని నాదొక ప్రార్థనముకలదు.

గర్గుఁడిట్లనెను:— "చెప్పుడు గోపేంద్రా! నేను నీ కే కార్యమును జేయఁ గలుగుదును? "

నందుఁడిట్లనెను:— "నాకిద్దరు పిల్లలున్నారు. వీరిలో నొకడు పదునైదు మాసములవాఁడు. ఒకనికి నేటికి నూరు

దినములు ఐనది. వీరిద్దర కిప్పటికి నామకరణ సంస్కారము కాలేదు. మీరు వీరికి పేర్లను బెట్టుడు."

గర్గుడిట్లనెను – "అయ్యా! పేర్లు మీకుల పురోహితుడు పెట్టగలడు. ఎవరే కులమునకు గురువో వారే వారికి సంస్కార మొనర్పగలడు. నేను మీగురువును గాను.

నందుడు దృఢతా స్వరమున నిట్లనెను;– "స్వామీ! బ్రాహ్మణుడు తల్లియొక్క ఉదరము నుండియే గురువై పుట్టును. ఆతడే వ్యక్తి విశేషమును బట్టి గురువు కాడు. ఆతడు జన్మచేతనే అందరకును గురువగును. ఈ న్యాయమున మీరును నాకు గురువులే. మీరు వీరికి నామకరణ సంస్కార మొనర్పుడు"

గర్గుడిట్లనెను:– "నాకు సంస్కార మొనర్పుటకభ్యంతర మేమియును లేదు. కాని బుద్ధిమంతుడు వెనుకముందులను విచారింప వలయును. నేను యాదవుల కుల పురోహితుడనని అందరకును తెలియును. సదా నేనీ పృథ్వి యందలి యదుకులాచార్యుడనని ప్రసిద్ధిని జెందితిని. నేను నీ పుత్రునకు సంస్కార మొనర్చినచో నందరును నీపుత్రుని దేవకీ గర్భమునుండి పుట్టినవానిగా భావింపగలరు. ఇప్పటికింకను లోకులకు సందేహముగనే యున్నది. కంసుడెట్టి దుష్టబుద్ధి కలవాడో నీకు తెలియును. నేడాతడు సదా సశంకుడై యున్నాడు. ప్రతి సంఘటనను శంకించు నాతడు రహస్యమును వెదకుచుండును. వసుదేవులకును నీకును ప్రగాఢమైత్రి కలదని అందరు నెరుగుదురు. కంసునకును నీవిషయము తెలియకుండ కాదు. దేవవాణిని బట్టి దేవకి

యొక్క అష్టమ గర్భమెన్నటికి గన్యక కాఁజాలదని వానికి దెలియును. నేను నీపుత్రునకు నామకరణ మొనర్చెదను. వ్రజమంతటను నుత్సవము జరుగ గలదు. గోలబయలు దేరును. అప్పుడు కంసున కీతడష్టమగర్భమను విషయము నణుమాత్ర మైనను సంశయ ముండదు. నీకును ఇబ్బంది జరుగును. వసుదేవునకును జరుగును. ఆతఁడుమరల నీపిల్లలను జంపి వేయును. గోవులనులాగుకొనును. నిన్ను రాజ్యమునుండి వెడలనడుపును. నేను సంస్కారము నొనర్చినచో నిన్ని యనర్థములు జరుగ వచ్చును.

నందుఁడిట్లనెను:_ "స్వామీ! మేము గోలగా నుత్సవములు చేయవలసిన పనియేమున్నది. మేము విస్తారముగఁ జేయదలచుటలేదు. మేమెవ్వరినిబిలువ దలచుకొనలేదు. మీరు వచ్చిన సంగతినైన నెవ్వరికినిఁ జెప్పము. ఇదిగో! ఆయిద్దరి పిల్లలను దల్లులను బిలిపించెదను. మీరు సాధారణరీతిగా స్వస్తివాచన పూర్వకముగ వారికి ద్విజాతి సంస్కారమును మాత్ర మొనర్పుఁడు. మేమేదైన నుత్సవమును జేసికొనఁ దలచినచోఁ దరువాతఁ జేసికొందుము.

గర్గుడిటులనెను:_ "ఇంకెవరినైన పిలిచెదవా? మాట నాల్గు చెవులారు చెవులై అట్లే వ్యాపింపగలదు ?

నందుడిటులనెను;_ "నాకును మీకును దప్ప యింకెవరికినిఁ దెలియదు. నేను, సేవకులనైన పిలువను. నేఁడుమీరు సంస్కార మొనర్చుడు. ఇచ్చటనే దేవతార్చనకు వంటను చేసికొనుడు. ప్రసాదమును గైకొని రాత్రికి వెళ్లిపోవచ్చును.

పడవ నేర్పాటు చేయఁగలను. రాత్రికే మధురకుఁ జేర్పించెదను. ఎవ్వఁడెఱుఁగఁడు ?"

సూతుఁ డిటులనెను:- "మునులారా! గర్గుని కోరిక యిదియే. ఈనిమిత్తముననే అతఁడు వచ్చినది. నందుఁడు తనకు దానే సమస్త విషయములను గుప్తముగ నుంచుట కంగీకరించిన మీఁదట నాతడు నామకరణ సంస్కార మొనర్చుట కంగీకరించెను. నందుఁడు తనపూజా సామగ్రినిఁ దెచ్చెను. నందుడింటిలోనికిఁబోయి యశోదా రోహిణులకు నామకరణ మొనరింపచేయుటకు సిద్ధముకండని చెప్పఁబోయెను. లోపలికి పోయి అతడు వారిద్దరకును నేకాంతమునఁ జెప్పెను. ఇది వినఁగా నాతల్లులిద్దరును సంతోషముతో నన్నిటిని సిద్ధ మొనర్చుచుండిరి."



# కృష్ణబలరాములు

( ౮౬౬ )

ఏవం సంప్రార్థితో విప్రః స్వచికీర్షితమేవ తత్ ।
చకార నామకరణం గూఢో రహసి బాలయోః॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౮ అ. ౧౧ శ్లో.

వ. అని రామకృష్ణులం జూపి గర్గుండు మున్ను కంసుని చేత బ్రేటువడి దివి కెగసిపోయిన తెఱవ సెప్పిన తెఱంగు తేటపఱిచి దేవకీదేవి కొడుకని కృష్ణునిఁ గంసుండు దలంచుం గావున రహస్యంబున సంస్కారంబు సేయుట కార్యంబు.

శ్రీమదాంధ్ర భాగవతము.

నామము రెండువిధములుగ నుండును. ఒకటి రాశి - లగ్ననామము. రెండవది ఇంటిలో పిలుచు ముద్దుపేరు. ముదు పేరు నొకొక్కప్పుడు సగము పేరే అగుచుండును. శ్రీని వాసులైతే సీని యనియు, రామదాసైతే రామూ అనియు, లక్ష్మీనారాయణ అయితే లక్ష్మయ్య అనియు, శంభుదత్తుడైతే శంభూ అనియు పిలుచుచుందురు. ఈ సగము పేరలోను, విరిచి పిలుచుటలోను గల ప్రేమ అనేక బిరుదములతోడను, శిష్టా చార యుక్తముగను సంబోధించుటలో నెక్కుడ లభింపఁ గలదు. సహూ రాముఁడను నొక పండితుఁడుండెడివాడు. ఆతని తల్లి నగర దగ్గరగా నూఱుసంవత్సరముల వయస్సు కలది. పండితుడు గొప్పగా ప్రతిష్ఠను జెందినవాడు. అందరు నాతని నెక్కుడుగ సమ్మానించుచుండెడివారు. ఆతనితల్లి చనిపోగా నాతడు బాలకునివలె వెక్కివెక్కి యేడ్వసాగెను. అందరు నిట్లోదార్చిరి :- పండితులవారూ! మీరింతగా తెలిసినవారు,

తల్లి కవసానకాలము దాపురించినది. దేహధారు లేదో యొక దిన మున చచ్చితీరవలసినదే. మీరింతగా శోకించుట శోభించుట లేదు. ”

పండితుడశ్రువులను తుడుచుకొనుచు నేడ్చుచు నిటు లనెను :– “ నాయనలారా! ఇవన్నియును నేనెరుగుదును. తల్లికిని మరణసమయమే. నాసమయమును సమీపించినది. అందరును మరణింపవలసినదే. నాకు తల్లి మృత్యువుకొరకై శోకము రాలేదు. ఆమె దుఃఖమునుండి బయటపడినది. మంచిదే. ఇకనన్ను ‘ నత్థూ ’ అని పిలుచువారు లేరనియే నాదుఃఖము. ‘ నత్థూ ’ అనుశబ్దములో నెంత ప్రేమ యిమిడి యున్నదో అంతటి ప్రేమ నానామమున కటునిటు బిరుదులను చేర్చి పిలుచుటలో లేదు. ఆ శబ్దము తల్లి నోటినుండి వచ్చిననే మధురముగ నుండెడు. ఇంకెవరైన పిలిచినచో దానిలో నవ మాన మొనర్చుట భాసించుచున్నది. ”

అసలు విషయమేమనగా శబ్దములలో నేమియును లేదు. అంతయును భావముమీద నాధారపడియున్నది. భావమే భావ శబ్దములయొక్క అర్థమును కొంచెముగనో గొప్పగనో వెలు వరచును. ఎవరైన తిట్టినచో చచ్చుటకును జంపుటకును సిద్ధ మయ్యెదము. అనియే అత్తవారింట బావమరదు లనుచో నది కలకండకంటె తీపిగను, పప్పుచారుకంటె కమ్మగను నుండును.

సూతుం డిటులనెను :– “ మునులారా! నందుడింటి లోనికి పోయి యశోదమ్మ చెవిలో నేదియో చెప్పెను. విన గానే యశోద రోహిణీసమీపమునకు పరువిడెను. రోహిణీ దేవి వినగానే ఆనందమును ప్రకటించెను. పిల్లలిద్దరకును

తలంట్లను పోసిరి. రోహిణి శ్రీకృష్ణునకు నలుగుపెట్టి స్నానము చేయించెను, కన్నులనిండ కాటుకను పెట్టి దృష్టి తగులకుండు టకై మాడున చంద్రవంకను బెట్టిరి. చేతి కంకణములను స్వచ్ఛము కావించెను. కాళ్ళకున్న గజ్జెలందెలను పులుసుతో తోమిరి. కంఠహారములను, పులిగోరు పతకమును కంఠమున బెట్టెను. పసుపుపచ్చని చొక్కాను తొడిగెను. గోటుకలిగిన చమికీటోపీని బెట్టెను. ఫాలమున గోరోచనతిలకమును ధరింప జేసెను. నల్లని యుంగరములుతిరిగిన వెంద్రుకలకు నూనెనురాచి జడనువేసి మిక్కిలి ప్రేమతో నొడిలోనికి దీసికొని ముద్దుపెట్టు కొనెను. ఈవిధముగ బాలునునకు శృంగారమును గావించి తల్లి యును తాను శృంగారమొనర్చుకొనెను. ఈవిధముగనే బల రామునకు యశోద శృంగారము గావించెను. ఈవిధముగ శృంగారము గావించుకొని యిద్దరును నలంకరించుకొని పిల్లల నెత్తుకొని వాకిద్వారముకుండా యెవరికిని చెప్పకయే గోష్ఠము లోనికి పోయిరి.

గరుడచ్చట సమస్తసామగ్రితోఁ గూర్చుండి యుండెను. నందుడును మరల స్నానమొనర్చి దేవతాపితరులకుఁ బూజన తర్పణ లొనర్చెను. ఇంతలోఁ బిల్లలనిద్దరను జంకల కెత్తుకొని తమ నూపుర, కంకణ, కింకిణులు మొదలైన యాభరణముల ధ్వనిచే గోకులమును ముఖరితము గావించుచు రోహిణీ యశోద లిద్దరును వచ్చిరి. చిన్నపిల్లవాని శరీరము మీఁద పట్టుపీత వస్త్రము శోభించుచుండెను. పెద్దవాని శరీరముమీఁద నీలపు పట్టువస్త్ర మలంకరింపఁబడెను. ఆ గౌరశ్యామమున మోహన రూపములు గల వారిదరినిఁ జూడఁగనే గర్గమహాముని శరీర సంతటను నొకవిధమగు విద్యుత్తు ప్రవహించినట్లయ్యెను. అతఁ

డేదో అవ్యక్తశక్తిప్రేరణముచేఁ దానను కొనకయే వెంటనే తన యాసనమునుండి లేచి నిలువఁబడెను. ఆతఁడు రెప్పలార్పుట లేదు. వీరిని దల్లులచంకనుండి తీసుకొని హృదయముతోఁ గౌగలించుకొనవలయుననియు, నేత్రములలో నిలుపుకొనవలయు ననియు, నెత్తిపై కెక్కించుకొననలయుననియు, వీరి చరణముల సంతఃకరణమున దాఁచుకొననలయుననియు నిట్లనేకవిధములఁ దర్కమొనర్చుచుండెను. కాని చేయి ముందునకు సాగుటలేదు. ఇంతలోనే శ్యామగౌరవర్ణములతోనుండిన బాలకులను దల్లులు తెచ్చి మునిచరణముల మీఁదఁ బడవైచిరి. గర్గుని పాదముల మీఁదనున్న శిశువులు, వికసించిన గౌర, నీలకమలములను దల్లులిద్దరిచే నర్పింపబడినట్లుండెను. శ్యాముఁడు గుప్పిళ్ళు పట్టుకొని, తల నిటుఁ ద్రిప్పుచుఁ జేతుల నాడించుచు నీక నిన్ను మాయ స్పృశింపదని చెప్పుచున్నట్లుండెను. బాలురిద్దరును మూర్తీభవించిన సౌందర్యమాధుర్యములవలెను, ఆనందోల్లాసములవలెను, సచ్చిదానంద, ఆనందఘనవిగ్రహములవలెను, మూర్తీభవించిన భాగ్యమువలెను మునివరునకుఁ గనఁబడెను.

ఆతఁడు పిల్లలిద్దరి శిరస్సులపైఁ జేతులనుంచి యిట్లనెను: "స్వస్త్యస్తు, కల్యాణమస్తు" వారు కల్యాణస్వరూపులే కదా! తల్లులును ముని చరణములందు శిరస్సులనుంచిఁ బ్రణామమును గావించ ముని ఆశీర్వదించెను. పిల్లల నిద్దరను దల్లులెత్తుకొనిరి.

వ్రజరాజు యశోదతో నిట్లనెను:- "గర్గాచార్యులవారు గొప్ప జ్యోతిష్కులు. ఈతనికి భూతభవిష్యద్వర్తమానములు తెలియును." యశోద యిట్లనుకొనెను:- "చూతమింతఁ డెంతటి త్రికాలజ్ఞుఁడో." ఆమె గౌరబాలకునిఁ దాను దీసికొని శ్యాముని

రోహిణి కొనసాగెను. సర్వజ్ఞుఁడైనచోఁ జెప్పవలయును. వీఁడెవరి పుత్రుఁడో అని అనుకొని ఆ తల్లులిద్దరును వారి పిల్లలను నూర్చుకొని యెత్తుకొని యుండిరి. ముని ఆజ్ఞాపింపఁగనే యిద్దరును బంచలో వేయఁబడిన పీఁటలమీఁదఁ గూర్చుండిరి. ముని సంక్షేపమున సంకల్పపూర్వకముగ దీప, కలశ, శంఖ, ఘంటా, గణపతి పూజల నొనరింపఁజేసి, తదనంతరము నవ గ్రహ పూజను, పంచదేవతాపూజను గావింపఁజేసి పంచాంగ మును దెలిపెను. రోహిణి శ్రీకృష్ణునిఁ దీసికొని ముందు గూర్చుండెను. తర్వాత యశోద బలరాముని దీసికొని కూర్చుండెను. నియమానుసారముగఁ బ్రథమమున నాతఁడు మొదట గూర్చుండిన రోహిణీచేతిలోని బాలకునకు నామకరణ మొనర్పవలయును. కాని ఆతఁడు సర్వజ్ఞుఁడు. పెద్దపిల్లవాఁడు యశోదచేతిలో నున్నాఁడని గ్రహించెను. ముందుగాఁ బెద్ద వానికి పేరును బెట్టి చిన్నవానికిఁ బెట్టవలయును. అందువలన గౌరవర్ణ బాలకునివైపు వ్రేలిని జూపించుచు నిట్లనెను:_ "ఈ యశోదారాణి ఒడిలోని వాఁడు రోహిణీపుత్రుఁడు. ఈతఁడు తన గుణములచే స్వజనులను రమింపఁజేయును. కావున నీతని కొక పేరు రాముఁడు. అయితే రాములు చాలమందిగలరు. ఒకఁడు పరశువును ధరించు పరశురాముఁడు. ఇంకొకఁడు దశ రథుని పుత్రుఁడు దశరథరాముఁడు. వీరందరకును విశేషణమును జేర్చుటచే వీరు వేరువేరుగ గుర్తింపఁబడు చున్నారు. ఈతని శరీరమున బల మధికముగ నుండును. కావున నీతఁడు బల రాముఁడని పిలువఁబడును. భద్రస్వరూపుఁడగుటచే బలభద్రుఁ డనియు, పెద్దవాఁడగుటచే బలదావూ అనియుఁ బిలువఁబడును. ఈతఁడు యాదవులకును గోపకులకును బోరాటము వచ్చినపుడు

రాజీ కుదర్చగలఁడు. అందువలన నీతని సంకర్షణుఁడనియుఁ బిలి
చెదరు. ముఖ్యనామము "బలరాముడు."

ఇది విని యశోద రహస్యభరిత దృష్టితో రోహిణీ
వైపునకుఁ జూచి, కనుసన్నలతోడనే ఆమె యిట్లనెను:–
"ముని చెప్పినట్లుగనే యున్నది కదా! నాచేతిలో నున్నను
గౌరబాలకుని విషయ మీతఁడు చెప్పినాడు కదా !"

తదనంతరము రోహిణీదేవి ఒడిలోఁ గూర్చుచున్న
పిల్లవానివైపు చూచి నందునితో గర్గమహాముని యిట్లనెను:–
"వ్రజరాజా! ఈ నీ కుమారుఁడు ప్రతియుగమునను బుట్టు
చుండును. కృతయుగమున నీతఁడు శ్వేతవర్ణముగ నుండును.
త్రేతాయుగమున నీతఁడు రక్తవర్ణముగ నుండును. ద్వాపర
యుగమునఁ బీతవర్ణముగ నుండును. ఇప్పుడు కలియుగాది
యందుఁ గృష్ణవర్ణముగ నున్నాఁడు. వర్ణానుసారముగ నీతని
నామము 'కృష్ణు'డను నామము. ఇది వరకీతఁడు వసుదేవునకుఁ
బుత్రుఁడై యున్నాడు. అందువలన నీతని వాసుదేవుఁడందురు.
అన్యథా తలంపవలదు. గుణకర్మానుసారముగ నీపుత్రుని
కింకను సహస్రనామములు కలవు. నేను జ్యోతిషమువలనను
దపస్సుచేతను దెలిసికొనుచున్నాను. ఇతరు లాతనిఁ దెలిసికొనఁ
జాలరు."

నందు డిట్లనెను:– "స్వామీ! వీని గ్రహలగ్నమును
జూచి వీని జాతక మెట్లున్నదో చెప్పఁడు. వీని మూలమున
మాకులము వృద్ధి యగునా? కాదా?

ఇది విని నవ్వుచు గర్గుఁడిట్లనెను:– "నందా! నీవీబాల
కుని గ్రహలగ్నముల నేమి యడిగెదవు? బాలకుని కళ్యాణ

సాధన మొనర్చుచు సమస్త గోగోపకుల నానందింపఁజేయ గలడు. ఈతని సహాయమున మీరు విపత్తులనుండి సుగమ ముగ దాఁటఁగలరు."

నందుఁడిట్లనెను:- "స్వామీ! ఈతనికి శత్రుస్థానమెట్లున్నది? శత్రువులీతని బాధపెట్ట జాలరు."

గర్గుడు నవ్వి యిటులనెను :- "నేనుగర్గసంహిత యను పేరట ప్రసిద్ధమగు నొకగ్రంథమును రచించితిని. దాని ననుస రించి నేను భూత భవిష్యజ్జన్మములను గూర్చి చెప్పెదను. పూర్వకాలమున నరాజకత వ్యాపించినపుడు దొంగలచేతను, దోపిడిగాండ్రచేతను పీడింపబడు ప్రజను సాధువులను నీతడు రక్షించినాడు. అప్పుడీతనిభుజబలముచే రక్షితులై సాధుజనులు దొంగలపై విజయమును పొందిరి. ఈతనికి శత్రుభయము లేక పోవుట నటుంచి, ఈతని నెవరు ప్రేమించెదరో వారును శత్రువులనుండి నిర్భయులగుదురు. వారినికూడ నెవరును బాధింపఁ జాలరు. మీకు తెలియును గదా! అసురులెంతటి బలవంతులో దేవతలు సమరమున వారి సమ్ముఖమున నిలువఁ జాలరు. కాని కృష్ణభగవానుని వలన వారు సురక్షితులగుటచే నసురులు వారి నేమియును చేయఁజాలరు. గోపరాజా! విశేష మేమి చెప్పఁగలము. నీకుమారుని యొక్క గుణ. కీర్తి ప్రభా వములు సాక్షాత్తుగ నారాయణునకు వలెనే యుండును. మీరు జాగ్రత్తగ నీతనిని రక్షింపవలయును."

చేతులను జోడించుకొని నందుఁ డిట్లనెను:- "స్వామీ! రక్షించుటకును, రక్షింపఁజేయుటకును నేనెవఁడను? మీ యాశీర్వాదము చేతనే రక్షణ జరుగును. మీవరద హస్త

మాతని శిరముపైఁబడిన నాతనికి మంగళము కాక యేమున్నది. స్వామీ! మీరీతని జాతక చక్రమును రచించినచో నీతని గ్రహముల యొక్క ఫలములను గూడ వినఁగలను.”

గర్గుఁడిట్లనెనుః— “విశేషఫలములను నేను పెదజన్మ పత్రమును వ్రాసినప్పుడు చెప్పెదను. ఈసమయమున సాధారణముగ మీపుత్రుని గ్రహములను మాత్ర ముల్లేఖించెదను. శుభగ్రహము లన్నియును నుచ్చమున నున్నవి. శ్రావణ బహుళాష్టమీ బుధవారమునాఁడు అర్ధరాత్రి సమయమున నీపుత్రుఁడు జన్మించినాడు. ఈసంవత్సరము యొక్క నామము సరస విభావనము. సరససంవత్సరమున నుదయించుటచే నీ శ్యామల సుందర సుకుమార శరీరుఁడు నీసుతుండందరను సరసములో ముంచును. విశ్వబ్రహ్మాండమునే రసములో ముంచివేయఁగలఁడు. జన్మనక్షత్రము రోహిణి. ఇది అత్యంత శుభమైనది. అష్టమీ తిథి బుధవారము అంతయును మంగళమయమే. లగ్నము వృషభలగ్నము. దీనిచే నీతఁడందఱికంటె శ్రేష్ఠుఁడగును. తను స్థానమున నుచ్చుఁడగు చంద్రుఁడున్నాడు. దాని వలన నీతనికి శారీరక సుఖము లభించును. వృషభమునకు చతుర్థ స్థానము సింహరాశ్యాధిపతి సూర్యుఁడు. దీని వలన నీతఁడు సమస్త భూమండలమును దన భుజబలముచే జయించును. పంచమ స్థానమగు కన్యయందు బుధుఁడున్నాడు. దీనివలన నీతనికిఁ బుత్రులు కొదువయుండదు. నిత్యమును బుత్రులు పుట్టుచుందురు. ఎంతమంది బుత్రులు పుట్టురందువా అవ్వకును తాతకును వారిపేర్లే జ్ఞాపకముండనంతమంది.

షష్ఠమ స్థానమగు తులారాశి యందు శుక్రశనులిద్దరు

నున్నారు. దీని వలన నీతఁడు తన శత్రువులను వెదకి వెదకి చంపును. భూమి మీఁద నీతనికి శత్రువగువాఁడొక్కఁడును మిగులఁడు. సప్తమస్థానమున రాహువున్నాడు. ఈతడు కొంచెము గడబిడ చేయువాఁడు. దీని వలన నీతనికి భార్య లెక్కుడుగ నుండును. ఉచ్చనీచ శ్రేణులలోని భార్యలంతఃపురము నిండ నిండియుండును. మకరమున భాగ్యస్థానమునఁ గుజుడున్నాడు. దీని వలన నెల్లప్పుడు నీతనికి మంగళములే కలుగును. నిరంతర మైశ్వర్యము వృద్ధినిఁ బొందుచుండును. లాభస్థానమగు మీనమునందు బృహస్పతి కలఁడు. దీని ఫలమును గూర్చి అడుగ వలసిన పనిలేదు. దీని వలన అష్టసిద్ధులును, నవ నిధులును నీకుమారుని సమ్ముఖమునఁ జేతులను జోడించు కొని నిలుచుండును. కర్కట స్థానమున శనైశ్చరుఁడుండు టచే నీతఁడుకృష్ణ వర్ణముగ నుండును మేఘమువలె శ్యామల శరీరముండును. సంక్షేపముగ గ్రహఫలము లివి."

నందుఁడిద్ది విని అత్యంతానందమును జెందెను. ఆతఁడు మణిముక్తా సువర్ణ రత్నములను, అనేకములగు వస్త్రాభరణ ములను గర్గునకు దక్షిణగ నొసంగెను. గోవులను గూడ నొసంగి యిట్లనెను:— స్వామీ! దక్షిణ వస్తువుల నిచ్చుటనే విడిచి పొందు. మేము మధురకు వచ్చినపుడు మీయింటికి జేర్చెదము. ఈ దక్షిణ పైకి దక్షిణ తరువాత నేమియును లేదని మీరనుకొనవలదు. మీదక్షిణను మీకు జేర్పగలము."

ఇది విని గర్గుడు నవ్వెను. యశోదా రోహిణులు ప్రణా మములను గావించి వెడలిపోయెను. రోహిణి యిటనెను:— 'పిల్లల కేమి పేరును బెట్టినారో నేను విననేలేదు."

యశోద యిట్లనెను:— "పెద్దవానిపేరు బలరాముడు,

చిన్నవాని పేరు కృష్ణుడు. ఇదిమాత్రము చెప్పినాడు. ఆపండితు డింక నేమి గీతములు పాడినాడో నాకు తెలియలేదు."

రోహిణిదేవి యిట్లనెను:_ "ఈపేర్లు కొంచెము పెద్దవిగ నున్నవి. నాకునోరు తిరుగదు. కావున పెద్దవానిని బలుడా బలుడా యనిపిలిచెదను. చిన్నవానిని కన్నయ్యా, కన్నయ్యా యని పిలిచెదను. ఏమమ్మా రాణీ! రెండు పేరులు బాగుండ లేదా ?"

యశోద యిట్లనెను;_ "ఈపేర్లు నాకును బాగున్నవి. కృష్ణ, కృష్ణ అనుటదెంతటి వంకరనామము. మూడుసార్లు నాలుకను త్రిప్పవలయును. కన్నయ్య సరియైననామము. బలుఁడను నామము బాగున్నది. నేటినుండి వీరెద్దరను కన్నయ్యా, బలా యను పేర్లతోడనే పిలిచెదము."

సూతుఁడిట్లనెను:___ "మునులారా! యజ్ఞములలో మిక్కిలి యాదరముతో సస్వరములగు వేద మంత్రములతో శుదముగ స్తుతించినను నెవరురారో వారే తల్లులు కన్నయ్యా! బలా! అని పిలచిన గంతులు వైచుకొని వచ్చుచుందురు.

ఈ విధముగ నామకరణ సంస్కారమొనర్చి గర్గమహాముని సూర్యాస్తమయము కాఁగానే మెదలక తనమూటను కమండలువును గైకొని మధురకుఁ బోయెను. నందుడాతని చరణములకు నమస్కారమును గావించి యింటికి వచ్చెను. శ్యామ బలరాములు గోకులమందు తల్లుల సమీపమున నుండుచు శుక్లపక్ష చంద్రునివలె వృద్ధిని బొందుచుండిరి. ఇప్పుడు వారు చంకలను దిగి మోకాళ్ళమీఁద బారకాడు చుండిరి."

# రామశ్యాముల బాలలీలలు

( ౮౬౭ )

శ్లో॥ తావంఘ్రియుగ్మ మనుకృష్య సరీసృపంతౌ ।
ఘోషప్రఘోషరుచిరం వ్రజకర్దమేషు ॥
తన్నాద హృష్టమనసా వనుసృత్య లోకమ్ ।
ముగ్ధప్రభీత వదుపేయ తురంతి మాత్రోః ॥

(శ్రీ)భాగ. ౧౦స్కం. ౮అ. ౨౨ శ్లో॥

సీ॥ జానుభాగముల హస్తమ్ముల వీడ్వడ
నిడుచు దిగ్గనఁ బోదు రింత నంత
నవ్వాల పయ్యెద లంది జవ్వాడుదు
రాలక్రేపుల తోఁక లలమి పట్టి
విడువ నేరక వాని వెనువెంట జరగుదు,
రప్పంకముల దుడుకడరఁ జొత్తు
రెత్తి చన్నిచ్చుచో నిరుదెసఁ బాలిండ్లు
చేతునఁ బుడుకుచుఁ జేఁపు గలుగ

గీ॥ దూటుదురు గ్రుక్కగ్రుక్కకుఁ ద్రోరనగుచు
నాడుదురు ముగ్ధపలుకు లవ్యక్తములుఁగ
గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు
రామకృష్ణులు శైశవ రతులఁ దగిలి.

(శ్రీ)మదాంధ్రభాగవతము.

ప్రపంచ మందెన్నో వస్తువులు సుందరమగునవి కలవు. సుందరములగు వస్తువులన్నిటిలో నమోఘ శిశువుయొక్క వైఖరియును, అతని సరస నిశ్చలస్వాభావిక క్రీడలును,

ఆతని నిలుచుండుటయుఁ గూర్చుండుటయు మాటలును, వైఖరియు నన్నిచేష్టలును బరమ సుందరములే. అమాయకులగు బాలకులఁగాంచి యానందించని హృదయ మెచ్చట నుండును? బాలకుఁ డెవ్వరి వాఁడైన గానిండు. ముద్దువచ్చుచుండును. దీని కొక కారణ మున్నది. గంభీరత, శీల సంకోచములతో నున నే సర్వశ్రేష్ఠుల మనుకొని బెట్టుగా మెదలక కూర్చుందుమే. దానిలో సమ్మానిత్వము, ప్రతిష్ఠ, సర్వపూజ్యత్వము కావలయునను వాసన యిమిడి యున్నది. బాలకున కేవాసనయు నుండదు. ఆతఁడు సరళుఁడు. నిశ్చలుఁడు వారి కిష్టము వచ్చినపుడు కిలకిల నవ్వుచుందురు. ఇంకొకప్పు డేడ్చుచుందురు. క్షణమున నేడ్పునాపి నవ్వుచుందురు. ఇంకెవ్వరి కడనైన నుచితానుచితము లుండునేమో కాని వానికి మాత్రము ఉచితానుచిత భేదము లుండవు. అందువలన నే పిల్లవాని నోటఁ జిలుక పలుకులను విన్నను నవ్వువచ్చుచుండును. వారేవిషయమున దేనికినిఁ జెడ్డగా భావింపరు. ఆతని కిష్టము వచ్చినపుడు స్త్రీల మీఁదకుఁ బరువిడును. మఱియొకప్పుడు పురుషులలోనికి వచ్చును. ఆతని మనస్సులో స్త్రీపురుష భేదభావముండదు. ఇష్టము వచ్చినపుడు దిగంబరి యగును. ఆతడు సమాజ బంధనముల స్వీకరింపలేదు. అందువలన నవి వానికి వర్తింపవు. ఆతనికి లజ్జాసంకోచములు కాని సమాజముయొక్క మానావమానభయము గాని లేదు. ఆడుట ఆతని వ్యాపారము. ఆతఁడు తన ప్రకృతి ననుసరించి యాడును. ఆతని మీఁదఁ బెద్దరిక ప్రభావము సమిూపింపఁ దలఁచినను సమిూపింపఁ జాలవు. అందువలనఁ బెద్దవారు పిల్లవాని కన్నమును బెట్టునపుడు తామును బిల్లల

వలె నగుదురు. వారితో నట్టే బాలకులవలె మాట్లాడు
చుందురు. పిల్లలు గడ్డములవారిని గాంచి భయపడు
చుందురు. గడ్డములును మీసములును నెంత పెదగ బెరిగిన
వారికి లోన నంతటి గర్వము నిండియుండునని వారికిఁ దెలి
యును. గడ్డములు మీసములలో నింకను నింతటి బాలత్వము
దాగియున్నదా యని వారు నిశ్చయించుకొన్నప్పుడు పిల్లలు
గడ్డములను మీసములను నాటవస్తువులుగఁ జేసికొని వానితో
నాడఁ బ్రారంభించెదరు. పిల్లలెప్పుడును గడ్డములు మీస
ములులేని తల్లులకడ నివసించుచుందురు. హఠాత్తుగా గడ్డ
మునుజూచిరాభయపడుచుందురు. రోజును జూచుచుండినచో
వారిభయము పోవును. బాలకునిలో ఛల ఛిద్రములుండవు.
అందువలన నాతఁడు సర్వప్రియుఁడగును. భగవానుఁడే బాలక
వేషమును ధరించి విహరించినచోఁ గ్రీడించినచో నికచెప్ప
వలసిన దేమున్నది? బంగారమునకుఁ దావి యబ్బినట్లే
యగును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! కొంతకాలమైన తరు
వాత భగవానుఁడుయ్యాలను, తల్లి చంకను వీడి తన పావన
పదములతోఁ బృథివిని బవిత్రతమ మొనర్పసాగెను. అతఁడు
భూమిపైఁ బదార్పణ మొనర్చెను. ఈతఁడు నాభారమును
దీయుటకువచ్చి యుయ్యాలలోఁ బడియుండినాఁడే? అచ్చట
క్షీరసాగరములోఁ బడియుండువాఁడిచ్చట నుయ్యాలలోఁ
బడియున్నాఁడే? తన చరణకమలములచే నన్నుఁ బావన
మొనర్పలేదే? పడుండినను దల్లిఒడిలోనే పడుండును. తల్లి
ఒడిలోఁ బడుండువాని వలన నాతని ప్రియకు ఆనందమో

కలుగును? తల్లి చంకను వీడి నా వత్సలమందుఁ దనచరణ ములు నుంచినపుడు నారోమరోమములు నిక్కబొడిచియుండ గలవు. ఇంతవరకు భగవానుఁడు సంకోచముచే నేత్రము లను మూసుకొని యున్నాఁడు. ఆకఁలైనఁ దల్లి పాలిచ్చును. పాలు త్రావి నిద్రించును. ఇప్పుడు కన్నులను తెఱచి అటునిటుఁ జూడఁగనే సైగలతో భూదేవి సైగజేసెను. "ఎంత వఱకు తల్లి చంకలో విహార మొనరెంచు చుందువు. కొంచె ముగ నన్నును మఱచిపోకుము. ఇది వఱలో నీవు వరాహ రూపమును ధరించి పాతాళమునుండి యెత్తితివి. ఇప్పుడు చూచుచుండియును గన్నులు మూసికొంటివేల? ఇది మంచి దేనా?"

భగవానుఁడిట్లనుకొనెను:- "నేను తల్లి ప్రేమచే నా సంగతినే మఱచితినే. సరియే! ఫరవాలేదు. ప్రాతఃకాల మున మఱచి సాయంకాలమైనను నింటికి వచ్చినచో నది మఱచినట్లుకాదు. ఇఁక నిప్పుడు తల్లి చంకనుండి దిగి పృథి విని బావన మొనర్తుము. ఈమె వత్సలము మీఁదఁ బాద ప్రహార మొనరించి యీమె కానందమును గలుగ జేయు దము" అని యిట్లాలోచించి యాఁతఁడు తల్లి చంక నుండి బలవంతముగ దిగఁబడెను. గాని తల్లికంటు బలవంతుఁడా? తల్లి ఆతని గట్టిగా బట్టుకొనెను. ఆతడేడ్వసాగెను. గోపిక లిట్లనిరి. రాణి! "ఇప్పుడిక బిల్లవానిని భూమి మీఁద దిరుగ నిమ్ము. ఎప్పుడును జంకలోనే అదిమి పట్టుటా?"

తల్లియిట్లనెను.- "పేఁడు పట్టి అర్భకుడు. అటునిటు వెళ్ళిన దెబ్బలుతగులును."

గోపికలిట్లనిరి:– "దెబ్బంలెదులకు తగులును. పిల్లలందఱును బోవుచునే యున్నారు. నీవు ఊరక చూచుచుండుము.

రోహిణియును నట్లే యనెను. అందరును చెప్పఁగా యశోద నేలమీఁదఁ బిల్లవానిని వదలెను. పృథివి నుద్ధరింపవలయునను స్మరణ కలిగెను. అందువలనఁ జేతులు కాళ్ళతో నడువసాగెను. అరచేతుల నాధారము చేసికొని మోఁకాళ్ళబలమున నిప్పుడాతఁడు క్రోఁతివలె మెల్లఁగాఁ బారకాడసాగెను. దీనినిఁగాంచి గోపికలందరును జప్పట్లను జరచుచు నవ్వసాగిరి. తల్లి "కన్నయ్యా!" అని పిలచిన నాతఁడు తలను ద్రిప్పి తల్లివైపు చూచును. తల్లికి మిక్కిలి ఆనందము లభించుచుండెను ఇప్పుడు పిల్లవాడు కొంచెము గ్రహించుచుండెను. ఇదివరకట్లు గ్రహించుట లేదు. ఆతడు పారకాడుచుఁ బారకాడుచు ముందునకుఁ బోవుచుండెను. వెనుకనుండిగబగబ తల్లి పరువిడి యెత్తుకొని మాటిమాటికినీ ముఖమును ముద్దు పెటుకొనెను. మానాయన నడుచుచున్నాఁడు. చూడుఁడెంత దూరము వచ్చినాఁడో! ఇప్పుడాతఁ డస్పష్టస్వరమున "అమ్మా!" అనియు ననుచుండెను. తల్లి యిట్లునేర్పును – వీరు నీ తండ్రి. ఈమె పిన్ని. ఈతఁడు పెత్తండ్రి. ఈమె అవ్వ. ఏశబ్దమునైన సగము పలికి కొన్నిటి నుచ్చరింపఁ జాలకపోవుటచేఁ దల్లిముఖము వైపునకుఁ జూచుచుండును: గోపిక లిట్లనిరి:– "ఏమమ్మా! పిల్లవానికిడిన నాభరణముల నన్నిటిని ధరింప చేసినచో నవి మ్రోగఁగలవు; ఆభరణముల శబ్దముచే బిల్లలు నడుచుటకు మిక్కిలియుత్సహించెదరు. తల్లి వెంటనే చేతులకును గాళ్ళకును

గంకణములను గజ్జలందెలను బెట్టెను. నడుమునకు పెట్టిన మొల త్రాటికిని గలగలమను మువ్వలనుగట్టెను. ఇట్లు వానిని ధరించి శ్యామరాములిద్దరును బోవుచుండ బాలకృష్ణురింగణ నృత్యమునకు నంగవాద్యములు వాయింపబడుచున్నట్లుండెను. ఆభరణముల ధ్వనిని విని బాలురిద్దరును నులికి పడుచుండిరి. ఆధ్వని యెచ్చటినుండి వచ్చుచున్నదో వారు నిర్ణయింప జాలకుండిరి. పోవుచున్నప్పుడు నూపురముల సుమధుర ధ్వనిని వినికిలకిల శబ్దము లొనర్చుచుండెను. ఇప్పుడు ద్వారము వరకు పోవుచుండెను. ఒక దినమున వారిద్దరును జారిజారి ద్వారబంధమును దాటి బయటకు వచ్చిరి. ఒకానొక బ్రహ్మజ్ఞానియగు వృద్ధమహాత్ముడటు వెడలు చుండెను. వారు వ్రజమునకు వచ్చుట భగవద్దర్శనము కొరకే. కాని వారికి దర్శన సాభాగ్యమింకను గలుగలేదు. కృష్ణుడు తెల్లని గడ్డమును దూరమునుండి జూచి యీతడు సాధుమహాత్ముడని గ్రహించెను. ఆతడు త్వరత్వరగా పాదములతో దేకుకొనుచు జిరుగజ్జలను మ్రోగించుకొనుచు నాతని వెనువెంటనే పోయెను. నన్ను వెదుకుటకై యేవిధముగ వచ్చినను సరియే నేను వారి వెనువెంటనే యుందునని చెప్పుచున్నాడా యనునట్లుండెను. కొందూరము పరమ పావనమగు వీథిదుమ్ములోదన శరీరము నీడ్చుకొనుచుబోయెను. ఆదివ్యనూపురములయొక్క సుమధుర ధ్వనినివిని సాధువు వెనుదిరిగి చూచెను. చూడగానే యీతడే సాకార బ్రహ్మ. వేద ప్రతిపాదితమగు పరబ్రహ్మయే యీ బాలకుని రూపమును ధరించినాడని భావించి ఆతడాగిపోయి చంద్రబింబ సదృశమగు ముఖముమీద విరియ బడి చిన్న

చిన్నవై యుంగరములు తిరిగిన జాలులో దనసునసునను బోగొట్టుకొనెను.

ఈతడు తనతండ్రి కాడని బాలకృష్ణుడు తెలిసికొని అచ్చటినుండి భయపడి పారిపోయెను. చేతులొక చోటకాళ్లొక చోట వణకుచుండెను. ఆతడు తన తత్వమును దాచుటకై అధీరుడై నట్లుండెను. "భక్తుని గాంచి భగవానుడు పారిపోవు టేమిటి?" అయ్యో! భగవానునకు రెండే పనులు తెలియును. పారిపోవుటయును, దాగుకొనుటయును ఈతనికి దాగుకొనుటలో నానందమెక్కువ. అందువలన నెప్పుడు దాగియుండును. ఎవరికైన ప్రత్యక్షమైనను మరల దాగును. ఏడ్పించి పారిపోవును. ఏడ్పించిన నీతనికి రసము కలుగును. తడబడు పాదములతో ద్వారము కడకు బోయినాడు కాని గడపను దాటజాలక పోయెను. అచ్చటనే యుండి యేడ్వ దొడంగెను. గడపను దాటుటకు సహాయము నర్థించు చుండెను. అప్పుడా బ్రహ్మజ్ఞాని మహాత్ముడు నవ్వియిట్లను కొనెను.— "చూడుడు, నేడు బ్రహ్మకును సహాయము కావలసి వచ్చినది. ఎవని నామస్మరణము చేతనే యీ యగాధ సంసారమును నిమిషములో దాటగలమో ఆతడే నేడు గడపను దాటుటకై యేడ్చుచున్నాడు. తల్లిని ప్రార్థించుచున్నాడు. ఇంతలోనే తల్లి పరుగెత్తుకొని ద్వారముకడకువచ్చి, పిల్లవాని యొక్క కాళ్ళుచేతులు వణకుటనుగాంచి, వెంటనే పిల్లవానిని జంక కెత్తుకొని, ముద్దుపెట్టుకొని వెంటనే వడ్రంగిని పిలిపించి మండిగమును దీయించి పిల్లవాడు పారకాడుటకుగాని, దాటుటకుగాని కష్టములేకుండ చేసెను. నందభవనమున భగ

వానుడెట్టి సరసవాత్సల్య ధారను ప్రవహింప జేసెనో చూడుడు. ఇప్పుడాతడు, జరిగిజరిగి గోష్టమునకు ఒకదినమున చేరుకొనెను. అచ్చటగోమూత్రముచే నంతయు రొచ్చుగ నుండెను. దానిలోని కాతడుపోయి పొరలాడ సాగెను. చేతులతో రొచ్చును థపథప కొట్టసాగెను. అటునిటు నెగుర సాగెను. రొచ్చులో బొరలాడిననాతని కానందముగ నుండెను ఇంతలోనే తల్లివచ్చెను.

ఆమె పరువెత్తుకొని పోయియిట్లనెను:- "కన్నయ్యా నీవు చాల పోకిరివిరా. గుడ్డలన్నిటికిని బురద చేసుకొంటివి. నేనెంత తిప్పలుపడి నీకు నలుగుపెట్టి నీరుపోసితినిరా. క్రొత్త చొక్కా తొడిగితిని. ఒత్తుగ కాటుక పెట్టితిని. వెంట్రుకలను నూనెరాచి దువ్వి చక్కగ తురిమితిని. నీవు నా పరిశ్రమ నంతను మట్టిలో కలిపితివి. అంతయును బేడయును బెల్లమును చేసితివి. అని పలికి తల్లి మిక్కిలి ప్రేమతో పిల్లవాని నెత్తుకొని యింటికివచ్చి మరల స్నానము చేయించి గుడ్డలనుమార్చి కట్టి మిక్కిలి జాగ్రత్తగా పిల్లవాని చేష్టలను జూచుచుకూర్చుండెను. కాని యెంతవరకని యిట్లు కూర్చుండగలదు. ఇంటిపనులను గూడ చూచుకొనవలసియున్నదాయెను. పిల్లవాని కన్నప్రాశన సంస్కారముకూడ జరిగినది. పిల్లవానికి ఆరునెలలు దాటినవి. అన్నప్రాశన దినమునందు తల్లి గొప్పయుత్సవము నొనర్చెను. వ్రజమందలి గోపగోపీజనముల నందరనుపిలిచెను. షడ్రస భోజనములను చేయించి అందరకును తృప్తిగపెట్టి పిల్లవానినోట సమస్తవస్తువులను దాకించి పాయసమును నాకించెను. ఇప్పుడు కృష్ణుడు పాయసమును చప్పరించుటయే కాదు. మెత్తని

పూరీ మొదలగు పిండివంటలను భ్రమింగుచుండెను. కూరను నోటబెట్టిన నుమియును మీాగడను బెట్టిన చప్పరించును. వెన్న ముద్దలను దీసికొని నోట కూరుకొనును. నేలమీాద వెన్నవైచి రుద్దును. తల్లి యిప్పుడు పిల్లవానికొరకు వివిధరకములగు వస్తువులను తానేచేయును. తల్లి కనుమరిగిన జారిజారి గోష్ఠము లోనికిబోయి గోమూత్రమందును, గోమయము నందును రొచ్చులో బొరలాడును.

సూతుఁడిటులనెను :– "మునులారా! ఈవిధముగ భగవానుడు ప్రాకృతబాలకునివలె లీలలొనర్చుచు నందయశోదలకును, అన్యగోపగోపిజనము నానందింపజేయుచుండెను.



# పంకాంగరాగానులిప్తులగు

# రామకృష్ణులు

( ౧౭౭ )

శ్లో॥ తన్మాతరౌ నిజసుతౌ ఘృణయా స్నువన్త్యౌ
పంకాంగరాగ రుచిరావుపగుహ్య దోర్భ్యామ్॥

దత్వా స్తనం ప్రపిబతోః స్మ ముఖం నిరీక్ష్య
ముగ్ధస్మితాల్పదశనం యయతుః ప్రమోదమ్॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౮అ. ౨౩ శ్లో

అవ్వల పయ్యెద లంది జవ్వాడుదు
రాల క్రేపుల తోక లలమి పట్టి
విడువనేరక వాని వెనువెంట జరుగుదు
రప్పంకముల దుడుకడరఁ జొత్తు
రెత్తి చన్నిచ్చుచో నిరుదెస పాలిండ్లు
చేతున బుడుకుచు జేపు గలుగ.

తే॥ దూటుదురు గ్రుక్క గ్రుక్కకు దోరమగుచు
నాడుదురు ముద్దుపలుకు లవ్యక్తములుగ
గరము లంఘ్రులు నల్లార్చి కదలుపుదురు
రామకృష్ణులు శైశవరతుల దగిలి॥

శ్రీమదాంధ్రభాగవతము.

అల్లరిచేయు పిల్లలను స్నేహాభరిత హృదయముతోఁ గసరినను, వారి యమాయకత్వమునకు సంతసించి మాటి మాటికి ముఖమును ముద్దుఁ బెట్టుకొన్నను నట్టి తల్లిదండ్రులు

భాగ్యవంతులు, బాలకుల ప్రతిలీలయందును సుఖము కలదు, సరళత్వము కలదు. అమాయకత్వము కలదు. ఆకర్షణము కలదు. బాలకుఁడేది చేసినను సహజస్వభావమునఁ జేయును. వాఁడేది చేసినను దానిలో నొకవిధమగు నద్భుతసుఖము కలదు. ఆతని ప్రతిచేష్టయందును వినోదము కలదు. హృదయముగల తల్లుల హృదయము బాలకుల అల్లరిచే వికసించును. ఏ పిల్లవాఁడెంతటి అల్లరివాఁడుగా నుండునో ఆతఁడా యల్లరిచేఁ దల్లిదండ్రులకు సుఖమును గూర్చును. చంచలత్వమే బాలత్వమునకు శోభ. ఇదియే బాలకుల స్వరూపము.

సూతుఁడిటులనెను:– "మునులారా! బలరామునితోఁ గూడి శ్యామసుందరుఁ డేసుఖమును వ్రజవాసుల కొసంగెనో అది యింకే గొప్ప గొప్ప లోకములందును లభింపదు. ఆ క్రీడలాసమయముననే వ్రజవాసులకు సుఖమును గలిగింపలేదు. ఇప్పటికిని వానిని స్మరించుచుందురు. వారు సుఖులై, ముందును ననంతకాలమువరకా చరిత్రములను స్మరించి సుఖానుభవమును జెందెదరు. శ్రీకృష్ణుని బాలలీలలే వాత్సల్యరసోపాసకులకు జీవనాధారములు. వాత్సల్యభావమునందు భావితులైన భావుకభక్తులు ఆతని స్మరణముచే నిర్భయులై యీ భవసాగరమును నిమిషములోఁ దరించెదరు. అనంతకాలపర్యంతముసుఖము ననుభవించెదరు.

శ్యామబలరాములిప్పుడుగోశాలను గాంచిరి. వారికినిధి దొరకినటులయ్యెను. వారి కెప్పుడవకాశము చిక్కిన వెంటనే పారకాడుచుఁ జేతులు కాళ్ళతో నడుచుచు గోశాలకు వచ్చి, చేతులతోడను గాళ్ళతోడను దూడలవలె నడచుచు గోవుల

పొట్టక్రిందకు దూరును చిన్నదూడలమని పోవుచుందురు. గోవులు వాసనచూచి ఆతఁడు తమ స్వామి యని గ్రహించి ప్రముదితలగును. ఇంటిలోఁ బిల్లవానినిఁ గానక యశోద పశువిడి వచ్చును. గోవుల క్రిందనున్న పిల్లవానినిఁ గాంచి యిటులను:- "ఈకృష్ణుడు మిక్కిలి అల్లరివాఁడమ్మా! బలరాముఁడు మంచివాఁడమ్మా! ఈ కృష్ణుఁడే మిక్కిలి పోఁకిరి. గోవులక్రిందకుఁ బోయి కూర్చుండును. ఆవు తన్నినను గిట్టతోఁ ద్రొక్కినను, కొమ్ముతోఁ బొడిచినను నేమగును ? వీని కిసుమంతైన భయము లేదు. మూర్ఖపు పొట్ల గోవులు. పశువుల కేమి తెలియును వీఁడెవరో ?" అనుచు రొచ్చులోఁ బడిన శ్యాముని దల్లి యెత్తుకొని వాని బుగ్గలమీఁదఁ బ్రేమచపేటములను గొట్టుచు నిటులనెను:- "కృష్ణా! నీవు చాల అల్లరి చేయుచున్నావురా! ఎత్తుకొనినఁ జంకలో నుండవు. వదలి పెట్టితినా యేదో అల్లరి చేయుదువు. నీవు చాల పోఁకిరివిరా! కొంచెము కనుమరగినఁ జాలును. ఇచ్చటికి పరుగెత్తుకొని వచ్చెదవు. నీకు భయము లేదు. పశువులతో నాడుకొందువా? శ్యామసుందరుఁడు తల్లియొక్క యీమాటలను విని అమాయకముగఁ దల్లివైపు చూచుచు నామె బులాకినిఁ బట్టుకొనును. కంఠములోని హారములను లాగ నారంభించును. "అమ్మా! నేను పశుపాలకుఁడను గానా ? గోపాలుని గోవులు గుర్తించును. నేను వానికి గంఠహారమును. నాచేతిలో వారినాథుఁడున్నాఁడు. నేనును వానికి నాథుఁడనే. నీముక్కుకే బులాకి. యెట్లున్నదో అట్లే నేనును వాని ముక్కులకు ముకుదాడును నా సంకేతమున నవి యన్నియును బనులొనర్చునని చెప్పుచున్నట్లుండెను.

తల్లి బాలకుని క్రీడను గాంచి నవ్వి తన స్తనములనున్న పాల నొసంగును. మరల నీళ్ళుపోసి వేరువస్త్రమును ధరింపఁ జేయును. పగలంతయును దల్లులిద్దరును బాలకుల రేఖలను జూచుటతోడనే గడపెదరు. ఒకదినమునఁ దల్లియగు యశోద శ్యామసుందరునకు చక్కఁగ నలుగును బెట్టి, వేడినీటితో నత్యంత శ్రద్ధతో స్నానమును జేయించి, శరీరమును స్వచ్ఛమగు వస్త్రముతోఁ దుడిచెను. ఆ సమయమున శ్యాముని బలిసిన పరమకోమల సుందర శరీరము నవనీతమువలెను, నీలమణివలెను నత్యంత సుందరముగ నుండెను. ఆ స్నిగ్ధ శ్రీయంగమును స్పృశించుటచేతనే తల్లి శరీరమున వాత్సల్యకారణమున రోమాంచమయ్యెను. ఆమె శ్రీకృష్ణుని రూపమాధుర్యమును బానముచేయుచుఁ దనవి తీరకుండెను. అత్యంత సుందరమగు పీతపట్టువస్త్రమును ధరించెను. కన్నులనిండుగఁ గాటుకను బెట్టెను. తిలకమును గస్తూరితో ఫాలమున నలంకరించెను. నల్లనల్లగా నుండు కృష్ణుని అలినీలాలకములను దువ్వెనతో నున్నగ దువ్వి, జడవైచి అందముగఁ జేసెను. అంత నాతని శోభను గాంచసాగెను. తల్లియొక్క మనస్సు నిండలేదు. ఆతనిఁ గను పాపలలోఁ బెట్టుకొనవలయుననియు, హృదయ కోశమున దాఁచుకొనవలయుననియు, నామె కోరిక.

ఇప్పుడిఁక కృష్ణుఁడు తల్లివడిలో నుండజాలకుండెను. శృంగార మైపోయినది. కడుపునిండఁ బాలు ద్రాగినాఁడు. ఇప్పుడిఁకఁ దల్లిచంకలో నేమిపని ? స్వార్థపరుఁడు వానికి స్వార్థము లభింపకుండినఁ జూచుచుండినను బలుకరింపఁడు. తనకుఁ బ్రయోజనముండినచో బలవంతముగఁ జంక కెక్కును. పిల్లవాఁడాటలకుఁ బోవఁ జూచుచున్నాఁడని తెలిసికొని తల్లి

కృష్ణుని భూమిపై వదలెను. ఇప్పుడాతఁడు చేతులబలమునను మోకాళ్ళ బలమునను బరువిడ నారంభించెను. అటునిటు నంగణమునఁ దిరుగఁదొడఁగెను. తల్లి చొక్కాను మడిచి వెనుక వైపున నొక ముడివైచెను. అట్లు కట్టుట వస్త్రము మాసిపోకుండ నుండవలయుననియు, అంగణములోని ధూళి తగులకుండ నుండవలయుననియు నామె యుద్దేశ్యము. కాని ఆతడు ధూళినే తన సర్వస్వముగ తలచుచుండెను. మిక్కిలి ఆనందముతో ధూళిలో నాడదొడంగెను. ఇంతలోనే ఒక గోపిక యేదో పని మీద నచటికి వచ్చెను. తల్లి ఆమెతో మాటలాడుచుండెను. ఏదియో వస్తువు నొసంగుటకు లోపలకు పోగా పిల్లవాడు ద్వారమును దాటి కొట్టములోనికి పరువిడెను. అచ్చట గోమూత్రపు గుంటయుండెను. దానినిండ రొచ్చు ఉండెను. దానినే ఆతడు క్షీరసాగరమనుకొని వెంటనే దానిలోనికి దిగెను. దానిలో నటునిటు పొరలసాగెను. ఆపావనపంకమందు విహారమునరించుటకు విహారికి మిక్కిలి ఆనందము కలుగుచుండెను. పట్టువస్త్రములు బురదలో తడిసిపోయెను. శరీరమంతయును బురదలో తడిసెను. ఆతడు రెండు చేతులతోడను బురదను టపటప కొట్టుచుండెను. చిన్నచిన్న దంతములను బయట బెట్టుచు నవ్వుచుండెను. బురదలో చేతులనుబాదుటచే చిన్నచిన్న బురదచుక్కలు బుగ్గలమీద పడుచుండెను. అవి చంద్రబింబముపైన నీలమణిచూర్ణము చల్లినట్లుండెను. ఇంతలోనే తల్లి లోపలనుండి బయటకు వచ్చెను. ఆమెశరీరము లోనికి బోయినది కాని మనస్సు మాత్రము నిరంతర మచ్చటనే యుండెను. రాగానే ఆమె అంగణమున నలువైపులను జూచెను. కాని కృష్ణునిజాడ చిక్కలేదు. పోకిరివాడు కను

మొరిగి గోపమునకు బోయియుండునని ఆమె గ్రహించెను. ఆమె పరువెత్తుకొని ఆదుర్దాతో వచ్చిచూడగా పిల్లవాడు బురదలో పొరలాడు చుండెను. పైగా నవ్వుచుండెను. తల్లి దీనిని జూచి ఆమె తన నవ్వు నాపుకొనజాలకపోయెను. కపట కోపముతో నిటులనెను :- "కృష్ణా! నీవు చాల అల్లరివాడ వయినావురా! నేను నీకెంతటి ప్రేమతో స్నానమును జేయించి తివిరా! మరల శరీరమునంతను బురదలో స్నానము చేయించి తివా? నీవింతకు పూర్వజన్మమున పంది వైతివని తోచుచున్న దిరా! అందువలననే నీకీ బురదలో పొరలాడు నలవాటు పోలేదు.

తల్లి పందియనుటను విని శ్యామసుందరుడు చకిత దృష్టులతో తల్లి వైపు చూడసాగెను. తల్లి బురదలోపడిన కృష్ణుని లేవనెత్తెను. తనపైటకొంగుతో ముఖమును తుడిచెను. మరలబోయి వస్త్రమును మార్చి శరీరమునందలి బురదను కడిగి, పాలనిచ్చి నిద్రబుచ్చెను. వేదములనేక విధముల వివిధో పమానములతో స్తుతియొనర్చుచుండునో, తల్లి ఆతని పందిఅని పిలుచుచున్నది. ఈతిట్టుతో నాతడానందిచునట్లు వేదస్తుతులతో నానందింపడు.

ఒక దినమున నాతడు గోవులు నీరుత్రాగు గాబులో దిగి గోవులుత్రాగిన నెంగిలినీటిలో ప్రవేశించి వానిని చిందింప చేయుచుండెను. తల్లి తన పిల్లవాని చేష్టలనుగాంచి యిటు లనెను :- "కృష్ణా! నీవు పూర్వజన్మమున తాబేలువై యుందువు. లేదా, చేపవై యుందువు. అందుకనియే నీకు జలవిహారమింత ప్రియముగ నున్నది. గుడ్డలనన్నిటిని తడుపు

కొంటివి. పద, యిక నిప్పుడు నిన్ను కట్టివైచెదను." అని పలికి తల్లి పిల్లవానిని గొనిపోయెను.

ఒకదినమున నాతడు నోటినిండ దుమ్మును బూసికొని పారకాడుచు పరువిడుచుండెను. తల్లి పోయి పట్టుకొనగానే తల్లి వైపు ఖుఖ్ఖుఖ్ఖుమనుచుండి చూచుచుండెను. తల్లి యిటు లనెను :— "నీవు సింహమువలె నురుకుచుందువు. నీవు తప్పక పూర్వజన్మమున సింహమవై యుందువురా!" ఎన్నడైన గోపి కలవద్ద నేవస్తువైనను కనపడినచో నది కావలయుననును. అప్పుడు తల్లి యిటులనును :— "అయ్యో! నాయనా! ఇప్పటి నుండియే నీవు బిచ్చమెత్తుకొనుచుంటివటరా! ఆ భీర గోపకు లెచ్చటనైన బిచ్చమెత్తుకొందురటరా! నీవు తప్పక యేజన్మ లోనయినను వామనుడవై యుందువు. ఒకదినమున తల్లి కూర తరుగుటకు కత్తిపీటను దగ్గరగా బెట్టెను. దానిని దీసికొని ఆతడు దుంపలను గోయుచుండెను. అప్పుడు తల్లి ఇటులనెను — "ఓరీ! కృష్ణా! కృష్ణా! ఏమి చేయుచున్నావురా? ఇప్పటి నుండియే కోయుటను కొట్టుటను నేర్చుకొనుచున్నావా? నీవు పూర్వజన్మమున నిర్దయుడై కోయు బ్రాహ్మణుడవని తోచు చున్నది. ఒకొ్కక్కప్పుడు గోపకుల బాణములను దీసికొని విసరును. వానిని నోటపెట్టుకొనును. వానిమీద చేయివేసి నిమురును. అప్పుడు తల్లి యిటులనును :— "నీవు నేర్వక పూర్వమే బాణములను విసరుచున్నావు. నీవు పూర్వ జన్మమున తప్పక వేటయందపేక్షగల క్షత్రియుడవై ఉందువు. ఈవిధముగా పిల్లవాడేదిచేసిన తల్లి దానిపై నేదోయూహించి పలుకుచుండును. కృష్ణుడిప్పుడు కొంచెము మాటలాడ నేర్చెను.

ఏవస్తువు దొరికిన నావస్తువును నోటిలోనికి పెట్టుకొనును. తల్లి యిటులనును :- " నీవు సర్వభక్షకుడవురా! నీపొట్టలో నేము న్నవో కాని ధనుర్బాణములును, రాళ్ళు, కత్తిపీట మొదలగు వస్తువులను గూడ తినివేసెదవా యేమి? నీచేతికేది యందిన దానిని నోటిలో పెట్టుకొను చుంటి వాయెను. "

సూతుం డిట్లనెను:- "మునులారా! ఈవిధముగ మోకాళ్ళపై బారకాడుచు తలులకు సుఖము నొసగూర్చుచు కృష్ణబలరాములు కొన్నిదినములువ్రజమందు విహారమొనర్చుచుండిరి. ఇప్పుడు వారు కాళ్ళతో నడుచుటకు ప్రయత్న మొనర్చు చుండిరి.

# గోవత్సవిహారలగురావహశ్యాము ౹౹౹

( ౨౬౯ )

శ్లో॥ యర్హ్యంగనా దర్శనీయకుమారలీలా
వంతర్వ్రజే తదబలాః ప్రగృహీత పుచ్ఛైః
వత్సైరితస్తత ఉభావనుకృష్యమాణౌ
ప్రేక్షన్త్య ఉజ్ఝితగృహా జహృషు ర్హసన్త్యః॥
(శ్రీ భాగ. ౧౦ స్కం. ౮అ, ౨౪శ్లో

కం. ఆ పాపల విహరణములు
దీపులు పుట్టింప మరగి తేకువ లేకా
గోపాల సతులు మక్కువ
నే పనులును మఱచియుండి రీక్షణపరలై॥
(శ్రీమదాంధ్రభాగవతము.

బాలకు లేజాతివారై యుందురో సాధారణముగ బాలకు లాయాటల నాడుచుందురు. తల్లి దండ్రు లేమియును దెలియని బాలకులను గాంచి ఉచితానుచితములను బలుకు చుందురు. వారిట్లనుకొందురు. "పిల్లలకు తెలియదనుట భ్రమ. పిల్లల కంతయును దెలియును. తల్లిదండ్రులేమి చేయుదురో వాని సంస్కారములు చలనచిత్రములవలె హృదయపటలమం దంకితము లగును. ఆతడు మాట్లాడుట ప్రారంభింపగనే ఆభావముల నన్నిటిని దెలియకయే వ్యక్త మొనర్చును. పెద్ద వారైన తరువాత దాని యర్థమును దెలిసికొందురు. గోవులలో జినచిన్న దూడలాడుటను జూచుచుందుము. ఏమి యును దెలియని బాలబాలికలు కలిసి ఆడు కొందురు.

మట్టితోఁ బొలము నేర్పాటు చేయుదురు. ఇసుకతో నిండను గట్టెదరు. పొయ్యి, అరుగు, పాత్రలు మొదలగు వస్తువుల నన్నిటిని పచ్చిమట్టితో జేయుదురు. ఎద్దులను, ఒంటెలను గుఱ్ఱములను నట్టి మెత్తని మట్టితోడనే చేయుదురు. ఒక ఆడుపిల్ల పైటను వైచుకొని యిల్లాలగును. ఇసుకనుబోసి అన్నమును వండును. ఒక బాలకుఁడింటి యజమాని అగును. పొలము నుండి నాఁగలి తీసుకొని వచ్చును. ఇంటిలో నన్నము తయారుకాక పోవునప్పటికి, అన్నమెందులకు కాలే దని గృహిణి మీఁదఁ గోపపడును. అందువలన నామెను గొట్టును. ఈవిషయములను వారింటిలోనే నేర్చుకొనిరి. ఇంక నెచ్చటను నేర్చుకొనలేదు. గృహిణి యగునది తనచెల్లెలు కావచ్చును. బాలకులకు గృహిణి యననేమో వారికేమి తెలియును. వారేది చూచినారో దానినే వారు చేయుదురు. అచ్చట నున్నదియే చిత్రములోఁ బడును. వ్యాపారస్థుల పిల్లలు దుకాణములాట నాడెదరు. క్షత్రియుల పిల్లలు రాజు లాడునాట నాడుదురు. గోపబాలురు గోవులయాట నాడె దరు. ఎదుట నేది యుండిన నట్టియాట నాడెదరు. ఈప్రపంచ మును నొక క్రీడారంగమే. జ్ఞానులు నిచ్చట నాడెదరు. స్వయ ముగ భగవానుఁడును బాలకుడై యిచ్చట నాడును.

సూతుఁ డిట్లనెనుః— "మునులారా ! శ్రీకృష్ణుని బాల లీల అతి మధురముగను అనురాగ రంజితముగను నుండును. దీని నెవరు వర్ణింప గలరు. శ్రీకృష్ణుఁడు పారకాడుచు వివిధ విధములగు లీలల నొనర్చుచు వ్రజవాసులఁ బరమా నందితుల నొనర్చుచుండెను. ఇప్పుడు తల్లి శ్రీకృష్ణుని నేళ్ళను బట్టుకొని కాళ్ళబలమున నడుచుటను నేర్పుచుండెను.

కాళ్ళకు గట్టఁబడిన గజ్జెలు గలగల శబ్దము నొనర్చుచుండెను తల్లి వానిచేతినిఁ బట్టుకొని యిట్లనును:— "చూడుడు. ఇప్పుడు మా అబ్బాయి నడచుచున్నాడు. పాఁపాఁ పైయాఁ – పాఁపాఁ పైయాఁ పరుగెత్తు పరుగెత్తు బాలగోపాలా – పాపలతో నీవు పాదెమెయ్యాలి. కృష్ణా, కృష్ణా, కృష్ణా, కృష్ణా అని యిట్లు పలుకుచు నిదరను నడిపించుచుండెను. బలరాముఁడు పెదవాఁడగుటచే వ్రేలిసహాయమునసే నడుచుచుండెను. ముందుపోవుచుండెను. ఈతఁడు చిన్నవాఁడు. చిన్నవాఁడు ముందెల్లు నడువగలఁడు. పెద్దవానిని ముందు పోనీయఁడు. అందువలన శ్యాముఁడేడ్వనారంభించెను. వెంటనే తల్లి చంకకెత్తుకొని ఘనశ్యాముని ముందు గొనిపోయి, చప్పట్లుకొట్టి, యిటులనెను:— "కృష్ణప్ప ముందుపోయినాఁడే, మాకృష్ణప్ప ముందుపోయినాఁడే." అప్పుడాతఁడానందించెడి వాఁడు. నాలుగడుగులు వైచి, యాగి చదికిలపడును. "ఓరీ ! చీమలు వచ్చినవిరా" యని తల్లి యనును. అప్పుడాతఁడేడ్చుటను మరచిపోయి తల్లి నిట్లు ప్రశ్నించును. "అమ్మా ! ఎక్కడ చీమలు వచ్చినది." మరలఁ దల్లి చంకకెత్తుకొనును. ఇప్పుడాతనికి వెళ్ళుటలో మిక్కిలి యానందము. గోపిక యెవతెయును వ్రేలినందింపకున్నచో నాతఁడు గోడను బట్టుకొని నిలుచుండును. అప్పుడు తల్లి మోదమును జెంది యిటులనును:— "ఓరీ ! కృష్ణప్ప నిలుచున్నాఁడు. ఇఁక నడువుము. నన్నుఁదాకుము."

అప్పుడాతఁడు తల్లినిఁదాక బరువిడును. మధ్యలోనే ఊఁగి పడిపోవును. అప్పుడు తల్లి పరుగెత్తుకొని పోయి చంకకెత్తుకొనును. ముఖమును ముద్దిడుకొని యిటులనును:— "కడుపునిండ పాలను ద్రాగుము. అప్పుడు నీవు త్వరగ

నడువగలవు." ఆతడిటులనును:- "అమ్మా! చాల పాలు త్రాగెదను." అప్పుడు తల్లి పటికబెల్లము పోడివేసిన పాల నొసంగును. ఆతడు మరల నూగుచునూగుచు పోవును. గోపికలు చప్పట్లు చరచెదరు.

అరుణోదయ సమయమున తల్లి ఆతని శయ్యమీదనే వదలి చల్ల చేయును. కన్నులు తెరువగానే ఆతడు శయ్యమీద తల్లిని వెదుకును. దధిమంథన ఘుఱ్ఱుఘుఱ్ఱను శబ్దమును విని తనకు తానే పక్కను పట్టుకొని మంచమును దిగి, వెనుకకుండా వచ్చి తల్లిని గౌగలించుకొని "నాకాకలి యగుచున్నదమ్మా" యని యేడ్చుట కారంభించును.

తల్లి యిటులనును:- "ఓరీ! ముఖమును గడుగుకో. ఇంకను బ్రొద్దుపొడువలేదు. పొడువనిమ్ము." కాని ఆతని కెన్నడును రాత్రియే లేదు. చీకటిలేనే లేదు. నిత్యప్రకాశమే. కలదు. ముఖమును గడుగుకొనుట కాడశుచి అయితేగా? నిత్యశుచిక బాహ్యశౌచముయొక్క ఆవశ్యకత యేమి కలదు? ఆతడు మారాము చేయును. తల్లి చిన్న వెన్నముద్ద నొకదానిని తీసి చేతిలో పెట్టును. చప్పున దానిని నోటిలో వైచుకొని మరల నడుగును. తల్లి ఉట్టినుండి ఒక్క పూరీని దీసి దాని మీద గట్టిగ వెన్నను రాయును. ఆపైన గొంచెముగ నుప్పును కారమును జల్లును. శ్యామసుందరుడు చిన్న చిన్న దంతములతో బూరీని కొరికి కొరికి తినును. తిని మరల దల్లి చంకలోనే నిద్రపోవును. చలను చేసి యశోద లేచును. శౌచాదులు కావింపజేసి మరల పాపా పయ్యా యను పాటలతో నడిపించును. ఇప్పుడాతడెవరి సహాయమును లేకయే బలరామునితో

గూడి గోష్ఠములోనికి బోవును. అచ్చట నావుదూడలతో నాడుకొనును.

ఒకదినమున బలరాముఁ డొకదూడ తోఁకను బట్టుకొనెను. పిల్లలస్వభావ మేమనఁగా నొకఁ డేపనిని చేసిన వారును నట్టిపనినే చేయుచుందురు. బలరాముఁడు తోకను బట్టుకొనఁగానే నేనును నాతనికేల దీసిపోవలయునని శ్యామసుందరుడును నొకదూడతోకనుబట్టుకొనెను. ఆ దూడ శ్యాము నివలెఁ బోకిరిది. తోకనుబట్టుకొనగానే అది అల్లన నొక గంతువైచి యెగిరి అది అటునిటుఁ బరువిడసాగెను. శ్యాముఁ డసహాయకుడు. భయపడెను. గట్టిగాఁ దోకను బట్టుకొనెను. ఇప్పుడది యీతనిఁ దీసికొని అటునిటుఁ బరువిడుచుండెను. ఈతడుఁ కోఁతి పిల్లవలెఁ దోకకు గరుచుకొనెను. గోపికలు దీనినిఁగాంచి గుంపులు గుంపులుగఁ బోవై, చప్పట్లను గొట్టుచు నవ్వసాగిరి. ఇంతలోనే రోహిణివచ్చెను. ఆమె వెంటనే శ్యాము నెత్తుకొని యిటులనెను;- "అయ్యయ్యో! కృష్ణప్ప! నీవు చాల అల్లరివాఁడవైనావురా! ఆవుదూడ తోకఁను బట్టుకొని వ్రేలాడుటయా?" ఆతఁడు కిలకిల నవ్వెను. బలరామునితో నిటులనెను;- "అన్నా! నీవు కూడ నీ దూడను తోలుము. బలరాముఁడు తోలినది ధమ్మని క్రిందఁ బడిపోయెను. బలరాముఁడేడ్వఁ దొడఁగెను. శ్యాముఁడు తల్లి చంకలోనుండి నవ్వసాగెను. వెంటనే యశోద పరుగెత్తుకొని వచ్చి బలరాముని దీసికొని, శరీరమును దుడిచి యిట్లనెను:- "బలరామా! నీవీ కృష్ణప్ప! మాటలను వినఁబోకుము. వీఁడు మిక్కిలి ధూర్తుఁడు నీకు దెబ్బతగిలినది. నేనుకృష్ణప్పను గొట్టెదనులే" అని పలికి తల్లి ఒకచేతిని శరీరము పైనుంచి రెండవ

చేతితో దనచేతిమీఁదనే టప్పని కొట్టెను. దీనినిగాంచి బలరాముఁడు నవ్వఁదొడగెను. తల్లి యిట్లనెను:– "మాబలరాముఁడు రాచబిడ్డఁడు, కృష్ణప్పరాజు కాఁడు." ఇది విని శ్యామసుందరుఁడు రోహిణీదేవి చంకలోనుండియే 'నేనును లాజునే' అనెను.

రోహిణి యిట్లనెను:– అవును నాన్నా! నీవును రాజువేరా" శ్యామసుందరున కిప్పుడు దూడతోకను బట్టుకొని వ్రేలాడుట ఒక గొప్ప ఆటయ్యెను. గోష్ఠములోని కెప్పుడు వచ్చినను ఆవుదూడతోకలను బట్టుకొని వ్రేలాడు చుండును. ఒకొక్కప్పుడు చాల ఆవుదూడల తోకల నొక్కసారిగ బట్టుకొనును. వానిలో బలముగల దూడయుండినచో నది తోకను జారదీసుకొని పారిపోవును. ఒకతోక తగిపోగానే చేయి వదులై పోవును. అప్పుడు శ్యామసుందరుఁడు బురదలో పడి యేడ్వనారంభించును. గోపకులు వచ్చి లేవదీయుదురు. గోపికలు చూడుడు తుఱ్ఱుమని పిట్ట ఎగిరిపోయిన దందురు.

శ్యామసుందరుడేడ్చుటను మరచి పిట్టను గాంచును. అప్పుడు గోపిక లెత్తుకొని వానినింటికి గొనివచ్చిరి.

కొన్ని గోవులను యశోద స్వయముగఁ బాలను పిదుకును. పద్మగంధా, శ్యామయను గోవులను ప్రత్యేకముగ పిదికి ఆపాలను యశోద కాచును. ఈ వెన్నచే మాకృష్ణప్ప బలువవలెననుకొనును. యశోద పాలను పిదుకునపుడు రామశ్యాములును చేతిలోఁ జిన్నచిన్న లోటాలను దీసికొని పోయి యిటులందురు :– "అమ్మా! మాకును పాలను పిదుకుము." యశోద వారి చిన్నలోటాలను గోవుల పాలధారలచే నింపి

యిచ్చును. ఆపాలనుదెచ్చి స్వయముగ కాచెదరు. కొంచెము కాగఁగనే వెంటనే త్రాగివేయుదురు. ఒకొక్కప్పుడు తమ చిన్న లోటాలను గొనిపోయి దూడలను పిండెదరు. దూడలు తన్నును. పారిపోయి యిట్లడుగుచుందురు :— "అమ్మా! మమ్మేల నివి పాలు పితుకనీయ వేమిటి? నీవిన్ని పిండుచున్నావు."

తల్లి యిటులనును :— "నాయనా! దూడలు పాలీయవు. ఆవులె పాలనొసంగును."

శ్యాముఁ డిట్లడుగును :— "అమ్మా! దూడలు పాలెందుల కీయవు?"

తల్లి యిట్లనును :— "ఆవు, దూడలకు తల్లి. నీవు నా పాలనెటు త్రాగుచున్నానో అట్లేదూడలు వాని తల్లుల పాలను ద్రాగును. అవి త్రాగునవియే. ఇచ్చునవి గోవులే."

ఒకొక్కప్పుడు కృష్ణుడు దూడలజంట నేర్పరచి ఒక కఱ్ఱకు త్రాటినిగట్టి దాని నరకగ వానిమెడకు గట్టి వానిని తోలుచు గూర్చుండును. తోలుచు నిటులనును :— "తోలగండీ, తోలగండీ, బండి వస్తున్నది, బండి వస్తున్నది."

ఒకొక్కప్పుడు దూడల భుజములమీద చేతులను వేసి వ్రేలాడును. ఇంకొక్కప్పుడొక దూడపై నెక్కును. దూడలెగురుటయు, పరువెత్తుటయును, ప్రారంభించెనా తాను పిల్లికూనవలెఁ గరచుకొనును. మరొకప్పుడు దూడల నటునిటు పరువెత్తించుచు తానుగూడ వానివెనువెంటనే పరువిడును. ఒకొక్కప్పుడు దూడల కింటినుండి రొట్టెలను తెచ్చిపెట్టుచుండును. అవి తినకపోయినచో నాతడు వానిని వానినోళ్ళలో

గ్రుక్కును. ఒక్కొక్కప్పుడు మజ్జిగను వెదురు గొట్టములో పోసి దూడలచే త్రాగించును. దూడలీతని శరీరము మీఁద మజ్జిగను గ్రుక్కును. అప్పుడు అతడు పరుగిడి పోయి యింటివద్ద తల్లిని తుడమార్చుమని కోరును. ఒక్కొక్కప్పుడు చిన్న చిన్న గడ్డిపరకలను దీసి దూడల నోటఁబెట్టును. ఒక్కొక్కప్పుడు బంధించిన దూడలను విప్పివేయును. అప్పుడవి గోవులకడకుఁ బోయి పాలు త్రాగనారంభించును. అంత వాటిని లాగి పాలను ద్రాగనీయఁడు. కాని తల్లి పాలను ద్రాగుచున్న బిడ్డ సరళముగ రాదు. ఆతఁడెంతలాగినను రాదు. అప్పుడేడ్వఁ దొడంగును. గోపకులు వచ్చి దూడలను గట్టివెచి ఒక్కొక్కప్పుడు ఆవుకొమ్ములను బట్టుకొని కదలించెదరు. దూడలతోఁకలను నావుల తోఁకలకు గలిపికట్టుచుందురు. అంత దూడలెగురఁగనే చప్పటను గొట్టి నవ్వుదురు. ఒక్కొక్కప్పుడు అమితలేత పచ్చికను బీకి దూడలకు వేయుదురు. అవి తినవు. ఆవులు నోరును దెరచి అందుకొనిన వాని నోటికందించెదరు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ విధముగ శ్యామ రాములు గోష్ఠమునకుఁ బోయి గోవులతోడను, గోవత్సముల తోడను వివిధ క్రీడ లొనర్చుచుండిరి. వారి యీ బాలలీలల నెవరు ప్రేమపూర్వకముగ స్మరించెదరో వారి యంతఃకరణము శుద్ధము కాఁగలదు. వారికి ప్రభుప్రేమ ప్రాప్తింపఁగలదు."



# బాలవినోదలీలలు

( ౮౭౦ )

శ్లో॥ శృంగ్యగ్నిదంష్ట్ర్యసిజలద్విజకంటకేభ్యః
క్రీడాపరావతి చలౌ స్వసుతౌ నిషేద్ధుమ్ ।
గృహ్యాణి కర్తుమపి యత్ర న తజ్జనన్యౌ
శేకాత ఆపతురలం మనసోఽనవస్థామ్ ॥

(శ్రీ)భాగ. ౧౦స్కం. ౮అ. ౨౫శ్లో॥

వ. ఆ సమయంబున బాలకుల తల్లులు గోరు గోఱ గొమ్ములు గల జంతువులవలన నేమఱక జలదహన కంటకాదుల యెడ మోసపోక బాలసంరక్షణంబు సేయుచు సుల్లంబుల మొల్లంబులైన ప్రేమంబు లభిరామంబులుగా విహరించుచుండి రంత.

(శ్రీ)మదాంధ్రభాగవతము

ప్రపంచమునందు బుట్టిన వారందరును నొకానొక ప్పుడు బాలకులే. మనలను గిశోరుడు, యువకుడు, వృద్ధుడు అనుచుఁ బిలుచుకొనుచున్నామే అందరము నొకనాఁడు బాలకులమై యుంటిమి. మనమిప్పుడు బాలకులవిషయమున నుపేక్షా స్వరమున నిట్లు పలికెదము. "అరే! వీరుపిల్లలురా! ఈ పిల్లలు చాల ఉపద్రవము లొనర్చుచున్నారు. ఇవన్నియును బిల్ల చేష్టలు." కాని ఒకానొకప్పుడు మనమును బిల్లలమైతి మను టను మరచుచుందుము. అప్పుడు మనలను గూడ పెద్దలు కసరియుందురు. అప్పుడు మన చెవులను మెలియబెట్టియుందురు. అప్పుడే మనలను గోడిగాఁ జేసియుందురు. మనమును చీవాట్లను దినియుందుము. మానవుఁడొక్కసారి తన పూర్వచరిత్ర మును స్మరించుకొనినయెడల నాతఁడెవరినీ దోషిగా నెన్నఁడు.

ఏలననఁగా దోషియగుటయును, బోరపడుటయును స్వాభావికము. తెలిసి తెలిసి యెవరును దప్పులు చేయరు. ప్రాణి యేది చేసినను దన బుద్ధితో మంచికొరకే చేయును. దేనియందు మానవునకు మంచి కనఁబడదో దానియందు మానవునకుఁ బ్రవృత్తియుండదు. ఎవని కేకార్యమునందుఁ బ్రవృత్తికలదో వాఁడు దానిలో సుఖమున్నదనియే ప్రవేశించినాఁడని అనుకొనవలయును. పిల్లవాఁడేది చేసినను నాటకొరకే చేయును. మనోవినోదమనుభావనతోఁ జేయును. పెద్దలకిది చెడుగాఁ దోచినఁ దోచనిండు. వారు బాలకులై యీ పరిస్థితిలోనుండి చూచినచో బాలకులు చేసినది యథార్థమని వారికిఁ దెలియఁగలదు. మనమును వారివలె బాలకులమై యుండినచో నట్లే చేయుదుము. తప్పు అనునది తనను వదలియుండదు. ఇతరుల తప్పులెన్నుటయే తప్పు. బాలకుల చేష్టలన్నియును నిస్వార్థముగను, ఛలకపటరహితముగను నుండును. సర్వాంతర్యామియగు భగవంతుఁడే బాలకుఁడై యుండి క్రీడించిన నింక నడుగవలసిన దేముండును?

సూతుఁ డిట్లనెను:– "మునులారా! రామశ్యాములిద్దరిప్పుడు కాళ్ళతో నడచుచున్నారు. పరుగెత్తుచున్నారు. ఆడుచున్నారు. తల్లులతోఁ జిలుకపలుకులను బలుకుచున్నారు. మారాము చేయుచున్నారు. ఇద్దరును బోఁకిరులే. అందులో నీ చిన్నవాఁడుమాత్రము మహాపోకిరి. ఈతఁడు లోపలను బయటను గూడ వక్రుఁడే. ఈతని చూపు, నడక, కూర్చుండుట, నిలుచుండుట, క్రీడలు లీలలు ఇవన్నియును వక్రములే. అన్నియు నద్భుతరహస్యములతో నిండియుండును. వేదమెవని నింతవరకును గనుఁగొనలేదో, ముందు కనుగొనుటలోను సందేహమో! అట్టి వేదమొక్కసారి యీతని రహస్యమును

జెప్పనుంకించి నేతి నేతి (న ఇతి, న ఇతి = ఇది కాదు, ఇది కాదు) అని పలికి మెదలకుండెను.

కృష్ణున కావులనిన మిక్కిలి ప్రేమ. ఆతఁడు గోష్ఠమునకు బోయి ఆవులతో నాడుకొనును. కొమ్ములను బట్టుకొని వ్రేలాడుచుండును. తల్లులు భయపడుచుందురు. వీరల్లరివాండ్రే! యనుకొనుచుందురు. మాటిమాటికిని పోవలదందురు. కాని వీరెవరిమాటలు వినుటను నేర్చుకొనలేదు. దేనినిఁ జేయఁదలఁచుకొనిన దానినిఁ జేయుచుందురు.

వ్రజమందొక పెద్ద ఆఁబోతు కలదు. సాక్షాత్తుగ ధర్మరాజే భగవంతుని శరీరమును స్పృశించుటకై ఆఁబోతయ్యెను. ఆతనికిఁ గలియుగములో నొక్కటియే పాదముండును. కాని నందుని గోష్ఠమున నాలుగుపాదములు చక్కఁగ స్వస్థములుగ నుండెను. భగవంతుఁడు స్వయముగఁ గ్రీడసలుపుచోట ధర్మవికృతి నెవరు సలుపఁగలరు? అందరును నా యాఁబోతు కడకెవరును బోఁజాల రనుకొనుచుండిరి. కాని ఒక దినమున రామశ్యాము లిద్దరును నాడుచు నాడుచు నా మదించిన యాఁబోతు సమీపమునకుఁ జేరుకొనిరి. ఇద్దరును దాని రెండుకొమ్ములను జెరియొకటి పట్టుకొనిరి. అది మెదలక తలను వంచెను. బలరాముఁడు పట్టుకొనియే యుండెను. కాని యీ శ్యాముఁడు పైకి యెక్కక వీఁడువాఁడు కాఁడని. మెల్లమెల్లఁగా దాని శిరస్సుపై గాలును బెట్టి, దాని మూఁపురము మీఁదకుఁ బ్రాకసాగెను. దాని మూఁపురము పెద్దది. ఆతఁడు జారుచులేచుచు దానిపై కెక్కెను. ఇంకఁ గొందరు పిల్లలు నిలుచుండిరి. వారందరును నవ్వుచుండిరి. దూరమునుండి తల్లి చూచి యిట్లనెను:—

"అయ్యో! కృష్ణబలరాములు ఆఁబోతుదగ్గర నాడుచున్నారు" అనుచుఁ దల్లి త్వరగాఁ బరువిడివచ్చెను. రోహిణి ఆమెకంటె ముందే పరువిడెను. పోఁగానే ఆమె శ్యాము నెత్తుకొనెను. యశోద బలరాముని బట్టుకొని ఆఁబోతు భయముచే వెనుకకు బరువిడెను. రెండు చేతులతో బలరాముని రెండు బుగ్గలను వత్తుచు నిటులనెను:— "నీవింత పెద్దవాఁడవయ్యును నీతమ్ముఁడు చేయు నుపద్రవములను నివారించుట నటుంచి నీవును వానితోఁ గలిసినావే! ఆఁబోతాయెను. అది కొమ్ములతోఁ గ్రుమ్మిన నేమి కావలయును?" బలరాముఁడిది విని శ్యాముని వైపు చూచి నవ్వెను. శ్యామసుందరుఁడును దెలియనట్లుండెను. ఇద్దరినిఁ దల్లి లోనికిఁ గొనిపోయెను.

శ్యామసుందరుఁ డెక్కడ నిప్పును వెలిగించిన నచ్చటికిఁ బరువిడును. అగ్నిజ్వాల లనిన వారికి సంతోష మెక్కువ. నందుఁడు చలికాలములోఁ జలిమంటను వైచుకొని, చాలమంది గోపకులతో నగ్నినిఁ గాల్చుకొనుచుండి, ఆమాట లీమాటలను మాట్లాడుకొనుచుండిన వీరానందుని వడిలోనికిఁ బోయి కూర్చుండెదరు. అగ్ని మండినచో వారు దానివైపునకుఁ జేతిని జాచెదరు. అప్పుడు నందుఁడు "కాలునురా! నాయనా! యని నివారింపగాఁ జేతి నీవలకు లాగుకొందురు. తల్లులు వంటఁ జేయుచుండినఁ బరువెత్తుకొని పోయి వడిలోఁ గూర్చుండి పొయ్యిమీఁదకు చేతినిఁ గొనిపోవుదురు. తల్లులు చేతులను బట్టుకొని యిటులందురు:— "కృష్ణా! చేయి కాలును. అగ్నినిఁ దాఁకరు నాయనా!" కాలుచున్న నొక కట్టెను దీసికొని శ్యాముఁడు నవ్వుచు బలరాముని వైపునకుఁ జూపును. అప్పుడు

తల్లి కోపపడును. "నీవిట్టి యుపద్రవముల నొనరించినచో నేను నిన్నింటిలోపలఁ బెట్టి బయట తాళము వేయుదును."

ఆతఁ డిటులనును:- "అమ్మా! నిప్పును దాఁకఁ గూడదా?"

ఒకదినమున నాతడింటినుండి గోష్ఠమునకుఁ బోవుచుండెను. మార్గమున నొక కుక్క కనబడెను. ఇంకేమున్నది. ఆట ప్రారంభమయ్యెను. ఎచ్చటనో ఒక త్రాటిని తెచ్చెను. కుక్కమెడలో దానిని గట్టి మరల దానికొక కళ్లెమువలె నోటిలోనికి వచ్చునటుల చేసెను. బలరాముడు దానితోకను పట్టుకొనెను. శ్యాముడు దానిపై నెక్కెను. ఇంతలో నింకొక కుక్కవచ్చెను. బలరాముడు కృష్ణుని కుక్కను వదలి దానికి కళ్లెమును వేయకయే యెక్కెను. అది బయటకు పరువిడెను. కృష్ణునిది లోపలకు పరువిడెను. కృష్ణుడిటు లనుచుండెను:- "అమ్మా! ఇది నా గుఱ్ఱం. ఇది నా గుఱ్ఱమమ్మా!

తల్లి చూచెను:- "అయ్యో! కృష్ణప్పా! రామరామ నీవు నీచుడవురా? ఓరీ! ఎచ్చటయిన గొల్లలు కుక్కమీద నెక్కెదరటరా?

అప్పుడాతడిట్లనెను:- "అమ్మా! అన్నయ్య గుఱ్ఱం బయటకు పారిపోయింది." ఇది విని యశోద బయటకు పరువిడెను. అచ్చట బలరాము నెత్తుకొని వచ్చుచున్న నందుఁడు కనబడెను.

యశోద యిట్లనెను:- "చూడండి. ఇప్పుడిక నీపిల్లలు చాల ఉపద్రవములు కావించుచున్నారు. నిత్యనూతనోత్పాత

ములను గావించుచున్నారు. మీ చిన్నకొడుకు కుక్కనే గుఱ్ఱముగా జేసికొనినాడు. ”

నవ్వుచు నందుడిట్లనెను :– “ ఏడును కుక్కమీద నెక్కుచున్నాడు. నేను పట్టుకొని తెచ్చినాను. అప్పుడు నందుడు వచ్చి కృష్ణుని గూడ యెత్తుకొనగాఁ గృష్ణుడత్యంతోల్లాసముతో నిటులనెను ;– “ నాయనా! నాయనా! నా గుఱ్ఱం లగెత్తుక పోయింది. ”

వ్రజేంద్రుడిట్లనెను :– “ వత్సా! ఇది గుఱ్ఱముకాదురా! కుక్క. ఇది కాటువేయగలదు. నీవు పెద్దవాడ వయిన తరువాత నప్పుడు నీకొక గుఱ్ఱమును తెచ్చెదనులే. ”

బలరాముడిటులనెను :– “ బాబూ! నాకును నొక్కటి తీసికొని రావలయును. ”

నవ్వుచు నందుడిటులనెను:– సరే, నీకును నొకటి తెచ్చెదనులే. నీవు రాజుకొడుకవు. ”

కృష్ణుడిటులనెను :– “ బాబూ! నేనును లాజునే ”

నందుఁడిట్లనెను :– “ అరే! పోపోరా! నీవేమి రాజువు· నీవు దొంగవు. ”

ఇది విని కృష్ణుడేడ్వ దొడగును. అప్పుడు వెంటనే రోహిణి నందునినుండి వానిని తన చంకలోనికి దీసికొని యిటులనెను :– మా కృష్ణుడు రాజు. పెద్దవాడయిన తరువాత కిరీటమును పెట్టుకొనును. ఛత్రచామరములను పెట్టుకొనును. ”

వెంటనే కృష్ణుడిటులనెను ;– “ ఇంక అమ్మా! గుఱ్ఱం మీద నెక్కుతా ”

డేదో అన్యక్తశక్తి ప్రేరణముచే దానను కొనకయే వెంటనే తన యాసనమునుండి లేచి నిలువఁబడెను. ఆతఁడు రెప్పలార్పుట లేదు. వీరిని దల్లులచంకనుండి తీసుకొని హృదయముతోఁ గౌగలించుకొనవలయుననియు, నేత్రములలో నిలుపుకొనవలయుననియు, నెత్తిపై కెక్కించుకొనవలయుననియు, వీరి చరణముల నంతఃకరణమున దాఁచుకొనవలయుననియు నిట్లనేకవిధములఁ దర్కమొనర్చుచుండెను. కాని చేయి ముందునకు సాగుటలేదు. ఇంతలోనే శ్యామగౌరవర్ణములతోనుండిన బాలకులను దల్లులు తెచ్చి మునిచరణముల మీఁదఁ బడవైచిరి. గర్గుని పాదముల మీఁదనున్న శిశువులు, వికసించిన గౌర, నీలకమలములను దల్లులిద్దరిచే నర్పింపబడినట్లుండెను. శ్యాముఁడు గుప్పిళ్ళు పట్టుకొని, తల నిటుఁద్రిప్పుచుఁ జేతుల నాడించుచు నీక నిన్ను మాయ స్పృశింపదని చెప్పుచున్నట్లుండెను. బాలురిద్దరును మూర్తీభవించిన సౌందర్యమాధుర్యములవలెను, ఆనందోల్లాసములవలెను, సచ్చిదానంద, ఆనందఘనవిగ్రహములవలెను, మూర్తీభవించిన భాగ్యమువలెను మునివరునకుఁ గనఁబడెను.

ఆతఁడు పిల్లలిద్దరి శిరస్సులపైఁ జేతులనుంచి యిట్లనెను. "స్వస్త్యస్తు, కల్యాణమస్తు" వారు కల్యాణస్వరూపులే కదా! తల్లులును ముని చరణములందు శిరస్సులనుంచిఁ ప్రణామమును గావించ ముని ఆశీర్వదించెను. పిల్లల నిద్దరను దల్లులెత్తుకొనిరి.

వ్రజరాజు యశోదతో నిట్లనెను:- "గర్గాచార్యులవారు గొప్ప జ్యోతిష్కులు. ఈతనికి భూతభవిష్యద్వర్తమానములు తెలియును." యశోద యిట్లనుకొనెను:- "చూతమితఁడెంతటి త్రికాలజ్ఞుఁడో." ఆమె గౌరబాలకునిఁ దాను దీసికొని శ్యాముని

ఇప్పుడు తల్లులు పిల్లలను సాధ్యమైనంతవరకు బయటకు పోకుండ నాపుచుండిరి. వీరొంటరిగ వెడలకుండు నట్లేర్పాటు జేయుచుండిరి. ఒకదినమున రోహిణి నారాయణుని నివేదన మునకు వంటను జేయుచుండెను. యశోద యింటిలోనే కూర్చుండి రామకృష్ణుల కన్నమును పెట్టుచుండెను. ఆసమయ మున రోహిణి యిట్లు కేక వేసెను :_ "యశోదా కొంచెము జీలకఱ్ఱ యిచ్చిపోవలయును. నేడు నేను జీలకఱ్ఱను తెచ్చుకొను టను మరచితిని." ఇదివిని యశోద వెంటనే లేచెను. ఈపిల్లలు మిక్కిలి అల్లరివారని ఆమెకు తెలియును. వీరటునిటు జారి పోవుదురు. అందువలన బయట గొళ్ళెమును వేసి ఆమె జీలకఱ్ఱ కొరకు పోయెను.

ఇప్పుడింకేమున్నది. వీరింటిలో నటునిటు నాడుకొను వస్తువులను వెదకుచుండిరి. నిన్నటి దినము దసరా యగుటచే నందుడు శస్త్రపూజనమును గావించి వానినట్లే వ్రేలాడ గట్టెను. రామకృష్ణులిద్దరు నున్నచోటునకు సమీపముననే శస్త్రాగారము కలదు. దానిలోఁ జాలగ ధనుర్బాణము లుంచ బడినవి. ఖడ్గములు వ్రేలాడుచుండెను. అన్నదమ్ములిద్దరును ఆ యింటిలోనికి చేరుకొనిరి. మెరయుచున్న దిసి ఖడ్గములను గాంచి యిద్దరును దానిపై జేతులతో నిమురుచుండిరి. దాని యందు వారి ముఖములను జూచుకొనుచుండిరి. బలరాము డొకదానిని లాగెను. ఒక ధనుస్సు ధడక్కని క్రిందబడెను. తల్లికి మొదటినుండియు ననుమానమే. చప్పుడునువిని యామె పరుగెత్తుకొని వచ్చి పిల్లలుఖడ్గముతో ఆడుటనుగాంచి సం వెత్తుకొనిపోయి యిద్దర నెత్తుకొనెను. నందుడును వచ్చెను. యశోదమ్మ యిటులనెను :_ " మీరీఖడ్గముల నిటే విడిగా

వదలితిరా? వీరిద్దరల్లరి పిల్లలాయెను. చేతులను, కాళ్ళను కోసికొందురో యేమో."

నందుఁడు తన పొరపాటు నంగీకరించుచు నిటులనెను:- "నిన్నటి తొందరలో నేను దాళమును వేయుటను మరచితిని. ఖడ్గములకు వరను దొడగుటను మరచితిని. ఇఁక జాగ్రత్తగ నుండవలయును. నీవు కొంచెము జాగ్రత్తగ నుండుము."

విసుగుఁకొనుచు యశోద యిటులనును:- "ఇంకెట్లు జాగ్రత్తగ నుందును? అక్కయ్య కొంచెము జీలకఱ్ఱనీయు మనఁగా నీయఁబోవునంతలో వీరు శస్త్రాగారమునఁ బ్రవేశించిరి. వీరొక్కచోట నుండరాయెను."

నందుఁ డిటులనెను:- "ఫరవాలేదులే, పిల్లవాండ్రు కాదఁటే. ఇంకను వీరికి మంచి చెడ్డలును, కర్తవ్యాకర్తవ్యవివేకమును లేదు." ఇట్లు పలికి అతఁడిద్దరు పిల్లలను దీసికొని యాడఁ దొడగెను. వంట అయినది. నారాయణునకు నివేదించెను. అంత నందుఁడిద్దరు పిల్లలతో భోజనము నొనర్చెను.

ఒక్కొక్కప్పుడు నందుఁడిద్దరను స్నానము చేయించుటకు యమునానదికిఁ గొనిపోవును. అచ్చట నొకరిమీఁద నొకరు నీళ్ళు చిందించుకొందురు. మాటిమాటికిని స్నానము చేయుదురు. నందుఁడు కసరి యిటులనెను:- "కృష్ణా! చాలసేపు స్నానము చేయఁగూడదు. జలుబుచేయును నాయనా!" కాని ఆతనికి జలుబు వేడి భయము లేదు. స్నానమనిన నీతనికి మిక్కిలి సంతోషము. తల్లి నీళ్ళుతోడుకొని అచ్చటఁ బెట్టిన వానిని విరజిమ్మును. ఒక్కొక్కప్పుడు మట్టికుండలను గఱ్ఱను దీసికొని కొట్టును. అది పగిలిపోయి దానిలోని నీరంతయును

బోఁగానే, పకపక పొట్టలుబ్బ నవ్వి తల్లికి భయపడి అటునిటు ఁబారిపోవును. ఇదంతయు నాథూర్తుని చేష్టలని తల్లి గ్రహించును. అడిగినఁ దెలియనివానివలె నుండి యిటులనును:— "అమ్మా! ఏకుండే. నేనచ్చటికిఁ బోనే పోలేదే."

ఒకనాఁడు శరత్పూర్ణిమ. వ్రజమందు గొప్పయుత్సవమును జేయుదురు. అనేకపాత్రలలో క్షీరాన్నము చేయఁబడుచుండెను. శరచ్చంద్రుఁడు నేఁడు తన సంపూర్ణకళలతో నుదయించినాఁడు. కృష్ణుఁడు తల్లి ఒడిలోఁ గూర్చుండి యిటులడుగుచుండెను:— "అమ్మా! శరత్తెప్పుడు వచ్చును?" తల్లి "శరత్ రాత్రియందు వచ్చు"ననెను.

ప్రొద్దు క్రుంకఁగానే ఆతడిటులనెను:— "అమ్మా! శరత్తు వచ్చినదా?"

తల్లి యిటులనెను:— "నీవు చూచుట లేదఁటరా, నీ పైనఁ జూడు చంద్రుఁడున్నాఁడే ఆతఁడే శరత్తు."

అమాయకముగ భగవానుఁ డిటులడిగెను:— "ఈ చంద్రుడెవరమ్మా?"

తల్లి యిటులనెను:— "నాయనా! ఇది భగవానుని ఆటవస్తువు."

ఆటవస్తువను పేరును వినఁగానే భగవానుఁ డుత్సహించి యిటులనెను:— "అమ్మా! నేనుగూడ ఆటవస్తువును దీసికొందునా?"

తల్లి వెంటనే రోలు, తిరుగలి, బొంగరము, కొయ్యఏనుగు, గుఱ్ఱము, పళ్ళెము, గిన్నె, జాణలి మొదలైన ననేక

రకములగు నాటవస్తువులను దెచ్చి కృష్ణుని సమ్ముఖమునఁ బడవైచెను. కృష్ణుఁడు వెంటనే ఆ యాటవస్తువుల నన్నిటిని దీసి పారవైచెను. ఆతఁడేడ్చుచు నిటులనెను:- "నేను చందమామ ఆటవస్తువును దీసికొందును."

తల్లి ప్రేమతో నిటులనెను:- "వత్సా! చందమామ భగవంతుని ఆటవస్తువురా!"

ఆతఁ డిటులనెను:- "నేను భగవానునకుఁ దీసివేసినవాఁడనా? నేనును భగవంతుడనే."

తల్లి చెవులమీఁదఁ జేతిని నిముచుచు నిటులనెను:- "అయ్యో! కృష్ణప్పా! అట్టి మాటలను నోటితో ననరాదు నాయనా! చెవులు వాచును." కాని ఆతఁడు హఠము చేయువాఁడు. ఏది పలుకునో దానిని జేసి చూపించును. ఏ సంకల్పమును జేసినను నదివ్యర్థముకాదు. హఠపూర్వకముగఁ గాళ్ళను తన్నుకొనుచు, చేతులను విసరుచు, కన్నుల నీరు గార్చుచుఁ, దల్లి వస్త్రములను లాగుచు నిటులనెను:- "నాకు చందమామనే కావలెను. ఊఁఊఁఊఁ అమ్మా! నాకు చందమామను దీసికొనిరా!"

తల్లి ప్రేమతో నిటులనెను:- "అరే, ఇదెక్కడి వెఱ్ఱి పిల్లవాఁడయ్యా! చంద్రుఁడెచ్చటనైన నాటవస్తువా! చూడు నాయనా! నీకు పెండ్లైన తరువాత పెండ్లాము వచ్చి నీకు రొట్టెను జేసియిచ్చును. చూడు మాయావుదూడెట్లు నల్లగానున్నదో. కృష్ణా నీవు చూడలేదా? నాయన నీ కొరకు పూలు కుట్టిన టోపి నెట్టి దానిని దెచ్చినాఁడో చూడుము. దానినిఁ బెట్టుకొని నీవు రాజువయ్యెదవు. బలరాముని కా

టోపీని నేసీయును. ఏలననగా రాజకుమారుఁడవు నీవే!" ఈ వినయముగ మాటలను జెప్పి తల్లి మరపింపఁదలచెను. కాని యీతఁడు మరిచెడువాఁడా? అతఁడు తన పట్టును వదలలేదు. "నేను చందమామను దీసికొందును. నేను చందమామను దీసికొందును."

గోపికలందరిట్లనిరి:— "యశోదమ్మా! నీ పిల్లవాఁడు చాల హఠము చేయువాఁడమ్మా! వీని నేవిధముగనైనను నిద్రపుచ్చుము."

ఇది విని తల్లి ఒడిలోనికి దీసికొని చిచ్చికొట్టసాగెను. జోలను బాడుచు నిట్లనెను:—"రావేరావే నిద్రమ్మా రేపేనీశిఖ గొరిగిస్తా! కృష్ణునికడకు రావమ్మా — వెన్న మీగడ తిని పోవమ్మా!" అని పాడుచు జిచ్చికొట్టినను. నాతడు నిద్ర పోలేదు. ఆతడు వెక్కి వెక్కి యేడ్చుచు చేతులను కాళ్ళను గొట్టుకొనుచుండెను. ఆసమయమున రోహిణికి ఒక యుక్తి తట్టెను. ఒక పళ్ళెరములో నీటినిబోసి తెచ్చి యిట్లనెను;— "కృష్ణా! రాదా! నేను నీకుఁ జంద్రుని తెచ్చి యిచ్చెదను." అని పలికి తల్లి శ్యామునెత్తుకొనెను. పళ్లెములోఁ జంద్రుని పతిబింబము పడుచుండెను. దానినిఁ జూపించుచు నిట్లనెను:— ' దీనిలోనికి చంద్రుఁడు వచ్చినాడు చూడుము. పట్టుకొనుము.'

దీనినిఁ గాంచి మిక్కిలి యుల్లాసముతోఁ బళ్లెరములోఁ జేయి పెట్టెను. కాని చేతిలోనికి చంద్రుడు రానేలేదు.

అప్పుడు తల్లియిట్లనెను:— "కృష్ణా! నీవు చేతిలోని

కాటవస్తువును బట్టుకొనక యే పోతివి ?" అతడు మాటి మాటికిఁ జేతిని బెట్టెను. చల్లనినీరు తగులుచుండెను.

తల్లి యిట్లనెను:– "నీవు పాలను ద్రాగి దానినిఁ బట్టుకొనుము."

ఇదివిని శ్యాముఁడు తలినద్ద పాలు త్రాగెను. అంత వెంటనే నిద్రించెను. నందుఁడి దరికిని ప్రణామ మొనర్చుటను నేర్పెను. ఏ సాధువు కనబడినను, లేక బ్రాహ్మణుడు కనబడినను "కృష్ణా! వారికి దండమును బెట్టు" మని నందుఁడనును. అప్పుడాతడు రెండుచేతులను జోడించి "నమస్కార మనును."

ఇది విని అందరును నవ్వెదరు. భగవన్మందిరముయొక్క పూజారి కడకు బోయి యిట్లనును:– "పండితులవారూ! పలసాదం" పూజారి వెంటనే ఒక అప్పము నిచ్చును. అందులో సగముతిని మిగిలిన సగమును వానిపై విసరి పరువిడును. పూజారి యిట్లనెను:– "ఓరీ కృష్ణా! నీవు చాల అల్లరినిఁ జేయుచున్నావే! చూడు మిప్పుడు మరల స్నానము చేయవలసి వచ్చినది. బ్రాహ్మణులతో శ్యామసుందరుఁ డనేక లీలలొనర్చును. ఒక బ్రాహ్మణుని గడ నాతడొక అద్భుత క్రీడనొనర్పగా దానికతడు విరాంత పోయెను.

యశోదమ్మ తండ్రిగారికొక వృద్ధ పురోహితుడుండెను. గొప్ప భగవద్భక్తుఁడు. యశోద నాతడు చిన్నప్పుడు పెంచెను. యశోదకు పిల్లవాడు పుట్టినాడనివిని యాతడు కర్రపోటు వేసికొనుచు గోకులమునకు వచ్చెను. గోపకులు వృద్ధ బ్రాహ్మణునకు మిక్కిలి యాదర సత్కారములను గావించిరి. తమ

పుట్టినింటివారి పురోహితుఁడు వచ్చినాడని తెలియగనే ఆమె మిక్కిలి ఆదరముతో నాతని బిలిపించెను. ఇంట క్షేమసమాచారముల నడిగి యిటులనెను:– "బాబుగారు! ఇప్పుడు మీరు వంటను చేసికొనుఁడు."

వృద్ధ బ్రాహ్మణుఁడిటు లనెను;– "అమ్మా! ఇప్పుడేమి వంటను జేసికొందును. నేటికి కొంచెము పాలను త్రాగెదను. రేపటి సంగతి చూచుకొనవచ్చును"

బలవంతముగ యశోద యిటులనెను:– "కాదు! బాబు అదెట్లు? వంట చేసికొని తీరవలయును. చెంబు, గిన్నె మొదలగునవి నేనిచ్చెదను. పాలను పొయ్యిమీద బెట్టి పెట్టెదను. మీరు దానిలో బియ్యమును బోయుడు. పిండిని గలిపియిచ్చెదను. నాల్గుపూరీలు చేసుకొనుడు. తర్వాత నాబాణలిలోనే కూరవేయించుకొనవచ్చును. యశోద మిక్కిలి బలవంతము చేయగా బ్రాహ్మణుడు వంటజేసికొన నంగీకరించెను. ముందు పాయసము తయారయ్యెను. మెత్తనిపూరీ, బంగాళాదుంపల కూర అంతయును దయారయ్యెను. యశోద యమునా జలముతో బిందె నట నుంచియిటులనెను;– 'స్వామీ! ఆలస్యము చేయకుఁడు. చాలప్రొద్దుపోయినని. నారాయణునకు నైవేద్యమును బెట్టుఁడు.'

బ్రాహ్మణుఁడు పాయసమును బళ్లెరమందారపెట్టెను. పూరీల నొక పళ్లెరమందుంచెను. కూరనొకగిన్నెలోనుంచెను. అన్నిటి మీదను దులసీదళముసువైచి కన్నులను మూసుకొని భగవంతుని ధ్యానించుచుండెను. ధ్యానమందాతఁ డిటులను చుండెను:– "ఓ ప్రభూ! రమ్ము, ప్రసాదమును గైకొనుము"

ఇంకేమున్నది. ఆకలినిజెందిన భగవానుడు నందభవనమందే విహరించుచుండెను. తల్లి యింకొకగది లోనికిఁ బోయెను. బ్రాహ్మణుఁడు కన్నులను మూసుకొని ధ్యానించుచుండెను. ఇంతలోనే బాలగోపాలుడు వచ్చిపాయసమునుజుర్రుచుండెను. రెండుచేతుల తోడను జుర్రు జుర్రు మని మెక్కుచుండెను. బ్రాహ్మణుని ధ్యానము భంగమయ్యెను. ఆతఁడెలుకలు వచ్చిన వనుకొనెను. కన్నులను దెరచిచూడఁగా నాలుకాళ్ళ యెలుక కాదుగాని రెండు కాళ్ళ నల్లని పెద్దయెలుక పాయసమును జుర్రుచుండెను. నేత్రములు తెరవగనే పాయసపు చేతుల తోడను, మూతితోడను భగవానుడుపారిపోయెను. ఇంతలోనే యశోదమ్మ వచ్చెను. కృష్ణుడు పాయసపు చేతులతోడను, నోటితోడను వచ్చుటను గాంచి యీ యల్లరివాడేదో చేసి నాడని అంతయును గ్రహించెను. పండితుని వంట నెంగిలి కావించెను. ఆమె కృష్ణుని దండింపఁ బరువిడెను. వెంటనే బ్రాహ్మణుడువచ్చి యశోద చేతులనుబట్టుకొనియిటుల నెను:—
"యశోదా! నీవు పిల్లవానిపై చేయిచేసికొంటివా నన్ను చంపినంత ఒట్టు. వాఁడుపిల్లవాడు. పిల్లలకేమియునుదెలియదు. ఏమియును ఫరవాలేదు నాకంతటి ఆఁకలికూడలేదు. అకాలము కూడా నైనది. రేపు చేసికొందును. కొంచెము పాలను ద్రాగెదను."

అత్యంతబలవంతముగ లజ్జితయై తల్లి యిట్లనెను:—"కాదు బాబు! అట్లుకాదు. నామీఁద ఒట్టు. మీరు వంటఁజేసికొనకున్న నాకు మిక్కిలి దుఃఖము కలుగును. నేనిప్పుడే త్వర త్వరగా నిప్పును రాజవేసెదను. పాలు కాగియే యున్నవి. ప్రక్కన నున్న పొయ్యిమీఁదఁ బాయసమునకుఁ బెట్టుఁడు.

రెండవ పొయ్యి మీఁదఁ బూరీలను జేసికొనుఁడు. కూరను జేసికొనినఁ జేసుకొనుఁడు. లేకున్న మానుఁడు."

బ్రాహ్మణుఁ డిట్లనెను:- "వద్దమ్మా! తల్లీ! నాకాకలి లేదు. నేనిప్పుడు యమునకుఁ గూడ పోవలయును."

తల్లి యిట్లనెను:- "ఆఁకలి లేకున్నను, నాబలవంత మునఁ జేసికొనుఁడు."

బ్రాహ్మణుఁడేమి చేయఁగలఁడు. యశోద బలవంతమును గాదనలేక పోయెను. మరల వంటను జేసికొనెను. ఆ అల్లరి వాఁడు మరల వచ్చునేమోనని తల్లి చూచుచునే యున్నది. శ్యాముఁడిప్పుడుయ్యాలలో నిద్రించెను. తల్లి యిట్లనుకొనెను. "సరే, వీనిని లేపను. ఇంతలోనే బ్రాహ్మణుఁడు భోజనము చేయఁగలఁడు." అందువలన నామె యిట్లనెను:- "బాబూ! ఇప్పుడిఁక నాలస్యమొనర్పకుఁడు" నివేదింపుఁడు. ప్రసాదమును గైకొనుఁడు. చాల అకాలమైనది."

బ్రాహ్మణుఁడు మరలఁదులసిని వైచి గంటను గొట్టి కన్నులను మూసికొనెను. ఇప్పుడు కన్నులను మూసినాఁడే కాని ధ్యానమందు బాలగోపాలుఁడే రాసాగెను. ఇంతలోనే ఇంటిలోనికి కుక్క వచ్చెను. తల్లి కుక్కను గొట్టుటకును తలుపు వేయుటకును పోఁగానే. అల్లరివాఁ డుయ్యాలనుండి లేచి పాయసమును రెండు చేతులతో జుఱ్ఱనారంభించెను. నాలుగు నాలుగు పూరీలను దీసికొని చుట్టబెట్టెను. చప్పుడుకాఁగా బ్రాహ్మణుఁడు కన్నులను దెఱచెను. చూడఁగాఁ గృష్ణుఁడు నైవేద్యము నారగించుచుండెను. చప్పుడు వినఁబడఁగానే తల్లియును బయువిడి వచ్చెను. ఇంకను బూరీలు బుగ్గలోనే

వుండెను. ఇంకను గొంతు దిగలేదు. చేతి నిండ పాయస ముండెను. తల్లి త్వరగా వచ్చి చేతినిఁ బట్టుకొని, పూరీలతో నిండిన బుగ్గమీఁద నొక్క దెబ్బ కొట్టి యిట్లనెను:. "ఏమిరా తండ్రీ! నీవింత ధూర్తుడ వైనా వేమిరా? బ్రాహ్మణులనైన వదలవా? ఆఁకలిని గొన్న బ్రాహ్మణుఁడు పులికంటె నధిక భయంకరుఁడు. బ్రాహ్మణులు శాపమిచ్చెదరని నీకు తెలి యదు."

ఇంతలోనే బ్రాహ్మణుఁడు వెంటనే తల్లి చేతులనుండి విడిపించి కృష్ణు నెత్తుకొని యిట్లనెను:– "నాయనా! ఏమి యును ఫరవా లేదు. నా భాగ్యమున నేఁడు భోజనము లేదని నేను మొదటనే చెప్పితిని. పిల్లవాని మీఁదఁ జేయి చేసుకొనుట మంచిదికాదు. ఇప్పుడిఁక నన్ను వంటచేసుకొను మని బలవంతము చేయవలదు."

మిక్కిలి లజ్జించుచు నపరాధివలె యశోద యిట్లనెను:– "బాబూ! ఇప్పుడు నేనేమి ముఖము పెట్టుకొని చెప్పుదును? అపరాధ మంతయును నాదే. నేను వదలి యీవలకుఁబోతిని."

బ్రాహ్మణుఁడత్యంత ప్రేమతో నిట్లనెను:– "యశోదా! నీవట్లు మాట్లాడకుము. నీమనస్సును గలతఁ బెట్టుకొనకుము. వృద్ధాప్యము నందాఁకలి యెక్కువగ నుండదు. దీసికొని రమ్మిప్పుడే పాలు త్రాగెదను. ఫలహారముగ నాల్గులడ్డను దీసికొనిరమ్ము."

యశోద దీనతాస్వరమున నిట్లనెను:–"బాబూ! పాల తోడను లడ్డుతోడను నేమగును. మీకేమున్నది? మీరు తినకున్నను నుండఁగలరు. కాని నామనస్సుకు తృప్తి లేదు.

ఇప్పుడు నేనేమరను పొయ్యిమీద బాలున్నవి, దానిలో బియ్యమును బోసి పాయసమును జేసికొనుఁడు."

విసుగుకొని బ్రాహ్మణుఁడిట్లనెను:- "ఓసీ! అమ్మాయీ! నేను ముసలి వాఁడను. ఇంతటి శ్రమను నేను పడఁజాలను",

యశోద బ్రతిమలాడుచునిట్లనెను:- "బాబూ! బాబూ! నేను మీ పాదములను బట్టుకొందును. దానికి శ్రమయే మియు నుండదు. బియ్యమును వైచి కొంచెముగ నేతిని వేయుము. నేయి వైచినచోఁ బాలు పొంగవు. ఒకక్షీరాన్నమునే చేసికొనుము."

ఇప్పుడేమి చేయగలడు. బ్రాహ్మణుడు పొయ్యిమీద నున్న పాలలో బియ్యమును వైచెను. ఇంతలోనే పొయ్యి మండెను. ఇంకొక యింటిలోనికిపోయి యశోద పిండినిగలిపి తెచ్చెను. నాలుగు పూరీలను వత్తి తెచ్చెను. నేతిని వైచి బాణలిని గూడ పొయ్యిమీద పెట్టెను. అప్పుడామె యిట్లనెను. "బాబూ పాయసము తయారైనది. నాలుగు పూరీలను గాల్చు కొనుడు. నా మనస్సునకు తృప్తిగ నుండును.

సామగ్రి యంతయును సిద్ధముగ నుండెను. నేయి కూడ కాగెను. పూరీలు గూడ ఒత్తుఁబడి యుండెను. కేవలము బాణలిలో వేయుటయే తరువాయి. బ్రాహ్మణుడు పూరీలను గూడ దించెను. తల్లి మామిడి వరుగును గూడ తీసికొని వచ్చెను. ఈసారి యామే కృష్ణు నొక యింటిలో బంధించి ద్వారముఁనదానే కూర్చుండెను. బ్రాహ్మణుడు నివేదింపక నెట్లుతినగలడు. మరల నారాయణ స్మరణము కావించెను.

దైవికముగ వంట యింటిలో రోహిణీదేవి వంటచేయు చుండెను. కూరను వేయించుటకు ఆమె కళాయిలో నేతిని పోసెను. నేయి కాగుచుండెను. ఆమె చేతులతో బూరె లను వత్తుచు నాపనిలో నుండెను. అంతలోన నామె అక్కడ నుండియే యిట్లనెను:-

"రాణీ! యశోదా! కొంచెము పరువిడి మెంతి పొడినిఁ దీసికొనిరా తల్లీ"

మెంతిపొడి యేయింటిలో కృష్ణుని బంధించినదో ఆయింటిలోనే కలదు. చప్పున మెంతిపొడిని దీసికొని పరు గున వంటయింటికిఁ బోయెను. తొందరలో నామె తలుపులు వేయుటయును మఱచెను. ఇంకేమున్నది సమయము చిక్కి నది. ఈసారి బ్రాహ్మణుఁడు క్షీరాన్నము త్వరగాఁజల్లార వలయునని పెద్ద పళ్ళెరములో నారఁబోసెను. బ్రాహ్మణుం రుఁడీసారి క్షీరాన్నపు పళ్ళెరమునందే పోయి కూర్చుం డెను. గుడ్డలన్నియుఁ బాయసముతోఁ దడిసి పోయెను. రెండు చేతులతో జుఱ్ఱనారంభించెను.

తల్లి మెంతిపొడిని నేతిలో వైచి కూరను కళాయిలో పడవైచి వచ్చునప్పటికే క్షీరసాగరశయనుఁడు క్షీరాన్న మంతయు విహరించుచుండెను. తల్లి మిక్కిలిగఁ గోపించి, కృష్ణుని రెండుచెవులను బట్టుకొని యిట్లనెను:- "భడవా! నేఁడు నిన్నుఁ గొట్టక విడువను. నీవింతగా నుపద్రవముల నొన ర్చెదవేల?

ఈసారి కృష్ణుఁడిట్లనెను:- "అమ్మా! నాతప్పేమి తల్లీ?"

తల్లి క్రోధముతో నిట్లనెను:- "నీతప్పా కాకున్న నాతప్పా యిదంతయును?"

శ్యామసుందరుఁడిట్లనెను:- "నీతప్పునుగాదు. నాతప్పునుగాదు. తప్పీ బ్రాహ్మణునిది. మాటి మాటికిని వంటజేసికొని, కన్నులను మూసికొని నన్నుఁ బ్రేమతోఁ బిలుచును. ప్రేమతో నన్నెవరు పిలిచిన నవశ్యము నేనచటికి పోవలసినదే"

తల్లి కోపించి యిట్లనెను:- "ఓరి ధూర్తుఁడా! వారు నిన్ను పిలిచారా?"

భగవానుఁడిట్లనెను:- "నేనే యీతని భగవంతుడను"

ఇది వినగానే బ్రాహ్మణుని హృదయావరణము నశించెను. ఆతని దృష్టి దివ్యమైన దయ్యెను. భగవంతుఁడని గుర్తించి ఆతని పాదములమీఁదఁబడి, కృష్ణుని యెంగిలిపాయసమును మిక్కిలి యుల్లాసముతోఁ బ్రేమతోఁ దినసాగెను.

తల్లి అత్యంత చకితయై యిట్లనెను:- "అయ్యో! బాబూ! మీరు చేయునదేమి? పిల్లవాని యెంగిలి పాయసమును దినుచున్నారా?"

బ్రాహ్మణుఁడిట్లనెను:- "యశోదా! సాక్షాత్తుగఁ బరబ్రహ్మ పరమాత్మను బుత్రునిఁగా భావించి నీవు నీ ఒడిలో గూర్చుండఁ బెట్టుకొని బువ్వపెట్టుచున్నావు. కసరుచున్నావు. మూర్ఖుఁడనగు నేనీ ప్రభువును గుర్తింపలేక పోయినాను. అయ్యో! నేనెంతటి యపరాధమొనర్చితిని." అని పలికి బ్రాహ్మణుఁడత్యంత ప్రేమలో నిమగ్నుఁడై రోదనము చేయసాగెను.

ఆకలిచేఁ బ్రాహ్మణుఁడు తికమకయై యిట్టి తలతోఁక

లేని మాటలను గొణుఁగు చున్నాఁడని యశోద తలఁచెను ఇట్లనుకొని ఆమె కృష్ణునెత్తుకొని వెడలిపోయెను. బ్రాహ్మణుఁడును నాదివ్య ప్రసాదమగు పాయసమును గ్రహించి కృతార్థుఁడై మాటిమాటికిని నందుని యంగణమందు బొరలాడి, అచ్చటి ధూళిని మూటఁగట్టుకొని నందనందనుని పాదపద్మములకుఁ బ్రణామమును గావించి తన యింటికి పోయెను.

సూతుఁడిట్లనెను:– "మునులారా! ఇట్టిదిది యొక్కటియే కాదు. ద్విజులతో శ్రీహరి అనేకములగు రసమయ క్రీడల నొనరించెను. ఇట్టిక్రీడలను ద్విజులతో నొనర్చుటయే కాదు. ద్విజకంటకులగు నసురులతోఁగూడ నిట్టి క్రీడలనే యొనర్చుచుండును. ద్విజరూపమున నుత్పన్నులైన నసురుల రొమ్ముమీఁద నెక్కివారిని భయపెట్టి కసరి ఉచితమార్గమునకుఁ దెచ్చినాఁడు. ఒకొక్కప్పుడు శ్యామసుందరుడు పక్షులను బట్టుకొని వానితోఁ గ్రీడించుచుండును, ఇప్పుడా తనికిఁ బండ్లన్నియును వచ్చెను. పాలదంతము లూడుటకును నారంభించినవి.

ఒక దినమున రొట్టెను దినుచుండఁగా నొకపాలదంత మూడిపోయెను. ఆతఁడి ట్లేడ్వనారంభించెను:– "అమ్మా! నా పన్నూడి పోయినదమ్మా! ఇప్పుడేమి చేయుదును. పండ్లు ముసలి వారి కూడును. నేనిప్పుడే ముసలివాఁడినైనానే.

తల్లి యిట్లనెను:– "నాయనా! నీవీ దంతమును బాలలోఁ బెట్టుము. పెద్దయిన మీఁదట మరల నీ నోటిలో మొలుచును. ఇది విని ఆతఁడు దానిని మిక్కిలి శ్రద్ధతో

నొక పిడతలోఁ బాలనుబోసి, వేసి, నాపన్నింకను బెదది కాలేదమ్మా, అనును. తల్లి యిట్లనెను:- "ఓరీ! నీవు ధైర్యమును వహింపుము. కొన్నిదిన ములలో దంతములు మొలచును." ఈ విధముగ నాతని చెప్పుడు పన్నూడినను బాలలో నుంచును. ఆస్థానమున నూతన దంతము మొలిచినచో మిక్కిలి యానందమున గంతులిడుచు నాకు పండ్లు మొలిచిన వని కేకలు వేయును. మరలఁ బాలలోఁ జూచును. తల్లి దానిని మట్టిలోఁ బొదిగి వచ్చి యిట్లనును:-

"ఇప్పుడది నీ నోట మొలిచినది. ఇప్పుడీ పిడతలో నెక్కడిది?"

"కృష్ణా! నీవు ముసలివాఁడవైనావురా" యని గోపిక యెవరైన ననిన నప్పుడాతఁడిట్లనెను:- "నాదంతములు పాలలోఁ బెరుగుచున్నవి." ఈ విధముగ ననేకములగు బాల లీలలొనర్చుచుఁ దల్లిదండ్రులను, వ్రజవాసులను నానందింపఁ జేయుచుండెను.

ఒకొక్కప్పుడు దిసి కాళ్ళతో ముండ్లలోనికిఁబోవును. తుమ్మముండ్లను దెచ్చి, యిసుకలోఁబాతి వానితోఁ బొలము నాటును. తల్లి వచ్చి యిట్లనును:- "అయ్యో! కృష్ణా! చూడుము. నీవిన్ని ముండ్లదెచ్చితివి. ఎవరి కాళ్ళలోనైనను గ్రుచ్చుకొనును. నీ శరీరమునకు గ్రుచ్చుకొనును. నీవింత పెద్దవాఁడవైనను నీకు బుద్ధిరాలేదేమిరా?"

అంత నాతఁడిట్లనును:- "అమ్మా! ఒక్క ముల్లును గూడ వుంచను. యేరివేరి అన్నిటిని దూరముగాఁ బారవేయు దును. నశింపఁ జేయుదును. వ్రజమును నిష్కంటక మొన

రించెదను. తల్లి యాతని అమాయకత్వమునకు నవ్వుకొని ముండ్లన్నిటిని దీసికొని మండుటగ్నిలో వేయును. అతఁడు దుమ్ములో నాడుకొనునప్పుడమ్మ యిట్లనును:— "నీకు దుమ్మనిన నింతటి ప్రీతి యేలనురా? ఎల్లప్పుడును ధూళి లోనే పొరలాడు చుండెదవు."

అప్పుడాతడిట్లనును:— "అమ్మా! ధూళి చాల కోమల ముగ నుండును. చల్లగ బాగుండును. బలరాముఁడును నాడుచుండును. మేమందరమును గలసి యాడుకొందుము. ఈధూళిలో నాడుకొనుటయనిన నాకు మిక్కిలి యానందము కలుగును"

తల్లి కృష్ణుని నోట నిట్టి యమాయకపుమాటలనువిని మిక్కిలి ప్రేమలో నిమగ్నయై మాటిమాటికిని నాతని ముఖమును ముద్దిడుకొనును.

శౌనకుఁడిట్లనెను;— "సూతా! తల్లి బాలకృష్ణుని ముఖమునే మాటిమాటికేల ముద్దిడుకొనును?"

సూతుఁడిట్లనెను:— "స్వామీ! వాత్సల్య రసమునకు ప్రధానస్రోత హృదయమే. దాస్య రసస్థానము పాదములు. సఖ్యరసమునకు ముఖరసాస్వాదనమునకు స్రోత బాహువులు. మధుర రసమునకుఁ బ్రధాన స్థానము హృదయము. ఆయా యంగములను దాకుచునే తమతమ రసముల నాస్వాదించెదరు. వాత్సల్యప్రేమలో మునిఁగి యుండిన తల్లి తనముఖమును బిల్లవాని ముఖమున కానించి వాత్సల్యరసానుభవ మొనరించును. దాసుఁడు తన స్వామి చరణములను దన యంగములతో స్పృశించి దాస్యసుఖరసాస్వాదన మొనరిం

చును. సఖుఁడు తన సఖుని బాహుపాశబద్ధు నొనర్చి సఖ్య రసాను భూతినిఁ బొందును. మధుర రసనాయికా నాయకులు హృదయములతో స్పర్శించి యామధుర రససాగరమున స్నాన మొనర్చెదరు. తల్లి యగు యశోద పరబ్రహ్మను బుత్రునిగాఁ జేసికొనినది. ఆమె హృదయమున నైశ్వర్య గంధ మేమాత్రమును లేదు. ఎవఁడైన లక్షసారులు కృష్ణుఁడు పరమాత్మ యని యననిండు. కాని ఆమె బుద్ధికది నచ్చదు. ఆమె ఆతనిఁ దనపుత్రునిఁగా భావించి వాత్సల్యరసాస్వాద మొనరించినది. మాటిమాటికిని బిల్లవాని ముఖమును ముద్దిడుకొనును.

సూతుఁ డిట్లనెను:– "మునులారా! నేను కొన్ని లీలలను మాత్రము సంగ్రహముగఁ జెప్పితిని. ఇప్పుడు శ్రీకృష్ణుఁడు మృద్భక్షణలీల నెట్లు చేసెనో దాని వర్ణనమును ముందు చేసెదను."



# మృద్భక్షణము

(౮౭౧)

శ్లో॥ ఏకదా క్రీడామానాస్తే రామాద్యా గోపదారకాః
కృష్ణో మృదం భక్షితవానితి మాత్రే న్యవేదయన్॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౮ అ. ౩౨ శ్లో॥

వ. అంత నొకనాఁడు బలభద్రప్రముఖులైన గోపకుమారులు వెన్నుండు మన్ను దినెనని చెప్పిన యశోద బాలుని కేలుపట్టుకొని యిట్లనియె.

శ్రీమదాంధ్రభాగవతము.

పృథివిని గంధవతిగా జెప్పిరి. సమస్త సుగంధములును దుర్గములును పృథివినుండియే యుత్పత్తియగును. ఎక్కడ జలము తియ్యగ నుండునో అచ్చట మట్టియును దియ్యగ నుండును. ఎచ్చట జలముప్పగనుండునో అచ్చటి మట్టియు నుప్పగ నుండును. తీపి మట్టిలో నొకవిధమగు స్వాదుకలదు. అందుకనియే మట్టిపాత్రలో నుంచిన జలముగాని, పాలుగాని, మొదలైనవి కానిండు అద్భుత స్వాదుగా నుండును, మన యీశరీరము మట్టితోడనే చేయబడినది. ఇందులో సగభాగము మట్టియే మిగిలిన సగములో వాయురాకాశశాదులగు నాలుగు భూతములు కలవు. ఇది నిలిచి యుండు మృత్తికాదులచే నుత్పన్నమైన నన్నాదులచేత నేఅగుచున్నది. చివరకు మట్టిలోనే కలిసిపోవును. అనఁగా నాది మధ్యాంతములలో నున్నదీ మట్టియే. మట్టి యింటిని సురక్షిత మొనర్చుటకెట్లు మట్టి చేతనే మెత్తఁబడి అలకఁబడుచున్నదో, అట్లే యీమట్టి

శరీరమును సురక్షితముగ నుంచుటకు మనము తినున దేమి కలదో అదిఅంతయును మట్టియే, మానవుఁడీ సత్యమును మఱచినపుడు భగవానుఁడవ తారమును ధరించి యీసత్యమును లీల ద్వారా ప్రకాశితమొనర్చును.

సూతుఁడిట్లనెను:— మునులారా! ఇప్పుడు శ్రీకృష్ణుడు సఖుల సహవాసముతో నాడుచునాడుచు యమునాతటము వరకు పోయి వివిధములగు నాటలనాడును. ఇంతవరకు నాతడు బలరామునితోఁ గూడి సంకోచమేమియు లేక అన్యగోప కుమారులతో సమముగా నిర్భయుడై ఆడును. ఈతఁడు తన కంటె పెద్దవాడు, ఆతనితో గౌరవము భయభక్తులతో నుండవలయునని యింతవరకు ఆతనికి దోచలేదు. కాని ఒక సంఘటనము జరుగుటచే నాదినమునుండి నాతడు బలరాముని తో నాడ సంకోచించు చుండెను. చేతనైనంత వరకు ఈతనికి దూరముగనుండి క్రీడించుచుండెను."

శౌనకుఁడిట్లడిగెను:— "సూతా! అట్టిది యేఘటనము జరిగినది?"

సూతుఁడిట్లనెను:— "స్వామీ! ఒకదినమున సఖులందరితోడను శ్యామసుందరుడు యమునా తటమునఁ గ్రీడించు చుండెను. వెంట బలరాముఁడును నుండెను. చెర్పట్టీ, చెడుగుడు మొదలగు నాటల నాడు చుండెను. చివరకు శ్రీకృష్ణుడొంటరిగానే యమునానదీ కట్టక్రిందకుఁ బోయెను. యమున యొక్క మెత్తని మట్టిని జూచు నప్పటికి శ్యామసుందరుని మనస్సు దానిమీఁదకుఁ బోయెను. ఆతడుమంచి మట్టిగడ్డను దీసికొని తినుట కారంభించెను."

శౌనకుఁ డిట్లనెను:– "నందునికడ పాలు, పెరుగు వెన్న, మీఁగడలకును మృష్టాన్నమునకును కొదువలేదే. భగవానుఁడు మట్టినేల తినెను?"

అంత సూతుఁడిట్లనెను:– "స్వామీ! భగవంతునిసంగతి భగవంతునికే తెలియవలయును. నా బుద్ధికి మాత్రమిట్లు తోచుచున్నది. భగవంతుఁడిట్లాలోచించి యుండవచ్చును. నాకు పాలు పెరుగనినఁ బ్రియము. ఇవి గోవుల స్తనములనుండి వచ్చును. గోవులు గడ్డిని దినును. దానివలన పాలు వచ్చును. గడ్డి భూమినుండి వచ్చును. ఏభూమినుండి పాలకు జననియగు గడ్డి వచ్చుచున్నదో దానిరుచి యేమో కనుగొనుటకు భగవానుఁడు మృత్తికను దినియుండవచ్చును. లేక దేవతలు తమకు వ్రజరజము కావలయునని ప్రార్థించుచుందురు. భగవానుఁడిట్లనుకొనెను:– "బ్రహ్మాదులును దీనికొరకు ఉవ్విళ్ళూరుచుందురు. దాని రుచి యేమియో కనుగొనవలయును? లేక భగవానుఁడిట్లనుకొని యుండవచ్చును. "జనులు శరీరమును మృత్తికతో శుద్ధము చేసికొందురు. "మృత్తికే హరతు మే పాపం, యన్మయా దుష్కృతం కృతమ్" అను మంత్రమును బఠించుచుందురు. కాని నాకడుపునందు సుకృతదుష్కృతము లన్నియును గలవు. ఈ మృత్తిక పొట్టలోనికి బోయి యేమి ప్రభావమును జూపునో చూడవలయునను బరీక్ష కొఱకీమృత్తికను దినియుండును. లేదా భగవానుడిట్లనుకొని యుండవచ్చును:– "నాకు వెన్నముద్ద లెట్లో మంటిముద్దలు నంతయే. యమునాతటమున నీ ముద్దలను దినెదను." లేక శరీరమునకు లోపలను బయటను మట్టే యున్నది. మనము తినునదియును మట్టియే" అని అను

కొని యుండవచ్చును. లేక, గర్భవతులగు స్త్రీలు మట్టిని దిను చుందురు. ఈ సంస్కారములే పిల్లలకును నుండును. అందు వలన గొందఱు పిల్లలు చాలస్వభావానుసారముగ మట్టిని దిను చుందురు. ఏకారణమైన గానిండు. శ్రీకృష్ణచంద్రుడు మట్టిని దినినాడు.

బలరామునకు శ్రీకృష్ణునియెడల వాత్సల్యప్రేమకలదు. పెద్దవాండ్రు చిన్నవారిని గొంచెము కనిపెట్టి యుందురు. ఆడు చున్న గోపకుమారులలో శ్రీకృష్ణుడు లేకుండుటను గాంచి, బలరాముడు భయపడి అటునిటు వెదుకగా శ్రీకృష్ణుడు యమునాతీరమున శ్రీకృష్ణుఁడు నిలుచుండి మట్టిని దినుటను బలరాముడు కాంచెను. ఆతనికిమిక్కిలి యాశ్చర్యము వేసెను. గోపకులును జూచి నవ్వదొడగిరి. అప్పుడు బలరాముఁడు పెదవులమీద వ్రేళ్ళువైచుకొని మెదలకుండుడనెను. బాలకు లందరు నూరకుండిరి. ఆసమయమున మెదలకుండ కాళ్ళ చప్పుడు కాకుండ బలరాముఁడు పోయి, వెనుకనుండి చేతిని బట్టుకొని యిట్లనెను:- "కృష్ణా! దీనిని మెక్కుచున్నావా?"

శ్రీకృష్ణుఁ డదరిపడి భయభీతుఁ డయ్యెను. నోటినిండ మట్టియుండెను. అందు వలన నేమియు మాటలాడఁ జాలకుండెను. అవును, కాదనియు ననఁజాలకుండెను. దొంగ సమయముననే చిక్కెను.

బలరాముఁడు దృఢముగ నిట్లనెను:- 'ఇవ్వేళ నేను నిన్నువిడువను, అమ్మకడకు గొనిపోయెదను. నీకు మట్టిని దిను నలవాటు పడినచో భయంకర రోగము రాగలదు.'

శ్రీకృష్ణుని నోటినుండి మాట రాలేదు. గోపకులు

చప్పట్లు చరచుచు నవ్వసాగిరి. దైవవశమున సరిగా నా సమయమునకే దేవపూజార్థమై యశోదమ్మ జలమును గొనిపోవ వచ్చెను. బలరాముడు కృష్ణుని నామె సమీపమునకు గొనిపోయెను. శ్రీకృష్ణుడు భయపడి యేడ్చుచు ననునయ వినయము లొనర్చుచుండెను. వద్దువద్దనుచు బలరాముని ప్రార్థించుచుండెను. ఆతడు నోటిలోని మట్టిని తొందర తొందరగా మ్రింగెను. పిల్లలు ముందుగానే పరువిడిపోయి యశోదకుఁ జెప్పనారంభించిరి:- "అమ్మా! అమ్మా! శ్రీకృష్ణుడేమన్నా ఇవ్వేళే మట్టితిన్నాడు. బలరాముడాతని బట్టుకొని తెచ్చుచున్నాడు" ఇంతలోనే భగవానుని బట్టుకొని బలరాముడు అచ్చటికి వచ్చెను. అమ్మతో నిటులనెను:- 'శ్రీకృష్ణుఁడు నేడిప్పుడే మట్టిని దినినాడు.'

ఇది వినగానే తల్లికి మిక్కిలి సందేహము కలిగెను — 'ఇప్పుడీతనికి మట్టిని దినునలవాటు పడినచో నీతనికి పాండువు మొదలగు రోగములు రాగలవు." అని యాలోచించి ఆమె గట్టిగా శ్రీకృష్ణుని జేతిని బట్టుకొని, కసరుచు నుపాలంభ పూర్వకముగ నిటులనెను:- 'ఏమిరా! తండ్రీ! నేడు నీవు మట్టినే నివేదనముగా గైకొంటివా?'

ముఖమును వ్రేలాడవైచుకొని అపరాధి వలె శ్యామ సుందరుడు నిలుచుండెను. తల్లియిటులనెను:- "మాటలాడవేమి? నిలుచుండి మూగమొద్దువలె మౌనముగ నుంటివేమి? అడిగిన దానికి సమాధానమును జెప్పవేమి?"

ఏడ్చుచు గృష్ణుడిటులనెను:- "ఏమి సమాధానమును జెప్పుదును?" తల్లి యిటులనెను:- ఆహా! హా! ఎంత నంగనాచి

గా నాపురా, ఏమియును నెరగని వానివలె. సరేలే, నీవు మట్టి నేం దింటివో చెప్పుము. ”

కొంచెము పెడకట్టిగ దల్లివంక క్రీగంట జూచుచు నిట్లనెను:- “ నే నెక్కడ మట్టిని దింటిని ? ”

తల్లి యిటులనెను:- “ దొంగతనమును జేయుదువనియు అబద్ధము లాడెదవనియు దొంగవనియు, పోకిరివనియు గోపకులందరును జెప్పుచున్నారు. ”

గోపకులిటులనిరి:- అవునమ్మా ! మేము మా కన్నులార మట్టిదినుచుండఁ జూచితిమి”

తల్లి శుష్కహాస మొనర్చి యిటులనెను:- “ చెప్పు! ఇప్పుడేమందువు”

ఇది విని శ్రీకృష్ణుఁడు పోట్లాడెను. బలరామునకు సంకోచించుచుండెను. తల్లి విషయమున సంకోచము లేదు. దృఢతాస్వరమున నిటులనెను:- “ఇప్పుడు నీవు నన్ను విశ్వసించుటలేదు. అబద్ధమును జెప్పు నీ గోపకుల మాటలనే నమ్మెదవు. నేడు వీరు నాకు వైరులైనారను సంగతి నీకు తెలియదు. ఆటలలో నేను వీరికి లోంగోటా నొసంగితిని. వీరీయక పోవుటచే నేను వీరితోఁ బోట్లాడితిని. అందువలన నామీాద నేరములను గల్పించి నీచేతఁ గొట్టింపజూచుచున్నారు. నీవు కొట్టిన వీరందరును నవ్వెదరు.

తల్లి యిట్లనెను:- “సరే, వీరందరును నీకు వైరులేనను కొందము. నీ అన్న బలరాముడును నీకు వైరియేనా ? ఆతడును జెప్పుచున్నాడుగదా!”

ఏడ్చుచు శ్యాముఁ డిట్లనెను:- "అమ్మా! నీవిప్పు డన్నయ్య నడుగవలదు. ఇప్పుడీతఁడు నన్నంతగా ప్రేమించుట లేదు. ఈతఁడు నావిపక్షులతోఁ గలిసినాఁడు"

తల్లి కసరుచు నిట్లనెను:- "అంద ఱసత్యవాదులే. కేవలము నీవొక్కఁడవే సత్యవాదివి. నీవు మట్టినిఁ దినకున్న నీకునిన్నేలఁ బట్టుకొని తెచ్చెదరు?"

ఇది విని దృఢతాస్వరమున శ్యాముఁ డిట్లనెను:- "అమ్మా! నీవు నామాటలను విశ్వసించి నన్నసత్యవాది నొనర్చుట మానుకొనుము. నేను మట్టిని దినలేదు. తిన లేదు, తినలేదు. నీకు నామాటమీఁద విశ్వాసము లేకున్నచో, నీవు నామాటను గల్లయని భావించుచో, నోటిని జూడుము. దీనికి మించిన ప్రత్యక్ష ప్రమాణ మేమియునుండఁబోదు."

తల్లి శీఘ్రముగ నిట్లనెను:- "మంచిది, చూపించుము నీనోటిని."

ఇది వినఁగానే కృష్ణున కసుపున్నైను. భయ పడెను. ఆతఁడు మట్టినిది నెను. నోటికిని నంటుకొని యున్నది. కాని యిప్పుడేమి చేయవలయును. నోరును దెరువవలసి వచ్చెను.

ఇది విని శౌనకుఁడిట్లనెను;- "తన నోటియందు మన్నంటుకొనియున్నదని భగవానునకుఁ దెలిసినప్పుడు, నేను మన్నును దినియుండిన నాముఖమును జూడుమను మాట యెందులకు? ఇంకొకఁడైన నిట్లనవచ్చును:- "అమ్మా నాకు చాల దప్పిక వేయుచున్నది. గొంతుఎండిపోవుచున్నది. నేను దాహము త్రాగిన మీఁదట నీవుకొట్టవచ్చును." లేక

బిగ్గరగా నేడ్చి, తన యపరాధము నంగీకరించి, అమ్మా! నేనిప్పుడు దిన నవచ్చును. లేదా నీరందరును గలసి నా నోట మట్టిని గ్రుక్కెనని జెప్పక నానోరును జూడమని స్పష్టముగ నేల చెప్పినాడు?"

సూతుఁడిట్లనెను:— "స్వామీ ! శ్రీకృష్ణుడు నిజముగ నోటిని జూపవలయునని అటనలేదు. ఆతఁడొక బోలావేయ దలచినాడు. ఆతడిట్లనుకొని యుండవచ్చును:— "నేనాత్మ విశ్వాసపూర్వకముగ ధృఢముగ నానోటిని జూపించెదనని పలికినచో దల్లి నా మాయలోబడిపోయి యిట్లనుకొనవచ్చును. "ఈతడు మన్ను దిినచో నింతటిధృఢముగ నోటిని జూపించెద ననడు" అని యిట్లు భావించి, "ఇక నుపద్రవము లొనరింపకు" మని చెప్పి విడువ వచ్చును. "అయితే నోటినిఁ జూపించుమని తల్లియడుగునని ఆతనికేమి తెలియును. తన యుద్దేశ్యమునకు విరుద్ధముగా దల్లి నోరును జూపుమనగానే కృష్ణుడు తికమక పడెను.

భగవానుఁడు భయభీతుఁ డగుటను గాంచి యాతని యైశ్వర్యశక్తి, యిట్లనుకొనెను:— "ఇప్పుడు నా స్వామికి సంకటము సంభవించినది, యశోదది శుద్ధ వాత్సల్యభావము. ఆమె నోటిలో మృత్తికను చూచినచో గొట్టకవదలదు. మట్టిని దినుటచే భయంకర రోగములు గలుగును. తల్లి హితైషిణి. కావున నిప్పుడు స్వామిని రక్షింప వలయును. కావున నాముఖ మందలి మృత్తిక యందే చరాచర విశ్వమును నైశ్వర్యశక్తి స్థాపించెను. బియ్యపు గింజలవలె దంతములతోడను, నెర్రగ నుండు నాలుకగలనోటిని భగవానుడు తెరచెను, తల్లిచూడగా

పిల్లవాని ముఖమునందు జలనచిత్రములలో వలె సమస్త విశ్వమును గనఁబడుచుండెను.

క॥ ఆ లలితాంగి గనుంగొనె
బాలుని ముఖమందు జలధి పర్వత వన భూ
గోళ శిఖి తరణి శశి ది
క్పాలాది కరండమైన బ్రహ్మాండంబున్ ॥

(శ్రీ)మదాంధ్ర భాగవతము.

దశదిశలును. భూగోళమంతయును, జలాగ్ని వాయు రాకాశ నద, నదీ, పర్వత ద్వీప సముద్ర, చంద్ర, తారకలతో గూడ నిఖిల జ్యోతిర్మండలమును వైకారి కాహంకారము యొక్క కార్యమును, సమస్తేంద్రియాధిష్ఠాన దేవతలును, మనస్సును రాజసాహంకారకార్య భూతమగు నింద్రియములును, తామసాహంకార కార్యభూతములగు దన్మాత్రలును, సత్వ రజస్తమములనునీ త్రిగుణములును శ్రీకృష్ణుని ముఖమందుఁ గనపడెను.

జీవ, కాల, కర్మ, స్వభావాశయములును, భిన్నభిన్న శరీరములకు గారణమగు విచిత్ర భేదముగల నీ సమస్త విశ్వమును నాకృష్ణుని ముఖమునఁగనబడుచున్నవి, ఆముఖమందు వ్రజమండల మంతయును గనబడుచుండెను. సమస్తగోప, గోపీ బాలురును గోవులును దానిలో విహరించుటను దల్లి గాంచి అధికాశ్చర్య చకితయగుచుండెను. యశోద తనను, నోరును దెరిచిన శ్రీకృష్ణుని గూడ గాంచెను. ఆలోపలనున్న కృష్ణుని నోటియందుననుఁ నన్తకోటి బ్రహ్మాండములు కనబడు చుండెను. దానియందు శ్రీకృష్ణుడుండెను. తల్లి యిది యంతయును గాంచి మిక్కిలి భ్రాంతిని జెందెను. చిన్న నిసువగు

మాపిల్లవాని నోట యిది యంతయును గనబడుటేమిటి? తల్లి మాటిమాటికి గన్నులను తుడుచుకొని చూచు చుండెను. తాను స్వప్నమును గాంచుటలేదుకదా యనుకొనుచుండెను. మరల నిట్లనుకొనెను:—

కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్ నేరక యున్నదానననో యశోదాదేవిఁ గానోపర
స్థలమో బాలకుఁడెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపఁగన్॥

ఆ॥ బాలమాత్రుఁడగు సలీలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసియుండు
బాలుభంగి నితఁడు భాసిల్లుఁగాని స
ర్వాత్ముఁడాది విష్ణుఁడగుట నిజము.

(శ్రీ)మదాంధ్రభాగవతము

ఇది స్వప్నము మాత్రము కాదు. నాకన్నులు తెఱచుకొనియే యున్నవి. నేను యమునాతీరమున నిలిచియున్నాను ఇది భగవన్మాయ యైనఁ గావలయును, నాయొక్క బుద్ధి భ్రమ యైనను గావలయును. ఏదైన మత్తుపదార్థమును సేవించిన నిట్టి యస్తవ్యస్తము కలుగుచున్నదా యనిన నేను మాదకవస్తువును దాకనైనఁ దాకలేదు. ఏమైనగానిండు. నా యీపుత్రుని యొక్క జన్మజాతయోగ సిద్ధియైనను గావలయును, లేదా యేదైన భూత ప్రేతము లీతనిలో నావేశించి యుండవలయును.

సూతుఁ డిట్లనెను:— "మునులారా! ఇంకొక తల్లి యీ విధముగఁ దన పుత్రుని ముఖమునందు విశ్వబ్రహ్మాండమును

జూచియుండినచో నాసమయమునఁ బుత్రుని పాదములను బట్టుకొని ఆతనికి గూడ ఘృతాదులతోఁ బూజచేసెడిదే. కాని యీమె అనన్య వాత్సల్య రసమూర్తి యగు యశోదమ్మ. ఆమెకీ యఖిల ప్రపంచము కనబడగానే యిదేదైన బాలకునకుఁ గల జన్మజాతమగు యోగసిద్ధియేమో నను ననుమానము కలిగినది. అయినను మరల నిటనుకొనెను;- ఏమైనగానిండు. ఇదియంతయును భగవానుని లీల. కావున భగవానుని స్తుతించుటచేతనే యిది యంతయును సరికాగలదు. ఇట్లాలోచించుకొని ఆమె చేతులను జోడించుకొని స్తుతి యొనర్ప దొడగెను:-. "ఏభగవంతుడు వాక్కు-చేతను, జిత్తముచేతను మనస్సుచేతను, లెస్సగా తెలియబడఁడో ఎవనిలో నీ విశ్వ బ్రహ్మాండమంతయును గలదో, ఇంద్రియాధిష్ఠాతగను, బుద్ధిప్రేరకుడుగను నెవడు భాసించుచున్నాడో అట్టియచింత్యశక్తియగు పరబ్రహ్మ పరమాత్మకు నేను బ్రణామ మొనర్చుచున్నాను. ఎవ్వడు పరమ పదమో ఈ ప్రపంచ మంతయును నెవ్వని మాయకు వశీభూతమై వ్యవహార మొనర్చుచున్నదో నేనును నెవ్వని మాయకు వశపడి మోహితనై యిట్టి గౌరవర్ణమును స్థూలమును గల శరీరమునే నేననుకొనుచున్నానో ఈవ్రజరాజు నాపతి ఈకృష్ణుఁడు నాపుత్రుడు నేను సమస్త వ్రజేశ్వరుని నిఖిలసంపత్తికి స్వామిని ధర్మపత్ని ననుకొనుచున్నానో ఈసమస్తవ్రజమండల మందలి గోపగణమును గోపికలును, గోవులును ఇవన్నియును నాయధీనమున నున్నవను కొనుచున్నానో ఎవని మాయచే నాకు నేను నాది యనియును నీవు నీది యనియు నను

గుమతి యాావరించినదో అట్టి విశ్వ భరుడగు భగవానుడే నాకే కైక గతి. ఆతడేనన్ను మోహపాశమునుండి విడిపింపగలడు.

తల్లి నోటినుండి యిట్టి యత్యుత్తమమగు దత్త్వజ్ఞానమునకు సంబంధించిన మాటలను వినగానే భగవానుడు భయపడి యిట్లనుకొనెను:- "అయ్యో! నాతల్లి విరక్తయై యోగినియై యీసంసారమంతయు నసారమనుకొని సమాధియందున్నది. ఇట్లుండిన నంతయును బేడబెల్లము కాగలదు, నాలీలలు సమాప్తములగును. నాకు పాలిచ్చువారెవరు? కొఱడాను గైగొని కసరి కొట్టువారెవరు? ఐశ్వర్యశక్తిమధ్యలో వచ్చి చాల గడబిడచేసినదని తెలిసికొని వెంటనే భగవానుడైశ్వర్య శక్తిని గసరి రూక్షముతో నిట్లనెను:- "ఇక నిచ్చటినుండిపారిపొమ్ము." అప్పుడైశ్వర్య శక్తి బలముచే నెత్తిన కాళ్ళుపెట్టుకొని తడిసిన పిల్లివలె నచ్చటినుండి పారిపోయెను. అప్పుడు భగవానుడు తనపతి సఖి, పుత్ర, స్వామి మొదలగు నిత్యసంబంధముగల తన వైష్ణవమాయను బిలిచి యిట్లనెను:- "నీవు నాతల్లి హృదయమును విడిచి యేల బోయితివి. నీవు వెంటనే ఆమె హృదయమున నీ ప్రభావమును జూపించుము."

భగవానుని ఆజ్ఞకాఁగానే పుత్రస్నేహ మయ యగు వైష్ణవమాయ తల్లిహృదయముపై నధికారమును వహించెను. ఆ ప్రభావము పడఁగానే తల్లి వెంటనే అదృశ్యము నంతను మఱచెను. చేతినుండి కఱ్ఱ నావలఁ బాఱవైచి, పిల్లవాని నెత్తుకొని, మాటిమాటికి నాతని ముఖమును ముద్దుపెట్టుకొనుచుఁ బుజ్జగించుచు నిట్లనెను:- "మా

కృష్ణప్ప రాజకుమారుడు. ఈ పిల్లలందరును మిక్కిలి ధూర్తులు. బలరాముఁడును ధూర్తుడే. మాబుజ్జి నాయన మీఁద కల్లబొల్లి నేరములను మోపుచున్నారా! మా యింటిలో వెన్నమీఁగడలకుఁ దఱుగున్నదా యేమి? మావాడు మన్నేల దినును? చెప్పినవారే తిన్నారేమో? నాయనా! యింటికి పోయి వెన్నమీఁగడలను దినుము.'' ఇట్లు పలికి యశోద పిల్లవాని నెత్తుకొని పోయెను. ఆమె వానినన్నిటిని విస్మరించెను. శ్యాముని హృదయముతోఁ గౌఁగిలించుకొనఁగాఁ బ్రేమప్రవాహ ముప్పొంగెను. ఆమె యిదివరకు కృష్ణునెట్లు కుమారునిఁగాఁ దలఁచుచుండెనో అట్లే తలచుచుండెను. బ్రహ్మాండ దర్శనవిషయము నామె స్వప్నము వలె మఱచెను.

సూతుఁ డిట్లనెను:— "మునులారా! వేదత్రయమును ఉపనిషత్తులును, సాంఖ్య, యోగములును, భక్తజనులును నెవని సుయశమును నిరంతరము గాన మొనర్చుచుందురో వేదమును నెవని విషయమును దెలియఁ జాలక నేతినేతీతి వాక్యములను బలికి యూరకుండెనో, శేషశారదులైనను నెవని గుణములయొక్క అపారైశ్వర్యము నింతవరకు నంతు గనఁజాలకుండిరో అట్టియఖిలాండకోటి బ్రహ్మాండనాయకుడగు శ్రీహరిని యశోదమ్మ తనఁపుత్రునిఁగా భావించుచుండెను. ఆతనిఁ గసరును. ఆతని సుఖదుఃఖముల విషయమును గూర్చి ధ్యానించుచుండెను. ఇదెంతటి యాశ్చర్యకరమగు విషయము. ఎవని మహిమమున కంతు లేదో, ఎవని శ్వాస ప్రశ్వాసల వలన నసంఖ్యాకులగు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు పుట్టిగిట్టుచుందురో, ఎవని భయముచే

వాయువు వీచుచున్నదో, సూర్యచంద్రులు ప్రకాశ ప్రదానము గావించుచున్నారో అట్టి సర్వేశ్వరుడు యశోద గోపికా సమ్ముఖమున భయమున గడగడ వణకుచున్నాడు. భగవానున కెంతటి భక్తవత్సలత. ఆతఁడాతని యనుగతుల కమ్ముడువోవును. వారి నానందింప జేయుటకు తన యపారైశ్వర్యమును మఱచును. చిన్న తెలియని బాలుడగును.

ఋషులారా! గోకుల సమీపమున యమునానదీ తటమున నెచ్చట భగవానుడు ముఖమందు తల్లికి బ్రహ్మాండమును జూపించెనో భగవానుడు మృత్తికను దినెనో ఆ ఘట్టమిప్పటికి బ్రహ్మాండఘట్టమను పేరఁ బ్రసిద్ధిని చెంది యున్నది. అచ్చటమట్టి యిప్పటికినిఁ దియ్యగా నుండును. యాత్రికులకుఁ బ్రసాదముగ నామట్టి యీయబడు చుండును. "మట్టిని దినిన మాధవ గోపాలునకు జయ్"



# నవనీతచోరలీల

(౮౭)

శ్లో॥ కాలేనాల్పేన రాజర్షే! రామః కృష్ణశ్చ గోకులే।
అఘృష్టజానుభిః పద్భి ర్విచక్రమతు రంజసా॥
తతస్తు భగవాన్ కృష్ణో వయస్యై ర్వ్రజబాలకైః
సహ రామో వ్రజస్త్రీణాం చిక్రీడే జనయన్ముదమ్॥

(శ్రీ భాగ. ౧౦ స్కం. ౮ అ. ౨౬, ౨౭ శ్లో॥

కం. అడుగులు వేగలిగియు రెం
డడుగులనే మన్ను మిన్ను నలిమిన బాలుం
డడుగిడఁ దొడగెను శాస్త్రపు
లడుగులు నడుగులును వదలి యడుగవనిఁబడన్॥

కం॥ తన యీడు గోపబాలురు,
దనుఁగొలువఁగ రాముఁగూడి తనువు గలుగుచుం
దనుగమనంబులఁ గృష్ణుఁడు,
తను మధ్యలు మెచ్చ నీలతనురుచి మెఱసెన్॥

(శ్రీమదాంధ్రభాగవతము

ఒక్కసారి యేపనినిఁ జేసిన రసానుభవము కలుగునో దానిని మరల మరలఁ జేయుట కలవాటై, అది చేయకున్న నిలువఁ జాలనిచో దానిని వ్యసనమందురు. కొన్ని వ్యసనములు స్వప్రేరణముచేతఁ గలుగును. కొన్ని పరప్రేరణముచే గలుగును. ఇతరులకు సుఖము కలుగుటకునుఁ గార్యము లొనర్పబడును. భగవంతుడాప్తకాముడు. ఆతనికిచ్ఛనులేదు. వ్యసనమును లేదు, కాని భక్తులకు సుఖము నొనగూరు

టకై వ్యసనముకలవానివలెఁ గనఁబడును. వాస్తవమున నాతఁడు నిరీహుఁడు. ఏవస్తువులేదో, లేక యేది తక్కువగ నుండునో సాధారణముగా నావస్తువు మీఁదఁ గోరిక యుండును. భగవంతుడందరకును జనకుడు. ఆతడేదైనగోరి నట్లుండినను నాతఁడు కేవలము తన యాశ్రిత జనులకు సంతోషమును గలిగించుటకై క్రీడ యొనర్చుచుండును.

సూతుఁ డిట్లనెను:– "మునులారా! ఇప్పుడు శ్రీకృష్ణుఁడు నాలుగైదేండ్లవాడయ్యెను. బాలకులతో స్వచ్ఛందముగఁ దిరుగు చుండెను. ఇదివరకాతనికి తల్లి యొడి యెంత యిష్టమో యిప్పుడాతనికిఁ గ్రీడలనిన నంతటి యిష్టము. ఆతని వెంట పందలుకొలది గోపకుమారులాడ వచ్చుచుండిరి. వాఁకిటనో, గోష్ఠమునందో, సావడిలోనో, యమునాతటముననో వారాడుచుందురు. అతని సౌందర్య మాధుర్యములు దినదిన ప్రవర్ధమాన మగుచుండెను. స్త్రీ పురుషు లొక్కసారి యాతని రూపవైఖరినిఁ జూచిన జాలును మోహమును చెందుదురు. అమాయకత్వముతోఁ బాటుగ నల్లరితనము, చిన్నతనము, బంగారునకుఁ దావి యబ్బిన పనిచేయును. ఆతని యంగ ప్రత్యంగములనుండి సౌందర్య సౌష్ఠవములు వెల్లి విరియుచుండెను. గోపికలు గుంపులు గుంపులుగా నాతని రూపమాధుర్యమును బాన మొనర్ప వచ్చుచుందురు. మూల్యము లేకయే వారాతనికి అమ్ముడు పోవుదురు. ఆతని నట్లే చూచుచు నిలుచుందురు. ఏపనియు లేక పోయినను నేదియో నంకను బెట్టుకొని వారు నంద భవనమునకు వచ్చుచుందురు, వారచ్చట శ్యామ

రూపాపపమును బానమొనర్చి తడబడుచు, మత్తిలి, పిచ్చి వారివలె నట్లే నిలుచుందురు. యశోద లోలోన నుబ్బి. మాటి మాటికినిఁ బిల్లవానికి దృష్టినిఁ దీయును,

శ్యామసుందరుడాటలనాటి పరువిడి వచ్చును. ఆతఁడు తల్లి చెంగుఁ బట్టుకొని యిట్లనును:- "అమ్మా ఆకలివేయు చున్నదే "

తల్లి అత్యంత ప్రేమతో ముఖమును ముద్దిడుకొని యిట్లనును:- " వత్సా ! పాలు త్రాగుము. మృష్టాన్నమును. బండ్లను దినుము. చెప్పవేమి తిదెదవో ?

ఆతఁడిట్లనును: " అమ్మా ! నాకు వెన్నకావలెను." తల్లివెంటనేవెన్నను బెట్టును రొట్టెపెఁకొని వెన్నను బాగుగా దినును. ఆ తిను వైఖరిని గాంచి గోపికలు గోపకలు తన్మయు లగుచుందురు. వారి కన్నుల నీరు నిరునింపుకొనుచు లోలోన నిట్లనుకొను చుందురు:- " సర్వాంతర్యామియగు నోహరీ ! ఎన్నడైన కృష్ణుడు మాయావరణ మందునను నీ విధముగ వెన్నను దినునా? ఎన్నడైనను మాతోగూడ నిట్టిమధువిస్తము లగు మధురవచనములను బలుకునా ? ఎన్నడైన మమ్మును దనసుఖదస్పర్శచే దన్మయుల నొకర్చునా? "భగవానుని ప్రాదు ర్భావము భక్తుల సుఖముకొరకే. గోపికలు గుంపులుగ నంద భవనమునకు వచ్చుచుందురు, యశోదఅందరకునునాదరసత్కా రములను గాంవించును. ఆ సమయమున శ్యాముడు కపట రోషమును జూపించుచుఁ, గటటాశ్రువులను గార్చును గాళ్ళను విదిలించుచు దల్లియొక్క పైఁటను బట్టుకొని తనపోకిరితన మున జూపించుచుబెరుగును. పెరుగు గోరును. పెరుగు పులుపై

నచో బాత్రను బగులగొట్టును. మారముచేసి యేడ్చును. తల్లికొంగును పట్టుకొని ప్రేలాడును. ఇట్టి యాటలను గాంచి గోపాంగనలు తన్మయులగుచుందురు, తమ్ముదాము మరచెదరు. కృష్ణుడు మనతోగూడ నిట్టి మారమును జేసిన బాగుండునను కొందురు, కృష్ణుడెన్నడైన మనల స్వీయులుగ జూచుకొనునా? ఇచ్చట గోపికల యొక్క యుత్కంఠత పెరుగు చుండెను. అచ్చట భగవానుని భక్తవత్సలత ఉప్పొంగు చుండెను. ఇద్దరి బంధములును దెగిపోగానే నవనీతచోరలీల ఆరంభమయ్యెను.

ప్రేమ సంబంధము రెండువైపుల నుండును. మన మెవ రిని ప్రేమించెదమో వారు మనలను ప్రేమింపక పోవుట అసం భవము. తెలిసిగాని, తెలియకగాని, ప్రేమ యెట్లున్నను దాగదు. కస్తూరి గంధమును ప్రేమ సంబంధమును దాచినను ప్రకటమగుచునే యుండును. మనస్సాక్షే. మనమెవరిని మనస్సుతో గోరెదమో అతడు కోరకుండ జాలడు. చైతన్య ప్రాణులలోపల హృదయమను నొక కోమల వస్తువు కలదు. ప్రేమ పాషాణాది జడములను గూడకరిగించును. గోపికలెంత చంచలులు. ఈతని ప్రతిచేష్టయందును నెంతటి యాకర్షణ ముండెనో మనము మనస్సుతో నీతని నెంతగా ప్రేమించు చున్నాము! ఎంత ఆపేక్షతో నున్నాము! కాని అతడు మన వైపు కన్నెత్తియైనను జూడడు. మనల నెరుగక పోవచ్చును. ఇచ్చట దల్లియెదుట మనమీతనితో మాటలాడ జాలము. మనము కౌగలించుకొని ముద్దుబెట్టుకొనలేము. మన యిండ్లకితడెట్లు రాగలడు, మనము దరిద్రులమైతిమి. ఈతడు రాజ పుత్రుడాయెను. ప్రేమించుట యెట్లు? భోజనము, భజనము

ప్రేమ ఇవి యేకాంతమందే బాగుగ వ్యక్తమగును. ఏకాంత
మున గృష్ణుడెచ్చట జిక్కగలడు ? వ్రజాంగనలు శ్రీకృష్ణు
నితో నేకాంతముగా గలిసికొనుటకెట్లు ఉవ్విళ్లూరు చుండిరో,
అట్లె శ్రీకృష్ణుడును వారిని గలిసికొనుటకు ఉవ్విళ్లూరు
చుండెను. తల్లి ఆతనిని బోనిచ్చుట లేదు. ఆడుకొనుటకు
బోవుచున్నాడుగాని గోపిక లిండ్లకు బోవుటలేదు.

తనకొడుకు పాలను బాగుగా ద్రాగవలయు ననియు
వెన్నను దక్కువగ దినవలయుననియు దల్లి కోరుకొనుచుండును.
ఏలననగా నధికముగ వెన్నను దినినచో నాకలి మందగించును.
అధికముగ బాలను ద్రావినచో బలమధికమగును. కృష్ణునకు
వెన్నయనిన నధికముగ బ్రీతి. తల్లి పాలధికముగ ద్రాగింపవల
యుననుకొనుచుండెను, ఈవిధముగ వారిద్దరి మధ్య నభిప్రాయ
భేదము కలదు, పాలొసంగెదరేమో నను భయముచే శ్యామ
సుందరుడు పెందలకడనే నిద్రించును. తల్లి నిద్రబోవు వానినే
ఒడిలో గూర్చుండ బెట్టుకొని చక్కగ గుంకుమపువ్వును, గల
కండను వైచిన పాలను ద్రావించును, నిద్రకండ్లతో నుండినం
ద్రాగును. మేల్కొని యుండిన బాత్రను గైకొని విసరిపాఱ
వైచును. తల్లి అనేక ప్రకారములగు గథలను జెప్పుచు శ్యామ
సుందరునకు బాల నారగించు రుచిని గలుగంజేయును. ఇట్లనును
“ కృష్ణా ! బలరాముని జుట్టు పెద్దది, నీజుట్టు చిన్నదిరా. ఇటు
లుండుటెందులకో తెలియునా ? నీవు పాలను ద్రాగవు. నీవు
నాలుగు సారు లొక్కొక్క లోటా పాలను ద్రాగుచో నీ
జుట్టును మడమల వరకును బెరుగగలదు.” ఈ యపేక్షతో
శ్యాముడు పాలను ద్రాగి తలవెండ్రుకలను జూచుకొని తల్లి
నిట్లడుగును:- “ అమ్మా ! నాజుట్టు కొంచెము పెరిగినదా ?”

అమ్మ యిట్లనెను: "ఓరీ తండ్రీ! నీవు పిచ్చివాడవురా! ఒక్కదినములోనే పెరుగునా? కొన్నాళ్ళు త్రావిన తర్వాతఁ జూచుకొనుము.

రెండుమూడు రోజులు పాలను త్రావి జుట్టు పెరుగక పోయిన బాలను త్రాగుటను మానును. అంతతల్లి యిటుల నెను:- "నాయనా! ఆపిల్లలంద రెంత సుందరులుగ నన్నారో చూడుము, నీవు నల్లగా నున్నావు. బాగుగా నీవు పాలను త్రాగినచో నీవును సుందరనివాడవు కాగలవు. రెండు మూఁడు దినము లీలోభమునఁ త్రాగును. తన రంగు మారలేదను సంగతిని దెలిసికొని పాలను త్రాగుట మానివేయును. తల్లిని వెన్న నడుగును. తల్లి ప్రాతఃకాలమున నప్పుడప్పుడు తీసిన వెన్న నొసంగును. కాని మాటిమాటికడిగినచో నిట్లనును:— 'వెన్న నెప్పుడును దిన గూడదు".

దేనిని గాదను కొందుమో అదియే కావలయు నను తలంపు హెచ్చుచుండుట ప్రకృతి నియమము. అభావమందు వస్తువునందాకర్షణ మధికముగ నుండును. ఒకదినమున ప్రాతః కాలమునందు లేవగనే శ్యాముడు నవనీతమునకై బలవంత మొనర్చెను. తల్లి ఒకసారి పెట్టెను. దానినాతడు తినెను. మరల అడుగగా దల్లి మరల నొసంగెను. మూడవసారి అడుగగా నప్పుడిట్లనెను;- "ఎక్కువగ వెన్నను దినినచో గడుపున వెన్న జిడ్డుయేర్పడును నాయనా!"

ఇప్పుడేమి చేయగలడు. ఆతడు మనస్సును జిన్నపుచ్చు కొని కూర్చుండెను. తల్లి కపిలగోవుపాలలో గలకండను గలిపి

యిచ్చెను. కృష్ణుడు పాత్రను దీసి విసరి పారవైచి, నేను పాలను ద్రాగను పో ” అనెను.

తల్లి కౌగలించుకొని బుజ్జగించి యిట్లనెను:— 'అయ్యో! పాలనిట్లు పారబోయుదురా! నాయనా! పాలను నేలపై బార పోసిన గొప్ప అశుభము. ఇట్లు నీవు పాలను బార పోసినచో నీకు ముసలి పెండ్లాము వచ్చును. అది నిన్ను గొట్టును. ”

అంత శ్యామసుందరుడు కోపమున నిట్లనెను:— “ముసలి పెండ్లాము వచ్చిన రానిమ్ములే; కాని నేనుమాత్రము పాలను ద్రాగను. ” తల్లి యెన్నోవిధముల బుజ్జగించి పాయసమును దినిపించును. పాల విరుగును శ్యాముడడుగగానే తల్లి యిటుల నెను:— “ నాతండ్రీ ! నీవు పాలవిరుగును తినినచో నీ పెండ్లి నాడు తుపాను వచ్చును నాయనా! ”

అంత శ్యాముడు కుపితుడగును. ' తల్లి విరుగుడు కూడ యీయదు. కడుపు నిండ వెన్నను దిననీయదు. సరే నేను మాఅమ్మకు దెలియకుండ తినవలె ' నసుకొనును.

ఒకదినమున తల్లి చల్లచేసి వెన్నను తీసి ఉట్టిమీద బెట్టి ఏదోపనిమీద బయటకు బోయెను. శ్యాముడిది గ్రహించి, నేడాతడు మేల్కొన్నను శయ్యపై బరుండి నిద్రించు చున్నట్లు నటించెను. తల్లి యిటులను కొనెను:— “ మంచిది, ఈ ధూర్తు డీవ్వేళ నింకను నిద్రలేవలేదు. లేకపోయిన వీడు నన్నుఁబని చేయనిచ్చెడువాఁడుకాడు. ఆమె చట్టిలో బెట్టిబయటకు రాఁగానే కృష్ణుడు మెదలక లేచెను. ఆ చట్టి అక్కడ క్రిందనే పెట్టబడి యుండెను. దానిలో జేతిని బెట్టి ఒక్క జుర్రు జుర్రెను. నేటి వెన్నలోనొక యపూర్వమగుస్వాదుగలదని కృష్ణుడు గ్రహించి

ఆశ్చర్యమును జెందెను. తాసింత వరకట్టిస్వాదిష్టమగు నవనీతము నెన్నడును దినలేదనిపించెను. ఆసమయమున నాతని మనస్సులో దొంగతనముగ దినిన వెన్నకురుచియెక్కువయని తోచెను. రెండవ జ్వరమును జ్వరమంతలోదల్లివచ్చెను. ఏదో జుర జుర చప్పుడు వినబడు నప్పటికి తల్లి పిల్లేమైన యింటిలో దూరినదేమోననుకొనెను. కాని ఇంటిలోనల్లపిల్లి ప్రవేశించి నవనీతము నారగించు చున్నది. "ఎవరువార" ని తల్లి కేకవైచెను.

ఇప్పుడుకృష్ణుడు స్తబ్ధుడయ్యెను. భయపడగా శారద యిట్లనుకొనెను:- "ఇప్పుడువిషయము చెడిపోవుచున్నది. నా స్వామిమీద దెబ్బపడ గలదు," అనుకొని ఆమె రహస్యముగా వచ్చి భగవానుని జిహ్వాపై నుండెను.

భగవానుడు వెంటనే యిట్లనెను:- ,, ఎవ్వరును లేరు, నేనే నమ్మా ! "

ఈతడేదో వెదుకు చున్నాడని తల్లి గ్రహించి యిటు లడిగెను:- ఎవరూ ? కృష్ణా ! నీవిచ్చట నేమి గందరగోళము చేయుచున్నావు ? వెన్న బిందెలో జేతులను బెట్టితి వేల? "

శ్రీకృష్ణుడు ముఖమును వ్రేలాడవైచుకొని యిటుల నెను:- " అమ్మా ! నీకు నా సుఖదుఃఖములను గూర్చిన చింతలేదు. నాకీ పద్మరాగ మణికటకమును జేతికి దొడిగితిరి. దీనివలన నాచేతులు మంటపుట్టినవి. వానిని చల్లని వెన్న బిందెలో బెట్టి చల్లబరుచుచున్నాను. "

తల్లి యిట్లనెను:- ."అయితే నీ బుగ్గలకు వెన్నెందు కైనది?

కృష్ణుడిట్లనెను:- "నేను వెన్నలో జేతిని బెట్టితిని. తెలియక నా వ్రేలు ౘ్రాకినది. ఆ సమయమున నా బుగ్గలమీద జిల పుట్టినది. గోకుకొనునప్పుడైనదేమో" తల్లి స్వప్నమందైనను దన తనయుడు దొంగతనము చేయు ననుకొనలేదు. కావున శ్యాముని మాట నంగీకరించినది. అప్పటి కది సర్దుకొని పోయినది కాని కృష్ణునిజిహ్వ దొంగతనముగ వెన్నను దిని చప్పరించు చుండెను. నేటినుండి యిక దొంగతనముగ వెన్నను దినవలయునని అతడు నిశ్చయించుకొనెను. దొంగతనముగ దినిన నవనీతమున నున్న రుచి తల్లియిచ్చిన నవనీతమున లేదు.

ఒకదినమున దల్లి యేదో వస్తువును దెచ్చుటకు శ్రీకృష్ణుని దమ పొరుగింటికి బంపెను. శ్రీకృష్ణుడు వారింటిలోనికి బోయెను. ఆమె యీతని పిన్నియగును. దైవవశమున నాసమయమున చల్లను జేసి యేదో పనిమీద బయటకు బోయెను. పిన్నిగారియింటిలో నిక నద్దేమియు నుండదు. తలుపును దెరచి కృష్ణుడు లోనికి ప్రవేశించెను. మట్టికుండలో కవ్వము పడియుండెను. సమీపమున బిందెలో గొంచెము నీటిలో వెన్నముద్దలు పడియుండెను. ఎవని కేవస్తువును గూర్చిన వ్యసనముండునో ఆ వస్తువు ఏకాంతమున దొరికినచో నిక నిలువజాలడు. దాని నుపభోగించుటకు వాని చిత్తము చంచలమగుచుండును. తత్కాలమున నేతీయబడిన వెన్న అందు పెట్టబడిన దని శ్రీకృష్ణుడు తెలిసికొని ఆతడటు నిటు దృష్టిని బఱపి, యింటిలో నెవరును లేరని తెలిసికొని వెన్నముద్దను దీసెను. ఒక్కజుఱ్ఱుజుఱ్ఱెను. శ్రీకృష్ణుని

ఆశ్చర్యమునకు మేఱలేక పోయెను. ఇంటిలోని వెన్నకంటె నీవెన్నలతోఁ రెట్టెక్కువరుచిగ నుండెను. చేతితో నిచ్చినదాని కంటె దొంగతనముగ దినిన వెన్న మిక్కిలి స్వాదిష్టముగ నుండునని యిప్పుడు నిశ్చయమయ్యెను. వెన్నను బుగ్గలనిండా గ్రుక్కుకొనెను. ఇంతలో గోపిక వచ్చెను. ఆమె దూరమున నుండియే కృష్ణుడు వెన్నను దినుటను గాంచెను. ఆమె అట్టే కోరినకోరిక నెరవేరినదని నిలిచెను. తన మనస్సులో నున్న అభిలాష నెఱవేరెను. ఆమె యెప్పటినుండియో యిట్లు కావలయునని కోరుకొనుచుండెను. అంతర్యామియగు ప్రభువు అమెకోరికను నెఱవేర్చెను. తాను లోనికి బోయిన కృష్ణుడు సంకోచించునని ఆమె ఆగిపోయెను. చోరుని హృదయము చాల దృఢముగ నుండును. అందువలననే ఆతడు సాహస మొనర్చి నిద్రించువారి గృహములలో బ్రవేశించును. కాని వాని కాళ్లు నిశ్చలములగును. కొంచె మలికిడి యైనచో నుడాయించును. శ్యామసుందరుడు క్రీగంట పినతల్లివచ్చుచుండుటను గాంచెను. శ్యామసుందరుడదే సమయములో రాయిని దీసికొని మిక్కిలి వేగముగ "తొలగు తొలగు" మనుచు బయిడి, ఒక మంటి కుండయందు రాయితో గొట్టెను. పాత్ర పగిలి పోయెను. గోపిక నవ్వుచు నవ్వుచు బొరలాడెను. ఇంటిలోనికి వచ్చి యిట్లనెను:– "కృష్ణా! కృష్ణా! ఏమిటిరా అది?"

ఆతడేమియు నెఱుగని వానివలె ముఖమును బెట్టెను:– "పిన్నీ! ఇప్పుడే ఒక పెద్ద పిల్లివచ్చినది. పిలిట్లిల్లు వదలిపెట్టి పోతివా యెను, అది నీ వెన్నముద్దలను గఱచుకొని పాఱి

పోయినది. నేను కవ్వమును దీసికొని దాని వెంట బడితిని, కాని అది గబక్కున నుట్టినెక్కి కప్పు చించుకొని పాఱిపోయినది"

నవ్వి గోపిక యిట్లడిగెను:— "కృష్ణా! ఆడు పిల్లియా, మగ పిల్లియా ?"

అతడు శీఘ్రముగ నిటులనెను:— 'పిన్నీ! ఆడుపిల్లియో మగ పిల్లియో నీకు తెలియగలదు. నేను బాలకుడను గదా ! నాకు తెలియదు. ఆడుపిల్లికిని మగ పిల్లికిని నేమి భేదమో? నే నన్నిటినిఁ బిల్లిగా నే భావించుచున్నాను."

గోపిక యిటులడిగెను:— "ఆమగ పిల్లికి నాయనా ! రెండుకాళ్ళున్నవా ? లేక నాలుగా ?"

నవ్వి శ్యాము డిట్లనెను:— నేను కాళ్ళను లెక్కింపలేదు, రెండు కాళ్ళును, రెండుచేతులును గలవని నేనను కొనుచున్నాను"

గోపిక యిటులనెను:— సరేఆడుపిల్లియో, మగపిల్లియో దానిని వదలి వేయుము. నీవు వెన్నను దినుము."

మూతిముడిచి శ్యామసుందరు డిట్లనెను:— పిన్నీ! నాకు వెన్నవాసనయే గిట్టదు. మాఅమ్మతో నిత్యమును నీవయము ను గూర్చియే పోట్లాట జరుగుచుండును. ఆమె వెన్నను తినుమనుచుండును. నేనునాకు వెన్న బాగుండదందును. అమ్మ నన్నిప్పుడేపిలిచినది." ఇట్లుపలికి ఆతడు వెంటనే పారిపోయెను. గోపికలయొక్క హర్షమునకు మేరలేదు.

వ్రజమందలి అందర గోపికల యిండ్ల యందును నవనీతమును దొంగిలింప వలయునని శ్యాముడునిశ్చయించుకొనెను.

దొంగిలిన వెన్ననే తినవలయును. ఒంటరిగా దినిన రుచిరాదు. కావుననొక సమితి నేర్పరుపవలయును. సుసంఘటితమగు కార్యము చక్కగజరుగును. కావున నొకదినమున నాతడు యమునా నదీ తటమున నొక గుప్తసభ నేర్పాటు చేసి పిల్లలను బిలిచెను. బలరాముని దానిలోనికి బిలువలేదు. మును ముందుగా శ్యాముడు తన పెద్ద టోపీనిదీసెను. ఆటోపీలోపల నాకులలో జుట్టబడిన రెండు వెన్నముద్దలను దీసెను. ఆటోపీలోపల నాకులలో జుట్టబడిన వెన్నముద్దలుండెను. ఎవరికినిసందేహాము కలుగకుండుటకై యీయుక్తి చేతనే బాలకులకు దెలియకుండ నీవెన్నముద్దలను దెచ్చెను. సమితిలో నెందరు సదస్యులు కలరో వారందరకు గొంచెము కొంచెముగ వెన్నను బంచి అందరతో దీనిని దినుడనెను.

అందఱును వెన్నను దినిరి. అంతగృష్ణుడిట్లడిగెను:- "ధర్మముగ నిజమును జెప్పుడు. మీరిట్టి వెన్ననెన్నడైన దిని నారేమో చెప్పుడు".

అందఱును నేక కంఠముగ నిటులనిరి;- "లేదు. మేమింతవఱకిట్టి వెన్నను దినలేదు. దీనిలో నేమి విశేషము కలదో చెప్పుమయ్యా"

శ్రీకృష్ణుడిటులనెను:- దీనిలోనున్న విశేష మేమనగా నిది దొంగిలించిన వెన్న. చోరత్వమున వచ్చిన వెన్నలోని స్వాదు మఱియొక వెన్నలో నెచ్చట నున్నది? మీరు నేను జెప్పినట్లు విని, నామాట నంగీకరించు చున్నచో నిట్టి వెన్ననే మాకు కడుపునిండ బ్రతిదినమును బెట్టెదను"

అందఱును నేకకంఠమున నిట్లనిరి:– "నీవు చెప్పినట్లు చేయుదుము. ఇట్టి వెన్నను నీవు మాకు ప్రతిదినమును బెట్టవలయును. ఈవిద్య నెచ్చట నేర్చుకొంటివి?"

శ్రీకృష్ణు డిట్లనెను:– "ఓరీ! నేనిది యంతయును దల్లి కడుపులో నేర్చుకొనియే పుట్టితిని. మీరెవ్వరితోడను జెప్పవలదు. అందఱును నేను జెప్పినట్లు వినవలయును. మీయిండ్లలో నెవరి యింటికి వెళ్ళినను మీ రెవరితోడను జెప్పవలదు. నేను చెప్పినట్లు చేయవలెను. ఒకవేళ మనమెన్నడైన బట్టుపడినచో నింటివారి పక్షమును వహింపక మా పక్షమున నుండవలయును."

అంద రిట్లనిరి:– "సరియే. మేము నిన్నే మానాయకునిగా జేసికొనుచున్నాము. నీయాదేశములనే పాలించెదము. అందరయిండ్లలోని రహస్యములను గనుగొనవలయును. వెన్న యెచ్చట నుండునో, అమ్మ యిల్లుదాటిబయటకెప్పుడుపోవునో ఇవన్నియును దెలిసికొన వలయును"

శ్రీకృష్ణు డిట్లనెను: "సరేనయ్యా! ఇది అత్యంతావశ్యకము. ఇంటిగుట్టును దెలిసికొనక దొంగతనము జరుగఁజాలదు. దొంగతనమునకు గుట్టు తెలిసినవాడొకడు తప్పక యుండి తీరును."

సఖులిట్లనిరి;– "అరే, పట్టుకొనినచో నప్పుడో?"

భగవాను డిట్లనెను:– "ఎట్టు పట్టుపడెదవుతమ్ముడూ! నేను లేక పోయినప్పుడు పట్టువడిన పొండు. నేను మీ వెంట నుండగా మీకే చింతయు నవసరములేదు, అంతయును నేను నిర్వహించు కొందును. మీరందరును నన్ను విశ్వసింపుడు."

అందరిటులనిరి:- "మాకు నీమీదఁ బూర్ణ విశ్వాసము కలదు. మంచియో చెడ్డయో, నలుపో తెలుపో నీయిష్టము. నీవేది చేసినను మాకే యభ్యంతరమును లేదు. నీ వౌననిన మేమును నౌననెదము."

సూతుడిట్లనెను;- "మునులారా! ఈవిధముగ వెన్న దొంగిలించు దొంగల సమితి యేర్పడెను. ఆ సమితికి శిఖామణి యును, సభాపతియును నేకగ్రీవముగ శ్యామసుందరుఁ డెన్నుకొనబడెను. అందరు నాతనిపై దమ విశ్వాసమును బ్రకటించిరి. ఆతని కందరును సర్వాధికారమును సమర్పించిరి. ఇప్పుడిక నేవిధముగ యుక్తిచే వెన్నను, పెరుగును, పాలను మొదలగు రసవస్తువులను దొంగిలించిరో ఆవర్ణనమును నేను ముందు చేసెదను?



# గోపికా ఉపాలంభార్థము వెడలుట

(౮౭౩)

శ్లో॥ కృష్ణస్య గోప్యో రుచిరం వీక్ష్య కౌమారచాపలమ్ ।
శృణ్వాత్యాః కిల తన్మాతురితి హోచుః సమాగతాః॥

(శ్రీ భాగ. ౧౦ స్కం. ౮ అ, ౨౮ శ్లో॥

వ॥ మరియు నాకుమార శేఖరుండు గపట శైశవంబున దొంగ జాడలం గ్రీడింప గోపిక లోపికలు లేక యశోదకడకు వచ్చి యిటులనిరి.

— శ్రీమదాంధ్రభాగవతము

ప్రేమభాషయొక్క అర్థము శబ్దములతోఁ దెలియఁబడదు. కార్యముల చేతను దెలియబడదు. అతిభావగమ్యము. హృదయమే దాని అర్థమును దెలిసికొనగలదు. ప్రేమ భాషకు వ్యతిరేకార్థమే వచ్చును. ప్రేమ కార్యములకు విపరీతార్థమే యుండును. తిట్టుట తప్పే, కాని అత్తవారింటి తిట్లలోను – ప్రేమతిట్లలోను – నెంతటి యానందము నిండియున్నది. ప్రేమ లేక పిల్లవానివైపు కొంచెము సేపు చూచినచో నేడ్చును. భయపడును. కాని ప్రేమతో వానినొక దెబ్బ కొట్టుము, యెంతగా నానందించునో వాని హృదయము పొంగి పోవును. జుట్టును పట్టుకొనుటయు బాదుటయు మంచి పనికాదు: కాని పిల్లలవెంట్రుకలను ప్రేమపూర్వకముగ బట్టుకొనుము, వానిని గొట్టుము, దానిని వారనుగ్రహముగ భావించెదరు. తమరు అనునది శబ్దసమ్మాన వాచకము, శ్రేష్ఠమైనది. చక్కనిది. కాని యే పిల్లవానినైన తమరు అనుడు. ఆతడు భయపడును. ఇటు

లనుకొనును:– ' అవశ్యము నావలన నేదియో అపరాధము
గొప్పగ జరిగి యుండవచ్చును, అందుకనియే మా గురుజనము
నన్ను ' తమరు ' అనుచున్నారు. ఇకనైనను వెనుకగా వచ్చి
కన్నులను మూయుట మానివేసెదను. కాని ఆపనినే ఎవరైన
ప్రేమించినవాఁడు చేయుచోనది అన్నిటికంటె శ్రేష్ఠమగు కార్య
మనుకొందురు. ఎవరినైన చెలువు చేయబడిన వస్త్రములమీఁద
బురద, మట్టి, రంగును గొట్టిన నది చాల తప్పు. కాని వానినే
హోళికోత్సవమందు తన బావమఱఁది బావకుఁ గొట్టిన నది
అమృతమును జిలికినట్లు సుఖప్రదముగ నుండును. దొంగతనమే
ప్రేమపూర్వకముగ ప్రేమికునియొక్క ప్రియవస్తువును దొంగి
లించినచో వానిపై నిక్కలి అనుగ్రహముగ నుండును. వస్తువు
లందును, కార్యములందును, వచనములందును ప్రేమయుండదు.
ప్రేమహృదయముయొక్క వస్తువు. తన ప్రేమికునియొక్క సమస్త
చేష్టలును, సమస్తకార్యములును సుఖప్రదములుగ నుండును.
కొన్ని భావములను తెలిసికొనక కేవలము కార్యములనే ఆలో
చించుచో సత్యసహృదయము గలిగిన కర్మనిష్ఠుఁడగు
వాఁడు రసమార్గమున కనధికారి. ప్రేమలీలలు రసిక భావుక
భక్తులకే ఆనందము నొసంగును. రసహీనుఁడగు గుతర్కి వాని
వలన విపరీతభావనయే తీసికొనును. అపరాధ భాగుఁడగును.
శ్రీకృష్ణ బాలలీలలయందు నవనీతచోరలీలయే అన్నిటికంటె
సరసమైన ప్రసంగము: కాని శుష్కహృదయుఁడగు నరసికుఁడీ
ప్రసంగమును వినుట కనధికారి. ఎవనికి రసశాస్త్రమునందు
ప్రవేశము కలదో వారే వానిలాభమును బొందగలరు.

సూతుఁడిట్లనెను;– " మునులారా! శ్రీకృష్ణుఁడు బాల

చోర సమితినేర్పాటు చేసెను. ఇప్పుడాతడు చోరత్వ మొనర్ప బయలు దేరెను. బాలకులకుఁదిండి, ఆటలు ప్రియములుగ నుండును. వీనికొరకు సత్యాసత్యములను రెంటిని జెప్పగలరు. ఏడువఁగలరు. ఇంటిలోని వారికి విరుద్ధముగు వర్తనమును నెరపఁగలరు. ఇంటిలోని వస్తువులను దాఁచునవచ్చును. చెడఁగొట్టవచ్చును. ఆసమయమున స్వపర భేదముండదు, వస్తువులందు మోహమమత్వములు నుండవు. భవిష్యచ్చింతయు నుండదు. నేటిపని జరిగిన చాలును. నేటి ఆట ఆడిన చాలును. ముందు సంగతిని జూచుకొనవచ్చును. చూచుకొనున దేమున్నది. ముందును గొంత రాఁగలదు అను స్మరణముకూడ ఆతని కుండదు. పిల్లలకు నవ్వులాటలనిన మిక్కిలి యిష్టము ఎవరినైనఁ గాంచి నవ్వుటయును, ఇతరుల ననుకరించుటయును రహస్యవిషయములను దెలిసికొనవలయుననుజిజ్ఞాసయును, ఇవియే సాధారణముగ బాలకుల స్వభావముగనుండును.

బాలకులు తెలియగతాళిని, తమ యేమ్ములను నాపుకొనజాలరు. వారికేదైన నవ్వువిషయము వచ్చినచో పకపక నవ్వుచుందురు. ఏడ్పువిషయము వచ్చిన నేడ్చుచుందురు. వారికి స్వపరపక్షపాత ముండదు. దాపరికము వారికి తెలియనే తెలియదు. ఏదైనయున్న దున్నట్లు చెప్పుదురు. నవనీతచోరత్వమున నాటయును గలదు. రహస్యమును గలదు. నవ్వులాటయును గలదు. మరిగిన వస్తువును దినవలయునను నేర్పాటును గలదు. ఇట్టి కార్యము నే బాలకుడు కోరడు. అతిబాల్యావస్థలో గొంచెముగ వృద్ధస్వభావముగల బాలకులను వదలి అందరును నీక్రీడయందు సహాయ్యముగ జేయుదురు. కృష్ణుడు గంభీరముగ

నుండు బాలకులను దనసమితిలోనికి జేరనీయలేదు. చంచల స్వభావము కలిగి నవ్వుముఖము కలవారై క్రీడా, వినోదప్రియులై తనకనుగతబాలకులైన వారినే తన సంఘమున జేర్చుకొనెను. ఏయింటిలో నెంతమంది మనుష్యులున్నారో, ఎన్ని ఆవులున్నవో, ఎవరియింట నెంత వెన్నయగునో, దానినెచ్చట నుంచెదరో వారు యిల్లు వదలి యెప్పుడు పోయెదరో, ఆవెన్న యెట్లు ప్రాప్తించునో ఇల్లన్ని గృహములగుఱించి జాడలను దీసెను. ఆతని గుప్తచర విభాగము సుదృఢమైనది. ఇంటింట నాతని యనుయాయులు కలరు. చివరకు కుదుళ్ళు, పొయ్యి లన్నో కూడ చెప్పువారుకలరు. ఇప్పుడు వారింటింటికిని బోయి దొంగతనము చేయసాగిరి.

ఒకానొక భావమయయగు గోపిక యుండెను. ఆమె శ్రీకృష్ణుని రూపమాధుర్యము మీద ననురక్తిని జెందియుండెను. నిరంతరము శ్రీకృష్ణునిరూపచింతన మొనర్చుచుండును. నిత్యమును నేవియో అనేక వంకలు బెట్టుకొని యశోదమ్మ యింటికిబోవును. శ్రీకృష్ణుని గాంచి సంతుష్టిని జెందును. శ్రీకృష్ణుడు తన యింట నెప్పుడైనను వెన్నను దినిన బాగుండు ననుకొనుచుండెను. నందుడు గోకులమునందు తన వంశమున బెద్దవాడు. ఆతడు కొండలకు పినతండ్రి యగును. కొండలకు సోదరుడును పడకుడును. అందువలన నధికొంచము శ్రీకృష్ణునకు బినతండ్రిభార్యలు. వదినెలు, పెదతల్లులును నగుదురు. భావమయయగు నాగోపిక కృష్ణునకు వదినె యగును. ఆమె యింటికి వెడలు నపుడు కృష్ణుడు తల్లిఒడిలో గూర్చుండిఆమెను "వదినా" అని పిలిచి తల్లిపైట కొంగుచాటున ముఖమును

దాచుకొనును. ఆమె యిట్లనును:- "అబ్బాయీ! నేనెత్తు కొందునురా" అప్పుడాతడు తల్లి ఒడిలోనే సిగ్గుచే నోదుగు కొని యుండును. అప్పుడు తల్లి యిట్లనును:- ఓరీ! కృష్ణయ్యా! నీవు నీనవి నెలకు గూడ సిగ్గుపడెద వేమిరా? చూడుమెట్లు పిలుచు చున్నదో, పొమ్ము. కాని ఆతడు పోడు."

ఒకదినమున నాతడామె కొట్టమునకు బోయెను. ఆమెకు జాలగ నావులు కలవు. ఆమె దూడల నన్నిటిని విడిచిపుచ్చి పసుగాత్తుకొనిపోయి ఆమెతో చెప్పుచు నిట్లనెను "చూడు! మీదూడలన్నియును నూడదీసికొనినవి. నేను వానిని గట్టి వేయుద మనుకొంటిని, కాని అవి నాకెట్లాగగలవు? త్వరగా బొమ్ము. లేకున్న నవి పాలనన్నిటిని త్రాగివేయును."

ఇది విని ఆమె పరుగిడి కొట్టములోనికి బోవుచునిట్లను చుండెను:- "కృష్ణా! మాయింటిని జూచుచుండుము. కుక్క లును బిల్లులును రాగలవు"

ఆతడిట్లనెను:- "సరేలే వదినె! నీవుపో, నేనిచ్చటనే కూర్చుందును." గోపికకొట్టము వైపునకుబోగా నాతడు వెంటనే చప్పట్లను గొట్టెను. చప్పట్లశబ్దమును వినగానే దగ్గఱిలో దాగియుండిన దాము, సుదాము తోకకృష్ణ కింకిణీ, మనసుఖ, మధుమంగళ, రైంద, పైంద, సైంద, సరకువా, మటకువా, లటకువా మొదలగు వందలకొలది గోపకులు వచ్చిరి. ఇంకే మున్నది: వెన్నముద్ద లెగిరిపోవుచుండెను. శ్రీకృష్ణుడు వెన్న అటకను దెచ్చెను. పిల్లలందరును దానిని బంచుకొని తిను చుండిరి. శ్రీకృష్ణుడు దూరమున నుండియే గోపిక వచ్చు చున్నదని తెలిసికొనెను. పిల్లలందరకును సైగలతో నిట్లు చెప్పెను

ఇప్పుడందరును దాడు తీయవలెను" వెంటనే కొందరు బుగ్గల నిండ వెన్నను బెట్టుకొనియు గొందరు చేతులలో ముద్దలను బట్టుకొనియు నచ్చటినుండి పాఱిపోయిరి. శ్రీకృష్ణుడిరువ సాగెను:– "ఓరీభూర్తులారా! నిలువండి. ఇప్పుడు పాఱిపోయెద రేల?

గోపికపోయిచూడగా పాలు, పెరుగు, వెన్న మొదలగునవి ఉన్న దుత్తలన్నియును పట్టిపయ్యెను. ఆమె యిట్లనెను:– "అయ్యో కృష్ణా! నీవిట్లు చేసితివేమి?"

ఆతడిట్లనెను:– "వదినె! నీవు నన్ను గుక్కలను పిల్లులను రాకుండ జూడమంటివి. నేను వానిలో నొక్కదానిని గూడ నింటిలోనికి బోనీయలేదు."

గోపిక యిట్లనెను:– నీవుపోకిరి పిల్లవాండ్ర నేల నాపక పోయితివి? శ్రీకృష్ణుడిట్లనెను:– నే నెంతో ఆపితిని; కాని వారు చాలమందైనారు. నేనొంటరిగాడ నైతిని. నేనొక్కడ నెట్లాపగలను?

గోపిక యిటులనెను;– " నీవువారి నచ్చట నాపితివి? నీవు వారికి బెట్టి నీవును దినుచున్నావు,

శ్రీకృష్ణు డిటులనెను;– "వదినె నీబొట్టు, నీభర్తమీద బొట్టు. నేను వెన్నను దాకనే తాకలేదు."

గోపిక యిటులనెను:– , అయ్యో! నాయనా! నీవబద్ధపు బొట్టు పెట్టుకొనుచున్నావు. నీవందరతో గలిసి తినుటను నేను జూచితిని. నీనోరింకను వెన్నమైయున్నది. బుగ్గమీద నతుకుకొని యున్నది.

శ్రీకృష్ణుడిట్లులనెను:_ "వదినె! నీవు వృథాగా అనుచున్నావు. నేను నీ వెన్నను జూడనైన జూడలేను. ఒక కుఱ్ఱవాడు వెన్నను దినుచుండెను. చేతిలోనికి దీసికొని నాడు. నేను వానిని బడద్రోసితిని. వాడుపడిపోయినాడు. కాని మరల నాతడు నన్ను బడవైచినాడు. చేతులతో నానోరును బట్టుకొని మూసినాడు. ఇదంతయును నిన్ను బిలువకుండుటకే. ఆసమయమున నానోటికి వెన్న అయినదేమో! హావన మొనర్చిన హాస్తములుకాలును. ఉపకారమునకుబోయిన నపకారమగును. నేను నీయింటిని రక్షించితిని. దానికి ఫలితముగ నాకు దొంగతనమును గట్టితివి. ఇక నేను మీ యింటి కెన్నడును రానే రాను" అని పలికి భగవానుఁడు వెంటనేపారిపోయెను. గోపిక నిర్ఘాంతపోయి ఆతనినట్లె చూచుచు నిలిచి పోయెను.

ఇప్పుడు గోపికలందరకును శ్రీకృష్ణుడింటింటికిని నవనీతమును హరించుటకు వచ్చుచున్నాడని తెలిసెను. మా యింటికి రావలయునవిన మాయింటికి రావలయునని అందరును గోరుకొనుచుండిరి. త్వరగా దించుకొనుటకు వీలుగానట్టి స్థానములందు వెన్నను బెట్టుచుండిరి. పనులను జేసికొనుచునే అటునిటు అతను వచ్చెనా లేదా యని చూచుచుండిరి. ఏరోజున నెవరి ఇంట దొంగిలింపబడునో వారు తమ్ము ధన్యమనుకొనుచుండిరి. ఇప్పుడు గోపికలిటులనుకొనిరి. "ఇది బాగుండలేదు. ఆతఁడు మొదలక దొంగిలింప నీయవలయును. దొంగతనము చేయుచుండ నాతని బట్టుకొని, బుగ్గలను మెలియదీసి, అవును తింటివని యేడ్చినప్పుడు వదలి పెట్టవలయును." ఇటు లనుకొని

యిప్పుడు వారు శ్రీకృష్ణునిఁ బట్టుకొనుటలో వ్యగ్రులై యుండిరి. ఒక చురుకుగల్గి స్థూలముగలేని గోపిక రేపు నేను బట్టుకొనెద'' ననెను.

శ్రీకృష్ణు నెవరు పట్టుకొనవలె ననుకొందురో వారి కాతడు చిక్కఁతీయును. గోపిక రహస్యముగా దాగియుండెను. ఘట ఘట విషయములను తెలిసిన శ్యాముఁ డాయింట బ్రవేశించెను. గోపిక కిటికీచాటునుండి చూచెను. ఇటునటుఁజూచి వెన్నకుండలో శ్రీకృష్ణుఁడుచేతిని బెట్టెను. ఒక్కఁజుర్రుజుర్రెను. రెండవసారి తీయబోవునంతలో వెనుకనుండి వచ్చిగోపిక చేతిని బట్టుకొనెను. అంత నిట్లనెను:— "చెప్పుము కృష్ణా! ఏమిచేయు చున్నావు."

శ్రీకృష్ణుడిప్పుడు నిర్భయుడయ్యెను, చోర విద్యలో నిపుణుడయ్యెను. అందువలన సందేహింపక తడవు కొనక యిట్లనెను:— "మా మనస్సున కేది దోచిన దానినిఁ జేయుచు న్నాము. అడుగుటకు నీవెవరు ? "

గోపిక యిట్లనెను;— "ఇంటిదానను నేనే. నా యింటి లోని కేల వచ్చితివి ? "

శ్రీకృష్ణుడు కపట సంభ్రమముతో నిట్లనెను:— "అయ్యో ! పిన్ని ! ఇది మీయిల్లా ! నేనెంత పొరబడితిని. ఇది నాయిల్లనుకొని ప్రవేశించితిని."

గోపిక ఇట్లనెను;— "సరే, మీయిల్లే ననుకొనుము. ఈ వెన్నకుండలో జేయి నేల బెట్టితివి ? "

ఆతడిట్లనెను:— "నీవు కుండకు మూతను బెట్టక పోతివి.

చూడుమెన్ని చీమలు పట్టినవో. నేనీ చీమలను దీసివేయు చున్నాను."

గోపిక యిటులనెను:- "చీమలను దీసినావు మంచిదే. ఈ బుగ్గకు వెన్నెందులకైనది ?"

భగవానుడిటులనెను:- "ఈ కుండలోని చీమలు బయటకు వచ్చి నాముఖము మీఁదకెక్కినవి. నేను చేతిని దీసితిని. ఆ వెన్న తగిలిన దేమో"

సఖి నవ్వి యిట్లనెను:- "కొన్ని చీమలు ప్రాకినవి. కొన్నిటిని నేను పట్టించెదను." ఇట్లుపలికి ఆమె ఒక వెన్న ముద్దను దీసి శ్యాముని నోటికిఁబూసెను. శ్రీకృష్ణుడు పరుగెత్తుకొని పోయి యిటులనెను:- "నేను మా అమ్మతోఁ జెప్పెదనుండుము. నీవు నన్నింటిలో బంధించి కొట్టెదవా ?" అని పలికి ఆతడు పారిపోయెను. గోపకులిట్లనిరి:- "బావా ! ఒంటరిగా పోయి అంతయును దినివచ్చితివి. మమ్ములను బిలువనైన బిలువనైతివి."

శ్రీకృష్ణుడిట్లనెను:- "నేనొక్కడనే తప్పించుకొనివచ్చితిని. అదియే గొప్ప. కాకున్న నామూతిమీఁదవెన్నను రాచి నన్నపరాధిగా చేయుచున్నది. ఈమెకు మోసపు విద్య తెలియును. అరే ! పరుగెత్తుకొనిపొండు. ఈమె అందరను దోషులుగా నొనర్పగలదు. ఇచ్చటనే మేఁమేఁ అనికూర్చుంటిరేల?" ఇది విని రాందుడు, పేందుడు, సేందుడు మొదలగు వారందరును పారిపోయిరి.

ఒకదినమున కృష్ణుడొక యిల్లు ఖాళీగా నుండుటను గాంచి గొళ్లెమును దీసి దానిలో ప్రవేశించెను. దగ్గరిలోని

చిన్నమూంతిగల వెన్న దుత్తు పెట్టబడి యుండెను. దానిలో నుండి వెన్నను దీసికొని తినసాగెను. గోపిక బుద్ధిపూర్వకముగ దాగియుండెను. ఇప్పటికి కృష్ణుడు కడుపునిండ వెన్నను దిని పాత్రిపోవుటకు సంకించుసంతలో సదికనిపెట్టి వెనుకనుండివచ్చి చేతిని బట్టుకొని యిట్లనెను:– "కృష్ణా! నమస్తే. రామరాను ఏమిచేయుచున్నావో చెప్పుము."

ఆతడు విడిపించుకొని యిట్టుజవాబొసంగెను:– "వదినె! మా ఆవుదూడ ఒకటి తప్పించుకొనిపోయినది. దానిని వెదుకు చున్నాను."

గోపిక నవ్వి యిటులనెను:– 'దూడ తప్పించుకొని పోయిన వెన్నకుండలో వెదుకుచున్నావేమి ?"

శ్రీకృష్ణుడిటులనెను:– " దానిని వెన్నకుండ లోనే వెదుకు చున్నాను. మాదూడ కొద్దిగ వెన్నదే. అది వెన్ననే తినును. గంతులను వైచుకొనుచు బోవును. వెన్నకుండ కన బడిన దానిలోనికి దూకును."

గోపిక యిటులనెను!– "ఆ దూడను గన్నది యశోదమ్మయే కదూ ? అది తెల్లనివెన్నది కాక నల్లని వెన్నది కాదూ ?"

ఇది వినగానే శ్యాముడు నవ్వెను. గోపికయును బాల సంతుష్టిని జెందెను,

ఒక దినమున శ్యామసుందరుఁడు తన సఖులతోఁగూడ ఒకగోపిక యింటిమీఁదకు దండెత్తెను. ఇంటిలోని వారు పొల మునందు పనినిచేసికొనుటకు బోయిరి. గోపిక పెడను జేయుఁ

బోయెను. ఆతఁడు తనసైనికులను వెంట బెట్టుకొని ఆమె యింటిలో బ్రవేశించెను. అచ్చటచ్చట సఖులను దాచిపెట్టి, తాను కుండలోని వెన్నను దీసి తినుచుండెను. ఇంతలోనే గోపిక వచ్చెను. బయటనున్న సఖులు పిల్లలు కావున బారి పోయిరి. శ్రీకృష్ణుడు మిగిలెను. రైందుడు, పైందుడు, సైందుడు మొదలగు వారు. పది పదునైదుగురు లోపలనే దాగిన సఖులు మాత్రము మిగిలిపోయిరి.

నేడు శ్యామ సుందరుడు వచ్చినాడని సఖి గ్రహించెను.

ఆమె కసరి యిటులనెను;– "ఇంటిలో బ్రవేశించిన దెవరు ?"

అచ్చటనుండియే ఆతఁడిటులనెను:– "వదినె! నేనే!" తెలిసియు దెలియనటులుగ గోపిక యిటులనెను:– "నేననిన నెవరు ?"

శ్యాముఁడిటులనెను;– "నేనా ! కృష్ణుడను."

గోపిక ప్రేమరోషమును బ్రదర్శించుచు నిటులనెను;– "నీవు కృష్ణుడవైన నింటిలో నేల ప్రవేసించితివి ?

శ్యామసుందరుడు రహస్యమయ మగు వాక్యములతో నిటులనెను;– "వదినె ! కొంచెము మెల్లగబలుకుము. నేఁడు మా అమ్మ నాపై మిగులఁ గోపించియున్నది. ఆమె నన్నుఁ జిక్కినచో నిన్నుఁగొట్టక విడువనన్నది. అందువలనఁ దల్లికి భయమున నేనిచ్చట దాగితిని, కొంచెము నామీద దయ చూపుము. తల్లితో జెప్పవలదు. కొంచెముసేపు దాగి యుండె దను."

గోపిక యిటులనెను;— "దాగిన దాగితివిగాని యీ వెన్నదుత్తలను నీవు బయట బోరవైచిన దెందులకు ?"

శ్రీకృష్ణుడిటులనెను;— "వదినె! ఇంతసేపు నేను మీ యింటిలో దాగియుంటినిగదా? కొంచెమైనగనీపనిని జేసిపెట్టవల యును గదా ! అందువలన కుండలను దీసి నీయింటిని దుడిచి వేయుచున్నాను."

గోపిక యిటులనెను:— "ఇంటిని దుడుచుచున్నావా ? లేక వెన్నను దుడిచి వేయుచున్నావా ?"

శ్యామసుందరుఁ డిటులనెను;— "వెన్న యెచ్చట సున్నది వదినె! నీపాత్రలను గూడ శోధింప నునుకొంటిని. దీనిలో జూడగా మజ్జిగపైన మురికి పడియున్నది. నేను పాత్ర లను బయట బెట్టితిని. ఈ బాలకులు దరిద్రులు, మజ్జిగ మీఁద మురికినే యెత్తుకొని పోయినారు."

గోపికయిటులడిగెను;— "సరే, నీవు నీతల్లికి భయపడి దాగియుండినచో నిందరు సఖులను వెంట గొనిపోవుట కేమి కార్యము ?"

శ్రీకృష్ణుడిట్లనెను:— "నీవింటిలో లేవు ఎవ్వరును లేని యింటిలో నే నొక్కడనే యుండిన నేనైన దొంగతన ములు కట్టుదురేమోయని వీరిని సాక్షులుగనిలుచుండ బెట్టితిని."

గోపిక యిట్లనెను:— "దొంగలకును దొంగలకును స్నేహము. నీవెట్టివాడవో నీయనుచరులు నట్టివారే. వెన్నను నీవు తినుచున్నావు. గోపకుమారులను దరిద్రు లనుచున్నావు. నీ పెదవులను బుగ్గలను వెన్న అంటుకొని యున్నది."

సంభ్రమమునుతో శ్రీకృష్ణు డిట్లనెను:– “ వదినె! బాగున్నది. నామీద దొంగతనమును మోపుచున్నావా? ఇప్పుడే ఒకకుక్క వచ్చినది. వెనుకనుండి అకస్మాత్తుగ కుక్క వచ్చుటచే నేను భయపడి ఒకకుండమీద బడిపోయితిని. కుండ పగిలి పోయినది. నేను తలక్రిందులుగ వెన్నమీద బడితిని. దానివలన నోటికి వెన్న అంటుకొన్నదేమో! ”

ఇది విని గోపిక వాకిలిని బంధించి యిట్లనెను:– “ సరే ఇప్పుడు నీవు దాగుకొన దలచినచో దాగుకొను మిచ్చటనే” శ్రీకృష్ణుడు గదిలో బంధింపబడుటను గాంచి సఖులందఱును బాఱిపోయిరి. శ్రీకృష్ణుఁడు భయపడెను. కాని సఖులును జోరవిద్యలో నిపుణులైరి. వెనుకగాఁ దిరిగివచ్చి మట్టిగోడ నెక్కి కప్పునకు రంధ్రమును జేసి అచ్చటనుండియిట్లనిరి:– “ కృష్ణా! ఓరి బావా! నేడు నీవు బాగుగా జిక్కినావురా.”

లోపలనుండియే సైగతో శ్యాముఁడిట్లనెను:– “లాగండిరా నన్ను నారహస్యమంతయును బయటఁ బడఁగలదు.”

పిల్లలు నాఁడుకట్టుకొనిన ధోవతులను విడిచి ఒకటొకటి ముడివైచి వ్రేలాడవైచిరి. శ్రీకృష్ణుడు ధోవతిని బట్టుకొని నఁకెమీఁద గాలును బెట్టికప్పును జించుకొనియాతడు వారును బాఱిపోయిరి. వెంటనే తల్లి కడకుఁ బోయి తల్లితో నిట్లు పాట్లాటను సాగించెను:– “ అమ్మా! నీవేమియును జూడవేమి? కట్టుమట్టునుండి గోపికలు పేడనుదొంగిలించుచున్నారు. తట్టలు దీసికొని పోవుచున్నారు. పేడను దీసికొనుటకు బాఱును దీసికొని పోవుచున్నారు.”

తల్లి యిట్లనెను:– “ మనకు పేడకు కొదవేమియును

లేదులే. తీసికొని పోనిమ్ము. శ్రీకృష్ణుడిట్లనెను:– " దొంగి లించి తీసుకొనిపోవుట మంచిదికాదు. అడిగి తీసికొని పోవల యును గాని దొంగతనముగ నేల దీసికొని పోవలయును?

తల్లియిటులనెను:– " ఎవరునాను? మీరు నన్నడిగిన నేనిచ్చెదను. ఎంతకావలయుననిన నంత గొనిపోవచ్చును. దొంగతన మేల చేయుదురు?

శ్రీకృష్ణుడిట్లనెను:– " ఇప్పుడిప్పుడే నలుగురు దొంగి లించి ఆవుపేడను గొనిపోవుచున్నారు? నన్నుఁ జూచి ముగ్గురు పారిపోయినారు. ఒకతె నాతోఁ బోట్లాడ సాగినది. నేనేమి చేయుదును? ఆమె పెద్దది. యువతి. నేనా చిన్నవాఁడను. పిల్ల వాడను. ఆమె పైగా నన్నే కసరసాగినది."

తల్లి యిటులనెను:– "పోనిమ్మురా, నాయనా! అంద రును మన ప్రజలే,"

ఇచ్చట తల్లియునుగొడుకును మాటలాడుకొనుచునే యుండిరి. అచ్చట గోపిక శ్రీకృష్ణుని గదిలో బంధించెను గాని ఆమె హృదయము దడదడఁగొట్టుకొనుచుండెను. లోపల బంధింపఁబడుటచే శ్యామసుందరుని మనస్సేమి కష్టపడునో యని యనుకొనుచుండెను. తలుపులు దెఱచిన నాతఁడు పాఱి పోవును, అట్లే మూసి యుంచినచో నాతనికిఁ గష్టము కలుగు ననుకొనుచు నామె తలుపును దెఱచి చూడఁగా దానియందు గృష్ణుడును నాతని జాడయును లేదు. గోపిక మిక్కిలి యాశ్చ ర్యమును జెంది లోపలకుఁబోయెను. కప్పుతీయఁబడి యుండు ఎను గాంచి అంతయును గ్రహించెను. చోరశిరోమణి యెట్లో ప్పును జించుకొని పాఱిపోయినాఁడు. ఇంటికిఁ జేరెనో లేదో

చూచెదను" అనుకొని ఆమె నందభవనమునకుఁ బోయెను. ఆమెను జూడఁగనే శ్యామసుందరుఁడిట్లనెను:- "ఈమెయే ఆవు పేడ దొంగ. ఎప్పుడును దొంగిలించుకొని పేడను గొని పోవుచుండును. ఇవ్వేళ నేనీమెను దొంగతనము చేయుచుండఁ బట్టుకొనగా నాతోఁ బోట్లాడ నారంభించినది. ఆవుపేడకు మనకు తరుగులేదు కాని యీమె దొంగతనముగఁ గొనిపోవు చున్నది. ఇది నాకు బాగుండలేదు. దొంగతనమనిన నాకు బనికిరాదు. ఎవరైన దొంగతనము చేయుచుండ నేను గాంచి నచో నాకు రక్తము బుకుచుండును.

ఇదివిని యశోదమ్మ నవ్వసాగెను. గోపిక సైగలతో నిట్లనెను:- "సరేలే. ఈసారి రావలయును. ఎవరు దొంగైన దియు నప్పుడు చెప్పెదను. ఆమె వెడలుటను గాంచి శ్యామ సుందరుఁడు చప్పట్లను జఱచుచు నవ్వసాగెను.

ముసలిది వెంటనే కోడలికి సంకటి నొసంగి పంపెను. క్రొత్తకోడలు కావున ముసుగు వైచుకొని పోవుచుండెను, ఇప్పుడచ్చట మైదానము చక్కఁగా నుండెను. గోపకులు నవ్వ సాగిరి. కృష్ణుడు నోటిమీఁద చేయి వైచుకొని వారిని నోరు మూయించెను. మరల నిటులనుకొనెను:— "ఇచ్చట వెన్నను దినినచో గోలయగును. ముసలిది తెలివితక్కువది. గందరగోళము చేయగలదు. కావున వెన్నను దీసికొని పోయినచో బయట నేకాంతముగ యమునానది యొడ్డున బెట్టుకొని తినవచ్చును."

ఇట్లువాఁడు నాలోచించుకొని మొదలకె అంతయును వెన్న ముద్దలను నన్నిటి యాకులయందుంచుకొని గుడ్డలలో గట్టుకొనిరి. వారు కౌతుకులుకదా, నాఁడు తీసిన వెన్నను వారు తీసికొని ఆ వెన్నకుండలో బురదను బోసిరి, పైన గొంచెముగ వెన్నను బొదివిరి. వెన్నను తీసికొని పారి పోయిరి.

కోడలు సంకటినిచ్చి తిరిగివచ్చెను. రొట్టెను చేయ సాగెను. మధ్యాహ్నము రెండు జాములకు అత్తయును, భర్తయును భోజనమునొనర్ప వచ్చిరి. భోజనమును చేయునపుడు వారు వెన్నను వేయుమనిరి. క్రొత్తకోడలు కావున సదా ముసుగు వైచుకొనియే దుత్తను తెచ్చి చేతితో నా బురదను వడ్డించెను. అత్త యిటులనెను;—"అమ్మాయీ! బురదెనదేమి? అయ్యో! మేము వెన్న వేయుమనగా నీవు బురదను వడ్డించితివా ?

ఇదివిని కోడలు మిక్కిలి లజ్జితయై ఇదేమియో ఆమెకుఁ దోచకుండెను. తనముసలి అత్త చెవిలో నిటులనెను;, "అత్తా! నేను నేడే దీనిలో వెన్నను బెట్టితిని. బురదగా నెట్లు మారినది? "

ముసలిది అంతయును గ్రహించి యిటులనెను;— "అమ్మాయీ! నందనందనుఁడు వచ్చినాడు. ఆతడింటికి బోయి వెన్నను దొంగిలించుచున్నాడని వినియున్నాను. ఏదో చప్పుడును నేను వినియున్నాను. ఎలుక లేమోనను కొంటిని, కాని నాకేమి తెలియును? ఇదంతయును ఆరెండుకాళ్ళ పెద్ద యెలుక యొక్క ఉత్పాతమే. నీవు తక్కిన కుండలను గూడ చూడుము."

ఇదివిని కోడలు లోనికిఁ బోయెను. ఆమె చూడఁగాఁ గుండలన్నియును ఖాళీగాఁ బడియుండెను. వెన్న యేమాత్రమును లేదు. కోడలిటులనెను;— "అత్తా! వెన్న యేమాత్రమును లేదు." ముసలిది యిట్లనెను;— "నీవుపోయి యశోదమ్మతో నీకొడుకిట్టి యుత్పాతము లొనర్చుచున్నాఁడని చెప్పిరమ్ము."

ఒక ముసలిది చాలతగవరి, ఆమెకు తగవులేనిది అన్నమునుగదు. ఆమె అన్నము లేకుండనైన నుండగలదుకాని తగవు లేక నుండఁజాలదు. ఆమెకొక్క తెయే కోడలు. ఆమె దిన మంతయును బని చేయుచు, స్వయముగఁ గూర్చుండి పనులు చెప్పుచుండును.

శ్రీకృష్ణుడిట్లను కొనెను:— "ఈ తగవులమారి యింట వెన్న దొంగిలింపవలయును." అని అనుకొని ఆతడటునిటు చూచుచుండెను. ఆమెకోడలు బిందెను, ఘోవతినిఁ దీసికొని యమునానది వైపునకు బోగానే కొంచెము సేపటికి వచ్చి రొప్పుకొనుచు నిట్లనెను:— పెదమ్మా! పెదమ్మా! పెద్దముప్పు టన జరిగినది"

ఉలికిపడి ముసలిది యిట్లనెను;– " ఏమి దుర్ఘటనరా !

శ్యామసుందరుడిటులనెను:– " నేనిప్పుడే యమునానది దగ్గరనుండి వచ్చుచున్నాను. నదినే స్నానమును జేసి యమునా జలమును దీసికొని, బిందెను శిరస్సున బెట్టుకొని వచ్చుచున్నది. వెనుకనుండి నల్లని పోట్ల ఆబోతు వచ్చి ఒక్కకుమ్ము కుమ్మినది. ఆమెముందరకు బడిపోయినది. దానివలనఁ బండ్లూడి పోయినవి, నోటినుండి రక్తము కారుచున్నది. ఆమె యేడ్చుచు నాతో " మా అత్తకీసంగతిఁ జెప్పవలయునని చెప్పినది, అందు లకు నేను బయువిడి వచ్చితిని " ఇదివిని ముసలిది వెంటనే తలుపును దెరచినది తెరచినట్లుగనే వెడలి పోయెను. ఇచ్చట మిత్ర మండలి కృష్ణునిచాతురికి తుములముగ నవ్వుకొనిరి. అందరును వెన్నను దినిరి. పెరుగును ద్రాగిరి. కోతులకును, నెమళ్ళకును బెట్టిరి.

ఇచ్చటనుండి ముసలిది పరువిడుచుండెను. అటునుండి కోడలు యమునాజలమును దీసికొని వచ్చుచుండెను. ముస లిది ఆదరముతో నిట్లనెను;– " ఏమే ! ఎట్లుపడితివే పెద్దదెబ్బ తగులలేదు గదా ! "

కోడలు ముసుగులోనుండియే యిటులనెను;– " నీతో ఎవరు చెప్పిరి ? నేను బడనే లేదు. "

ఇదివిని యిదియంతయును నందనందనుని పన్నాగమని ముసలిది తెలిసికొని. యింటికిఁ బరువిడి వచ్చెను. చూడఁగా నచ్చట వెన్నదుత్తలు పడియుండెను. ఇదంతయును నందనంద నుని కార్యమని గ్రహించి ఆమె గద్దించి కోడలితో నిట్లనెను:–

"నీవు పోయి వెంటనే బోరిగింటి యామెను గూడ తీసికొని పోయి యశోదతో నీపిల్లవాఁడిట్టి ధూర్తకార్యము లొనర్చు చున్నాఁడని చెప్పుము.

సూతుడిట్లనెను;- మునులారా! శ్రీకృష్ణచంద్రుఁ డిట్టివి ఒకటి కాదు. రెండుగాదు. అసంఖ్యాకముగ మధురాతి మధుర లీలలను నిత్యమును వ్రజమందు జేయుచుండెను ఎవరినద్ద నేసంఘటనము జరిగిన వారు దానిని విస్తారముగ వర్ణించు చుండిరి. శ్రీకృష్ణుఁడిప్పుడు విచ్చలవిడిగ నాడ దొడగెను. ఎవరింటిలోనికైనను బోయి వారి వెన్న నుదినును. తిని వచ్చునపుడు పసిపిల్లవాని జుట్టుముడి కోసివచ్చును. ఒక్కొక్కప్పుడు మంచముమీదఁ బరుండి నిద్రించుచున్న గోపగోపికల జుట్లను ముడివేచి పైనఁ ద్రాటినిఁ జుట్టి వచ్చును. గయ్యాళియగు గోపిక యింటిలోని వస్తువును దెచ్చి యింకొకరి యింటిలోఁ బెట్టగా వారిద్దరునుబోట్లాడుకొందురు. ఇద్దరును బోట్లాడు కొనుచుండిన కృష్ణుఁడు నిలుచుండి నవ్వుచుండును. ఈవిధముగ నాతఁడత్యధికముగ నుపద్రవములను సలుపు మండ గోపికలందరును గలసి యశోదకు జెప్పవలయు నని తీర్మానించు కొనిరి. ఈ యుద్దేశ్యముతో నొకనాడుఁ గోపిక లందరును నందభవనమందు ఉపాలంభార్ధము బయలు దేరిరి. వారి మనస్సులలో జాల సంతోషమే. శ్రీకృష్ణుఁ డెల్లప్పుడు తమకడ నిట్టి అల్లరి పనులను జేయవలయునని వారి హృదయమున కలదు. కాని పైకి కపట రోషమును జూపించుచు నీ నెపమున తల్లిని సంతోషపెట్టు కోరికతో వారు తల్లికి శ్రీకృష్ణుని కొంటెతనమును జెప్పబోయిరి."



# గోపికా ఉపాలంభము



శ్లో॥ వాత్సాన్ముంచన్ క్వచిదసమయే క్రోశసంజాతహాసః
స్తేయం స్వాద్వత్త్యథ దధిపయః కల్పితైః స్తేయయోగైః
మర్కాన్భోక్ష్యన్ విభజతి స చేన్నాత్తి భాండం భినత్తి
ద్రవ్యాలాభే సగృహకుపితో యాత్యుపక్రోశ్య తోకాన్॥

(శ్రీ)భాగ. ౧౦స్కం. ౮అ. ౨౯ శ్లో॥

కం॥ బాలురకుఁ బాలులేవని,
బాలెంతలు మొగలు వెట్టఁ బకపక నగి యీ
బాలుండాలము సేయుచు
నాలకుఁ గ్రేపులను విడిచె నంభోజాక్షీ॥

క॥ పడతీ నీబిడ్డఁడు మా
కడవలలో నున్న మంచి కాఁగిన పాలా
పడుచులకుఁ బోసి చిక్కిన
కడవలఁ బోనడిచె నాజ్ఞ గలదో లేదో!

క॥ మీపాపఁడు మాగృహముల
నాపోవఁగఁ బాలు ద్రావ నగపడకున్నం
గోపించి చిన్నపడుచుల
నాపోవఁగఁ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ॥

(శ్రీ)మదాంధ్రభాగవతము.

ప్రేమతో జేసిన నుపాలంభమునందు, చెప్పువారికిని, వినువారికిని, నెవనిగూర్చి యుపాలంభ మొనర్పఁ బడుచున్నదో

వానికిని ఈ విధముగ ముగ్గురకును సుఖము కలుగును. ప్రేమ దేనిలో గలిసినను దానిని మధురమొనర్చు పదార్థము. బుద్ధిమంతుఁడగువాఁడే క్షేత్రమునఁ దన బుద్ధి నుపయోగించినను దానియందాతనికి ఖ్యాతి ప్రాప్తించును. ప్రేమ దశయు నిట్టిదే. చెడ్డపనినిఁ జేయుటయును, వినుటయును, గొప్ప పాపము: కాని ప్రేమపూర్వకముగ చేయఁబడిన చెడ్డకు మించినపుణ్యమీ ప్రపంచమున నేమియు నుండదు. గోకులమందలి పల్లెటూరు గొల్లలతిట్లకు ప్రసన్నుఁడైనట్లు వేదసారగర్భితములగు స్తుతులకు శ్రీకృష్ణుడు ప్రసన్నుడు కాడు. గోపికలాతని ధూర్తుఁడు, కితవుఁడు, మోసగాడు, వంచకుడు, చోరుడు, హృదయహీనుడు మొదలగు కఠోర శబ్దములతో సంబోధించుచుండియును వారు కృతకృత్యులైరి.

సూతుఁడిట్లనెను:— "మునులారా! అలంకరించుకొని గోపికలు నందభవనమునకుబోయిరి. యశోదదూరమున నుండి గుంపులు గుంపులుగ గోపికలు నందభవనము వైపునకు వచ్చుటను గాంచిరి. వారందరును వివిధములగు సువర్ణాది మణులచే గూర్పబడిన నాభరణములను ధరించి రంగుల రంగుల పైఁటలను వైచుకొని, ఇంద్రధనస్సునందు మెరయు మెరపులవలెఁ గనుపడుచుండిరి. యశోద వెంటనే దాసీలచే పెద్ద జంబుఖానాను బరిపించెను. తొందరగా తాంబూలమును వైచుకొని వాకిట నిలుచుండెను. నవ్వుచు నందపత్ని అందఱకును స్వాగతసత్కారములు నొనర్చెను. అందరును యశోద పాదములంటిరి. అందరను సౌభాగ్యవంతులు కావలయుననియును చిరంజీవులు కావలయుననియును, పిల్లలు కలుగవలయునని,

పెద్దవాండ్రు కావలయు ననియును, నాశీర్వదించి యశోద కూర్చుండెను. దాసీలు వెండిపళ్ళెమునందు వక్కలాకులను, నేలకులు మొదలైన వాటిని దెచ్చి అందర సమ్ముఖమున నుంచెను. కుశల ప్రశ్నలను స్వాగతము నైనతరువాత యశోద యిట్లనెను:— "నేడుమీరందరును గలిసి యేపని మీఁదను రాలేదుకదా? ఏదైనాపనియున్నను, నేదైనఁ గష్టమున్నను నాతో చెప్పవలయును."

ఆ గోపికలందరలో మిక్కిలి గయ్యాళిగా నున్నదియును, వాచాలయునగు నామె యిటులనెను;— "రాణి! మీవద్ద అంతిమ వీడ్కోలును గైకొనుటకు వచ్చియున్నాము. నీకు కొంత మొరపెట్టుకొనుటకై అందరమునుగలిసి వచ్చితిమి."

ఆశ్చర్య సంభ్రమముల తోడను, చింతాస్వరముసను యశోద యిటులనెను:— "ఏల? ఏమికారణము? వ్రజమున మీకేమి కష్టమున్నది! మిమ్ముల నెవరైనను బెదరించినను గష్టపెట్టినను నాకుఁ జెప్పుడు. వ్రజరాజుతోఁజెప్పి నేను వానికి దండమును విధింపఁ జేసెదను."

ఆగోపిక యిటులనెను:— "నీవాతనికి దండమును విధింపజాలవు. వ్రజరాజును నాతనికి దండమును విధింపఁ జాలఁడు."

యశోద ఆశ్చర్యమున నిటులనెను;— "వ్రజరాజును దండమును విధింపజాలని మహాబలశాలి యెవ్వఁడీ వ్రజమున బకటమైనాడు? వాని పేరును జెప్పుడు విందుము."

వారిలో నింకొక గోపిక యిటులనెను:— "ఆ బలశాలి యెవ్వడునుగాడు నీచిలిపికుమారుడగు కృష్ణచంద్రుడే."

తల్లి యిటులనెను:- "నాపిల్లవాడు చిన్నవాడు వాని కింకను మాటలాడుటయే చేతగాదు. ఆతడు మీకేమి యప రాధ మొనర్చినాడు."

ఒక గోపిక యిటులనెను;- "ఆతడు చిన్నవాడుకాడు. చాలపోకిరి. నీవాతని చేష్టలను గూర్చి వినినచో వాని పోకిరి తనము తెలియగలదు. నీయెదుట నాతఁడేమియు నెరుగని అమా యకునివలె గనుపడును."

తల్లి యిటులనెను: "వినెదను, ఏమి అల్లరినిఁ జేయు చున్నాడు. ?

గోపిక యిటులనెను:- "అమ్మా! మా యావుదూడ లను విడుచుచుండును,"

తల్లి యిటులనెను:- "ఇందేమి చెరుపు చేసినాడు? పాలను బితుకునపుడు మీరును దూడలను విడుచుచుందురు కదా! మీకుబనియును జేసిపెట్టుచున్నాడు. పైఁగా వాని మీద నేరములను జెప్పుచున్నారు."

గోపిక యిటులనెను;- "అమ్మా! పాలను పితుకు నపుడు దూడలను విప్పిన నేమియును బాధలేదు. అతడసమయ మున దూడలను విడుచుచుండును. పాలు పితుకు సమయము కాకపూర్వమే దూడలనన్నిటిని వదలిపెట్టి పారిపోవును. దూడ లన్నియును బాలను ద్రాగును, మేమట్లూరకె చూచుచు నూరకుందుము, మేములేని సమయమున నిండ్లలోనికిఁబోయి యున్న నంతను హరించుకొని పోవును."

తల్లి యిట్లనెను;- "అమ్మలారా! మీపిల్లవాఁడే

కదమ్మా ! ఏమియును ఫరవాలేదు. వాఁడు కొంచెము చంచలుడు కావునగొంచెము కసరి అదుపును చేయవచ్చునమ్మా!"

ఒక గోపిక మాటినిమడిచి యిటులనెను;_ "అమ్మా! నీవు వానిని గసరి అదుపును చేయుమను చున్నావు. ఆతఁడు చేయు చిడుకుతనముల వలన మంచివారే ఆతనికి భయపడు చుందుము. మేము గట్టిగా గోప పడితిమా, ఆసమయముననే మా కోపమంతయును గర్పూరమువలె గరగి బోవునట్లు పక పక నవ్వును. అప్పుడాపుకొందమన్నను మాకు నవ్వు ఆగదు. ఆతని నవ్వులో నొకవిధమగు మాయ మంత్రము కలదు. దానివలన నీతని సమ్ముఖమున నెవ్వరును గోప పడజాలరు. నవ్వుచు నీతడు హాని యొనర్చుచుండును."

నందపత్నియగు యశోద యిటులనెను:_ "అమ్మా! చూడుఁడు. మాయింట వెన్నకుఁ గొదువలేదను సంగతి మీకు తెలియును గదా! పిల్లవాఁడాయెను. ఎప్పుడైన నవనీతమును జూచినగనే మనస్సు పోయిన దేమో. గన్వంత వాని చేతిలో బెట్టరాదటమ్మా?"

గోపిక యిటులనెను:_ "అయ్యో! యశోదమ్మా! నీవును నట్టిమాటను బలికెద వేమమ్మా! నారాయణుని సాక్షిగా నాతఁడు కడుపునిండఁ దినిననేమి? అంతయును మాదియే కదా! మేము వెన్నను బెట్టమనుట లేదు. కాని వెన్నను యిచ్చిన నాతఁడు దిననే తినడు. పైగా నాకు వెన్న నిరాకరించును. కాని ఆతఁడు దొంగతనము చేసి పోవునపుడు మాత్రము ముద్దలకు ముద్దలే తిని వేయును. దొంగతనము

చేసిన వెన్న ఆతనికి రుచిగా నుండును. పాలను ద్రాగును. వెన్నను దినును. పెరుగును దుడిచిపెట్టును."

తల్లి యిట్టులనెను:- "ఒక్కపనిసి జేయుడమ్మా! పాలను, బెరుగును, వెన్నను, నేతిని యితర రసవస్తువులను బైనున్నట్లమీద బెట్టుడమ్మా!"

గోపిక లిట్లనిరి:- "అమ్మా! మేమివి యన్నియును జేసి చూచితిమి. మీబాలుడు నుంచి మంచివారిని జెవులు కొరుకు నంతగా దొంగతనములో మిక్కిలి నిపుణుడైనాడు. పిల్లులకువలె నీతనికి ముక్కుతో బసిపట్టుట కలదమ్మా. ఏ వస్తు వెచ్చటనున్నదియును నిమిషములో బసికట్టి, ఏపాత్రలో బాలున్నదియు, నేపాత్రలో బెరుగున్నదియు, దేనిలో నవనీత మున్నదియు, దెలిసికొనగలడు. ఈతడు కొంత జట్టును బ్రోవు చేసికొనినాడు. ఆతడు పాలను జూడగనే ఆకుండకు జిల్లి పెట్టగా బాలు ధారగా గారుచున్నప్పుడు అందఱును నోళ్ళను దెఱచు కొని త్రాగివేయుదురు. వెన్నకుండను దింపవలసివచ్చినచో నొకనిపై నొకడెక్కి దానిని దించి తినివేయుదురు."

తల్లియిట్టులనెను:- "ఏమమ్మా! తిసినారే అనుకొనుడు అందరి పిల్లలును మీపిల్లలే కదా! తిననిండు."

గోపిక యిట్టులనెను:- "తినినచో మాకేమియును నభ్యంతరము లేదు." పొట్టనిండాతిననిండు. తనసహచరులకు గంపునిండ బెట్టనిండు. కాని ఆతడందఱకునుసదానర్త మొసంగి పంచుచుండును. ఆతడు క్రోతులన్నిటికిని నొక విద్యను నేర్పి నాడు. ఆతని జూడగనే క్రోతులన్నియును గుమిగూడితోక లను జాచుకొని కూర్చుండును. వీని కన్నిటికిని వెన్నముద్ద

లను విసరివేయుచుండును. వాటికెని పొట్టలేకదా! క్రోతు లును నెంతవఱకని తినగలవు. అవియును దినజాలకపోవును. క్రోతులును దిననప్పుడ తిట్టుట కారంభించును. ఏమిదౌర్భాగ్యపు వెన్నయో గాని మాక్రోతులును దినుటలేదు.'' అని పలికి క్రోధమును జెంది ఆతఁడు పాలను, పెరుగును, నేతిని నవనీతము మొదలగునవి యున్న కడవలను నాయీవరణము ననే విసరివైచి పగులఁ గొట్టును.''

యశోదమ్మ యిట్లనెను:— మీరందఱొక్కపనినిఁ జేయుఁడు. వానినిండ్లలోఁ బెట్టుకుఁడు. ఏదైనఁ బెద్ద పెట్టెలో బెట్టి తాళమును వేయుఁడు. లేదా యెచ్చటనైన దాచి పెట్టుఁడు'

గోపిక యిట్లనెను:— "ఇవన్నియును జేసి చూచితి మమ్మా! తల్లీ దీనివలనను ప్రయోజనము లేకపోయినది. ముందుగా సఖుల సహాయమున వారితోగూడి యింటిని వెను కును. ఇంటిలో నేమియును దొఱకక పోయినచో నింక నింటిమీఁదనే కోపమును వహించును. ఆతఁ డిట్లనును:— "ఈయిల్లు మిక్కిలిచెడ్డది. అశుభమైనది. ఏయింటిలో బాలు పెరుగు, నేయి, వెన్న మొదలగునవి లేవో ఆయిల్లు ప్రజ ములో నుండుటకు వీలులేదు.'' అని పలికి యింటికప్పునకు నిప్పును బెట్టుచుండును. ఇల్లు తగులబడుటకు ప్రారంభింపగనే పారిపోవును. లేదా యింటిలోని వారిమీద గుపితులగుదురు. పిల్లవాడు నిద్రించినచో వానిని గిల్లి పారిపోవును. నిద్రించు నపుడు వంకెకు వాని జుట్టును బంధించుచుండును. చేతులను రెంటిని త్రాళ్ళతో గట్టివేయుచుండును. ముఖముమీద గుడ్డను గప్పిపోవుచుండును.''

యశోదమ్మ యిటులనెను:_ "గోపికలారా! మీరింత పెద్దపెద్ద యువతులైరి. మాపిల్లవాడు చాల చిన్నపిల్లవాడాయెను. మీరు యువతులు కాబట్టి యౌవనమదమున మదించియుండి, మాపిల్లవానితో నెగతాళి పరిహాసము లొనర్చియుందురు. మాపిల్లవాడు కొంచెముగ జిలిపివాడేకాని మీరు గోరంతలు కొండంతలుగ జెప్పుచున్నవి మాత్రముచేయడు. చేసినాడనిన నాకు విశ్వాసము కలుగుటలేదు. రెండుచేతులతో గొట్టినగాని చప్పుడు కాదు. మీరాతనితో బరిహాసము లొనర్చుటను మానివేయవలయును. అప్పుడు తనకు దానే చక్కబడగలడు."

గోపిక యిటులనెను:_ అమ్మా! నీవు నీపుత్రుని పక్షమున నహించి మా మాటలను విశ్వసింప వనుసంగతి మాకిది వఱకే తెలియును. మంచిది. విశ్వసింపకుము. ముందుగా మీ పిల్లవాడు చేయు పనులన్నిటిని వినుము. విని నీకేదియుచితమని తోచిన దానిని జేయుము."

సూతుడిటులనెను:_ "మునులారా! ఇట్లు పలికి వారు తల్లితో శ్రీకృష్ణు డొనర్చిన నితర చిలిపిచేష్టలను గూడ నధికముగ జెప్పసాగిరి. వాని వర్ణనమును నేను ముందు చేసెదను.



జెప్పక యుండ జాలము. సరిగా జెప్పనిందు. వంకరగా జెప్పనిందు. త్రిప్పిచెప్పనిందు. మెలికగాఁ జెప్పనిందు. చెప్ప వలసిన దే ఒకవాణి కలదు. శబ్దములతో నది స్తుతిగా నుండును: కాని వాస్తవమున నది నింద. ఇంకొక కథనము కలదు. వినుటకది తిట్టుగా నుండును. కాని లోపల దాని యందనంత ప్రేమ నిండియుండును. కాముకుఁడు కామిని యొక్క కథలను జెప్పుచుండును. భక్తుఁడు భగవంతుని కథ లను జెప్పును. సాంసారికులు సంసారమునకు సంబంధించిన కథలను జెప్పుచుందురు. తమ ప్రియతమునిఁ గూర్చిన కథలను జెప్పువారు ధన్యులు. వానిని వినువారును ధన్యులే. అట్టి వారు మిక్కలి ఆసక్తితోడను, అత్యంతోత్సాహముతోడను దన ప్రియుని కథలను వినెదరు.

సూతుఁ డిట్లనెను;—"మునులారా! గోపికలు యశోద దగ్గర శ్రీకృష్ణుని యుత్పాతములను గూర్చి వర్ణనము చేయు చుండిరి. ఇంతలోనే శ్యామసుందరుడు వచ్చి తల్లి ఒడిలో గూర్చుండెను. ఇంకేమున్నది. గోపికల యుత్సాహము పెరి గెను. కృష్ణుఁడు తల్లిని గౌగిలించుకొని యుండెను. ఆమె పైఁట చెఱఁగుచే నాతఁడు తన ముఖమును గప్పుకొనెను. అప్పుడప్పుడు తల్లి చూడకుండునట్లు, ఆమె నీలి చీరెలో కుండ గోపికలను గ్రీగంట దృష్టితో. చూచు చుండెను. అపుడు మేఘములలో నుండి శరత్పూర్ణిమ యందలి పూర్ణ చంద్రుఁడు తొంగి చూచుచున్నట్లుండెను. అందఱి హృదయ ములు ప్రేమకారణమున నుప్పొంగుచుండును. వారు యశో దతో ముందే చెప్పుచుండిరి."

ఒక గోపిక యిట్లనెను;— "యశోదమ్మా! నీకొడుకు చేయు పనులు ఒకటియు, రెండైనఁ జెప్పవచ్చును. ఈతడు నిత్యమును క్రొత్త క్రొత్త దొంగతనము లొనర్చుచుండును. ఒక దినమున నేను బిడకలను జేయఁ బోయితిని. నేనావు పేడనుఁ బ్రోవుచేయునంతలో నావద్దకు మీపిల్లవాడు వచ్చి యిట్లనెను.— "వదినె! రామరామ నమస్కారము,"

నేనిట్లంటిని:— "వేయ్యేండ్లు బ్రతుకు నాయనా! దేనికి రామరామ యనెదవు."

ఈతడిట్లనెను:— "రామరామ యనుటయును పాపమా యేమిటి?"

నేనిట్లంటిని:— "పాపమేమియును లేదు. కాని నీ రామ రామ కొంత రహస్యభరితముగ నుండును. నేఁడెవరి యింటి మీఁదఁకు దండెత్తుటో చెప్పెదవా?"

తెలియనివానివలె నటించుచు నిట్లనెను:— "ఎట్టిదండు వదెనె?"

నేనిట్లంటిని;— "ఎంతనంగనాచి వైతివిరా! నేఁడెచ్చటి కిని దొంగతనమునకుఁ బోలేదా?"

ఇంకేమున్నది. ఇది వినఁగానే కోపించి యిట్లనెను:— "నీవు దొంగవు, నీ యన్న దొంగ, నీయబ్బదొంగ, నేనెప్పుడు దొంగతనము చేసితిని?"

నేనిట్లంటిని:— "నేను నీ మాయలలోఁ బడుదానను గాను."

అప్పుడిట్లనెను:— "ఇంతవరకు నేను దొంగతనము నే

యెరుగను, కాని యిప్పుడు నీవు నన్ను దొంగ యంటివి. కావున దప్పక దొంగతనము చేసెదను.

నేనిట్లంటిని:— "చూచెదములే! నేనును జాగ్రత్తగనుండెదనులే." మరునాఁడు నేను గూర్చుండియుండగా నొక పిల్ల వచ్చి యిట్లనెను;— "అత్తా! నిన్ను నాయనమ్మ పిలుచుచున్నది."

నేనిట్లంటిని;— "అమ్మాయీ! నీవెవరవు?

ఆమె యిట్లనెను:— "అయ్యో! అత్తా! నీవు నన్నెరుఁగవా? పాపమ్మ నాకు నాయనమ్మ యగును."

నేనిట్లంటిని:— "నీవు వసంత కూతురవా? సరే, నేను మీనాయనమ్మ దగ్గరకుఁబోయెదను. నీవిచ్చటనే యుండుము. నల్లనివాడు, పద్మ నయనంబుల వాఁడగు నందనందను డింటి లోనికి రాకుండ చూడవలయును. ఇంటిలో గోడలొక్కటెయే యున్నది."

ఆ పిల్ల చాల చతురగాఁ గనబడుచుండెను. ఆమె యిటులనెను:— "అత్తా! నేను మా గ్రామమునుండి వచ్చితిని. నందనందనుడు నవనీతమును హరించుచున్నాడని నేను వినియుంటిని. నేనాతని నెరుగుదును. నీవు వచ్చువరకు నేను వాకిటనే యుండెదను."

ఇది విని నేను వెడలి పోయితిని. నేను శ్యామలపిన్నిగారింటికి పోయి నన్నెందులకు పిలిచితివని అడుగగా నామె నేను పిలువలేదమ్మా! యనెను. ఇప్పుడే వసంతమ్మగారి అమ్మాయిని పంపినావు కదా! నేనామెను ఇంటిలోఁ గూర్చుండఁ బెట్టి వచ్చితిని."

ఆమె యిట్లనెను;- "అమ్మాయీ! నీవు మాత్రమం దేమియును గ్రాగలేదు కదా! వసంత మాకత్తగాదు. ఆమెకు ఆడపిల్లలేదు. మగపిల్లవాఁడమ్మా!"

ఇదంతయును నీతని పోకిరి తనమని నేను గ్రహించితిని. పరుగెత్తుకొని యింటికి రాఁగా నేమున్నది? గోప బాలకు లందరును వెన్నను మెక్కుచున్నారు. ఆపిల్లవాఁడు క్రోఁతులకు ముద్దలకు ముద్దలనే వెన్నముద్దలను బడవేయు చున్నాడు. నేను దూరముగ నుండగనే చూచి "కృష్ణా! నిలునిలు" మంటిని. ఆసమయమున నాతఁడు శృంగమును జూపుచు నిట్లనెను;- "వదినె! రామ రామ! ఇఁక నన్ను దొంగవనవు కదా!"

ఇట్లు పలికి సఖులతోఁ గూడి పారిపోయెను. పిచ్చి నేనిం టిలోఁ జూతునుగదా! పాలు, పెరుగు, నేయి యున్న కడవ లన్నియును రిక్తముగ బడియుండెను. పిల్లవాడుయ్యాలలోఁ బడి యేడ్చుచున్నాడు. పిల్ల ఒక స్తంభమునకు గట్టబడియుండెను. అప్పుడు నేను గ్రహించితిని. అది పిల్లవాఁడని. ఈ సిపిల్లవాఁడే కొంపలు తీయుచున్నది."

యశోద నవ్వి యిటులనెను:- "నీవెంత తెలివితక్కువ దానవమ్మా? నీవు మగపిల్లవాఁడైనదియు, నాడుపిల్లైనదియు గుర్తింపజాలవా? మాపిల్లవానిని బిల్లయని యందువా!

అంత నింకొకతె యిటులనెను:- "నీయీ బాలకుడు పిల్లయును గాడు. పిల్లవాడు గాడు; తంపులు పెట్టువాడు."

యశోద యిటులనెను.- వీడు మీకొంప లెప్పుడు తీసి నాడమ్మా!

ఆమె ఇటులనెను:– "నాకథను గూడ వినుడు. గడచిన మాఘమాసముననే నేను గాపురమునకు వచ్చితిని. మూడు సంవత్సరములకు ముందు నేను వివాహమునకు వచ్చినపుడు నీచంకలో నీనిని గాంచితిని. అప్పటినుండియును మా అత్తగారు అమ్మాయీ యశోదానందనునితో జాగ్రత్తగా నుండవలయును. ఆతెడండఱ నవనీతమును మెదలక తీసుకొని తినివేయుచుండును. పాలను దాగివేయును. పెరుగును నాకివేయును,"

నేనిట్లంటిని:– "అత్తా నీవు నిశ్చింతగ నుండుము. నేను నా పుట్టినింటను నందనందనుని దొంగతనము విషయములను వింటిని. నాదగ్గఱ నాతడు దొంగిలింప జాలడు."

అత్తగారిట్లనెను:– "అమ్మా! అతడతి పోకిరీ. మెదలక యింటిలో బ్రవేశించు టక్కరి. ఆతని నెవరును బట్టుకొనజాలరు."

నేనిట్లంటిని:– "అత్తా! మనయింటి కాతడు వచ్చినచో నేను బట్టుకొనెదను."

ఈతడు మాయిరుగు పొరుగిండ్లకు దొంగిలింప వచ్చును గాని యెందులకో మాయింటికి మాత్రము వచ్చుటలేదు. మాయింట దొంగతనము చేయజాలడని నాకు గర్వము. ఒకదినమున నీతడునంటరిగా వచ్చుచుండుటను గాంచితిని? ఈతని చంచల నేత్రము లీతడేదో అన్వేషణమున నున్నాడని చెప్పుచున్నవి. మాయత్త పొలమునకు బోయెను. నేను తలుపులను దెఱచి ఒకవైపున దాగితిని. ఈతడు వచ్చి అటునిటు జూచెను. కొంచెముసేపు దగ్గుచు సకిలించుచుండెను. అంత నిటులనెను:

"పిన్ని లేదాయేమి? ఈత డిదే ధోరణిలో నున్నాడని నేను గ్రహించి మెదలకుంటిని, పలుక లేదు. మరల నిటులనెను:— వదినె! తలుపుచు దెఱచి యుంచితి వేమమ్మా?"

నేను దాగుకొని కూర్చుంటిని. ఈతఁడు నెమ్మదిగా లోనఁ బ్రవేశించెను. నేను వెన్నకుండను గ్రిందనే పెట్టితిని వెంటనే యీతడొక ముద్దను నోట వైచుకొనెను. ఒక ముద్దను జేతితో బట్టుకొని అటునిటుఁ జూచుచు నీతఁడు పారిపోవ నుంకించునంతలో నేను వచ్చి గట్టిగాఁ జప్పున జేతినిఁ బట్టుకొని యిట్లంటిని? "కృష్ణా! ఏమిది, నీవు ఇతర గోపికల యింటి వంటి దనుకొన్నావా యేమి?"

ఇది విని కృష్ణుడు తడవుకొనుచు భయపడుచున్నట్లు నటించుచు నిటులనెను:— "వదినె! నేను నీకు దండము పెట్టెదను. పాదములకు మ్రొక్కెదను. గుంజిళ్ళు తీసెదను. ఇఁక నెప్పుడును మీయింటికి రాను. నీవు నన్ను వదలివేయుము."

నేనిట్లంటిని. — "కృష్ణా! నీవేమైనఁ చేయుము. మా అత్తగారు రాఁగానే నిన్ను మీ అమ్మ దగ్గరకుఁ దీసికొని పోక నేను వదలను."

ఇది విని యాతఁడు నాకనునయ వినయము లొనర్చి యిటులనెను:— "వదినె! నీమీఁద ఒట్టు, మీ అన్నమీద ఒట్టు. ఇఁక నేనెన్నటికిని రాను."

నేను బట్టుకొని నీకడకు దీసికొని వచ్చెదమను కొనునంతలో నీతఁడేడ్చుటను గాంచఁగనే నాకు దయకలిగెను. కాని నేను వదల లేదు. నిన్ను బంధింతు నని చెప్పితిని. ఇట్లు చెప్పి నేను వీని నొక స్తంభమునకు బంధించితిని.

కొంచెము సేపటికి ఇట్లనెను:– "వదినె! నీకు దయయైన లేదు గదమ్మా! నేను పరుగిడలేను. చూడుడు. నాచేతుల నెట్లు గట్టిగాఁ గట్టబడినవో కొంచెము వదులు చేయుము. నాకు దయ కలిగెను. పోయిచూడగా జేతు లెట్టఁబడెను. నేను వదలితిని. అప్పుడు మిక్కిలి ప్రేమతో నిట్లనెను;– "వదినె! నీకు బంధించుట తెలియదమ్మా."

నేనిటులంటిని:– "నీకు దెలిసిన రమ్మా, నేర్పుము."

అప్పుడిటులనెను;– "నరుసు కొనకుండ కట్టవలయును. తేలికగ గట్టుము. అట్లే ఒకచుట్టను ద్రిప్పెను. రెండుచుట్లను ద్రిప్పెను. మూడుచుట్లు ఇట్లు త్రిప్పి నన్ను గట్టివైచెను. "నేనిటులంటిని;– "అవును ఇప్పుడు దెలిసినది. ఊడదీయుము. అప్పుడాతడిట్లనెను:– నేను నీకు నీ తొత్తుకు నొకరునా దానిని విప్పుటకు. నీ మగనిచేత విప్పించుకొనుము," అని పలికి ఒక వెన్నముద్దను నాముఖమునంతటను బూసి పారిపోయెను.

మా అత్తగారునచ్చి యిట్లనెను:– "కోడలా! ఇంకను వంటఁ జేయలేదేమే ? వంటయింటిలోనికి గుక్కలెట్లు చొరఁ బడినవే? లజ్జచే నానోటినుండి శబ్దము కూడ వెలువడుటలేదు. నేనుబంధింపబడుటనుగాంచి మాయత్త అంతయును గ్రహించి యిట్లనెను:– "తప్పక యిది కృష్ణుని కార్యమే. నీవు వాని వలలో నెట్లు పడితివే. నేను వానివలలో నెన్నటికినిఁ బడనని బీరములను బలికితివి గదే!" ఇదివిని నేను లజ్జితనైతిని. అత్తగారు నాబంధనము నూడదీసెను.

యశోద యిట్లనెను;– "నీవును మాపిల్లవానినిఁ గట్టి

దమును గైకొనుము, నీకేదైన వరము కావలయుననిన గోరు కొనుము.” కావున రాణీ! ఈవిధముగ నీత డుపద్రవము లొనర్చు చున్నాడు.”

ఇదివిని మరల నాల్గవ గోపిక యిట్లనెను;- “ అమ్మా! నీయొడియందు కృష్ణుడెంతో నంగనాచిగా గూర్చుండును. కాని నీవాతని దొంగిలించుచుండఁ జూచినచో నవ్వినవ్వి పొట్టలుబ్బి పోయి క్రిందపడి దొర్లవలసినదే. ఒకదినమున నేను నిద్రించు చుంటిని. వారు పొలమునకు బోయిరి. ఈతని సఖులెచ్చట దాగి యుండిరోకాని మెదలక లోన ప్రవేశించిరి. నన్నుజూచి గుసగుస లొనర్చుచుండిరి. నవనీతచోరుడు వచ్చినాడని నేను గ్రహించితిని నేనింకొక దుప్పటినిగూడ కప్పుకొని పండు కొంటిని. వెంటనే ఆతడటునటు వెన్నను వెదుకుచుండెను. వానరసేనఅంతయును వెంటనుండెను. అటునిటు వెన్నలభింపక పోవునప్పటికి పైకిఁ జూడసాగెను. ఒకడిటులనెను:- “ ఒరే! ఉట్టిని జూడుడెంత పైకి గట్టబడినదో.” ఆసమ యమున నాతడిటు లనెను:- “ బావా! మెల్లమెల్లగా మాట లాడుము. మేల్కొనినచోఁ గొంపపోవును.” ఇదివిని అంద రును మెదలకుండిరి. ఒకడిటులనెను:- “ కృష్ణా! ఒకరిమీద నొకరు నలుగురెక్కినగాని పని జరుగదు.” అంత నాతడిటు లనెను:- “ బావా! ముందునీవే గుర్రము కావలెను.” ఆతడు కొంచము పెద్దవాడగుటచే గుర్రమయ్యెను. వానిపై రెండవ వాడు, రెండవవానిపై మూడవవాడు, ఇట్లెక్కిరి. అయినను నుట్టి అందలేదు. అప్పుడు మెల్లగా కృష్ణుడిటులనెను:- “ కుండకు జిల్లు పొడువుము. కాని చప్పుడైనచో నీ గోపిక మేల్కొన గలదు. కావున ముందీమెను గట్టిగాఁగట్టివేయుడు.”

నేనిది యంతయును బయటనుండి వినుచునే యుంటిని ఇట్టు లనుకొంటిని:— "ఈయుత్పాత మొనరించు పిల్లలు నన్ను గట్టివేయగలరు. అప్పుడు నేను దేనికిని బనికిరానని నేను లేచిపరు గెత్తుకొని పోయి తలుపును మూసితిని. అప్పుడు పిల్లవాడు భయపడి, పాలు, పెరుగు, వెన్నను తినుటను మానివిచె. ఈతడొక పిల్లవాని శరీరము మీద నూనె బూసి, దానిమీద బింజదీసిన దూది నంటించి యినుపపిసయునుజ్జెను. ఒక చిన్న తప్పెలను పగులగొట్టి దానిచిప్పను జేతిలో బుచ్చ్యగా గ్రహించి వాకిలికి దగ్గఱగా నిలుచుండెను. ఇంతలో నే నిరుగుపొరుగు గోపికలను గూడ పిలుచుకొని వచ్చితిని. వాని నెట్టైన బట్టుకొని నీకడకు దీసికొని రావలయునని నాయూహ"

లోపలనుండి యీతడిటులనెను:— "పిన్నీ తలుపును దెరువుము. నేనిక నెన్నటికిని రానులే"

మేము చాలమంది గోపికల ముంటిమి. నీవు మమ్ము దప్పించుకొని యెటు పోగలరని మేమనుకొంటిమి. నేను దలుపును దెఱవగానే వీరందరును నొక్కసారి "దయ్యము వచ్చినది, దయ్యము వచ్చినదని అరువసాగిరి. ఈతడెవనికి దయ్యము వేషమును వైచెనో ఆత్ల 'బ్యా' 'బ్యా' అనుచు మావైపునకు బరువిడెను. మేమందరమును భయపడి అటునిటు గ్రిందబడి పోతిమి. వీరందఱును నవ్వుచు త్రుళ్ళుచు బాఱిపోయిరి. ఈతడనేకవిధములగు చేష్టల నొనర్చుటను నేర్చుకొనినాడు. ఒక్కొక్కప్పుడు ఆడపిల్లయగును. ఇంకొకప్పుడు సాధువగును, మఱొకప్పుడు భూతమగును."

యశోదయిటులనెను:— "అమ్మాయి! నీవు కలను

గంటివేమో నమ్మా మా పిల్లవానికివి యన్నియు నేమి తెలియును? నీవు స్వప్నములోనే మేల్కొని యుందువు. ఇంతటి చిన్నపిల్లవాడు చీకటిలో నింటిలోని వస్తువుల నెట్లు వెదుకగలడు?

అంతనింకొక సఖి యిట్లనెను:- రాణీ! నీవు మమ్ముల నందఱి నసత్యవాదుల నొనర్చుచున్నావు. వీనికి పగలును రాత్రియు నొక్కటియే. నీవు వీనికి మణిహారాలలను, మణి ఆభరణములను బెట్టితివి. వీనివలన జీకటి యింటిలోను ప్రకాశము కలుగుచున్నది. దీపములకంటె నధిక ప్రకాశముగనున్నది.

తల్లి యిట్లనెను:- "మీరందఱును వలదనినచో నేను వీని శరీరమునుండి ఆభరణముల నన్నిటిని దీసివైచెదను."

అంత బాలనుండి గోపికలు తల్లితో నేడ్చుచు నిట్లనిరి:- "అమ్మా నీవు పిల్లవాని ఆభరణముల మీద చేయి వైచినచో నొట్టుబెట్టుకొనుచున్నాము, పిల్లలకున్న సొమ్ములను దీసివైచుట అశుభము. నీవీతని యాభరణములను దీసివైచినను నాతని శరీరమును జీకటిలో ప్రకాశించునట్టి కాంతి కలదే. అంధకార మీతని జూడగనే పాఱిపోగలదు. అమ్మా! కావున నీవు ఆభరణములను దీసివేయవలదు."

తల్లి యిట్లనెను:- "మీరందఱును వచ్చి నాకీదోషములను గల్పించి చెప్పుచున్నారు. అమాయకుడగు నా యీ బాలునకివి యన్నియు నేమి తెలియును?"

అంత నొక గోపిక యిట్లనెను:- "యశోదా! నీవు విశ్వసింపుము. ఈతడింటింటికిని బోయి దొంగతనము నొనర్చి అందఱను మోసగించును"

యశోద యిట్లనెను:– "మీరు పిల్లిని బట్టుకొని నా కడకు దీసికొని వచ్చినచో నేను విశ్వసించెదను. అప్పుడు మీయిష్టము వచ్చినట్లు నేరమును మోపవచ్చును."

అంత నొక గోపిక యిట్లనెను:– సరే సరమ్మా! నేను శ్యాముని బట్టుకొని నీదగ్గఱకు దెచ్చెదను."

సూతుడిట్లనెను:– "మునులారా! ఎన్ని విషయములు చెప్పినప్పటికిని యశోద విశ్వసింపకపోగా గొందఱు గోపిక లింకను జెప్పసాగిరి."



# శ్రీకృష్ణుని నపరాధిగా నొనర్చుటకుఁ బ్రయత్నము

(౨౭)

శ్లో॥ ఏవం ధార్ష్ట్యాన్యుశతి కురుతే మేహనాదీని వాస్తౌ
స్తేయోపాయై ర్విరచితకృతిః సుప్రతీకో యథాస్తే
ఇత్థం స్త్రీభిః సభయనయన శ్రీముఖాలోకినీభి
ర్వ్యాఖ్యాతార్థా ప్రహసితముఖీ నహ్యుపాలబ్ధు
మైచ్ఛత్॥

శ్రీ భాగ, ౧౦ స్కం. ౮ అ; ౩౧ శ్లో

క॥ ఓయమ్మ! నీకుమారుఁడు,
మాయిండ్లను బాలుఁ బెరుఁగు మననీఁడమ్మా
పోయెద మెచ్చటికైనను,
మాయన్నల సురభులాన మంజులవాణీ॥

వ. అని మరియు ననేకవిధంబుల బాలకృష్ణుండు సేయు వినోదంబులు దనయందుఁ జేయు మహాప్రసాదంబులని యెఱుంగక దూఱుచున్న గోపికలకు యశోద యిట్లనియె.

క॥ చన్నుఁ విడిచి చనఁడిట్టటు,
నెన్నఁడుఁ బొరుగిండ్ల త్రోవ లెఱుఁగఁడు నేఁడుం
గన్నులు దెఱవని మా యీ,
చిన్నికుమారకుని ననఁగ నేయుఁదగునే

తే॥ అన్యమెఱుఁగఁడు తనయంత నాడుచుండు
మంచివాఁడితఁ దోసులు మానవన్న
రామలార! త్రిలోకాభిరామలార!
తల్లులార! గుణవతీమతల్లులార॥

వ. అని యశోద వారల నోడంబఱచి పంపి కొడుకుం గోపింపఁజాలకుండె.

శ్రీమదాంధ్రభాగవతము.

పనులలో మంచిపనులును లేవు. చెడ్డపనులును లేవు. ప్రాణులందును మంచివారును లేరు. చెడ్డవారును లేరు. అన్నియును భగవంతునిచే నేర్పఱుప బడినవే. మంచిచెడ్డల యొక్క విచక్షణము మనము మమత్వకారణమున నేర్పఱచుకొన్నాము. మమకారము దేనిమీదనుండునో దానిలో మంచియే కనబడును. పరాయిగానున్నవాని గుణములును నవగుణములుగ భాసించుచుండును. జీవునకు మమకారమెచ్చట నుండునో అచ్చట బంధింపబడును. తనవానియొక్క అన్ని విషయములును సహింపవలసియుండును. ఏడ్పుమనో నవ్వనోచునో, సహింపవలయును. సహింపకున్న నిర్వాహము లేదు.

ఏలననఁగా నాతఁడు తన వాఁడు. తన చేతితో చేసికొనిన వంట యును తన పొలములో పండిన ధాన్యమును సుస్వాదిష్ఠ ముగ కనబడును, సంసారమును నాదని భావించు నంతకు జీవుఁడు దుఃఖము ననుభవించును. ఏలననగా సంసారము దుఃఖమయము. ఈతఁడు శ్రీకృష్ణుఁడు తనవాఁడనుకొనెనా ఆతని యందు మమకారమును వహించెనా, అప్పుడు దుఃఖ మను మాటయే యుండదు. ప్రతిసంఘటనమునందును సుఖా నుభవమును బొందును. ఏల ననఁగా నా శ్రీహరి సుఖ స్వరూపుఁడు. ఆతని ప్రతి చేష్టయును సుఖప్రదమే. ఆనంద దాయకమే కాఁగలదు.

సూతుఁడిట్లనెను;— "మునులారా! మీరు కన్నులను మూసికొని ధ్యానమొనర్పుఁడు. చాల విశాలమగు నంద భవన ప్రాంగణము కలదు. దాని మీఁద సింహముల ముద్రలు ముద్రింపఁబడిన తివాచీ పరుపఁబడెను. దాని మీఁద రంగురంగుల పుష్పములు పరుపఁబడినవి. పడమటి వైపున నానుకొనుటకుఁ దెల్లగ స్వచ్ఛముగనున్న దిండ్లుంచ బడినవి. మధ్యలోఁ బెద్ద బాలీసును నానుకొని యశోదమ్మ కూర్చుండియుండెను. మిగిలిన దిండ్లటునిటుఁ బడియుండెను. అడిగినను నామెకెవరును నాధారముగ లేరు. నందరాణి యెదుట నామెకు దీటుగా బాలీసును వైచుకొని యెవరు కూర్చుండఁగలరు. ఆమె ముఖము తూర్పువైపుగ నుండెను. ఆమె సమ్ముఖమున వేలకొలది గోపికలు రంగురంగుల పైట లను ధరించి, ఈ విధములగు లంగాలను జీరెలను ధరించి కూర్చుండిరి. సాధారణముగ గోపికలందరును యువతులే.

వారి ముసుఁగులన్నియును భృకుటి వఱకును గలవు. శ్రోత్రకోడండ్రు పెదముసుఁగులు వైచుకొని కూర్చుండిరి. తర్జనీ మధ్యమ ప్రవేళ్ళతో ముసుఁగులను దాలిఁగించుకొని వారు యశోదవడిలోఁ గూర్చుండిన బాలముకుందుని నిరంతరము చూచుచుండిరి. మధ్యమధ్య నవ్వుమాటలాడినప్పుడందరును నవ్వుచుండిరి. అనురాగకారణమున సందరహృదయ తరంగములుప్పొంగుచుండెను. అందఱి నేత్రములానందోద్రేకముచే వెలుఁగుచుండెను. వారి రవికలు బిగుగ నుండెను. అతి అనురాగకారణమున వారి వక్షస్సులుబికి నపుడు వారి రవికలు చినుగునాయనునట్లుండెను. యశోద ముందు మాటలాడుటలో నిపుణలైన గోపికలే మాటలాడుచుండిరి. రంగు రంగుల మేలిముసుఁగులను వేసికొనుటచే నాయంగణము వివిధ రంగులుగల పూలతోటవలె నుండెను.

యశోద శరీరము కొంచెము స్థూలము. గౌరవర్ణముగల శరీరము మీఁద వివిధవిధములగు నాభరణములు మెఱయుచుండెను. ఆమె తన చేతిని శిశువుపైనుంచి ఆ శిశువుపైఁ గదలించినచోఁ గంకణములు, గాజులు మొదలగు నాభరణములు గలగలమనును. ఆమె ముఖము విశాలమై తేజఃపూర్ణమై యుండును. వయస్సు మీరినను నామె శరీరమందు వృద్ధాప్య చిహ్నములు గోచరించుటలేదు. ఒక కాలును ముడుచుకొనియు, నింకొక కాలును శ్రీకృష్ణుని పిరుదానుకొనియుఁ గూర్చుండియుండెను. ఆమె సమ్ముఖమునఁ దాంబూలపు పళ్ళెరములో నాకులు వక్కలు ఏలకులు మొదలగు

బూడిదనటునిటు వెదజల్లెను. నీళ్ళకుండలను బగులగొట్టి ఇల్లంతయును బురదనొనర్చెను."

అంత యశోదమ్మ యిట్లనెను:— "ఇంటిలో చెత్తయును చెదారమును వేయుట చాల చెడ్డపని. ఏమిరా కృష్ణా! నీవిట్లొనర్చుచున్నావా ?"

భగవానుడిట్లనెను;— "అమ్మా! నీవు గోపికల వాక్యములన్నిటిని వినుము. తరువాత నేనన్నిటికిని గలిసి ప్రత్యుత్తరమొసంగెదను" ఎవరి యింటిలో చెత్తను వైచితినో ఎవరింటిలో బురదను వైచితినో."

ఇదివిని యింకొక గోపిక యిట్లనెను:— "అయ్యో! రాణీ ఈ పసికందును చూడగ నెన్నిమాటలని చెప్పనుందును. నాకు చెప్పుటకును లజ్జయగుచున్నది. సంకోచము కలుగుచున్నది. ఈతడు బురదను వేయుటయే కాదమ్మా! ఇంకను గొప్పగొప్ప యుత్పాతములొనర్చెను."

యశోద యిట్లనెను:— "ఏమిచేసినాడో అదిగూడ వినెదను."

అంత నాగోపికయే యిట్లనెను:— "దీపావళి కొరకని నేను నాయింటిని జక్కగా మెత్తి అలికి స్వచ్ఛమొనర్చితిని. ఈగ గూడ ప్రాలిన జారిపడునట్లుగ నేల స్వచ్ఛముగ నుండెను. నేనింటిలోపలనే యుంటిని. ఈతడు తనసేనను దీసికొని వచ్చెను. అటునిటు దిరిగి యీతడు మొదలక నిట్లనెను:—

"ఇంకను నామె యింటిలోనే యున్నది. ఇంకనుజీకటిగనే యున్నది. మరల రావచ్చు."

అంత నొకఁడు యిట్లనెను:— "బావా! నాకు లఘుశంక వచ్చుచున్నది." అంతమంది యిట్లనిరి:— మాకును వచ్చుచున్నది; మాకును వచ్చుచున్నది. పిదప మనసుఖుఁ డను వాఁడిట్లనెను:— "బావా! మీకందరకు లఘుశంక యైనచో నాకు దీర్ఘశంక యగుచున్నది."

అప్పుడు నీయీ పిల్లవాఁడిట్లనెను:— "ఓరీ బావా! ఇంకెచ్చటికి పోయెదవురా? ఎంతచక్కఁగ నలికి మెత్తబడియున్నదో చూడుము. ఇచ్చటనే కానీయుండి."

ఇంకేమున్నది. ఈతని యనుమతి కాఁగానే అచ్చటనే నిలుచుండి పిల్లలందరును వర్షమువలె విడువసాగిరి. అంత మనసుఖుఁ డిట్లనెను:— "వర్షము బాగుగానే కురియుచున్నది గాని గర్జనము జరుగుటలేదు." ఇదివినగా నందరును నేకపంక్తిలోఁ గూర్చుండి గుదములను విప్పి కూర్చుండిరి. నేను లోపలనుండఁగా పిటరపిటర శబ్దమును విని "బయటకు వచ్చితిని. దుర్గంధముచే ముక్కు పగిలిపోవుచుండెను. అచ్చట నొక కట్టె పడియుండెను. నేను దానిని దీసికొని పరువిడి యిట్లంటిని:— "దొంగలారా! నిలువుఁడు నిలువుఁడు, మీరు మా అంగణమును పాకీ దొడ్డి అనుకొంటిరా!" ఇదివినగానే అందరును బరువెత్తుకొని పోయిరి. ఆసమయమున పాకీవానిని బిలిచి యిల్లు బాగు చేయించితిని. అమ్మా! నీవే చెప్పమ్మా! ఇది మంచి పనియో మో, గొప్పయింటి వారిట్లు చేయవచ్చునా?"

తల్లి శ్రీకృష్ణుని గడ్డము నెత్తి యిటులనెను; "ఏమిరా! కృష్ణా! నీవిట్లు చేసితివా?"

శ్రీకృష్ణుడిటులనెను;— "అమ్మా! నేను ఒంటరి

దొంగిలించుటకే యిప్పుడు వచ్చియుండును. ఏదో నెపముండ వలయును వచ్చుటకు. వచ్చి అబదములను జెప్పినారు. అబద ములను జెప్పినను జాగ్రత్తగా జెప్పవలయును. ఆ తెలివి కూడ వీరికి లేదు. దొంగతనములను గట్టిన వారింకేమైన గట్టగలరు. నేను వెన్న నేల దొంగిలించవలెను. మనకు లెక్కలేని ఆవుల గోవులు కలవు. నీరువలె పాలును పెరుగును ప్రవహించు చుండును. బురదవలె వెన్నపడియుండును. వెన్నను దొంగిలిం చుటకు నాకేమికర్మము పట్టినది. నీకును బది, పదునెనుగురు పిల్లలు లేరు కదా! నేనొక్కడనే. నే దలచుకొనిన వీరినంద రను వెన్నతో ముంచివేయగలను. వీరు స్వయముగ నన్ను బట్టుకొని వారిండ్లకు గొనిపోయి నోటవెన్నను గ్రుక్కుచుం దురు. నామూతికి బూయుదురు, మూతులను ముద్దుకొనియు సైగలను జేసియు, కనుబొమ్మలను నాడించుచును ఏదో చెప్పు చున్నారు. నన్ను మాటిమాటికిని రొమ్ములతో గౌగలించు కొందురు. వీరి లీలలు వీరికే తెలియవలయును. వీరి మనస్సుల లోతు ఎవరికెరుక ? వీరు తమదొంగతనమును గప్పిపుచ్చు కొనుటకు నామీద దొంగతనమును గట్టుచున్నారు. ”

యశోద యిట్లనెను:— “ నేను మీమాటలేవియు నమ్మను, మావాడు దొంగతనము జేయుచో నట్టి దొంగ తనమును జేసినప్పుడు పట్టుకొని నా వద్దకు గొనిరండు. ఇట్లు చెప్పినచో వీడు మిమ్ములను గూడ దోషిగా జెప్పును. కాని నేను వీని మాటలను గూడ విశ్వసింపను. ”

ఇది విని గోపికలు లేచి యిటులనిరి:— “ సరియే మమ్ములనే కసరి అదుపును జేయుదువని మాకిదివరకే

తెలియును. మీ పిల్లవానిని గసరవు. సరే, మే మొప్పపైనను బట్టుకొని నీకడకు దెచ్చెదము. మాకు సొంగతనములుచేసిన వానికి........" ఇట్లు పలికి వారు తమతమ యిండ్లకు బోయిరి. కృష్ణుడు తల్లివడిలోనే ఉండి ఆమెపైన ముఖము పెట్టుకొని యుండెను.

గోపికలు తమలో దాము కృష్ణుని బట్టుకొనుట యెవరని యాలోచించుకొనిరి. ఆసమయమున వృషభానుపురము (బర్సానా) నుండి ఒక క్రొత్తకోడలు గోకులమునకు వివాహముచేసికొని వచ్చెను. ఆమె తాను బట్టుకొందుననెను. బాలచోరసమితిగూఢ చారులవలన శ్రీకృష్ణుని ఘలాని గోపిక పట్టుకొందుననెనని తెలిసెను.

శౌనకుడిట్లడిగెను:— "సూతా! శ్రీకృష్ణున కీసంగతి నెవరు చెప్పిరి?"

సూతుఁ డిట్లనెను:— "స్వామీ! ఇంటిగుట్టు చెప్పవారే యిదంతయును జెప్పెను. ఆగోపికకొక చిన్న మఱఁది కలడు. అతఁడును జోరసమితిలో సభ్యుఁడు. అతడిట్లనెను:— "కృష్ణా! మా వదినె నిన్నుఁ బట్టుకొందునని చెప్పినది."

ఇది విని నవ్వుచు నందనందనుఁ డిట్లనెను.— "సరే, చూడఁగలము. ఆమె నన్నుఁ బట్టుకొనునా? లేక తానే పట్టువడునా?" ఇప్పుడాగోపిక రాత్రింబవళ్ళు శ్రీకృష్ణునే కనిపెట్టు చుండెను.

శ్రీకృష్ణునిఁ బట్టుకొనుటకెవరు ప్రతిజ్ఞను చేయుదురో శ్రీకృష్ణుఁడు వారి ప్రతిజ్ఞను నెరవేర్చును. తానేచిక్కును ఆమెను జిక్కించును. ఒక దినమునఁ దన సేననంతయును

వెంటబెట్టుకొని చీకటితోనే ఆగోపిక యింటికిఁ బోయెను. సఖుల నందఱును ద్వారమున నిలిపి, జాగ్రత్తగ నుండుడని చెప్పి వారితో నిట్లనెను:— "ఎవ్వరును నావెంట రావలదు. నేనొకవేళఁ బట్టువడినచో నావెంట మీయింటి నలుకును రావలయును. అందరు నాతని యాజ్ఞను శిరసావహించిరి. నేడాతఁడు స్వయముగఁ బట్టువడఁబోయెను. గోపిక వెన్న నెదురుగనే పెట్టి దాగి పట్టుకొనుటకు సిద్ధముగ నుండెను ఆతడు కుండలలో నుండి వెన్నను తీసుకొని చప్పున దిను చుండెను. కడుపునిండఁ దినిన తరువాత వెనుకనుండి వచ్చి గోపిక చప్పున వచ్చి పట్టుకొని యిటులనెను:— "కృష్ణా! జ్ఞాపకమున్నదా? ఆనాడు తల్లిఒడిలో గూర్చుండి నన్నే దొంగయని యంటివే! ఇప్పుడు నీబుగ్గలను నొలియబెట్టి నీకు .........గుర్తు చేయించెదను. ఇది తల్లియొడి కానియ్యాల, గోపికాగృహము."

ఆతడు నవ్వి యిటులనెను:— "వదినె! నీబట్టు, నీ తోడు, ఎప్పుడిక మీయింటికి రాను."

గోపిక యిటులనెను:— "నీవు ఒట్టును బెట్టుకొన్నను నిన్ను విడువను. నామీద నొట్టు బెట్టుకొందువేమి? నీతండ్రి మీద నొట్టు పెట్టుకొనుము. నీతల్లిమీద నొట్టు పెట్టుకొనుము ఇప్పుడొట్టు పెట్టుకొనిన జెల్లదు. నిన్ను నేడు పట్టుకొని మీ అమ్మకడకు గొనిపోయెదను."

ఆతడామె పాదములను బట్టుకొని యిటులనెను:— "వదినె! అట్లుచేయవలదు. అమ్మ నిన్ను గొట్టును. నీవే నాకు తగిన దండమును విధింపుము. తెమ్ము నీలంగాను యమునలో నుదికి తెచ్చెదను.

గోపిక యిట్లనెను:— "నాలంగాను నునుకవలదు. నారవికి నునుకవలదు. నేను నిన్ను మరమ్మతు చేయనలేను. అదియును మీఅన్నచేతిలో. ఆమె నాపిల్లవాడు దొంగ కాదనుచుండును, ఈతడు పిల్లవాడు కాడు. కొంపలను దీయువాడనియు. వీనికడుపులో బారెడుగడ్డమున్నదనియు అందఱును దెలిసికొనగలరు.

శ్రీకృష్ణుఁ డేమ్నునొడంగెను. గోపిక యిట్లనెను:— "నేనీ కపటాశ్రువులకు లొంగువానను గాను. నేఁడు నిన్నుఁ బట్టుకొని తీసుకొని పోయి తీరెదను."

ఆతడు దీనముఖమును బెట్టి "సరే" తీసికొనిపో' అనెను.

ఇంకేమున్నది? గోపిక గట్టిగా కృష్ణుని.....పట్టుకొనెను. కృష్ణుడు వెంటబోసాగెను. ఆమె ఆయూరికోడలు. క్రొత్తకోడలు. అందువలన ముసుగు వైచుకొని శ్రీకృష్ణుని గట్టిగా బట్టుకొని పోవుచుండెను. శ్యాముని సేనయును సంకేతానుసారముగ వెనువెనుకనే దొంగ, దొంగ పట్టుబడినాడనుచుఁబోయిరి. మార్గమున బోవుచు శ్రీకృష్ణుడిట్లనెను:— "వదినె! నీవింత నిష్ఠురత వహించెద వేల? నీ వెంత గట్టిగా నా చేతిని బట్టుకొంటివో చూడుము. ఈచేయి నొంటపుట్టుచున్నది. ఇదిగో యీ చేతిని బట్టుకొనుము." గోపికకు శ్రీకృష్ణుని గష్టపెట్టుటకిష్టములేదు. ఆమెకు గావలసినది తల్లిముందు తనతనయుడు దొంగయని రుజువుచేయుటయే. ఆమె యీచేతిని వదలి రెండవచేతినిబట్టుకొనెను. ఆమె నందుని వాకిలికడకు పోగానే అచ్చట ఉపనందుడును, సునందుడును మొదలగు చాలమంది వృద్ధగోపకులు కూర్చుండి యుండిరి. వారిలో నామెకు గొందరు

పినమామలు, కొందరు పెదమామలు. బావలుండిరి. అప్పుడామె పెద్దముసుగును వైచుకొనెను. అప్పుడు శ్యామసుందరుడు మెల్లగా నిటులనెను:—

"వదినె! నా యీచేయికూడ నొప్పి పెట్టుచున్నది. ఈ చేతిని బట్టుకొనుము." ఇది విని ముసుగులోఁ జూచుచునే ఆమె చేతినిఁ జాచెను. శ్రీకృష్ణుడు వెంటనే వెనుకనుండి వచ్చి వానితో నామెనురది చేతి నామెచేతి కందించెను. ఆతని కిది వరకే చెప్పియుంచెను. అందువలన నాతఁడు మాటలాడ లేదు.

శ్రీకృష్ణుఁడు వెనుకనుండి పరుగిడి సాలయొక్క ద్వారమునఁ దల్లి వడిలోనికిఁ బోయి గూర్చుండెను. తల్లి యిట్లనెను "కృష్ణా! రొప్పెదవేమిరా?"

శ్రీకృష్ణుఁ డిట్లనెను:— "నేను కొట్టము దగరనుండి వచ్చుచున్నాను. అచ్చటనొక నుమ్ముకోతి నాఁమీదను గాండ్రించుచుఁ బరుగెత్తినది. నేనచ్చటనుండి ఉరుకెత్తి పరుగెత్తుకొని వచ్చితిని."

తల్లి భయభీతయై యిటులనెను:— "నాయనా! అది కరవ లేదు కదా!" శ్రీకృష్ణుఁ డిటులనెను:— "లేదమ్మా! అదెట్లు కాటు వేయగలదు? దానికి నానీడయైన నంటనుండునట్లు పరు విడితిని. నేను గొంచెము సేపు నీ యొడిలో బరుండెదను," 'నిద్రపో!' అని పలికి తల్లి కృష్ణుని వీపుమీఁద జిచ్చిఁ గొట్టుచుండెను. ఇంతలోనే ఆగోపిక వచ్చి యిటులనెను:— "అమ్మా! ఇదుగో నమ్మా! ఎవ్వడైన నవనీతము దొంగతనము చేసిన బట్టుకొని తీసికొనిరమ్మని నీ వెంతో చెప్పితివి. చూడు మిదిగో నేడు. వీనిని బట్టుకొని వచ్చితిని. ఇప్పుడిక మమ్ముల సత్యవాదులుగ గట్టవలదమ్మా"

యశోద యిటులనెను:– "ఎప్పుడు పట్టుకొని వచ్చితివి? ఎప్పుడు పట్టుకొని వచ్చితివి? నీ వేమియును మత్తును సేవింపలేదు కదా!

గోపిక వ్యంగ్యాత్మకస్వరమున నిటులనెను:— "దొంగతనము చేయుచుండగ మీపిల్లవానిని బట్టుకొని వచ్చితిని. మీ కృష్ణునే, చూడుము వీనిని మూతికింకను నవనీత మంటుకొనియే యున్నది."

తల్లి యిటులనెను:— "ఓసీ గోపికా! కొంచెము ముసుగును దీసిచూడవే. మా కృష్ణుడా? లేక నీ మగడియా? మాపిల్లవాడు నావడిలో నిద్రపోవుచున్నాడు."

గోపిక తనముసుగును దీసి చూడగా నామె యాశ్చర్యమునకు మేర లేక యుండెను. ఆమె యిటులనెను:—"నేను పట్టుకొని కృష్ణునే తెచ్చితిని. వీడు మధ్యలో నామగఁడెట్లైనాడు?

తల్లి నవ్వియిట్లనెను:– "ఇవ్వేళ నీ మగనిని బట్టుకొని వచ్చితివిగాని రేపు నీ మగనిఁ బట్టుకొని వచ్చెదవు. నీ చేయి తగులఁగానే పిల్లలు మారిపోవుదురు. నీపతినిగూడ మార్చెదవు." ఇది విని గోపిక లజ్జిత యయ్యెను.

శ్రీకృష్ణుఁ డిటులనెను:– "అమ్మా! ఈమె గొప్ప అసాధ్యురాలే. ఇంటిలోని పాలమీఁది మీగడను దీసి మెదలకఁ దినివేయునే. ఈమె మగఁడి తన యన్నకుఁ జెప్పినాఁడేమో, అందువలన నానిని భయపెట్టుటకై యిచ్చుటకై బట్టుకొని వచ్చినది. నీవీమె మాటను విశ్వసించవలదు."

ఇది విని యాగోపిక వచ్చిన త్రోవనే పోయెను. శ్రీకృష్ణుడు పకపక నవ్వసాగెను. పిల్లలందరును జప్పట్లను

జఱచిరి. అప్పుడు శ్రీకృష్ణుడు యిటులనెను:— "అమ్మా! ఈగొల్లపిల్లలందరును వచ్చినారు. నీరికి నేటికి వెన్న నుబెట్టవే! తల్లి మిక్కిలి ప్రేమతో నిటులనెను:— "రండు, నాయనలారా! కడుపునిండ వెన్నను దినుడు. అందరకు నొక్కొక్క వెన్న ముద్దయును, ఒక్కొక్క పటికబెల్లం గడ్డయును నొసంగను. అందరును వెన్నను గలకండను దిని యెగురుచు గంతులు వైచుకొనుచు దమయిండ్లకు బోయిరి. ఇప్పుడు శ్రీకృష్ణునకు సాహసమింక నధికమయ్యెను. ఆతడు దినదినమును గోపికల బయలు దేరుచుండెను. ఆతనికిని దొంగిలించిన వెన్నతినిన నానందము. ఎవరి వెన్న దొంగిలింపబడినదో వారికి నానందమే,

కృష్ణుడు ప్రతిదినమును దనయింట వెన్నను దొంగిలింపవలయునని ఒక గోపిక కోరుకొనుచుండెను. కాని ఆమెతో నిత్యమును వాదప్రవాదము జరుగవలయుననియు, తగాదా జరుగవలయుననియు నామె కోరిక. ఒక దినమున కృష్ణుడు తిరుగుచుండెను. ఆగోపిక యిటులనెను:— "కృష్ణా! ఎచ్చటికి బోవుచున్నావు?

ఆతడు గద్దించి యిటులనెను:— ఎచ్చటకో పోవుచున్నాను. అడుగుటకు నీ వెవరు? నాశకునమును బాడుచేసితివి. ప్రొద్దుననే కనబడి యెక్కడి కంటివి?

గోపిక యిటులనెను— నేను నీశకునమంతయు నెరుగుదును. ఇచ్చట నీపప్పులుడుకవు. నావద్ద నీవు దొంగతనమును జేయజాలవు. మరల నీచాయలకునచ్చితివా? మర్యాదదక్కదు

శ్రీకృష్ణుం డిటులనెను;— "పోపో! నీబాబుబజారాయిది. వేయిసార్లు వచ్చెదను. కాదనుటకు నీ వెవతెవు?" అనిపలికి

పారిపోయెను. గోపిక ప్రతీక్షించుచుండెను. ఆమెకుక్షణక్షణ మును భారముగఁ దోచుచుండెను. శ్యాముఁ డింకను రాఁగలఁడింకను రాఁగలడనుచుండగఁనే సూర్యాస్తమయ మయ్యెను. రాత్రియంతయును దారకలను లెక్కించు కొనుచు నామెగడిపెను. ప్రాతఃకాలమున వెన్ననుదీసి ఆశతో గూర్చుం డెను. శ్యాముఁడు రాలేదు. ఆమె వ్యాకులత వృద్ధిచెందెను. ఆహారపానీయయము లేమియును రుచింపకుండెను. రెండవ దినమును గడిచెను. మూఁడవ రాత్రియు నట్లే గడిపెను. ఇఁక శ్యామసుందరు డాగలేక పోయెను. ఆతఁడు వచ్చిగోపిక యొక్క మనోవాంఛను దీర్చెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికల నోటనిత్య మును శ్యాముని దొంగతనము విషయమును వినుచుండిన తల్లి మనస్సునందు గూడ శ్యామసుందరుఁడెప్పుడు దొంగిలిన వెన్నను దినుచుండఁగాఁ జూడఁగల ననుగొనెను. వాంఛా కల్పతరువగు శ్రీహరి యశోద కోరికను దీర్చుటకు విచా రించుచుండెను.



# యశోద యొక్క దధిమంథనము



శ్లో॥ క్షౌమం వాసః పృథుకటితటే విభ్రతీ సూత్రనద్ధమ్
పుత్రస్నేహస్నుత కుచయుగం జాతకంపాచ సుభ్రూః
రజ్జ్వాకర్షశ్రమభుజచలత్ కంకణౌ కుండలే చ।
స్విన్నం వక్త్రం కబర విగల న్మాలతీ నిర్మమంథ॥

(శ్రీ) భాగ, ౧౧ స్కం ౯ అ. 3 శ్లో

సీ॥ కరకమలారుణకాంతిఁ గవ్వపు ద్రాడు.
పవడంపు నునుఁదీవ పగిది మెఱయ
గ్రమముతో రజ్జువాకర్షింపఁ బాలిండ్లు,
వీడ్వడియొండొంటి వీఁక నొత్తఁ
గుచకుంభముల మీఁది కొంగుజాఱఁగఁ జిక్క-
వడుచు హారావళుల్ వ్రయ్యలుపడఁగఁ
బొడమిన చెమటతోఁ బొల్పారు నెమ్మోము,
మంచుఁ పై బడిన పద్మంబుఁ దెగడఁ

తే॥ గౌను నులియంగఁ గంకణక్వణన మెసఁగఁ
దురుము బిగివీడఁ గర్ణికాద్యుతులు మెఱయ
బాలు నంకించి పాడెడి పాటవలనఁ
దరువు లిగురొత్తఁ బెరుఁ గింతి దరువఁ జొచ్చె॥

(శ్రీ)మదాంధ్ర భాగవతము

ప్రపంచము నందంతటను నెచ్చట జూచినను సౌందర్యమే నిండియున్నది; కాని దానినిఁ జూచుటకు యోగ్యత కావలయును. సౌందర్యోపాసకుఁడగు కవి సర్వత్ర సౌందర్యమునే

గాంచును. కవులకు ఫలపుష్ప సమన్వితమగు వృక్షములనిన మిక్కిలి యానందము. వారు వానిలో ననంత సౌందర్యము ననుభవించెదరు. వానితో మాటలాడెదరు. వానిమాటలను వినెదరు. వారు ప్రతి సంఘటనము నందును, సౌందర్యమును గాంచెదరు. వనమునందు, ఉపవన ములందు సరస్సులందు సాగరములందు, నదులందు, పండితులందు, గిరులందు గిరిశిఖరములందు, నగరములందు, పండితులందు, పామరులందు. బాలకులందు, వృద్ధులందు, ప్రౌఢులందు, యువకులయందు, నరులందు, నారులందు, నల్లవారియందు తెల్లవారియందు, రూపవంతులయందు, నవ్వువారియందు, ఏడ్చువారియందు, నెచ్చటికి దృష్టిపోయినను నచ్చటనే ఆసౌందర్యమును గాంచును. వారిదృష్టిలోఁ బ్రపంచమంతయు నొక సుందరమగు నాటవస్తువు. వానికి ఘటనలన్నియును నవ్వువచ్చు సామగ్రులే. ఎవరైన వచ్చినను నవ్వును. పోయినను నవ్వును. ఎవరైన ప్రతిజ్ఞ నొనర్చినను నవ్వే. ప్రతిజ్ఞాభంగమైనను నవ్వే. ఆవశ్యకసాధనములు వచ్చినను నవ్వే. వాని యభావమునను నవ్వే. గంభీరతను గాంచిన నవ్వును, చంచలతనుగాంచినను నవ్వును. అనుకూల ప్రతికూలతల రెండింటి యందును సుఖానుభూతి కలిగి ఉప్పున్నను నుప్పు లేకున్నను కూరలు రుచిగా నెవని కుండునో అతఁడే కవి. వాస్తవమునఁ గాంచినచో నుప్పులేని కూరలందును నొకవిధమగు కమ్మని రుచి కలదు. ఈవిషయములను గవియే అనుభవ పూర్వకముగఁ దెలియఁగలడు. సాంసారికులమగు మనము సంఘటనముల నేదృష్టితోఁ జూచెదమో, కవి వానికి భిన్న దృష్టితోఁ గాంచును. ఏ స్త్రీయైన నేడ్చినచో మనకును దుఃఖము కలుగును; కాని కవి ఆమె

చేష్టలనధ్యయనము కావించును. ఈమె కన్నీరుపులెట్లు వచ్చు చున్నవి నీమె ముఖాకృతి యెట్లున్నదియు, రోదన మేస్వర ముతో నొనర్చునదియు, నశ్రువులు వెలువడియెచ్చటబడి నదియు రోదనసౌందర్య చింతనమందే నిమగ్నుడగును.

ఒక కవి యుండెను. ఆతఁడొక చిన్నతోటను వేసెను. దానియందు రంగులరంగుల బటానీలను నాటెను. ఒక బలిసిన ఆఁబోతు ఆ బటాణి తోఁటలోనికిఁ బ్రవేశించి దానిని తిన నారంభించెను. కవి స్వభావాను సారముగఁ గట్టను గైగొని ఆఁబోతును బొలమునుండి బయటకుఁ ద్రోలవలయు నని పోయెను. ఆతఁడు కట్టనెత్తెను. ఎద్దుకన్నులెఱ్ఱచేసి తన శృంగములతోఁ గవిని బొడువవచ్చెను. ఆసమయమున దాని మూఁపురము కదలుచుండెను. కాళ్ళనుకొంచెము వంకరగఁబెట్టి, తలను వంచి, అది క్రోధముతోఁ గవివైపు నకు బరువిడెను. కవి దాని శోభను గాంచి యాత్మవిస్మృతిని జెందెను. దాని క్రోధముద్రనుగాంచి రసాస్వాదన మొనరించుచుండెను. ఉన్నదున్నట్లుగ నిలిచి పోయెను. ఇదియే కవియొక్క హృదయము. కవి దృష్టిని సాధారణులు తెలిసికొనఁ జాలరు. మనముప్రతిదినమును గాంచుఘటనల మీఁద నేప్రభావమును బడదు. వానినిఁ గవి గాంచి వర్ణించుచో మనము చదువఁగాఁ దృప్తినిఁ జెందకుందుము. ఈ రామకృష్ణా ద్యవతారము లెన్నివచ్చినవో వారియొక్క చారు చరిత్రలను నేకవియైనను నంతర్దృష్టిచేఁ జూడ కున్నచో నీకథ లమరము లెటు కాగలవు.? ఇతిహాస పాత్రల నమరము కావించువాఁడు కవియే. సాధారణ ఘటనము లందును. సరసతను నింపువాఁడే కవి. స్త్రీలు దధి మంథన

మొనర్చుటను నందరును నిత్యము చూచుచునే యున్నారు. వానివలన మనస్సునం దేవిధమగు ప్రభావమును బడదు. అదే మంథన వర్ణనమును నేకవిశృతి యందైనను జదివి నచో శుష్క హృదయమైనను సరసముగ నగును. యశోద దధిమంథన సమయమున నెట్టి యపూర్వశోభతో నున్నదో, దాని సాకార రూపకము వేదవ్యాస భగవానుఁడు తన వర్ణనమందు నిరూపించినాఁడు. అదృష్టవంతుఁడే ఆవర్ణనమును జదివి దానినిఁ దమ హృదయములం దనుభవింపఁ గలరు.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! శ్రీకృష్ణుని విషయమున నిత్యమును నుపాలంభనమును వినివిని యశోద మనస్సునం దొక కోరిక యుత్పన్నమయ్యెను. ఆమెయిట్లు తలంచెను:- "కృష్ణుఁడు గోపికల యిండ్లనుండి వెన్నను దొంగి లించు చున్నాఁడు. దీనిని నేను నానేత్రములతో నెట్లు చూడ గలను.?" ఎన్నడైన నాయెదుట దొంగతనము నొనర్చిన నేనీతనిఁ గసరి గొట్టవచ్చును. పిల్లలను గసరిగొట్టుటచేఁ నొకవిధమగు నానందము కలుగును. సర్వాంతర్యామియగు ప్రభుని సమస్త చేష్టలును భక్తులకు సుఖము నొసంగు కొరకే యుండును. అతఁడు తల్లియొక్క భావమును గ్రహించి తల్లి సమ్ముఖమునను నేను వాత్సల్యరసముయొక్క అభూత పూర్వ ధారను బ్రవహింపచేసెదను; ఆమెకును నాచౌర్య కర్మను జూపించెదనని నిశ్చయించుకొనెను. తల్లియెంతగా లీలలను చూచుట కుత్సహించుచున్నదో అంతకంటె నధిక ముగ నీలీలాధారి లీలలొనర్ప నుత్సుకుడై యుండెను.

యశోదయొక్క సమస్తకర్మలును దనకృష్ణుని ప్రీతి నిమిత్తమే. మందలో లక్షలకొలది గోవులు కలవు. వానిని దాసదాసీజనములు పోషించుచుందురు. నందుని సంరక్షించుట యందే ఆమె సమస్తకర్మమును. తల్లి పూజనము కొఱకు పదిపదునైదు గోవులనింటివద్ద నుంచును. వానికి పండ్లను బిండివంటలను గూడ పెట్టును. నీటికి బదులుగాఁ బాలనే త్రాగుచుందురు. వానిపాలు మిక్కిలి చిక్కగా నుండును. వానినుండి పద్మగంధము వచ్చుచుండును. అందువలన నాయావు లన్నియును పద్మగంధలని పిలువబడును. వానిపేరులు - శ్యామ రామ. గంగ, యమున, త్రివేణీ మొదలగునవి. యశోద స్వయముగ వానిని బోషించును. ఆగోవులపాలు నారాయణుని సేవకు వచ్చును. వానిలో నొకటి రెండుగోవులను స్వయముగ యశోదయే పాలుపిదుకును. స్వయముగ గాచును. స్వయముగ దానే తోడుపెట్టును. కృష్ణుని దన యుత్సంగముననుంచుకొనియే స్వయముగ దన సమ్ముఖమున దనకన్నుల యెదుట జల్లను జేసి దానిని గృష్ణునకు బెట్టును, తల్లిహృదయ మట్టిది. మాకృష్ణునకు వెన్నయనిన మిక్కిలి యిష్టము. కావున జాలమంచి వెన్నను వానికొఱకు తీయవలయుననియే తల్లి చింత.

ఇప్పుడు శ్రీకృష్ణునకు నాలుగైదేండ్లు వచ్చినప్పటికిని పాలు, పెరుగు, వెన్న. మీగడ మొదలగునవన్నియును దినును అన్నము, పప్పు- రొట్టెలును దినును, కాని తల్లిచనుపాలను ద్రాగుటను మానలేదు. ఒకసంవత్సరమైనమీాదట దల్లికింకొక పిల్లవాడు పుట్టినప్పుడు మొదటిపిల్లవాని పాలెండిపోవును. రెండవపిల్లవాడు పుట్టకుండినచో జాలమంది పిల్లలు పెద్దవా

పైన తరువాతను తల్లియొక్క చనుబాలను ద్రాగుచుందురు. ఈతని స్థితియు నట్టిదే. నిత్యమును దల్లి యేబదియారు పిండి వంటలను జేసిపెట్టును. వివిధ పదార్థములను జేయును. తన చేతులతో శ్యామసుందరునకు బెట్టును: కాని యీతనికి బాలు త్రాగనిది తృప్తియుండదు. తల్లికిని దీనిలో నానందము కలుగును. ఈతడు తల్లి దగ్గఱబరుండియే నిద్రించును. తల్లిని గట్టిగా బట్టుకొని యుండును. మంచము మీఁదనుండియే తల్లి దాసీలకు బనిని జెప్పును. కవ్వము పిడచను వేడి నీటితో దోమవలెను. తొందఱ పడవలదు. చల్ల చేయునపుడు చల్లని జలముండవలె. ఆఱబోసిన గొంచెము వేడినీటిని బోసిన జల్ల దనముపోగలదు. .........ఇట్లు ప్రక్కమీఁదనుండియే చెప్పుచుండును. వెన్నపడు సమయము రాగానే వెంటనే చేతులను గడుగుకొని చేయిపెట్టి వెన్నను దీయును. దధిమంథనము తిరుగలిని ద్రిప్పుపనియు నరుణోదయమందు జరుగును. ఏ స్త్రీ పెరుగును నరుణోదయమునకు ముందేజల్లగా జేయదో సూర్యోదయము నఱకును గవ్వమును ద్రిప్పుచుండునో ఆమె నేర్పు లేని— దని పిలువబడును. లక్ష్మీదేవి వారింటినుండి పోవును. కావున గవ్వమును తిరుగలిధ్వని సూర్యోదయమునకు ముందే పూర్తిగ నాగి పోవలయును, కావున ప్రాతఃకాలమున గను చీకటితోడనే తల్లి తనపిల్లవానిని జిచ్చికొట్టి పెరుగును జిలుకును.

ఒకదినమున నేదియో పర్వము. ఇంటిలోని దాసీలందఱును సేవిమోపనులలో నిమగ్నులై యుండిరి. ఇంతవరకును చల్లచేయబడలేదు. తల్లి కిల్లప్పుడును దనకొడుకు చింతయొక్కటియే. లేవగానే అతడు వెన్న నడుగును. నేనిచ్చుట

దెచ్చి యిచ్చెదను. నేడు నేనే లేచి చల్ల నేల జేయరాదు. ఈ ధూర్తుడు లేచినచో నేపనియును జేయనీయడు. అప్పుడప్పుడు తీసిన వెన్న నీతనికి లభింపకున్నచో నేడ్చియేడ్చి యిలంత యును గోలజేయును. అందువలన దల్లి కృష్ణునకు దెలియ కుండునట్లు లేచెను. ఆమె కొంచెము లేచి మరల నాగి, మాటి మ్మాటికిని బిల్లవాని ముఖమును గాంచి ఏడు నేను లేచుటను దెలిసికొనలేదు గదా యనుకొనెను. శ్రీకృష్ణుడు నేడు విచిత్రలీలను జేయదలచెను. అందువలన నాతడు నేడు గాఢ నిద్రను బోవుచుండెను. తన తల్లి యెప్పుడు శయ్యపైనుండి లేచి పోయినదియు నాతనికి దెలియదు.

లేచి తల్లి వెంటనే వేడినీటితో జేతులనుగాళ్ళను గడిగి కొనెను. కవ్వమును స్వచ్ఛజలములచే గడిగెను. అలమరలలో బెట్టిన పెరుగు కుండలను దెచ్చెను. శబ్దము కాకుండునట్లు పెరుగులో జేతిని బెట్టికవ్వమును నిలిపి, తరువాత దధి స్తంభ మును గడిగెను. కవ్వపు త్రాటిని సవరించెను. కవ్వపుత్రాడు కవ్వమునకు జుట్టబడెను. ఆ త్రాటికి రెండుచివరలను బంగారు కడియములు కలవు. తల్లి కవ్వపుముద్దను బెరుగునముంచి ఘుమరుఘుమరుమనుచు బెరుగును జిలుక దొడగెను.

యశోద చల్లచేయునపుడామె శోభనుచూచి తీర వలసినదే. చల్లనుచేయునపుడును, రాట్నమును త్రిప్పునపు డును దల్లులు మధురస్వరమున గీతములను బాడుచుందురు. దానివలన మనస్సును నిలుచును. శ్రమయు నుండదు. పని చేసినటుల యుండదు. యశోదయును దధిమంథన సమయ మున దన పుత్రునియొక్క బాలలీలలను స్మరించుచుం బాడు

చుండును. వ్రజమున నొక గోపికకలదు. ఆమె చక్కఁగఁ కవిత్వమును జెప్పగలదు. ఆమె శ్రీకృష్ణుని బాలచరిత్రము లను మంచి మర్మమును స్పృశించుభావములో వర్ణన మొన రించెను. మంచి చక్కని ప్రసాదపూర్ణములగు మధురగీత ములను రచించెను. ఆగీతములను యశోద కంఠస్థ మొన ర్చెను. ఆమెకుఁ దన పుత్రునియొక్క ప్రతివిషయమును బరను ప్రీతిగ నుండును: ఆమె కాతని లీలలను గానమొన ర్చుటలో నాంతరిక సుఖము కలుగుచుండును. అందువలన నామె కెప్పుడవకాశము జిక్కినను నాపదములను గొణుఁగుచు బాడుకొనుచుండును. నేఁడు దధిమంథన మొనర్చుచు యశోద మంథనమున వచ్చిన ఘుమర ఘుమర శబ్దములో దన స్వరమును గలిపి పాడుచుండెను. ఆమె ఒక చక్కని యెత్తు పీఁట మీఁదఁ గూర్చుండెను. దాని కోళ్ళన్నియును జందనపు కొయ్యతోఁ జేయఁబడినవి. పెదపెద కుండలలో జిక్కని పెరుగు నిండియుండెను. దానిలోఁ గవ్వమునువైచి కుడి యెడములకుఁ ద్రాటినిఁ గ్రమముగఁ ద్రిప్పుచుండెను. పెరుగును జిలుకుచుండ దానిలోనుండి చిందులు లేచును. అవి క్షీరసాగరమును మథించినపుడు దానిలోనుండి యెగిరిన ముత్యాలవలె నుండెను. యశోద శరీరము కొంచెముగ స్థూల శరీరము. ఆమె నడుము స్వాభావికముగ నుండు దానికంటె నధిక స్థూలముగ నుండెను. ఆమె ఒక చక్కని పట్టుచీరెను ధరించియుండెను. ఏకాంతమున నచ్చటఁ బురుషు లెవరును లేరు. అందువలన ముసుఁగు జారిపోయెను. ఆమె యొక్క కొప్పు అటునిటు నూగుచుండెను. అది విద్యు త్తముగఁ దుమమఁ బడినది. రాత్రి దానీలు దానియందు

రాజమాలతీ పుష్పములను దుఱిమిరి. మాలతీ మాలలను దానిలోఁ దుఱుమఁ బడెను. చల్లచేయునపుడు వేణియందు దుఱిమిన పుష్పములు క్రింద భూమిమీఁదకు రాలుచుండెను. అది ఆకాశమునుండి దేవతలు పుష్పవర్షమును గురిపించు చున్నట్లుండెను. లేక పుష్పములు పాదములమీఁదఁ బడియును, భూమిపైఁబడియును తల్లితో నిట్లు మొఱను బెట్టుకొనుచున్నట్లుండెను:- "అమ్మా! ఇది నీపని కాదు. దాసీలను రానిమ్ము. వారు చల్లను జేయుదురు. నీవు శ్రీకృష్ణుని కడకుఁ బొమ్ము." లేక తల్లి యింతటి చిన్నచిన్న కార్యములొనర్చుచుండఁగాఁ జూచి మనమీమె మస్తకముపై నుండుట కధికారము లేదు. క్రింద బడిపోవలయునని పడెనా యనునట్లుండెను. లేక శ్రీకృష్ణుడీమార్గముననే వచ్చి తల్లినిఁ బట్టుకొనఁ గలఁడు. కావున నాతని మార్గమును బుష్పమయ మొనర్పవలయును. అందువలన నవి తల్లి తలనుండి వ్రాలి శ్రీకృష్ణుని మార్గమునఁ బడియుండెను. లేక పుష్పము లిట్లనుకొని యుండును. వ్రజమం దుచ్చాసనమున నుండుట నిషేధము. అచ్చట వ్రజరజమునఁ బొరలాడుటయే గొప్పమాహాత్మ్యము. గోపికల పదధూళియే సర్వశ్రేష్ఠమనుకొని దానిలోఁ బొరలాడవలయును. యశోదమాత యమ్ములను పైన శిరస్సునఁ గూర్చుండ బెట్టినది. కావున నిప్పుడు మనము వ్రజరజమున దొరలవలయును. లేక శ్రమ కారణమునను శిరస్సుకదలుట చేతను బుష్పములు స్వాభావికముగఁ బడవచ్చును, ఏమైనఁ గానిండు. యశోదతలనుండి సుందర సుగంధ పుష్పములు క్రిందకు వ్రాలెను. యశోద వయస్సు మళ్ళినను ఆమె శరీర నుందొక ముడత యైనను లేదు.

ముఖము పూర్ణిమనాఁటి చంద్రునివలె వికసించియుండెను. పాపిట సిందూరము శోభించుచుండెను: ఫాలమున సౌభాగ్య తిలక మంకితమై యుండెను. తలవెండ్రుక యొక్కటియైనను నెఱియ లేదు. కర్ణముల నున్న గమనీయ కుండలములు మాటిమాటికిని డ్రాడును లాగునప్పుడెల్ల నూఁగుచు గదలు చుండెను. ఆమెజుట్టు సుందరముగను వంకర వంకటులు తిర్గి దట్టముగ నుండి చక్కఁగ దువ్వఁబడి యుండెను. పెద్ద పెద్ద నేత్రము లనురాగముచే వెలుఁగుచుండెను, ఆమె గాజు లును, గంకణములును కడియములును, బాజూబందులును ఇతరాభరణములును, త్రాడులాగుచుండ భుజములాడుటచే నూఁగుచుండెను. ఆభూషణము లన్నియును మ్రోగుచు మంథాన శబ్దమును దనుతాళమును గలుపుచుండెను. నిద్రించి లేచుటచే యశోద రవికను దొడుగుకొనలేదు. అందువలన నామె నిర్ముక్త, పుష్ట, దీర్ఘ, లోలస్తనములు రెండు పెద్ద బలిసిన చేపలవలెఁ జంచలించు చుండెను. నిరంతరమును బుత్రుని స్మరించుటచే నామె మాతృ స్నేహ ముప్పొంగు చుండెను. స్నేహోద్రేక కారణమున స్తనమునందలి దుగ్ధ ములు స్రవించుచుండెను. దాని వలన నామె పట్టుచీరె తడియుచుండెను. శ్రమచే ముఖమునందు స్వేదకణములు మెఱయుచుండెను, కాళ్ళను జాచుకొని ఆమె స్నేహమయ మగు సజీవ ప్రేమ ప్రతిమవలె నుండెను. కుండ కదలకుండు టకై దానికి నాల్గువైపులను రాళ్ళను బెట్టెను. యశోద దధి మంథన మొనర్చుచునే మాటిమాటికిని శయ్యవైపునకు గృష్ణుఁడు లేచునేమో నని చూచుచుండెను.

రాజమాలతీ పుష్పములను దుఱిమిరి. మాలతీ మాలలను దానిలోఁ దుఱుమఁ బడెను. చల్లచేయునపుడు వేణియందు దుఱిమిన పుష్పములు క్రింద భూమిమీఁదకు రాలుచుండెను. అది ఆకాశమునుండి దేవతలు పుష్పవర్షమును గురిపించుచున్నట్లుండెను. లేక పుష్పములు పాదములమీఁదఁ బడియును, భూమిపైఁబడియును తల్లితో నిట్లు మొఱను బెట్టుకొనుచున్నట్లుండెను:— "అమ్మా! ఇది నీపని కాదు. దాసీలను రానిమ్ము. వారు చల్లను జేయుదురు. నీవు శ్రీకృష్ణుని కడకుఁ బొమ్ము." లేక తల్లి యింతటి చిన్నచిన్న కార్యములొనర్చుచుండఁగాఁ జూచి మనమీమె మస్తకముపై నుండుటకధికారము లేదు. క్రింద బడిపోవలయునని పడెనాయనునట్లుండెను. లేక శ్రీకృష్ణుడీమార్గముననే వచ్చి తల్లినిఁ బట్టుకొనఁ గలఁడు. కావున నాతని మార్గమును బుష్పమయము నొనర్పవలయును. అందువలన నవి తల్లి తలనుండి వ్రాలి శ్రీకృష్ణుని మార్గమునఁ బడియుండెను. లేక పుష్పములిట్లనుకొని యుండును. వ్రజమం దుచ్ఛ్వాసనమున నుండుట నిషేధము. అచ్చట వ్రజరజమునఁ బొరలాడుటయే గొప్పమాహాత్మ్యము. గోపికల పదధూళియే సర్వశ్రేష్ఠమనుకొని దానిలోఁ బొరలాడవలయును. యశోదమాత మమ్ములను పైన శిరస్సునఁ గూర్చుండ బెట్టినది. కావున నిప్పుడు మనము వ్రజరజమున దొరలవలయును. లేక శ్రమ కారణమునను శిరస్సుకదలుట చేతను బుష్పములు స్వాభావికముగఁ బడవచ్చును, ఏమైనఁ గానిండు. యశోదతలనుండి సుందర సుగంధ పుష్పములు క్రిందకు వ్రాలెను. యశోద వయస్సు మళ్ళినను ఆమె శరీర నుందొక ముడత యైనను లేదు.

ముఖము పూర్ణిమనాటి చంద్రునివలె వికసించియుండెను. పాపిట సిందూరము శోభించుచుండెను. ఫాలమున సౌభాగ్య తిలక మంకితమై యుండెను. తలవెంట్రుక ఒక్కటియైనను నెఱియ లేదు. కర్ణముల నున్న గమనీయ కుండలములు మాటిమాటికిని ద్రాడును లాగునప్పుడెల్ల నూగుచు గదలు చుండెను. ఆమెజుట్టు సుందరముగను వంకరవంకటలు తిగ్గి దట్టముగ నుండి చక్కగ దువ్వబడి యుండెను. పెద్ద పెద్ద నేత్రము లనురాగముచే వెలుగుచుండెను. ఆమె గాజు లును, గంకణములును కడియములును, బాజూబందులును ఇతరాభరణములును, త్రాడులాగుచుండ భుజములాడుటచే నూగుచుండెను. ఆభూషణము లన్నియును మ్రోగుచు మంథాన శబ్దమును దనుతాళమును గలుపుచుండెను. నిద్రించి లేచుటచే యశోద రవికను దొడుగుకొనలేదు. అందువలన నామె నిర్ముక్త పుష్ట, క్షీర, లోలస్తనములు రెండు పెద్ద బలిసిన చేపలవలె జంచలించుచుండెను. నిరంతరమును బుత్రుని స్మరించుటచే నామె మాతృస్నేహ ముప్పొంగు చుండెను. స్నేహోద్రేక కారణమున స్తనమునందలి దుగ్ధ ములు స్రవించుచుండెను. దాని వలన నామె పట్టుచీరె తడియుచుండెను. శ్రమచే ముఖమునందు స్వేదకణములు మెఱయుచుండెను, కాళ్ళను జాచుకొని ఆమె స్నేహమయ మగు సజీవప్రేమ ప్రతిమవలె నుండెను. కుండ కదలకుండు టకై దానికి నాల్గువైపులను రాళ్ళను బెట్టెను. యశోద దధి మంథన మొనర్చుచునే మాటిమాటికిని శయ్యావైపునకు కృష్ణుడు లేచునేమో నని చూచుచుండెను.

శ్రీకృష్ణుడు నిద్రలేవక పూర్వమే తాను చల్లను జేసి వెన్నదీయుట పూర్తి చేయవలయునని ఆమె యూహ. వీడు మేల్కొనినఁ జల్లఁజేయ వీలులేదు. అందువలన నామె గబగబ చేతుల నాడించుచుండెను. తల్లి దేనినిఁ గూర్చి యూహించుచుండెనో అదియే జరిగెను. శయ్యమీద నాతడటు నిటు తల్లినిఁ గాంచెను. తల్లి కనబడక పోవునప్పటి కాతఁడు లేచి కూర్చుండి కన్నులను నలుచుకొనుచు మూల్గసాగెను. ఎదుటఁ జూడగాదల్లి చల్లనుజేయు చుండెను. ఆతడు పట్టెను బట్టుకొని నేలమీదకు దిగి, తల్లికడకు బోయెను.

సూతుడిట్లనెను;- “మునులారా! ఎవరిని యోగులును, యతులును, సాధువులును, సన్న్యాసులును సదా అన్వేషించుచుందురో ఆతఁడే నేఁడు అమాయకునివలె పాలు త్రాగుటకై యేడ్చుచుఁ దల్లిని వెదకుచుండెను. లేనగానే భగవానునకు దల్లిపాలు కావలసివచ్చెను. ఆతఁడు కన్నులను గొంచెముగఁ దెరచి, కొంచెముగ మూయుచు, ముఖమును వ్రేలాడవైచుకొని తల్లికడకుఁ బయిడెను. సమీపమునకుబోయి వెంటనే తల్లి మథించు త్రాటిని బట్టుకొనెను. ఇక దల్లి దధినెట్లు మథింపఁగలదు. ఇంకేవస్తువునైన బట్టుకొనినచో దల్లి తెరచుచుండెడిదే: కాని త్రాటినిఁ బట్టుకొనగానే ఆమె ఆగవలసివచ్చెను. చల్లచేయుట నాపి యశోద పిల్లవాని నెత్తుకొని మంద మందహాసముతో గూడిన నాతని ముఖారవిందమును గాంచుచు స్నేహకారణమున స్వతః స్రవించుచున్న నామె స్తనములతోఁ బాలను ద్రావించుచుండెను.

# నవనీతచోరుని అల్లరిపనులు

(౮౭౮)

శ్లో॥ ఉలూఖలాంఘ్రే రుపరి వ్యవస్థితమ్
మర్కాయ కామం దదతం శిచిస్థితమ్ ।
హైయంగవం చౌర్య విశంకితేక్షణమ్
నిరీక్ష్య పశ్చాత్సుత మాగమచ్ఛనైః ॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౯ అ. ౮ శ్లో॥

ఆ॥ వికచకమల నయన వేరొక యింటిలో
వెలయు రోలు దిరుగ వేసి యెక్కి
యుట్టిమీఁద వెన్న నులుకుచు నొకకోఁతి
పాలు సేయుచున్న బాలుఁ గనియె.

శ్రీమదాంధ్రభాగవతము.

తనప్రియులకంటెఁ దనప్రియుల హితైషుల నెక్కువగ నాదర మొనరించుచుందురు. పుత్రునకేదైన రోగముండి, అతనికి చికిత్స సుయోగ్యుఁడగు వైద్యుఁడెవఁడైనఁ జేయుచుండ పూర్వ విశ్వాస మాతనిపై నుండి, పుత్రుఁడాతని యుపచారముచే నీరోగుఁడైనచో నాతనికి స్వాగతసన్మానము పుత్రునికంటె నెక్కుడుగఁ జేయుదుము. కారణ మేమనఁగా నాతడు పుత్రుని మేలును గోరినవాఁడు. అతని వలన కుమారునకు మేలుకలుగును. ఆవైద్యుని యెడల స్వయముగ నేప్రేమయును లేదు. ఆతని యెడల నుండిన యాదరబుద్ధి సుతుని సంబంధముచేతనే. ఆతని బ్రసన్నునొనర్పఁగోరుటలో సుతుఁడు రెండు మూఁడు కఠినవాక్కులు పలికినను నది ప్రేమాధిక్యముననే.

వైద్యుని బ్రసన్నునొనర్చుకొనుటకు యనిన బుత్రుని నీరోగునిగా నొనర్చుటకే. చిన్నపిల్లలు వివేకమును గ్రహింపజాలరు. వారు దీనిలో దమకవమాన మని గ్రహించెదరు. ఏడ్చెదరు. తల్లిదండ్రుల మీద గోపమునువహించెదరు. దూషణమును జెందియుద్రేకించెదరు. నానా విధములగు నుపద్రవములను గావించెదరు. తల్లిదండ్రులును దానిని శాంతింపజేయుటకును సామదానభేద దండోపాయములను గ్రహింపవలయును.

సూతుడిటులనెను:- "మునులారా! యశోద మథించుచుండిన తరి సగము మథింపబడి పెరుగులోనట్టియుండెను. ఆమె చేతిలోనుండి త్రాడెప్పుడు జారిపోయినదో యామెకే తెలియదు. శ్యాముడు తల్లి కడపాలను ద్రాగుచుండెను. ఎదుటనే పద్మగంధ గోవుల పాలు మట్టికుండలలో గ్రాగుచుండెను. నిత్యమును దాసీలు దాలిపోయిలలో బిడకలనుంచి రాజవైచి, వానిపొగపోగానే పాలనుబోసిన బానలను వానిపై బెట్టెదరు. అగ్ని క్రమ క్రమముగఁ దగ్గిపోగానే పాలపొంగు బానలోనుండి, దానిలోనే పొంగి క్రమముగ శాంతించును. అంతగ్రమ క్రమముగ బైన మీగడయేర్పడును. తోడుకొనగా పాలుగాగి యెఱ్ఱనై దానిమీదనుందముగ రొట్టెవలె మీగడ కట్టును. శ్రీకృష్ణునకు మీగడయనిన జాలయిష్టము. కావున దల్లి తెల్లవారక ముందే పాలనుబిలికి ఆ దాలిమీదనే కాచుచుండును. శ్రీకృష్ణుడాడుకొని రాగానే మీగడ కావలయుననును. అప్పుడు తల్లి రొట్టెమీద నట్టి రొట్టెవంటి మీగడనుంచును. అది ఎఱ్ఱని గోధుమరొట్టెమీద తెల్లని మీగడరొట్టెపెట్టినట్లుండును. శ్రీకృష్ణుడు రెండు రొట్టెలను బండ్లతో

గోరుకు కొని తినును. అట్లుచేసిన తల్లి కానందము. పాలెంత చిక్కగానుండి, యెంతటి మందాగ్నిలో గాచబడునో అంతటి మందము గల మీగడ కట్టును. తల్లి యెన్ని పనులనొనర్చు చున్నను నామె మనస్సు పాలమీదనే యుండును. ఆమె శ్యామసుందరునకు పాలొసంగు చున్నను నామె మాటిమాటి కిని పాలవైపునకు జూచుచునే యుండును. నేడు తొంద రలో నెవతెయో దాసి అధికముగ పిడకలను వైచెను. నిర్ధూ మము కాకపూర్వమే అగ్ని బాగుగా మండుచున్నపుడే దాని మీద పాలతో నింపబడిన పాత్ర పెట్టబడెను. అధికాగ్ని యగుటచే పాలు పొంగి పొంగి దాల్లోబడి పోవదొడగెను. పాలబొట్టొకటి నిప్పులోబడినను దల్లులు దానివాసనచే నెచ్చ టనో పాలుపొంగుచున్నవని గుర్తించెదరు. ఇంత వరకును యశోద పాలను ద్రాగుచున్న మదన మోహనుని సుస్మిత ముఖారవిందమును మమతా భరిత దృష్టితో జూచుచుండెను, పాలపొంగును వాసనబట్టి ఆమె ఆదురాపడి అన్నిటిని మరచి పోయెను. వెంటనే బలవంతముగ శ్రీకృష్ణుని ఒడిలో నుండి తీసి భూమిమీదనుంచి పాలనుదించుటకు బరువిడెను, ఇంకే మున్నది. ఇంతవరకు పాలేపొంగుచున్నవి. ఇప్పుడు పుత్రు డుప్పొంగు చున్నాడు. “ నామీదదల్లికి ప్రేమలేదు. ఆమెకు నామీద కంటె పాలమీద ప్రీతి. నావిషయమును జూడకయే నన్నతృప్తునిగనే పీడి మధ్యలోనే లేచి నన్నువిడిచి పాలను దింపుటకు బోయినది. ఈమె, పాలు వెన్న పెరుగు సంగతిని జూచెదను ” అని అతడనుకొనెను. తల్లి చేసిన యీ పనికి బాల కృష్ణునకు గోపము వచ్చెను, భగవంతునకు గోప మేలవచ్చినది ? మంచిదికాక పోయినను నేదియో యుండితీర

వలయును, మంచిచెడ్డలకు జనకు డతడే కదా! దైవీసంపత్తును, ఆసురీసంపత్తును సృజించిన దాతడే. సమస్త భావములకును జనకుడాతడే. అతనిలో శాంతియున్నప్పుడు క్రోధమునుండ ను. కాని ఆతని క్రోధము కల్యాణ ప్రదము. ఏలననగా నాతడు కల్యాణ స్వరూపుడు, తల్లిపై వచ్చిన కోపములో ప్రేమయును నిండియున్నది. గంగాజలములోనికి వచ్చిన జలములన్నియు గంగాజలము లెట్లగునో అట్లే ప్రేమ గంగలోనికి వచ్చిన భావములన్నియును ప్రేమమయములగును. ప్రేమకోప మద్భుష్ట వంతులకే ప్రాప్తించును. ప్రేమకోపము పరాయి వారిమీద జేయబడదు. అది ఆత్మీయులమీదనే వచ్చును. కృష్ణుడెవని దనవానిగా జేసికొని వానిమీద గోపమును జెందునో ఇంతకు మించిన సౌభాగ్యకరమగు విషయమింకేది యుండును?

శ్రీకృష్ణునకుఁ గోపకారణమున బంధూక పుష్పము యొక్క అరోన్మీలిత కళికమువలె నాతని రెండు పెదవులును వణఁకసాగెను; ఆతఁడు తన చిన్నచిన్న శుభ్రప్రకాశమయ మనోహర దంతములచే దొండపండు వలెనుండిన పెదవు లను గొఱకుచుఁదన కోపమును వ్యక్తపఱచుటకు సాధనమే మున్నదా యని వెదుకుచుండెను. తల్లి పెరుగును జిలుకు టకుఁ గుదురుగాఁ బెరుగు బానక్రిందఁ బెట్టిన రాతిముక్కల మీఁద నాతని దృష్టిపడెను. ఆతఁడొక పెద్దరాతిని దీసికొని పెరుగుతో నిండియుండిన బానమీఁద బలముతోలఁది బాదెను. రాయి తగలఁగానే ప్రాతదగు నాబాన వెంటనే ఫట్టని పగి లెను. సగము చిలుకఁపడి నాపెరుగు భూమిమీఁద జరజర ప్రాకివ్యాపించెను. తల్లి పాలకుండను గొంచెము దూరముగ నున్న యింటిలోఁ బెట్టుటచే నామె పాలను దించి, అది

అప్పటికై ప్రయత్నించుచుండెను. శ్రీకృష్ణుని సత్పుత్రునిచేసి వచ్చితినేనని ఆతొందరలో నామె మఱచెను.

శ్రీకృష్ణుడు క్రోధభరితుఁడై కుండనురాతితోఁ గొట్టెను. గాని అతని చేతికేమియు నంటలేదు, ఇదివరకిట్టే చేయుచుండిన మజ్జిగ పోయి కొంచెముగనో గొప్పగనో వెన్న దొరికెడిది. కాని అదియింకను దానిలో నేకాకారముగనే యుండెను. పెరుగుబాన పగిలిపోగానే భగవానునకు గొంచెము భయము వైచెను. ఆతడచ్చటినుండి పారిపోయెను. ఆతడిటులను కొనెనుః— "తల్లికపరాధము నొనర్చితిని. మేమియును సాయ పడలేదు." వెంటనే ఆతడింటిలో బ్రవేశించెను. ఉట్టిమీద నిన్నటి వెన్నయుంచబడెను. సమీపముననే బియ్యమును దంపుకొయ్య రోలొకటి తలక్రిందులుగ బెట్టబడి యుండెను. శ్యాముడు మెల్లగా దానిని లాగి యుట్టిక్రిందకు దెచ్చెను. ఒక జుర్రుజుర్రగా నది చాల తీపిగనుండెను. లోభమునవలన లోభము పెరుగుచు. ఆతడిటులనుకొనెనుః— "ఇక్కడనే కూర్చుండి తినినచో మధ్యలో దల్లిరావచ్చును. ఆమె తిన నీయదు సరికదా పైగా దండించును. కావున నీ వెన్నమొత్త నెచ్చటికైనను నేకాంతముగ గొనిపోయి తినవలయును, బయటకు పోయినచో దల్లి చూడగలదు. అసమయమున నాతనికి వెనుకనొక కిటికీ కనబడెను. దైవవశమున నది తెరవ బడియుండెను. ఆతడా మొత్తను గైకొని ఆకిటికీ కుండా దిగెను. అచ్చటనే తమాల, నకుళ, కదంబ, అర్జునాది చాలావృక్ష ములు నాటబడి యుండెను. వాటిమీద శ్రీకృష్ణుని సఖు వానరులు కూర్చుండి యుండిరి. అచ్చటను నొక కొయ్యరోలు తలక్రిందులుగఁ బడియుండెను. దానిని గూడ శ్యామసుందరుడు

తనకెత్తుపీటఁగా గావించుకొనెను, దానిమీఁద దుత్త తీసికొని కూర్చుండెను. వానరులు చుట్టును జేరెను. వానరులు కానిండు బాలకులు కానిండు. ఒక్కసారి తినుట రుచిని మరిగిరా వారు కలసి మెలసి యుందురు. శ్రీకృష్ణునిఁ జూడఁగనే చాల వానరులు తమపరివారముతో వచ్చి ఆతనికి నలు వైపులను గూర్చుండెను. శ్రీకృష్ణుఁడొక్కడే భోజనమొన ర్చిన నానందముండదు. భోజనము రుచి తన కత్యంతము ప్రియులగు సఖులతోఁ గూర్చుండి నవ్వుచు ప్రేలుచు, వాగుచు, పాడుచు, మధుర సంభాషణ మొనర్చు కొనుచు తినిన నానందము కలుగును. భోజనములోని మాధుర్యము ప్రేమ సంభాషణమున వృద్ధినిఁ బొందును. తన వానర సఖులను గాంచి శ్రీకృష్ణుఁడత్యంతానందమును జెందెను. తానొక ముద్దను దిని, ఒక్కొక్క ముద్దను వానికినిఁ బడవేయు చుండెను. వానికి ముద్దలను బంతులవలె బడవేయుచుండ వానిని మధ్యలోనే అందుకొని తినుచు బుగ్గలందు గ్రుక్కు కొనుచుండెను. ఈ విధముగ వెన్నలవిందు జరుగుచుండెను.

ఇచ్చటఁ దల్లి పాలను దించి చల్లార్చెను. అగ్నిని దులిపియు, ఆర్పియు దానిబలమును తగ్గించి చివరకది మృత ప్రాయము కాఁగానే బలము తగ్గినది కావున దానిమీఁద మరల పాలనుంచెను. ఇంతలోనే మరల పొంగునేమోనని చూచుచుండెను. దానిమీఁద సన్నగా చేసికొనఁగానే మీగడ యేర్పడినది. అప్పుడామె నిశ్చింత యయ్యెను. పాలమీఁద మీగడ కట్టగానే అదియిక పొంగదు.

ఈవిధముగఁ బాలను జక్కఁగసర్ది తల్లి చల్లచేయుచుండ

దగ్గరకు వచ్చునప్పటికి, ఆమె కంగణమందు దధిసాగర ముప్పొంగినట్లుండెను. బాన పగిలిపోయి యుండెను. పెరుగు బురదవలె నయ్యెను. పగిలిన మజ్జిగ బానలోపల రాతినిఁ గాంచి, మంథన గృహమునుండి మరియొక యింటిలోనికి శ్రీకృష్ణుడు పెరుగు దడిసిన పాదములతోఁబోయిన గుర్తులను గాంచి, ఇదియంతయును నీధూర్తుని పనియేనని గ్రహించెను. అటునిటు వెదకిచూచెను. కాని శ్రీకృష్ణుడచ్చట లేడు. అందువలన నాతఁడే దీనినిఁ బగుల గొట్టి భయముచే బారిపోయెనని గ్రహించెను, తల్లికి పుత్రుని యిట్టి చాపల్యమునకు నవ్వువచ్చెను. యిట్లు పిల్లల అల్లరినిఁ జూచుభాగ్యము భాగ్యశాలురకే లభించును. అయినను తల్లి పైకి మరల నిట్టి పనిని చేయకుండుటకై కోపమును ప్రకటింప వలయును. ఇప్పుడు తల్లికి పిల్లవాడెచ్చటికిఁ బోయినాఁడాయను చింత పట్టుకొనెను.

శ్రీకృష్ణుడు మంచిబుద్ధిమంతుడుగానుండును కాని తల్లి దగ్గఱనాతని యాటలు సాగవు. వెన్నను దొంగిలింపఁ బోవు నప్పుడా పెరుగు బురదలో నుండియే పోయెను. అందువలన నాతని చరణచిహ్నములు స్పష్టముగా గోచరించుచుండెను. తల్లి యా చరణ చిహ్నముల యాధారమున నింటిలోనికిఁ బోయెను. పోయిచూడఁగా నిన్న నుట్టి మీఁద బెట్టిన వెన్న కుండయును లేదు. నేఁడు శ్రీకృష్ణుడు తన యింటిలోనే దొంగతనమును జేసినాడని ఆమెగ్రహించెను. కావున గోపికలు చెప్పినదెనసత్యమే! వారు ప్రతిదినమును మొఱఁబెట్టుకొన వచ్చుచుండినను నాకువిశ్వాసము కలుగకుండెను. నాయెదుటనే యీతఁ డిట్లు చేయుచున్నప్పుడు మిగిలిన గోపికల వద్ద నీతఁడు చేసియే

యుండవచ్చును. నేఁడు వీనికి దండనును విధించెదను. కొట్టె దను. త్రాడుతోఁ గట్టివైచెదను."

ఇంతలోనే ఆమెదృష్టి తెఱచియుండిన బయట కిటికీ మీఁదఁబడెను. ఆమెయిట్లనుకొనెను-; అధూర్తుఁ డీవైపుగా బయటకుఁబోయి క్రిందకు దిగియుండ నచ్చును. భయకారణమున వనమునకుఁ బాఱి పోయినాఁడేమో నని తల్లి ఆదిక్కునకు బోయెను. ఆమె తనజారుచుండిన అందెలకడియాలను పైకి లాగుకొనెను. చప్పుడును వినిన నీచోరుడు పాఱిపోవు నేమోనని ఆమెభయము. కాళ్లు చప్పుడు కాకుండ యశోద కిటికీ కడకుఁబోయెను. అచ్చటికిఁబోయి చూడగా నామెకు నవ్వువచ్చెను. వానరులకు విందు జరుగుచుండెను. వెనుక కాళ్ళ బలమున పెద్ద మనుష్యులవలె గూర్చుండి వానరులు చేతులలో బెట్టు వెన్నముద్దల నారగించుచుండెను. శ్రీకృష్ణుఁడు మధ్యలోఁ గూర్చుండి పంచి పెట్టు చుండెను. అతఁడొక్క వడించు పనిలోనే నిమగ్నుఁడైయున్నను నాతఁడేమరపాటున లేఁడు. తనదొంగతన మెచట బయటపడునో యని భయముచే నటునిటు జూచుచుండెను. యశోద మెల్లగా నాతనికిఁ దెలియకుండ వచ్చి పట్టుకొొన వలయుననియు నటు శ్రీకృ ష్ణుఁడు తల్లి తనదొంగతనము నెచ్చటగనుఁగొనునో యనియు నామె రాకపూర్వమే తాను వెన్నదిని సమాప్త మొనర్ప వలయుననియు దలచుచుండెను. కాని తల్లి ముందు పుత్రుని యాటలెట్లు సాగగలవు.

సూతుఁడిట్లనెను-: మునులారా! తల్లి శ్రీకృష్ణునిజూచు చుండెను. గాని శ్రీకృష్ణుడు వెన్న ముగలను ...

ములో విమగ్నుడై యుండెను. ఇంతలో నామె మెదలక జేతిలో జిత్తమును బట్టుకొని తనవైపునకు వచ్చుచుండుటనాతడు కాంచెను. వెంటనే వెన్నపాత్రను నేలపై బడవైచెను. రోలు మీదనుండి దూకివచ్చుమన పరువిడెను. భయకారణమున నాతడు దాగుకొనదలచెను. తల్లి యాతని బట్టుకొనదలంచెను. విజయమెవరికి గలుగునో ఆవర్ణనమును నేనుముందు జెప్పెదను.



# శ్రీకృష్ణుడు పట్టుబడెను

( ౮౭౯ )

శ్లో॥ న చాంత ర్న బహిర్యస్య న పూర్వం నాపి చాపరమ్।
పూర్వాపరం బహిశ్చాంతర్జగతో యో జగచ్చ యః॥
తం మత్వాత్మజమవ్యక్తం మర్త్యలింగ మధోక్షజమ్।
గోపికోలూఖలే దామ్నా బబంధ ప్రాకృతం యథా॥

(శ్రీభాగ.౧౦. ౯అ, ౧౩, ౧౪ శ్లో)

క॥ వెలిలోను మొదలు తుది నడు
ములు లేకజగంబు తుదియు మొదలున్ నడుమున్
వెలియును లోనగు నీశ్వరు
నలవడు నే కట్టఁబ్రిణతురాల్ గాకున్నన్ ॥

ఆ॥ పట్టె యెల్ల బోటి పట్టి యీతండని
గట్టి తలపు తోడ గట్టె గాక
పట్టి కడుపు పెక్కు బ్రహ్మాండములు పట్టు
టెరిగనేని దల్లి యేల కట్టు.

(శ్రీమదాంధ్రభాగవతము.

పలుకుట, వినుట, చూచుట, మాటాడుట, అనుట, దుముకుట మొదలగు వ్యాపారములన్నియును మాయాసంభవములే. సమస్త క్రియలును, సమస్తలీలలును, మాయలోనే యుండును. మాయలో నసంభవమనునది లేదు. మాయా వినోదమగు బ్రహ్మమును, జీవుడును లీలారహితులైన చెప్పుటకును వినుటకును, వీలుగాక రసవిహీనమగు నెండిన పిండివలె నుండును. అదియే మాయ నాశ్రయించి సరసమైన దగును. రసగుల్లావలె మధురముగను, సుస్వాదుగను, చెప్పుటకును యోగ్యమగును. వైష్ణవులు మాయకు మూడు భేదములను జెప్పిరి. ఒకటి ప్రపంచమును మోహింపచేయు నల్లని మాయ, రెండవది భక్తులను మోహింపజేయు రసమయమగు మాయ, మూడవది భగవంతుని గూడ మోహింపజేయు పరమరసమగు నభిన్నస్వరూప మాయ. సఖ్య, దాస్య, వాత్సల్య, రసాస్వాదనమునకు సంబంధించిన మాయ భక్త మోహినీ మాయ. మధురరసానుభూతి భగవంతునిం గూడ మోహింపజేయు మాయవలననే కలుగును. దానిని బొందుట కన్యసాధనము లేదు. సఖ్య, దాస్య, వాత్సల్య రసముయొక్క రసికులకడకు ఐశ్వర్యము కంటె మాధుర్యమాత్ర యక్కువగ నుండును. దాస్యరస మందెంతటి యైశ్వర్యము కలదో

అట్టి భక్తభానుడగు భగవానుడు తల్లి భయముచే బారిపోవు చుండెను. తల్లి కాతడీశ్వరుడను జ్ఞానములేదు. ఈశ్వరుడైన తనగృహముననే యీశ్వరుడు. తల్లికుండాతడు ముద్దు పిల్లవాడు. ఆతడన్ని పనులను తల్లి యాజ్ఞ ప్రకారము చేయ వలయును. వెన్నను గొనిపోయి తినుటకు గోవులకు బంచుట కాతని కేమి యధికారము కలదు. ఆతనికిది అనధికారచేష్ట. దానికాతని దండించి తీరవలెను. దండించిన దొంగతనమును బట్టుకొని నప్పుడొనర్పవలయును. ఎనుట నపరాధి లేకున్న దండించు టెవరిని ? కావున ముందాతని బట్టుకొన వల యును, తల్లి ఆలోచన యిది యిట్లుండగా శ్రీకృష్ణుండిట్లను కొనుట లేదు;- "నేను మా అమ్మ యొక్క వెన్ననే తింటిని. తల్లి యొక్క వస్తువులన్నియును పిల్లవానివే. పుత్రుడు వాని కధికారి. ఇష్టము వచ్చినట్లుపయోగించుకొన వచ్చును. తిన వచ్చును. దానమొనర్పవచ్చును. ప్రోవుచేసి కొనవచ్చు. ఇది యంతయు నాతని యిష్టముమీద నాధారపడి యుండును. మా అమ్మ యుంచిన దుత్తనే నేను దెచ్చితిని. దానిలోని వెన్నను దింటిని. నా సఖులకు బెట్టితిని. ఇందులో దొంగతన మేమున్నది. ఏమి అపరాధము జరిగినది, కాని శ్రీకృష్ణున కిట్టి బుద్ధి యెక్కడిది ? నేడాతడు పరమ అమాయకుం డయ్యెను. నేను జిన్నపిల్లవాడను. నేను తల్లి యిష్టము ననుసరించి నడువవలయును. ఆమె యాజ్ఞ ననుసరించియే వస్తువులను గదిలింపవలయును. నాకాకలి యైనచో దల్లిని యడుగవచ్చును. ఆమె యేది పెట్టిన దానిని దినవలెను. అట్లు గాక ఆమె నడుగక యేవస్తువును దీసినను నది దొంగతనమే. దీనికి నన్ను దండించుటలో స్వతంత్రము కలదు. తానే దొంగ

నని చెప్పుచుండ నింక నపరాధమును మోపు ప్రశ్న యేమున్నది. దొంగతనము చేయుచున్నప్పుడు ప్రత్యక్షముగ దండనము నొసంగువారే పట్టుకొనిన దానికింక సాక్ష్యమెందులకు? వెంటనే వానిని వారే దండింప వచ్చును. శ్రీకృష్ణుడు తాను చోరుఁడనని యొప్పుకొనుచుండెను. ఇచ్చటఁదల్లి యో తన సర్వాధికారములచేఁ గొఱడాను దీసికొని వచ్చుచు నేమియు నడుగకయే వీనిని దండింపవలయుననుకొనుచుండెను. అందు వలననే ఆమె చేతిలోఁ గొఱడాను బట్టుకొనెను. చోరుఁడు సాధ్యమైనంత వఱకు చిక్కఁడు. తల్లి దగ్గఱకు వచ్చుటను గాంచి శ్రీకృష్ణుడు పరువిడెను. ఈకుఱ్ఱడు నాముందెంతగా బరువిడఁ గలఁడని యశోదకు గర్వము. నాల్గడుగులలో నీతనిఁ బట్టుకొందు నని తల్లి తన బలముకొలఁది పరువిడెను. తల్లి చాల సాహస మొనర్చెను. కాని పిల్లవాఁడెచ్చట ముసలిదెచ్చట! సన్నని అందమయిన శరీరము గలపిల్లవాడెక్కడ? స్థూలశరీరముగల తల్లియెక్కడ ? సుకుమారిఁయగు తెల్లని చాయగల రాణి యెచ్చట? నటనమఁడును నాభీరతనయుడగు నల్లని కృష్ణు డెక్కడ?

శ్రీకృష్ణు వెంటబరువిడుచుదల్లి యలసిపోవుచుండెను. ఆమె శరీరమంతయును స్థూలమగుటొక్కటియు, నితంబము అతి స్థూలములగుటచే నామె బాలకుని వెంట నెట్లు పరుగెత్త గలదు. ఆశచే పరువిడుచుండెను. ఆమెజడ సడలి యటు గొట్టు కొనుచుండెను. వెన్నకొరకై వెన్నుని కొట్టవలదని జడ చెప్పు చున్నట్లుండెను. కాని తల్లి అటుఁజూచుటయే లేదు. ముఖారవిందమునుండి అనన్యాస్వాదకణములు బయలుదేరి తల్లికోప మును తమ శీతలకణములచే శాంతింప జేయుచున్నవని స్వేద

కణములు శరీర ఛిద్రములనుండి బయటకు వచ్చుచున్నట్లుం డెను. కాని తల్లి వానికి క్రోధమున వానిని దండించుచుండెను. వెంటనే తన కోమలకరములతో వానిని తుడిచివేయుచుండెను. మరల నాస్థానమున క్రొత్తవి వచ్చుచుండెను: కావున నొక చేతితో యశోద స్వేదబిందువులతో సమర మొనర్చుచు, నొక చేతిలో కొరడాను బట్టుకొని యూగించుచు నామె పరువెత్తు చుండెను.

తల్లి యికఁ నూరకుండదని కృష్ణుడు తలచి, యింత వరకు నేసఖులకు వెన్నను బెట్టుచుండెనో వాని సహాయమున నాతడును చెట్టెక్కవలయుననియు, చెట్టు తల్లి యెక్కలేద నియు, నింతలోనే తండ్రివచ్చి పట్టుదలతో తన్ను కొట్టవలదని చెప్పగలడనియు తలచెను. కాని కృష్ణునకు పారిపోవుట తప్ప యింకొక యుపాయము తోచనేలేదు. తల్లి సమ్ముఖమున నాతడెంతని పరువెత్తగలడు? ఆతడు తల్లికి పట్టుపడెను. శ్రీకృ ష్ణుని బలమంతయును సమాప్తమయ్యెను. తల్లిముందర నాత డపరాధివలె నిలుచుండెను. జీవి సమస్తవిధముల ప్రయత్నము విఫలము కాగానే యేడ్వనారంభించును. ఎవరుటవారు దయా ళువులైనచో నేడ్చిన నవశ్యము దయకలుగును. అందువలన బాలకులు ప్రతి యావశ్యక కార్యము కొరకును దల్లిముం దేడ్చును. బాలకులకునిర్బలమునుసరళమునగుబల మేడ్చుటయే. శ్రీకృష్ణునికన్ని ప్రయత్నములును విఫలము కాగా నాతడు తల్లి సమ్ముఖమున భయముచే గడగడవణకుచు నేడ్చుచుండెను. అపరాధియే కనుక దండమొసంగి తీరవలయును. ఇప్పుడేడ్చిన దండము తగ్గగలదని, మాతృహృదయమున కరుణ నుత్పన్న మొనర్చుటకై ప్రయత్నించుచుండెను. రాత్రి తల్లి కన్నులకు

కాటుకను నష్టముగ జెప్పెను. ఆతనికి గన్నులకు నీరు కారవల యునని కోరిక. అశ్రువులను గాంచగనే సహృదయులకు హృదయము కరగును. కాని నేడశ్రువులును సమయమునకు విశ్వాసఘాతము నొనర్చెను. నేడాతని యిచ్ఛచేతనే తల్లి ముందు నేత్రములనుండి అశ్రువులును దల్లికి భయపడి రాలేవనునట్లు రానేలేదు. సమయమునకు దనకశ్రువులు కాలవిపరీతమున రాకపోఁగా నాతడు తనయెర్రని మృదుహస్తములతోఁ గన్నులను నులుముకొనెను. “ఓ దుష్టులారా! మీరీ సమయమున కేల నెండిపోతిరో రెండు మూఁడు బొట్లు పడిన జాలునని నానికి జెప్పుచున్నాఁడా యనునట్లుండెను. కాటుక రేగెను. ఆతడరుణ హస్తముల నరుణ కపోలమును నల్లగఁ జేసికొనెను. అపరాధి కన్నులతో గన్నులను గలిపి చూడ జాలడు. శ్రీకృష్ణుడు దెబ్బల భయముచే వ్యాకుల నేత్రములతో నాకాశము వైపునకు జూచుచుండెను. ఆతడా కాశముతో నిట్లు చెప్పుచున్నట్లుండెను:— “ఓ ఆకాశమా! నావర్ణమును నీవర్ణమును నొక్కటే. నీవైనవర్షింపుము. నీవే యీ నేత్రముల నార్ద్ర మొనర్చుము. దానివలన నీనుండి నాల్గు బిందువులు జలము రానై రాగలవు” కాని ఆకాశ మీ లీలను గాంచి నవ్వుచుండెను. అది యిట్లనుకొనుచున్నట్లుండెను.— “నా భూతముల నన్నింటిని నీవు కట్టివైచితివి అన్నిటిని గలిపి ముద్దచేసితివి. ఇప్పుడు నీవును స్వానుభవ పూర్వకముగ బంధనములోని స్వారస్యమును గ్రహింపుము,”

భయకారణమున దృష్టిని మళ్ళించిన శ్రీకృష్ణుని రెండుచేతులను దల్లి పట్టుకొని గద్దించుచు నిట్లనెను:— “ఏమిరా నాయనా! నీవు దొంగతనము నెఱుగవు కాదూ?

గోపికలు నాతో వచ్చి చెప్పుచుండ వారి మాటలను నేను విశ్వసింపలేదు. కాని నేడు నీవు దొంగతన మొనర్చుటను ప్రత్యక్షముగ గాంచితిని. నేడు నిన్ను గొట్టక విడువను," ఇదివిని శ్రీకృష్ణుడు భయముచే గడగడ వణకసాగెను.

తల్లియొక్క యుద్దేశ్యము పుత్రుని భయపెట్టుటకాదు. ఆతడు దొంగతనమున కలవాటు పడెను, తాను దొంగతనము చేయనని కృష్ణుడు చెప్పుటలేదు. ఆతడేమియును మాట లాడుటలేదు. మౌనియయ్యెను, తల్లి యిప్పుడు భయపడ సాగెను. ఆమె యిటులనుకొనెను, "చిన్నపిల్లవాడు చాల భయ పడినాడు. ఈతని హృదయములో భయమేర్పడెనా అనర్థము కలుగును." అని యాలోచించి ఆమె చేతిలోని కోరడాను పారవైచెను. "నీవు నాశరీరమున నుత్పన్నమైతివి. కావున నన్యత్ర ఉత్పన్నమైన బెత్తముతో నిన్నుఁ గొట్టనని చెప్పి నట్లుండెను. బెత్తమును బాఱవైచుటచే కృష్ణునకు గొంచె ముగ నోదార్పు కలిగెను.

యశోద మిక్కిలి పుత్రవత్సలత కలది. హితైషిణి, ఆమె పుత్రుని హితము కొరకే దండింప దలచెను. చిన్నపిల్లవానిని గొట్టజాలక బెత్తము నావలబారవైచి యిటు లనెను:– "సరే! నీవొక్కచోట నుండవు; కాని నిన్ను ద్రాటగట్టిద నవశ్యము. నీవుచాలా పోకిరీవైనావు. నిన్ను దూడనువలెఁ గట్టివైచెదను. అట్లుచేసిన నిక నీవెచ్చటను దొంగతనము జేయబోవు."

శ్రీకృష్ణుడేమియును మాటలాడుటలేదు. నేడాతని గట్టు టకు దల్లి నిశ్చయించుకొనెను, ఒకరోజంతయును గట్టివైచి

నచో నీతనికి దొంగతనము లోనగు అలవాటు పోవును. అట్లు చేయకున్నచో నీతడింకను నుచ్ఛృంఖలుఁడగును. ఈతని గట్టివైచిన గొంచెము సేపటికి గోపికలు వచ్చి విడిపించెదరులే యని ఆమె తలచెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ప్రేమ లీలయెట్లున్నదో చూడుఁడు. లోపలను, బయటను, పూర్వమునను బరమునను సమస్త బంధ వినిర్ముక్తుఁడగు శ్రీకృష్ణుని, దల్లి త్రాటితోఁ గట్టుదలచు చున్నది. శరీరమును బంధించి దానినింకొక వస్తువుచే బిగించుటయే బంధనము. శ్రీకృష్ణునకు బరాపరములేమున్నవి? బంధమును లేదు, మోక్షమును లేదు, కాని యివియన్నియును జ్ఞానవిషయములు. ఇచ్చట దల్లికిని బుత్రునకును మధ్య వాత్సల్యలీల జరుగు చున్నది. ద్వైతము లేక నీ యాస్వాదనము జరుగదు. బంధనము ప్రేమస్వరూపము. "బంధనాద్బంధురుచ్యతే" ఎవరు తమ ప్రేమ పాశములతో మనలను బంధించెదరో వారే బంధువులు. జీవులందఱకేకైక బంధువు శ్రీహరియొక్కఁడే. అందువలనఁ దల్లి తన జడలోనుండి వెండ్రుకల త్రాడును దీసి తన పుత్రుని బంధించుట కుద్యుక్తయయ్యెను."



# దామోదరుని దయాళుత్వము



శ్లో॥ స్వమాతుః స్విన్నగాత్రాయాః విస్రస్తకబరస్రజః
దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాసీత్స్వబంధనే ॥
ఏవం సందర్శితా హ్యంగ హరిణాభృత్యవశ్యతా
స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరం వశే ॥

శ్రీభాగ ౧౦ స్కం. ౮ అ. ౧౮,౧౯ శ్లో॥

ఆ॥ ఒడలఁ జెమట లెగయ నుత్తరీయము జార
పీడి యున్నతురుము విరులు రాలఁ
గట్టరాని తన్నుఁ గట్టెదనని చింతఁ
గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి॥

క॥ బంధవిమోచనుఁడీశుఁడు,
బంధింపఁబెనంగు జనని పాటోర్చి సుహృ
ద్బంధుఁడు గావున జననీ,
బంధంబునఁ గట్టుపడియెఁ బాటించి నృపా॥

శ్రీమదాంధ్రభాగవతము.

బంధనములేక రసము లేదు. బంధవిముక్తుఁడైనవాఁడు రసాస్వాదన మెట్లు చేయగలడు. భేదమేమనగా జీవుడు విషయములచే బంధింపబడినపుడు బద్ధుడగును. ఆతని సంయోగము శివునితో గలిగినచో దానికి ముక్తుడనుపేరు వచ్చును. కాని ఏక రసము దీనికిభిన్నమయినది. దీనిలో జీవుడు విషయములతోడను బంధింపబడడు. బ్రహ్మతోడను బంధింపబడడు ఆతడు తానే బ్రహ్మను బంధించును. దీనినే పంచమపురు

పార్థమందురు. దీనినే రాగమార్గమనియు, రసఅధ్యాయనియు ప్రేమ పంథాయనియు నందురు. ఇందులో జీవుడు శివునితో సాయుజ్యమును బొందడు కాని యాతనినే బంధించియుచ్ఛ్వాను సారముగ నాడించును. కొందరు దాసులై సేవచే నధీను నొనర్చుకొని స్వామి నాడించెదరు. కొందరు సఖులై మిత్ర త్వమును జోడించుకొని బాహుపాశమున బంధించి మిత్ర హృదయమును దన హృదయ తంత్రులచే బంధించును. కొందరు స్వయముగ దల్లిదండ్రులై ఆసర్వేశ్వరుని సుతునిగా నొనర్చుకొని ఆతని లాలన నొనర్చెదరు. అబ్బాయీ యని పిలిచెదరు. అపరాధ మొనర్చిన గసరి చీవాట్లను బెట్టుదురు. అపరాధ మొనర్చిన నాతని యుదరమును ప్రేమరజ్జువుచే బంధించెదరు. కొందఱాతని భర్తగనుఁ ప్రేష్ఠునిగను, ప్రియుని గను, ప్రాణనాథునిగను బతిగను భావించి రతిబంధనముచే బంధించియుచ్ఛ్వాను సారముగ నాడించెదరు. ఆతనిచే మాటి మాటికిని హాహాయనిపించెదరు. ప్రేమబంధనమందులో యదృష్ట మున కాని లభింపదు. దీనిలో బంధింపబడి జీవుడును గృతార్థు డగును, బ్రహ్మయును దన్ను ధన్యుడనను కొనును. ఈబంధన మత్యంత భాగ్యముచే బ్రాప్తించును.

సూతుడిటులనెను:– " మునులారా! తల్లి శ్రీకృష్ణుని బట్టుకొనెను. బాలకుడత్యంత భయభీతుడగుటను గాంచి ఆమెతన బెత్తమును బారవైచి యిట్లనెను:– " నిన్ను గట్టెద నులే " అని పలికి ఆమె తన జడనుండి వెండ్రుకల త్రాటినిఁ దీసెను. స్త్రీల వెండ్రుకలూడి వచ్చును. వానిని జక్కఁగ సవరించి యుంచెదరు. అవివాల కాగానే వానినిఁ ద్రాడుగ బేనుదురు. దానితో వారి కొప్పుముడిని గట్టుకొందురు, తాను

ఆతని సంకటమునుండి రక్షించుటకు బరువిడును. ఆమె ప్రయాసము నిష్ఫలమయ్యు రక్షింపబోయి తాను మునిగిపోనున్నను బలికి విపత్తు సంభవించుటను గాంచి ఆమె నిలువజాలదు, ఆమె తనశక్తి కొలది ఆతనిని రక్షించుటకు బ్రయత్న మొనర్చును. రక్షించుటకు బ్రయత్న మొనర్చియు, రక్షింపలేక పోవుట తరువాత మాట.

శ్రీకృష్ణుఁడనంతకోటి బ్రహ్మాండములలోని యీశ్వరులకును నీశ్వరుఁడు. నేఁడాతఁడు బాలకుఁడై తల్లి యగు యశోదకధీనుఁడై యున్నాఁడు. ఐశ్వర్యాది శక్తులు తమస్వామియొక్క యీలీలను గాంచి లజ్జితలైరి. మాస్వామి స్వతంత్రుఁడైన నీశ్వరుఁడు. ఆతఁడెవరిని లక్ష్యపెట్టఁడు. ఆతని కేధోరణి పట్టిన నదియే. దానినిఁ బూర్తి చేసి తీరును. ఆతఁడిప్పుడు చిక్కినదియును గోకులములోని ఒక గ్రామీణ గోపికల యింట. ఈగోపిక యీతని మహత్వము నెఱుగదు. అందువలన నైశ్వర్యాది శక్తులకు మిక్కిలి దుఃఖము కలిగెను. తల్లియొక్క వాత్సల్యము పరాకాష్ఠ నందుకొని సర్వేశ్వరుని దండింప నుంకింపఁగా నప్పుడు శక్తులయొక్క సాహసము సడలి పోయెను. అవి శ్రీకృష్ణునకు సహాయ మొనర్పఁ బరువిడెను. మృద్భక్షణ సమయమునను నైశ్వర్యశక్తి శ్రీకృష్ణుముఖమందు దన చమత్కారమును జూపించెను. కాని తల్లిపై నే ప్రభావమును బడలేదు. జనని దానిని జంజాలమనుకొనెను.

ఇప్పుడీ సమయమునను నింతగా భయభీతుఁడైన గృష్ణుని గూడ తల్లి వదలలేదు. ఆతని బంధించుటకే నిశ్చయించుకొనెను.

విశ్వైర్యశ యొక్క కట్టలు తెగెను, అది శ్రీకృష్ణునియొక్క యీాదుర్దశను జూడజాలక పోయెను. ఉదరములోనికి వచ్చి నిలిచెను. మృద్భక్షణ సమయమున నది ముఖమందు విశ్వ బ్రహ్మాండమును దర్శింప జేసెను. ఇప్పుడుదరమం దనంత శక్తిని గూర్చుండబెట్టెను. శ్రీకృష్ణుని నడుమున్నట్లె యుండెను. అర్జునునకు విశ్వరూపమును జూపించినపుడు భగవానుని శరీరము విశ్వమయ్యెను. ఇచ్చటనట్లు కాదు శ్రీకృష్ణుని నడుమట్లేయుండెను. అతని యంగములందేమాత్రమును వృద్ధిలేదు. పరివర్తనములేదు. కాని దానికంతమును లేకుండెను.

యశోద తన కేశపాశమునందలి నల్లని బెండ్రుకల దారముతో శ్రీకృష్ణుని నడుమును గట్ట నారంభించెను. ఒక చుట్టును జుట్టి ముడివేయదలచునంతలో నది రెండంగుళములు తక్కువయ్యెను. యశోదయిట్లనుకొనెను:- "పరవాలేదు, రెండంగుళములే కదా తక్కువ. రెండంగుళముల త్రాడు నొకదానిని దీనికి జోడించెదను" అనుకొని ఆమె దాసీనిట్లు పిలిచెను. "ఏమే! సుఖియా! అచ్చట నాజడత్రాడుండుచున్నది. దానిని నాకిటువచ్చి యిచ్చిపొమ్ము."

"రాణిగారూ! జడత్రాడు నేమి చేయుదువమ్మా!" అని అచ్చటినుండియే సుఖియా సమాధాన మొసంగెను.

"ఈకృష్ణుడు చాలయుపద్రవ మొనర్చువాడగుచున్నాడు ఇంటింట వెన్నను దొంగిలించుచున్నాడు, మొదట నేను నమ్మలేదు. నేడు వీడు మా యింట నేదొంగతన మొనర్చినాడు. వీనిని నేడు నేను గట్టివైచెదను. నా కేశములతో జేసిన త్రాడు కొంచెముగ తగ్గినది. కొంచెముగ ముడివేయవలయును. నీవు

పసువిడి తీసికొని వచ్చియిచ్చిపొమ్ము" తల్లి ఒక్క గ్రుక్కలో నిజ్జు చెప్పగనే, చెప్పినది దాసితో నైనను వినుచు పొరుగున నున్న గోపికలు దీనిని వినిరి. ఆచెవిని బడి వ్రజమంతటను నిది తెలిసెను. నేడు శ్రీకృష్ణుడు దొంగతనము చేయుచుండబట్టు వడినాడట. తన యింటిలోనే పట్టుపడినాడట. ఏగోపికయు నాతనిబట్టుకొన లేక పోయినది. తల్లియే ఆతనిబట్టుకొనినది. శ్రీకృష్ణుడు నవనీతచోరుడని యిప్పుడామెకు విశ్వాసము కలిగినది. ఇప్పుడామె కట్టి కొట్టగలదు. పదండి విచిత్రమును జూతము. కట్టివేయగా కృష్ణునకు కాంతివచ్చినది. యశోద శ్యామ సుందరు నెంతగా ప్రేమించుచున్నదో, కనుపాపలవలె నెంతగా రక్షించుకొనుచున్నదో వారికి తెలియును. ఏకైక పుత్రుడు. పైగా నెన్నియో మ్రొక్కులు మ్రొక్కగా చిరకాలము నకు లేక లేక వృద్ధావస్థలో నొక పుత్రుడు పుట్టినాడు. తల్లి హృదయ పూర్వకముగ నాతనిదండింపజాలదు. ఏదో పైకి కసరిభయపెట్ట గలదనుకొని శ్రీకృష్ణుని బంధనము విషయ మును వినగానే యెవరికిని దుఃఖము కలుగలేదు. పైగా నిట్టి ప్రేమమయమగు ఖేలనమును మనము స్వయముగా గన్నులార జూచు భాగ్యము కలిగినదని ఆనందము కలిగెను. ఈ ఆలో చనముతో గుంపులు గుంపులుగ గోపికలుత్సాహముగా సాగిరి. శ్రీకృష్ణుడపరాధివలె నిలుచుండెను. ఆతని యుగ్మ ముష్టులను దట్టి దామమును జుట్టుచుండెను, ఆమె రెండు చేతులతోడను దానియొక్క రెండుకొనలను బట్టుకొని మఱియొక త్రాడు కొఱకు ప్రతీక్షించుచుండు సంతలో దాసి రెండవ త్రాడును దెచ్చి యిట్లనెను;— "రాణీ! పోనీయుమమ్మా! పిల్లవాడు.

ఏమియును ఫరవాలేదు, మీకు వెన్నకు గొడవకలదా యేమి?"

కోపముతో విదిలించుకొని తల్లి యిటులనెను:— "పో, పో, గొప్పతీర్పు తీర్చుదానవైనావు, వెన్న కేమిపోవును. ఎంతైన దినవచ్చును. ఎంతైన జల్లవచ్చును. వీనికి దొంగతన మలవాటైనది, అది చాల చెడ్డది. నేడు వీనిని గట్టక వదలను. దాసి యిప్పుడింక నేమి చేయగలదు. అది దాసియయ్యెను గదా! తల్లి అడుగగా ద్రాడునిచ్చెను. తల్లి మొదటి త్రాటికి తాటిని గలిపి మరల నింకొకచుట్టు త్రిప్పి ముడివేయుబోగా మరల రెండంగుళములు తక్కువయ్యెను. మరల నింకొక త్రాటిని దెప్పించెను, దానిని గూడ కలిపికట్టెను. రెండంగుళములు తక్కువయ్యెను. ఈవిధముగ దల్లి యెన్నిసార్లు కట్టి చూచినను రెండంగుళములు తక్కువగు చుండెను"

అంత శౌనకుడిటులడిగెను:— "సూతా త్రాడు రెండంగుళములే తక్కువగు టెందులకు?

నవ్వి సూతుండిటులనెను:— "స్వామీ! జీవేశ్వరులకు రెండంగుళములే దూరము. జీవునకొక అంగుళము కొరవ. అది యాతఁడు తన యహంకారమును వదలక పోవుట. ఒక అంగుళము భగవానునకును గొఱవ కలదు. అది జీవుని నాతఁడు కృపచూడకుండుట. జీవుఁడు తన కర్తృత్వమును నభిమానమును వీడి, భగవానుఁడు కృపజూచినచో నింక లోటేమియునుండదు."

శౌనకుఁడిటులనెను:— "సూతా! భగవానుని పక్షమున నేమాత్రమును లోటులేదు. ఆతని కృపా దృష్టి నిరంతరము

బెంచి స్వయముగఁ గట్టఁబడును. తనవద్దననేకములగుఁ ద్రాళ్లు కలవు. వానిచేఁ దాను గృష్ణుని బంధింపఁగలనని యశోదను గర్వము. శ్రీకృష్ణుఁడు నవ్వుచుఁ జూచుచుండెను. తల్లి త్రాళ్లను దెప్పించెను. తన దగ్గరనున్న త్రాళ్లన్నియును బూర్తికాఁగా నసఫలత వలన దుఃఖితురాలు కాలేదు. నవ్వెను. ఆశ్చర్య చకితయై శ్రీకృష్ణుని నైపుణకుఁ జూడసాగెను.

యశోద తన శక్తినంతను వినియోగించెను. ఆమె తన ప్రయత్నమందేలోపమును జేయలేదు. ఇంటిలోని త్రాళ్లన్నియును బూర్తియయ్యెను. ఇరుగుపొరుగుననున్న గోపికలును గుతూహలవశమునఁ దమతమ యిండ్లలోని త్రాళ్లన్నిటినిఁ దెచ్చెను. వారు శ్రీకృష్ణుఁడు బంధమునుండఁ జూడఁదలఁచిరి. శ్రీకృష్ణుఁడు మనలను నిత్యమును వేధించుచున్నాఁడు. నేఁడాతనికి ఆ దొంగతనముయొక్క ఫలము తెలియవలయును. ఆతఁడు మోసమున గోపికలను బంధించి నవ్వుచుండును. నేఁడాతఁడును బంధింపఁబడినప్పుడు మనము చూచి నవ్వవలయును. యశోద త్రాళ్లుచాలకపోగాఁ గట్టలేకపోవుచున్నది. మనమామెకు సహాయము చేయుదము. ఆమెకు యథేష్టముగఁ ద్రాళ్ళనొసంగినను కాని వారి సహాయము దేనికిని బనికిరాలేదు. శ్రీకృష్ణుఁడు బంధింపఁబడలేదు. రెండంగుళములు తరుగు కనఁబడుచునే యుండెను. త్రాళ్ళనతుకు పెట్టి పెట్టి తల్లి యలసిపోయెను. ఆమె శరీరమంతయును స్వేదముచే ముద్ద ముద్దయ్యెను. ఆమె వేణియందుఁ దురుమఁబడిన మనోహరమాలలు తన స్థానముల నుండి జారి వదులైపోయెను. ముఖమునఁ జింతావిషణ్ణతా చిహ్నములు స్పష్టముగఁ గనఁబడుచుండెను. తల్లి యొక్క

యీస్థితినిఁ గాంచఁగనే శ్రీకృష్ణునకుఁ గృప కలిగెను. ఆతని హృదయమందు గృపా సంచారము కలిగెను. కృపయుదయింపగనే ఐశ్వర్యశక్తి భయపడెను. ఆమె యిటులనుకొనెను:— "కృపయున్నచోట నిఁక నా పప్పులుడుకవు. దయయందు గర్తవ్యపాలన మొనర్పుట జరుగును. కాని కృపకు వశుఁడైనచో నంతయు మరపునకు వచ్చును."

ఇది విని శౌనకుడిటులడిగెను:— "సూతా! నేము దయను, గృపను నొక్కటిగనే భావించుచున్నాము. ఇప్పుడు నీవు వీనిని వేరు వేరుగఁ జెప్పుచున్నావే?"

సూతుఁడిట్లనెను :— "స్వామీ! దయయుఁ గృపయును వాస్తవముగ నొక్కవస్తువే. అచ్చటచ్చట నీ రెంటిని బర్యాయ పదములుగ గూడ నాడుటకలదు; కాని దయకును గృపకును గొంచెము భేదము కలదు. దయ అందఱి మీఁదను సమాన రూపమున నుండును. పరులు దుఃఖితులగుటను గాంచి వారి దుఃఖములను బోగొట్టవలయునను భావనకే దయయనబడును. కాని ఆదయయే తనకు సంబంధించిన వారియందు కలిగినచో దానిని గృపయందురు. దయలో సంబంధాపేక్ష లేదు. కృపలో సంబంధావశ్యకత కలదు. ఎవరైనా మనలను సేవించినదానిచే స్వామిసేవక సంబంధము కలదు, ఆసేవాపరాయణుడగు వ్యక్తియొక్క దుఃఖమును గాంచి దానిని నివారించుటకే కృపయని పేరు. లేక యెవరైనా నింకొకనితో సఖ్యసంబంధమును బెట్టుకొనినను, పుత్రుడును, పతియును పత్నియును వారు దుఃఖితులగుటను గాంచిన కలుగు కరుణకు కృపయని పేరు. అర్జునునకు యుద్ధమందు తనవారిని జూడగనే మోహావశమున నిదే కృప

యుత్పన్నమగును. కృపచే బంధనము కలుగును. భగవానుడు ప్రాణిమాత్రులపై దయజూపును. కాని అతనితో సఖ్య, వాత్సల్య, దాస్య, మధురసంబంధములు నేర్పరచుకొందురో వారిమీదనే కృపయుంచును. ఈసంబంధములవలన శ్రీకృష్ణుడు విసుగుజెందగనే “కృపయాసీత్ స్వబంధనే” తనకుతానే కృపతో బంధనమున బంధింపబడును.

శ్రీకృష్ణుడిట్లనుకొనును :— “నాతల్లి యిప్పుడు మిక్కిలి దుఃఖితురాలైనది.” అని. అతడు తీక్ష్ణదృష్టితో నైశ్వర్య శక్తివైపునకు జూచెను. భగవానుని కుటిల భృకుటిని చూడగనే ఐశ్వర్యశక్తి పారిపోయెను. అనంతమగు శరీరము మూరల సీమితమయ్యెను. అతడు సాధారణ గోపబాలునివలె నయ్యెను. తల్లి ఆతని నొక త్రాటిచేతనే బంధించివైచెను.”

సూతుడిట్లనను :— “మునులారా! శ్రీకృష్ణునిప్రపంచమందెవరు బంధింపగలరు? బంధింపబడువానికంటె రూపము నందును, ఆకర్షణమునందును, గుణమునందును, ఐశ్వర్యము నందును సరళత్వమందును, నాతనికంటె నధికులగువారెవరో వారే కట్టగలరు. అతనికి మించిన నాకర్షణమును ప్రపంచమం దెచ్చట నుండదు. సద్గుణముల కాతడు గనియే. సద్గుణములు ఆతనినుండి యుత్పన్నమైనవియే. అతడు గుణములకు నియామకుడు, ఆతనికి సమానముగు నైశ్వర్య మింకెవనికి గలదు. ఆతనికే వస్తువును నభావమనునదిలేదు ఆతనికి మించిన వాడును లేడు అవస్తువును చూడగనే దానిలో లీనమై బంధింపబడును. ఆ వస్తువే ప్రేమ. అతడు ప్రేమకధీనుడై భక్తులకు వశపడును. ఈవిధముగ తల్లి ద్వారా స్వయముగ బంధింపబడి సమస్తబంధ

ములనుండి విడిపించు సర్వేశ్వరుడు "నేను భక్తులకు వశపడెదను. భక్తులు నన్నాడించిన నట్లాడుదును. ఎచ్చట నుంచిన నచ్చట నుండెదను. వారేది చెప్పిన దానిని చేయుదును. వారు బంధింపగా బంధింపబడుదును. కావుననే తన తల్లిమీదకృపను చూపి యతడు స్వయముగనే బంధనమున బంధింపబడెను.

---

# జీవోద్ధారలీల

(౨౨౧)

శ్లో॥ కృష్ణస్తు గృహకృత్యేషు వ్యగ్రాయాం మాతరి ప్రభుః।
అద్రాక్షీదర్జునౌ పూర్వం గుహ్యకౌ ధనదాత్మజౌ ॥
శ్రీభాగ ౧౦స్కం. ౯అ. ౨౨శ్లో॥

వ. అంత నయ్యశోద యింటికడంబనుల వెంటం దిరుగఁ గృష్ణుఁడు దొల్లి నారదు శాపంబున విటపములైయున్న నలకూబర మణిగ్రీవులను గుహ్యకుల నిద్దరంగని రోలీడ్చుకొని చనియె."

శ్రీమదాంధ్రభాగవతము.

వంటచేయువాఁడందరకును వంటఁజేయును. వాని పని అందరకును దృప్తినిచ్చునట్లు. కాని వానికేకాంతమిత్రుఁడుగా నున్నవానికిఁ బ్రేమగఁ బెట్టును. పదార్థమదియే. దానిలో

విశేషమేమియును లేదు. నడిపించువాఁడును నతఁడే. కాని దానిలోఁ గర్తవ్యపాలనమునకుఁ దోడుగాఁ బ్రేమనుగూడ కలిపినాఁడు. ప్రేమ వస్తువులలో నుండదు. అది భిన్నవస్తువు. దాని నేవస్తువుతోఁ గలిపినను నది సరళమగును. ముక్తి ప్రదాతయగు శ్రీహరి అందరకును ముక్తినొసంగును. ఆతని పని ముక్తి నొసంగుటయే. ఆతఁడు యోగులు, యతులు; సన్యాసులు, త్యాగులు, జ్ఞానులు, ధ్యానులు, సమస్త సాధకులకును ముక్తి నొసంగును కాని భక్తుల కేసుఖము నొసంగునో ఆసుఖము శుష్కతత్త్వజ్ఞానులకెట్లు అనుభవపూర్వకము దెలియగలదు ? పతివ్రతయగు పత్ని యింటిలోని వారికందరకును సేవచేయును. అందరకును వంటచేయును. అందరస్థానములను నలుకును, అందరతో నవ్వుతూ మాటలాడును. పైకి చూచినచో పతితో విశేష వ్యవహారము నేమియును గావింపదు. కాని పతితో నామెకు గల యేకాంత సంబంధము ఆపతికే ప్రాప్తింపగలదు. శ్రీకృష్ణునితో సంబంధమును బెట్టుకొని భక్తిచేయువారలకు లభించుసుఖము బ్రహ్మాది దేవతలకును, యోగులకును, ఆత్మస్వరూపులకును తత్త్వజ్ఞానులకును దుర్లభము.

సూతుడిట్లనెను:_ "మునులారా! శ్యామసుందరుడు కృపకు వశీభూతుడై స్వయముగ బంధింపబడెను. తల్లి ఆతనికి మొలనూలును గట్టుచోట చిన్నత్రాటితో గట్టెను. అది నల్లని కృష్ణునకు వేరొక నల్లని మొలనూలును గట్టినట్లుండెను. వకాయ్యరోలుమీద కృష్ణుడు కూర్చుండి యుండెనో అది డమరువలె పైనను గ్రిందను వెడల్పుగను గుండ్రముగను మధ్యలో సన్నముగ నుండెను. యశోద వేరొక పెద్దత్రాటిని తీసికొని ఒకప్రక్క శ్యామసుందరుని కటిభాగమునకు గట్టిన త్రాటికి

గట్టెను. రెండవవైపు చివరను రోలుయొక్క మధ్యభాగమున నిటగృష్ణుడు పారిపోకుండునటుల కట్టెను. ఈవిధముగ తల్లి పుత్రుని బంధించెను. గోపికలు సైగలతో శ్రీకృష్ణునకు గొప్ప మును చెప్పించుచుండిరి, కొందరు మూతులను ముడుచుకొని సైగలు చేయుచు నిట్లనిరి:- "కృష్ణా! ఎట్లు బంధింపబడి నావో చెప్పుము. రోజు మమ్ములను మోసగించుచుంటివే? ఇప్పుడు నీపాగ రెచ్చుటెక్కి బోయినది? నిన్నెవరు విడిపించెదరో చెప్పుము."

తల్లి ముసలిదైనను నీయువతులగు గోపికల సైగలతో మాటలాడు మాటలామెకు తెలియును. ఆమె యిట్లనుకొనెను:- "ఈ యౌవన మదమత్తలైన గోపిక లున్నంత వఱకు మా పిల్లవానినిఁ గద్దించుచునే యుందురనుకొని ఆమె యిట్లనెను:- "ఏమమ్మా! గోపికలారా! ఇక మీరు మీ యిండ్లకుఁబొండు. ఇంటిపనులను జూచుకొనవలయునుగదా! గోపికలు పోఁదలచలేదు, కాని యింటివారే యుక్తిపూర్వకముగఁ దయచేయుమనిన నెట్లు కూర్చుందురు. అయినను వారు వెడలుటకు కొంచెము వెనుకాడుచుండిరి. దీనినిఁగాంచి యశోద తాను లేచి తన యింటిపనులలో నిమగ్నయయ్యెను. ఈ ముసలిదానికి మనయుచ్చటఁ గూర్చుండుట ఇష్టములేక కష్టముగానున్నదని గ్రహించి వారును నొక్కొక్కరు వెడలి పోయిరి. శ్రీకృష్ణునియొక్క చాలమంది సఖులును ప్రోగైరి. తల్లి దీనినే కోరుకొనుచుండెను. చాలమంది పిల్లలు కృష్ణుని దగ్గఱనుండినఁ జాలును. ఆ మూలమున తన పిల్లవానికి బెంగ వేయదు. అందులకని పిల్లలకామె పెద్ద పెద్ద లడ్లనొసంగి యిట్లనెను:- "నాయనలారా! ఇచ్చటనే ఆడుకొనుచు

నాయనా !"

పిల్లలు మిక్కిలి సంతోషించిరి. తల్లి చేతులతో జనులను జేసికొనుచుండెను: కాని ఆమె దృష్టి శ్రీకృష్ణునిపైననే యుండెను. ఆమె మాటిమాటికి నిట్లనుకొనుచుండెను:—

"పాపము! ఇప్పటికి చాలసేపైనది. విప్పివైచెదను. కాని మరల నిటనుకొనును. కొంచెముసేపటే కట్టియుండనిమ్ము. కట్టిన నాతనికేమియును గష్టముకూడలేదు. పిల్లలతో నానందముగ నవ్వుచు నాడుకొనుచున్నాడు. ఏడ్వనారంభింపగనే విడిచి పుచ్చెదను." ఇట్లాలోచించుకొని ఆమె మొదలక తన పనిలో తాను నిమగ్నయై యుండెను.

పిల్లలిట్లనిరి:— "కృష్ణా! లడ్డును దింతువా?"

కృష్ణుడిట్లనెను :— "మీరిచ్చిన దిందునురా"

ఒకడిటనెను :—"కృష్ణా! నీముపండ్లతో కొరకినాముురా!

కృష్ణుడిట్లనెను :— "ఏమైతే, క్రిందనుండితినెదనులే"

ఇదివిని అందరును తమతమ లడ్డునుండి కొంతకొంత శ్యాముని కీయసాగిరి. శ్యాముడు చిరకాలమునుండి ఆకలిని జెందినవానివలె తినసాగెను. యజ్ఞములందు విధివిధానము ననుసరించి చేసిన చరువునుగూడ వేదమంత్రములతో మాటిమాటికిని స్తుతి నొనర్చినను దిననివాడు నేడు ఆటవిక గోపబాలకుల యెంగిలిని దినుచున్నాడు.

తినిన తరువాత సఖులిట్లనిరి :— కృష్ణా! ఇప్పుడేదైన నాట నాడవలయును."

శ్రీకృష్ణుడిటులనెను :— "ఓరీ! నన్ను మా అమ్మ కట్టివైచినది. ఆటలాడుటెట్లు?

ఖేలనముగ భావింపక సత్యమని భావించువారెవరో వారే ఏల? ఎందులకను మాయలోపడిపోవుదురు. అంతయును శ్రీకృష్ణుని క్రీడ. అంతయు నాయాటగాని యాట. అంతయు నా బృందావన విహారియొక్క విహారమే. అంతయు నా పరమ కౌతుకియొక్క కౌతుకమే. దీనిని చూచుచుండుము. నవ్వుచుండుము. ఇదియే శ్రేష్ఠసాధనము.

ఇది విని శౌనకుఁడిట్లనెను:— "సూతా! మీరు శ్రీకృష్ణుని స్వరూపమును గుఱించి చెప్పగా 'ఏల' అని ప్రశ్నించుచుందుము. అప్పటనే ఆగిపోవుదుము. సరియే, తరువాత బండి నడిచినదా? లేదా?"

సూతుఁడిట్లనెను:— "ఎందులకు నడువదు స్వామీ! నడిపించుటకే శ్రీకృష్ణుఁడాగినాఁడు. రసపుష్టి కొఱకే నిశ్చలుఁడయ్యెను. గోపకుమారుల మొఱలను విని శ్రీకృష్ణుడు బలమును వినియోగించెను. ఆతడు చేతుల బలమును కాళ్ళబలమునను నెమ్మదివలెనయ్యెను. ఒక్కయూపున లాగెను. బండి బయలుదేరెను. రోలు వెంట సాగెను. పిల్లలు చప్పట్లు చరచిరి. అందరిట్లనిరి :— "బలిసిన యెద్దేరా, బలిసిన యెద్దేరా"

శ్రీకృష్ణుడు కొంచెము ముందునకు పోయెను. అప్పటనాతడు జంటగా పెరిగిన మద్దిన తరువులనడుమను గాంచెను. వీరిదివరకు ఉత్తరదిశయందలి లోకపాలుడును యక్షపతియునగు కుబేరుని పుత్రులు. నారదుని శాపమున నిట్లు వృక్షములైరి. వారిమీద భగవంతుని దృష్టిపడెను.

శౌనకుఁడిట్లనెను :— "సూతా! ఈరెండు చెట్లును శ్రీకృష్ణుని యావరణములోనే యుండెనని నీవు చెప్పితివి. ఇన్ని

దినములనుండి భగవానుడు వీనిక్రిందుగా తిరుగలేదా? తిరిగి యుండవచ్చును. అంతవరకు వీనిపైన దృష్టిపడలేదా యేమి? ఇంతవరకు భగవానుడు వీనిని చూడలేదా? ”

సూతుడిట్లనెను :_ “స్వామీ! ఎందులకు చూడలేదు. భగవానుడు నిత్యమును జూచుచునే యున్నాడు. కాని నేడు కృపాభరిత దృష్టులతో గాంచెను. నేడాతడు వానిని వృక్షయోనినుండి యుద్ధరించుటకై అవలోకించెను. నేడు వారిని శాపబంధమునుండి విముక్తుల నొనర్పదలచెను. ”

శౌనకుడిట్లనెను :_ “ సూతా! నేడే భగవానుడిట్టి విచారమేల జేసెను. నేడే ఆతనికి వీరిజ్ఞాపకమేలవచ్చినది? ”

నవ్వి సూతుడిట్లనెను :_ “ స్వామీ! ఈశ్వరుని మనస్సు నెవ్వరెరుగగలరు? ఎప్పుడీతని కృపాదృష్టిపడునో ఎవరికి దెలియును. అన్నిటికిని కాలము నిర్ణయమై యుండెను. సమయము వచ్చినప్పుడే యీతడు కృపాదృష్టివృష్టిని కురిపించును. ఇంకొక విషయమును నుండవచ్చును. నాకిట్లు తోచుచున్నది. తన బంధనమును గాంచగనే భగవానునకు కుబేరపుత్రుల బంధనము జ్ఞాపకము వచ్చియుండవచ్చును. ఎవడు దెబ్బ తినని వానికి దెబ్బతగిలినవానిబాధ యేమి తెలియును. నేడు తాను కట్టబడుటను గాంచగనే యీవృక్షములయొక్క జ్ఞాపకము వచ్చెను. అయ్యో! వీరెన్ని దినములనుండి మాయావరణమున బంధింపబడి నిలచియున్నారు! నేను వీరిబంధనములను వదలింపక పోయినచో నేను తల్లియొక్క బంధనమును నెట్లు వదలించుకొన నాసించెదను. నేను వీరి బంధనములు వదలించినచో నాబంధనమును వీడిపోగలదు. ప్రపంచము వ్యవహారము మీదనే నడచు

చున్నది. ఈచేతిల్లో నిచ్చిన నాచేతినుండి రాగలను. ఇట్లాలో చించుకొనగా భగవానునకు నారియభారమును గూర్చిన విష యము జ్ఞాపకమునకు వచ్చియుండవచ్చును. భగవానుడు కృపా సాగరుఁడు. అతఁడు తల్లి యెడలఁకృపఁ జూపుటకై స్వయ ముగ బంధింపఁబడినాఁడు ఇప్పుడు యమళార్జున వృక్షముల మీఁదఁ గృపఁజూపుటకు ముందుకుఁ బోయెను.

శౌనకుఁ డిట్లడిగెను_; సూతా! బంధింపఁ బనుట తల్లి మీఁదనేమికృప?

ఇది విని సూతుఁడు నేత్రములనుండి ప్రేమాశ్రువు లను గార్చెను. ఆతని వాక్కు గద్గదిక మయ్యెను. ఆతఁడ త్యంత కరుణాస్వరమున నిట్లనెను:_ "స్వామీ! ప్రేమబంధన మందును భగవంతుని అనంత ప్రసాదము నిండియున్నది. భగవాఁనుడు లక్ష్మీపతి. పత్నియందు పతి యను గహమును జూపినట్లెవ్వరిమీఁదను జూపఁడు. తన సర్వస్వమును నామె కర్పించును. తన శరీరములో నామెను గలుపుకొనును. అందువలన నామె అర్ధాంగి యనఁబడుచున్నది. భగ వానుఁడు లక్ష్మీదేవినిఁ దన హృదయమునందుండుటకు స్థాన మొసంగెను. పాదసేవన మునప్పు సర్వోత్కృష్ట సేవను ప్రసాదించెను. ఇంతకు మించిన ప్రభుప్రసాదమేమియుండును. ప్రభువు ప్రసాదమునకుఁ బరాకాష్ఠ. కాని యింతటి కృపను జూపినను లక్ష్మీదేవి కాభగవంతునిఁ గట్టు సాహసము లేక పోయెను. ఆమె ఆతని ముఖమువైపే చూచుచుండును. మానవుఁడు తన పుత్రునిపైఁ గూడ అందరికంటె నెక్కువ కృపను జూపును. పుత్రుఁడు తనకాత్మ. తండ్రియొక్క

చరాచర సంపత్తికధికారి. భగవానుఁడు యశోద యెడల గృపను జూపినట్లు తనపుత్రుఁడగు బ్రహ్మమీఁదఁ గూడ చూపలేదు. చూడుఁడామె కధీనుఁడై ఆమె చనుబాలను ద్రాగెను. ఆమె భయమున గడగడ వణఁకెను. ఆమె బంధింపఁగా బంధితుఁడయ్యెను. కావున భగవానుఁ డపరాధమునకు ఫలస్వరూపుఁడుగ బంధింపఁబడలేదు. ఆతఁడు సర్వేశ్వరుఁడు. విశ్వపతి. ఆతని కపరాధమేమున్నది? తల్లికి వాత్సల్యసుఖము నొసంగ నాఁతఁడు బంధింపఁ బడెను. నలకూబరమణిగ్రీవులు కుబేరుని పుత్రులు. వీరు చిరకాలము నుండి ఆతని యావరణమున నుండిరి. వారినుద్ధరించుటకు ఉలూఖలమును లాగుచు ముందుకు వచ్చెను."

ఇది విని శౌనకుఁడిట్లనెను:– "సూతా! ఈ దామోదరలీల చాల రసమయమైనది. మహాభాగా! ఈలీలయందు భగవానుఁడు వాత్సల్యరసముయొక్క పరాకాష్ఠను జూపించెను. యశోదమ్మ భాగ్యమును గూర్చి యెంతగాఁ బ్రశంసించినను నది అత్యల్పమే. అనంతకోటి బ్రహ్మాండనాయకుఁడు [illegible] యేతల్లి స్తనముల పాలను ద్రాగెనో నామెకు మించిన భాగ్యవతి ప్రపంచమునం దెవరుండగలరు? నేను యమళార్జునోద్ధార కథ [illegible] చెప్పెదను. భగవానుఁడు ఉలూఖలముతో నాఁడు [illegible]చుండునప్పటి [illegible] నిమ్ము. నీవు మాకు వినిపింపుము. శ్రీకృష్ణునకుఁ దల్లిదండ్రులగు యశోదానందుల కట్టిదైన దుర్లభమగు పదము ప్రాప్తించుటకు వారేమి సుకృతమును గావించిరి. యశోదాదేవి యేకర్మ నొనరించుటచే దానికి ఫలస్వరూపముగ నామె బృహత్పయోధరములను శ్రీకృష్ణున కందింపఁ గలి

గెను. ఈ ప్రశ్నకుఁ బ్రత్యుత్తరము నొసంగి మీరు తర్వాత కథను జెప్పుము."

ఇది విని సూతుఁడు గంభీరుఁడై యిట్లనెను:— "మహాభాగా! ఇట్టి పదవి కర్మముల ద్వారా ప్రాప్తింపదు. ఈ పదవి సాధన సాధ్యమైనది కాదు. కృపా సాధ్యమైనది. భగవంతుఁడెప్పు డనుగ్రహించిన నప్పుడు కృపావృష్టిని గురిపించును. శ్రీనంద యశోదలను గూర్చి ఒక పౌరాణికకథ కలదు. దానినే నేనిప్పుడు చెప్పెదను. మీరు దత్తచిత్తులరై వినుఁడు."



# శ్రీహరి యశోద స్తనపానమేలఁ జేసెను

౮౮౨

శ్లో॥ నందః కిమకరోద్బ్రహ్మన్ శ్రేయ ఏవం మహోదయమ్।
యశోదా చ మహాభాగ! పపౌ యస్యాః స్తనం హరిః॥

శ్రీభాగ. ౧౦స్కం. ౮ అ. శ్లో॥

ఆ॥ జగదధీశ్వరునకుఁ జన్నిచ్చు తల్లిగా
నేమి నోము నోఁచె నీయశోద
పుత్రుఁ డనుచు నవనిఁ బోషించు తండ్రిగా
నందుఁ డేమి సేసె నందితాత్మ.

శ్రీమదాంధ్రభాగవతము.

దరిద్రమునందన్నియును గుణములే. ధనమునందన్నియును దోషములే. ధనమెంతో కష్టమున నుపార్జింపఁబడును. ప్రాణపణముగ ధనము ప్రాప్తించినను దానిని రక్షించుట చాలకష్టము. ధనికునకు రాత్రులందు నిద్రయుండదు. మేల్కొని యుండవలసినదే. ధనికున కెవరిని జూచినను ననుమానమే. ధనమును జోరులెవరైనను హరించెదరేమో. ఎవరైన యాచించెదరేమో, చుట్టాలు పక్కాలును, దాయాదులును ధనమునకై కలహించెదరేమో, రాజు గ్రహించునేమో, నేనే యెచ్చటనైనను బెట్టి మరచెదనేమో, అని యీవిధముగ రక్షించుటయందును దుఃఖమే. దగ్గరఁబెట్టుకొన్నను దుఃఖమే. ఇది యిట్లియున్నది. ఏదైన వ్యాపారములోఁ బెట్టినవృద్ధికలదే అనుచింత. వ్యయమును జేయువలయునన్నను దుఃఖమే. "అయ్యో! వ్యర్థముగ వ్యయమగుచున్నదే! యను చింత. ఒకవేళ నష్టమైనచోఁ బ్రాణాంతక దుఃఖము. ధనికుఁడెన్నడును నిశ్చింతగనుండ జాలడు. ఆతని కెప్పుడును జింతయే యుండును. ఏదో విధముగ జోరత్వమొనర్పని ధనికుఁడెచ్చటనో విరళముగ నుందురు. ఇతరులకు గష్టమును గలిగించిననే ధనము ప్రోగగును. ధనికులకు మిథ్యాభాషణమొక సామాన్య విషయము. మాటమాటకును నబద్ధము జెప్పెదరే యనిన నబద్ధమాడనిది పని జరుగదని వారందురు. వ్యాపారము సత్యాసత్యముల మీద నాధారపడి యున్నది. ధనికులు చెప్పునదొకటియుఁ జేయునదొకటియును. ధనము దగ్గరనుండిన నో బని వేగము పెరుగును. ధనికులు మిక్కిలి అహంకారులుగానుందురు. వారెవరిని లక్ష్యపెట్టరు. వారికి ప్రతికూలముగ నేదైన విషయము జరిగెనా వారికి గ్రోధమువచ్చును.

పారు మూర్తీభవించిన నహంకారములు. వీడు పెద్ద, వీడు చిన్న, వీనితో మాట లాడవచ్చును, వీనితో మాటలాడరాదు. అను నీభేదబుద్ధి ధనవృద్ధిచేఁగలుగును. ధనికులకు చాలమందితో వైరము కలుగును, ఏలననగా వారానక్యకతను మించిన వస్తువుల యందధికారమును వహించెదరు. ధనికులకు నెంతనే యెవరి మీఁదను విశ్వాసము కలుగదు. తల్లి, తండ్రి, భార్య సోదరుడు, బంధువు వీరందరయందవిశ్వాసము కలుగును. ధనమున స్పర్ధ స్వాభావికము. తనతో సమానముగ నెవరైన నయ్యెదరనుకొనును. ధనము పెరిగిన స్త్రీ జూదము, మదాది మాదక ద్రవ్య వ్యసనము వృద్ధియగును, ఈ విధముగ ధనమున ననేక దోషములు కలవు. దరిద్రుల వైపున కెవ్వరును జూడనే చూడరు. అందువలన నీయవగుణములందు వీటికిచ్చ యున్నను వీనినుండి రక్షింపబడెదరు. ఈవిధముగ దరిద్రము నందన్ని యుసు గుణములున్నను నొక గొప్పదుర్గుణము కలదు. అతిథి సత్కారము సముచితరీతిని జరుగదు. దరిద్రుడైయున్న నింటికి వచ్చిన నతిథిని తను, మన, సర్వస్వములనర్పించి వానిని సత్కరించినచో నాతనికిమించిన సుకృతి యీ ప్రపంచమున నింకెవడూ నుండజాలడు. అతడీ సుకృతముచే భగవంతుని గొని వేయును. ఆతని దన వానిగా జేసికొనును. భగవంతుఁ డట్టివాని చేతికమ్ముడు వోవును. ఏలననగా నాతఁడు తన స్వామిస్వరూపముగ దర్శించినాఁడు. అతిథికి సర్వస్వమును సమర్పించి సత్కారమొనర్చినవాడు సమస్తమును బొందినట్లె.

సూతుఁడిటులనెను:— "మునులారా ! మహాభాగ్యవతి యగు యశోద కేకర్మచేఁ బరాత్పరుఁడగు ప్రభువు ప్రసన్న

జేనాఁడో, ఈ విషయమున నొక గాథను నేను మీకుఁ జెప్పెదను.

ఒక అత్యంత శాంతమగు నేకాంతవనము కలదు. ఆ వనమునం దొక జీర్ణశీర్ణమగు బర్ణకుటీరము కలదు. దానిలో నొక ద్విజదంపతులు నివసించుచుండిరి. బ్రాహ్మణుని పేరు ద్రోణుఁడు. ఆతని భార్య పేరు ధర. ఇద్దరును గొప్పభగవద్భక్తులు, విషయవిరక్తులు, కృష్ణప్రేమానురక్తులు భగవద్రూపాసనాసక్తులు. బ్రాహ్మణుఁడు భిక్షను దెచ్చి మూఁడు జాములకు వచ్చును. బ్రాహ్మణి దానిని వంటజేసి, వచ్చిన నతిథి నభ్యాగతులకుఁ బెట్టి, భర్తకును బెట్టి మిగిలినది తాను దినును. మిగులకున్న నట్లే నిద్రించును. ఆమె గ్రామమును జూడనేలేదు. ఆమె వనములోనే ఉండి భగవద్ధ్యానమందు నిమగ్నయై యుండెడిది. భగవంతుఁడామె కింతటి యధిక సౌందర్యమును వ్యర్థముగ నొసంగినాఁడు. ఆమె యౌవనప్రదేశమందలి మాలతీకళికవలె నామె సౌందర్యము వనమును పరిమళింపఁ జాలనట్లుండెను. యౌవనమువచ్చి ఆమెను గుదిలించి కదిలించి యూఁపెను. కాని ఆమె మీఁద నే ప్రభావమును బడలేదు. ఆ సతిసాధ్వి తన పతినే పరమేశ్వరునిఁగ భావించుచు నాతని యాజ్ఞల ననుసరించుచుఁ బతిసేవయందే తాను నిమగ్నయై యుండుటయే కర్తవ్యమని భావించుచుండెను. పతి యాజ్ఞయే ఆమెకు వేదాజ్ఞ. పతియొక్క యిచ్ఛచే నామె బిల్వపత్రములను, తులసీదళములను, వివిధములగు బుష్పములను బ్రోవు చేసెడిది. అతిథి ఈశ్వరరూపుఁడని పతి చెప్పెను. అతిథిననాదరించిన నీశ్వరు ననాదరించుటే. అతిథి యేద్వారమునుండి

దగ్గరగ నున్నదని మాత్రము నాకు దెలియును. మీరు కొంచెము సేపు వేచియుండినచో నేను కొంచెము ఆహారమును తెచ్చెదను. ” అనిపలికి ఆమె యున్నదున్నట్లు లేచిపోయెను.

గ్రామము సమీపముననే కలదు. దానిలోనొక యువక వణిజుని దుకాణము కలదు. పతివ్రత అచ్చటికి బోయి నిలుచుండెను. ఇంకను చాలమంది స్త్రీపురుషులు బేరమును చేసి సామానులను దీసికొనుచుండిరి. యువక వణిజుడందరకు తూచి యిచ్చుచుండెను. ఆతడు పతివ్రతను గూడ అడిగెను :— నీకేమి కావలయునమ్మా? ”

పతివ్రత యిటులనెను :— “ నాభర్త భిక్షను తెచ్చుటకు వెడలినాడు. ఆతడింకను రాలేదు. మాయింటికి ముగ్గురు అతిథులు వచ్చిరి. వారికిప్పుడే ఆహారము కావలయును. వారికొరకు నేనాహారమును గొనిపోవ వచ్చితిని. ”

యువకుడు భిక్షుక బ్రాహ్మణుని నెరుగును. గ్రామద్వారాని సమీపమున నొక పల్లెగుడిసె యైనను లేదనియు తెలియును. ఆతని భార్య నాతడు చూడలేదు. ఒక్కసారి ఆతడా పతివ్రతను పైనుండి క్రిందకు చూచెను. అసహాయునిగాంచి యుండెను వానివలన ననుచిత లాభమును పొందచూచెను. సౌందర్యమును గాంచిన గొప్పగొప్పవారి మనస్సులును విచలితము లగును. కామవాసన కామసామగ్రినిచూడగనే వృద్ధినిపొందెను. యువక వణిజుని మనమునందు పాపవాసన యుదయించెను. ఆమెనాతడిటులడిగెను :— “ నీకేమికావలయును ?”

యువక వణిజుడు కావలసినదానికంటె నధికముగ బియ్యమును, పప్పు, పిండిని, నేతిని, ఉప్పు, మిరపకాయలు, వగైరా

మసాలా దినుసులు, కూరలను నొక పాత్రలోబెట్టి సతీసమ్ముఖమున నుంచి యిటులనెను ;– "ఈసామగ్రిని నేను నీకిచ్చితిని. ఇక నిప్పుడు నీవు నాకేమి యొసంగెదవు? "

దీనతాస్వరమున దేవి యిటులనెను :– "నేను దరిద్రురాలను, భిక్షుకను. నావద్ద నిచ్చుటకేమున్నది? "

సతృష్ణనేత్రములతో తనదుర్భావనను వ్యక్తమొనర్చుచు నాతడిటులనెను :– "నేను సదావర్తి నిచ్చువాడను గాను. వ్యాపార మొనర్చుకొనువాడను. ఒకవస్తువునకు బదులుగా నింకొకవస్తువు నొసంగుటయే వ్యాపారము. నీవద్ద ధనములేకుండిన నేమియుండిన దానినిమ్ము. "

వివశతాస్వరమున సతీదేవియిటులనెను. నావద్దనిచ్చుటకేమున్నది? నావద్ద నీ చినిగిన చీరెయున్నది. అని పలికి ఆమె తన చినిగిన చీరెను చూపించెను. చినిగిన రవికనుండి బంగారమువలె నుబ్బెత్తుగా నుండిన నామె పయోధరములు కనబడుచుండెను. "

వణిజుడిటులనెను :– "నీదగ్గర నున్నదాని నొసంగెదవా? "

దేవియిటులనెను :– "నేను భగవంతుని తోడుగా నొట్టుపెట్టుకొని చెప్పుచున్నాను; నావద్ద నేమున్నను నీవు తీసికొనవచ్చును. "

ఇది యా కాముకుడు తన కాముకభాషలో నాతల్లి స్తనములనై పునకు చూపించెను. దేవియొక్క సతీత్వము మెరసెను. ఆమె కోపింపలేదు. చెడ్డగను భావింపలేదు, నేను భగవంతునిమీద నొట్టుపెట్టుకొని అడిగినదిచ్చుటకు ప్రతిజ్ఞను చేసి

నప్పుడామాటను తప్పరాదు. ఈతడుబ్బిన నీమాంసపిండములనే అడుగుచున్నాడు. ఇవి వ్యర్థముగ రొమ్మునకు బరువేకదా. నీని నొసంగి అతిథులకు సత్కారమొనర్చెదను. అని యాలోచించి యెదుటబడియుండిన నొక తీక్ష్ణమగు కత్తిని దేవి గట్టిగా దీసి కొని నిమిషములో నామె తన రెండు స్తనములను కోసివేసి స్తనముల నాయునకుని మీదకు విసరివైచి ఆభోజన సామగ్రిని తీసికొని త్వరత్వరగా తన కుటీరము వైపునకు పరుపిడెను. రొమ్మునుండి రెండు రక్తప్రవాహములు ప్రవహించుచుండెను. వానివలన నామెవస్త్రమంతయును రక్తమయమయ్యెను. మార్గ మంతయును రక్తమయమయ్యెను. తెచ్చి సామగ్రి నాయునకున కొసంగెను. ఆవేశమున నామె నచ్చినదిగాని కుటీరమునకు రాగానే అధికరక్తము పోవుటచే మూర్ఛితయై క్రిందబడి బోయెను.

కొంచెము సేపటికామె కన్నులను దెఱచి చూచు నప్పటికి ఆమెకు మిక్కిలి విస్మయము కలిగెను. ఏయునకుని కొఱకామె యిదియంతయును దెచ్చినదో ఆయునకుఁడిప్పుడు చతుర్భుజుడగు విష్ణురూపమునఁ పరిణతినిజెందెను. అవ్వద మాతే సింహవాహినియగు మహామాయాదేవి. వృద్ధుఁడగు తండ్రి త్రిలోచనుడఁగు శంకరుఁడు. భగవానుఁడు సతి కథ మదాన మొసంగుచు నిట్లనెను;— "అమ్మా! నీవు మా కొఱకు నీస్తనముల దానమొసంగితివి. కావున నేను ద్వాప రాంతమున వచ్చి నీకు బుత్రుఁడనయ్యెదను, ఈస్తనములను బానమొనర్చి నీకత్యంత సుఖము నొనగూర్చెదను."

సింహవాహినియగు దేవియును నిట్లు వరము నొసం

గెను:- "నేనును నీకుఁ బుత్రికనై పుట్టెదను." నేనుగూడ వ్రజములో నుద్భవించెదనని శివుఁడనెను. ఇట్లు వరము నిచ్చునంతలో ద్రోణద్విజుఁడును వచ్చెను. ఆతఁడును భగవంతుని దర్శించి కృతార్థుఁడయ్యెను. ఈద్రోణుఁడే మరల నష్టమవసువు రూపమునఁ బుట్టెను. ధరాదేవి ఆతనికి భార్య యయ్యెను. బ్రహ్మయీతనితో నిట్లనెను—"ఇప్పుడు నీవు భూమిమీఁదఁ బుట్టి గోవంశమును బాలింపుము."

ద్రోణవసువిట్లనెను:- " మేము మీ యాజ్ఞను శిరసావహించెదము కాని మేము భూమి మీఁద నుదయించి నప్పుడు దేవాధిదేవుడగు విశ్వపతి శ్రీహరి యందు మాకవిచలమగు భక్తి కలుగవలయును. ఆభక్తిచేతనే కదా జీవుడు సహజముగ దుర్గతి నుండి దాటి పోగలడు. "

బ్రహ్మ యిట్లనెను:- "తథాస్తు. భగవానుఁడు నీకు పుత్రుఁడై పుట్టఁగలఁడు. నీకు సుఖమును గలిగించుటకై వివిధ లీలలొనర్చును."

ఈవిధముగ బ్రహ్మయొక్క యాజ్ఞను, నీవరమును బొంది, ద్రోణుడు వ్రజమందు నందుఁడై యుద్భవించెను. అతని పత్ని ధరాదేవియే యశోదరూపమున బుట్టెను. అందువలన నీమెకు భగవంతుని యందత్యధిక భక్తి కలిగెను, భగవానుఁడు తన ప్రతిజ్ఞను నెరవేర్చవలయును గదా! అందువలన నాతఁడు శ్రీకృష్ణరూపమునఁ దల్లియొక్క స్తనములందు పయఃపానమును గావించెను. బలరాముని తోడను నితర సఖుల తోడను గూడి వివిధ క్రీడలొనర్చెను. ఈ సుకృతముచేఁ తల్లికింతటి సాహసము కలిగెను. ఇదియొక

వ్యావహారిక కధ. వాస్తవమున శ్రీకృష్ణుఁడు నిత్యుఁడు. ఆతని లీలలును నిత్యములే. నిత్యమైన తల్లి యీతని నులూఖలమునకుఁ గట్టెను. అందువలన నీతనికి దామోదరుఁడను పేరు నిత్యము.

శౌనకుఁడిట్లనెను:— "సూతా! సరియే, యీసంగతి తెలిసినది, ఇప్పుడిక నీవు యమళార్జున వృక్షముల యొక్క కధను జెప్పుఁడు. ఉలూఖలమునకు బంధింపఁబడిన కృష్ణుఁడు తరువాత నేమిచేసినాఁడు?"

సూతుఁడిటులనెను:— "ఇప్పుడు, స్వామీ! నేనా యమళార్జునోద్ధార కథను చెప్పఁబోవుచున్నాను. మీరు దానిని దత్త చిత్తులరై వినుఁడు."



# యమళార్జునోద్ధారము



శ్లో॥ బాలేన నిష్కర్షయతాన్వగులూఖలం తత్
దామోదరేణ తరసోత్కలితాంఘ్రిబంధౌ।
నిష్పేతతుః పరమ విక్రమితాతివేప
స్కంధప్రవాల విటప కృతచండశబ్దౌ॥

శ్రీభాగ ౧౦ స్కం. ౯ అ. ౨౭ శ్లో.

వ:- అని యాయర్జున మహాబలుండు నిజోదర దామ సమాకృష్యమాణ తిర్యగ్భూత మహోలూఖలుండై యా రెండు ద్రుమాంతముల నడుమం జొచ్చి యుంచుటకు నిగుడుచును.

క॥ బాలుఁడు ఱోలడ్డము దివ
మూలంబులు పెకలి విటపములు విరిగి మహా
భీలధ్వనిఁ గూలెను జా
పాలస్య వివర్ధనములు యమళార్జునముల్.

శ్రీమదాంధ్ర భాగవతము

శ్రీకృష్ణుని లీలలన్నియును ప్రాణుల హితము కొరకును, జీవోద్ధారము కొరకును జరుపబడెను. ఆతడు యెవరి చేతనైన నేదైన జేయించినను, తాను జేసినను వాని అన్నిటిలో నంతయు నానందమే. అంతయు నానందముకొరకే చేయుచుండును. ఆతడునిరానందము పేరైన నెరుగడు. వృక్షము నకుఁ బుట్టినపత్రము లేనాటికైనను దప్పక రాలిపోవును. శ్రీకృష్ణుని సమ్ముఖమునబడిన వారందరకును ముక్తి కలుగును. కొందరకాలస్యముగాను కొందరకు తొందరగ. ఆలస్య

తొందరల కరములేదు. నేడే ఆటవస్తువులన్నియును బగిలి పోయినచో శాశ్వతముగ నాట జరుగునదెట్లు? శ్రీకృష్ణుడు సదా ఖేలన మొనర్చుచునే యుండును. ఖేలనము తప్ప అతని కింకొక విషయము తెలియదు. ఒక ఆటవస్తువు పగిలిపోయిన నింకొక ఆటవస్తువు వచ్చును. ఇదియే గుణప్రభావము. ఇందు లోను శాపమేమున్నది ? అనుగ్రహ మేమున్నది ?

సూతుడిటులనెను:— " మునులారా! యశోదానందనుం డగు శ్యామసుందరుని యుదరమును త్రాడు కట్టబడినది. ఇంకొక త్రాటిని దానికి గట్టి అది రోలునకు గట్టబడినది. పిల్లలు రోటిని త్రిప్పివైచిరి. అదిబండివలె నయ్యెను. శ్రీకృష్ణుడు రెండు చేతులు, రెండుకాళ్ళబలమున నేలపై నడచు చుండెను. గోపబాలురు వెనుకనుండి చప్పట్లను జరుపుచుండిరి. బండి యాట జరుగుచున్నది. శ్యామసుందరుడు గోలచేయువాడు కదా! అతనికేదియో విచిత్ర విషయములు తోచుచునే యుండును. ఎదుట రెండర్జున తరువులు జంటగ పెరిగియుండెను. వాని స్కంధము లొక్కచోటున నుండియే మొలచినవి. వానికి మధ్యకొంచెమెడము కలదు. శ్రీకృష్ణుడు [illegible]నుండి కాక ఆవృక్షముల మధ్యగుండా వచ్చెను. [illegible] శ్రీ యంగ స్పర్శచే గృతార్థుల నొనర్చుటకై [illegible] గెను. తాను బయట పడినాడుకాని, అతని నడుమునకు త్రాటితో గట్టబడిన రోలు వంకరై ఆ రెంటిమధ్య చిక్కు కొనెను.

బండినడక ఆగిపోయెను. ఎద్దుగనైన గద్దరి కృష్ణునకిది యవమానముగ దోచెను. పిల్లలు చప్పట్లు జరచుచు నుండి

యెన్ను నురల యొత్తుపడినదనిరి. అందువలన నాతఁడు తన బలమునంతను వినియోగించెను. శ్రీకృష్ణుడుతనబలమునంతను వినియోగించినను నది కదలక పోవుట ఆశ్చర్యమే. శ్రీ కృష్ణుడుబలముగలాగు నప్పటికా పెద్ద యమళార్జునవృక్షములు డబ డబ మని నేలమీాద పడిపోయెను.

అవి వేళ్ళతో బాటుగా పెల్లగిలి పోయెను. వాని కొమ్మలు విరిగిపోయెను. ఆకులు నుగ్గునూచయ్యెను. అవి పడిన భయంకర శబ్దము వ్రజమంతటను వ్యాపించెను. వెనుక వచ్చుచున్న పిల్లలు భయపడిరి. శ్రీకృష్ణుడు వారిమధ్యలో నిలుచుండి నవ్వుచుండెను. ఆతనికేమియును దెబ్బతగులలేదు. ఆతనికి దెబ్బెమున్నది? ఆతడు దెబ్బలకుగిబ్బలకుపరుడు. ఆతడు వానిని కృపాభగిత దృష్టులతో చూచుచు నిటులనుకొనెను :-
" వీరు ధనమునగు కుబేరుని ప్రియపుత్రులు. ధనమదమత్తుల గుటచే నా పరమభక్తుడగు నారదముని పరవమానము గావించిరి. అందువలన వారినే యూరకే శాపమునొసంగి వృక్షములుగ పుట్టుడనెను. వీరలతో ప్రార్థింపగా నావలన నుద్ధారము కలుగు నట్లొసగెను. దేవర్షి యగు నారదుడు నాకనుగతుడు. భాగవత శ్రేష్ఠుడు. నాకు పరమ భక్తుడు. కావున నేను నారదుని వచనములను సత్యమునర్చెదను. లోకపాలుడగు కుబేరుని పుత్రుల నుద్ధరించెదను." ఇట్లాలోచించుకొని భగవానుడు ఆ రెండువృక్షముల మధ్యగా వచ్చెను. తన సంకల్పముచే వానిని పడవైచెను. కాకున్న నింతటి గొప్పవృక్షములు చిన్న పిల్లవాని నడుమునకు గట్టిన త్రాటిచే నెట్లు పడగలవు?

ఆ వృక్షములు పడగానే వానిలోనుండి అగ్నివలె ప్రకా

శవంతులగు పరమ తేజస్వులగు నిద్దరు దేవకుమారులు వెంటనే యుత్పన్నమయిరి. వారిద్దరును సిద్ధపురుషులు. తమ పరమ దివ్యకాంతిచే దశదిశలను దేదీప్యమాన మొనర్చుచుండిరి. వారు తమకాంతులచే సూర్యునైన తిరస్కరించుచుండిరి. మలహీను లగు ఆ దేవకుమారులు చరాచర జగత్తునకేకైక ప్రభువును, సచ్చిదానంద ఘనుడును, సౌందర్యవిగ్రహుడును, రసరూపుడు నగు శ్రీకృష్ణచంద్రుని పాదపద్మములకు వినమ్రులై ప్రణామ మొనర్చి గద్గద కంఠములతో నాతని స్తుతించిరి.

సూతుడిట్లనెను :— “ మునులారా! కుబేరపుత్రులగు నలకూబర మణిగ్రీవులిరువురును శ్రీకృష్ణుని దివ్యస్తోత్రముల స్తుతించిరి. దాని వర్ణనమును నేను సమయానుసారముగ మరల జెప్పెదను. వారిద్దరును చేతులనుజోడించుకొని వినీతభావముతో నాతని స్తుతించుచుండిరి. శ్రీకృష్ణుడమాయకపు బాలకునివలె వారివైపు చూచుచుండెను.

సోదరులిద్దరును దండప్రణామము నాచరించి స్తుత్యంతమున నిట్లనిరి :— “ ఓ సర్వేశ్వరా! మీరు సర్వజ్ఞులు. మేమిద్దర మును గుహ్యక, యక్షాధిపతియగు కుబేరలోకపాలుని పుత్రుల మని మీకు తెలియును. మాపేర్లు నలకూబర మణిగ్రీవులు. మమ్ము మీరు తమ అకించన అనుచరులని భావింపవలెను. ప్రభూ! మేమైశ్వర్యమదమున సదా మదమత్తులమై యుందుము. మీరకించన గోచరులు. మావంటి అభిమానావిష్టులకు మీ దర్శనమెట్లు కాగలదు? దేవర్షి నారదుని కృపచే మీ దర్శన మైనది. పరోపకారియగు నా సాధుపుంగవుడు మమ్ముల నను గ్రహింపక పోయియుండిన దేవదుర్లభమగు మీ దర్శనము

మాకెట్లు కలుగగలదు. ఇప్పుడు మమ్ము మాలోకమునకు వెడలుటకాజ్ఞ నొసంగుడు."

భగవానుడిటులనెను ;- "సరే, మీరు నన్నేదైన వరమును కోరుడు."

ఆయిద్దరన్నదమ్ము లిటులనిరి ;- "స్వామీ! ఈసాంసారిక విషయములు మిమ్ము దూరమొనర్చుచుండును. మిమ్ము విషయ భోగములను గూర్చియు నైశ్వర్యమును గూర్చియు, నేమని యాచింతుము. మీదర్శనమున నన్నియునులభించినట్లే.

భగవానుడిటులనెను :- "మంచిదే, యశమును నైశ్వర్యమును నడుగవలదు. ఇంకనేదైన నడుగుము."

నలకూబర మణిగ్రీవులిదివిని యిటులనిరి :- "అశరణ శరణా! భక్తవత్సలా! కారణరహిత కృపాళో! స్వామీ! మాకు కావలసిన వరములివి :- వాక్కు సదా మీదివ్యదానళీలలను పలుకవలయును. జిహ్వతో పరుల గుణదోషముల నెంచరాదు. మా శ్రవణములు మీసుందర సుఖద శ్రవణ ప్రియములగు లీలలను, కథలను, వినుటయందు సంలగ్నమై యుండవలయును. మాకరములు సదా మీకైంకర్య కార్యము లొనర్పవలయును. మా మానస భృంగము మీ యరుణ వరణ చరణ కమల మకరంద పానమునందు సదా న్యస్తమై యుండవలయును. శిర మెల్లపుడును నీసదనస్వరూపమగు ప్రపంచ సేవా సత్కారము లందు నతమై యుండవలయును. నేత్రములు సదా మీయొక్క శ్రీవిగ్రహ, సాధుజన దర్శనమునందే నిమగ్నమై యుండవలయును. నీయచలరూపమగు ప్రతిమాదుల యందునను, చరరూపములగు సాధుమహాత్ములనుతప్ప మరియే యితరవస్తువునందు

మాదృష్టి పోకుండుగాక! సర్వేశ్వరా! నీవు కృపతో నీవర
మునే ప్రసాదింపవలయును. ”

సూతుఁడిట్లనెను :— మునులారా! ధనద కుబేర పుత్రు
లిట్లు ప్రభువును ప్రార్థించి యాతని పునీత పాదపద్మములకు
బ్రణతులైరి. ప్రాణిమాత్రునకుఁ బ్రేమాస్పదుఁడును బరే
శుఁడానందముతోఁ బ్రీతితో ముఖమునకు బ్రకాశింపఁ
బడియే సర్వాత్ముఁడు వారితో నిట్లనెను:— “లోకపాలుఁడగు
కుబేరుని పుత్రులారా! అభిషేకములనన్నిటిని మీరు
చెప్పక పూర్వమే మీరు ధనమదమున మదోన్మత్తులై
దృష్టిహీనులైరని నాకుఁ దెలియును. అందువలన మీమీఁద
కృపవలనఁ బరమ కారుణికుఁడును నా ప్రియ భక్తుఁడును,
దేవర్షియునగు నారదుఁడు మీకు శాపము నొసంగినాఁడు.
అతని శాపము క్రోధ జనితమగు నావేగ మాత్రమే కాదు.
అందులో మీయొక్క పరమ హితము నిహితమై యున్నది.
మీకైశ్వర్య జ్వరము తగిలినది. ధనగర్వమే యెంత బాహు
ళ్యము. దానిలో మీరస్తవ్యస్తముగ సంబరముగఁ బ్రేలి
తిరి. దేవర్షియగు నారదుఁడు సంసారరోగమునకు సునిపుణ
చికిత్సకుఁడు. అతఁడు మీకు సముచిత చికిత్స నొసంగి
దారిద్ర్యరూపమగు నౌషధము నొసంగి మిమ్ము మద
రహితులుగను నీరోగులుగను నొనర్చెను. ఇది అతని కను
రూపమైనదే. ఏలననఁగా సాధువుల దర్శనముచే మానవు
లకు సంసార బంధముండదు. ఇప్పుడు మీరే యాలో
చింపుఁడు. చీకటిలో నేమియును గనఁబడదు. ఏలననఁగా
నేత్రములకు జ్యోతి ప్రదానము సూర్యుఁడే యొనర్చును.
అతఁడు జగత్తునకును బ్రకాశమొసంగును. చూచుటకు

నేత్రములకు శక్తిని నొసంగును. ఇదే విధముగ నెవని చిత్తమహర్నిశము నిరంతరము నాయందే లగ్నమైయుండునో అట్టి సాధువు దర్శన మొనర్చువారల కజ్ఞానమును గూడ పోగొట్టును. హృదయమందు నాపరమ జ్యోతిని ప్రకాశింపచేయును."

ఆసోదరులిద్దరును లజ్జితులై యిట్లనిరి:- "ప్రభూ! మేము నారద భగవానుని సమ్ముఖమున గొప్పఅశిష్టకార్యము నొనర్చితిమి, కాని యాకృపాసాగరుఁడు మామీఁద సహైతుక కృపను జూపినాఁడు. సంసారబంధనమును దెగగొట్టు మీదుర్లభ దర్శన మైనది. ఇప్పుడు మాకేమి కర్తవ్యము కలదో మీరాదేశింపుఁడు."

భగవానుఁ డిటులనెను:- "ఏమియును ఫరవాలేదు. సాధు సమ్ముఖమున కేవిధముగ జీవివచ్చినను వాఁడు విముక్తుడగును. సంత సమాగమము రాగముచేతనో, ద్వేషము చేతనో, క్రోధముచేతనో, సద్భావనముచేతనో, దుర్భావనము చేతనో, ఏవిధముగఁ గలిగినను వాని యుద్ధారమున సందేహముండదు. ఇప్పుడు మీరు పోయి నామీఁదఁ జిత్తమునుంచి సుఖపూర్వకముగ నచ్చట నివాస మొనర్పుఁడు."

ఆ సోదరులిటులనిరి:- "స్వామీ! ఇంటిలో నన్నియును బంధనములే. అచ్చట మాకు మరల మదోన్మత్తత రాదుగదా!"

భగవానుఁడు ప్రేమతో నిట్లనెను:- "లేదు నాయనలారా! ఒక్కసారి నా కృప కలిగిన వాఁడు మరల శాశ్వతముగ విషయములలోఁ బడిపోవునా? మీకు సంసారబంధన

మును విచ్ఛేదము కావించు నా పరమ ప్రేమ ప్రాప్తించి నది.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! భగవానుని నోట నీవచనములను విని ఆ యిద్దరును పరమానందమును జెంది, ఱోటికిఁ గట్టఁబడిన శ్రీకృష్ణచంద్రుని పాదపద్మములకు పునఃపునః ప్రణామములొనర్చి, ఆతనిచే నాజ్ఞను గైకొని, తమ తండ్రియుండు నుత్తర దిశకుఁ బోయిరి. ఇది నేను సంక్షేప ముగఁ గుబేరుని పుత్రులగు నలకూబర మణిగ్రీవుల శాపోద్ధార కథను జెప్పితిని. ఇప్పుడు మీరేమి అడుగఁ దలచితిరి.''

శౌనకుఁ డిటులడిగెను:- ''సూతా! నలకూబర మణిగ్రీవులు నారదునకేమి యపరాధము నొనర్చిరి? ఆతఁడా సోదరులిద్దరకేల శాపముసంగినాఁడు? దయతో నీకథను మాకుఁ జెప్పవలయును.''

సూతుఁడిట్లనెను:- ''మంచిది, స్వామీ! నేనిప్పుడా కథనే చెప్పఁబోవు చున్నాను. మీరు సావధానులరై వినుఁడు''

# నలకూబర మణిగ్రీవుల శాపకథ

(౨౨౪)

శ్లో॥ కథ్యతాం భగవన్మేత త్తయోః శాపస్య కారణమ్।
యత్తద్విగర్హితం కర్మ యేన వా దేవర్షి సత్తమః॥

(శ్రీ)భాగ ౧౦స్క. ౧౦అ. ౧శ్లో॥

క॥ నారదుఁడేల శపించెను
ఏరాజ్యకృత్యమునకు వచ్చిన పనికిం
గారణ మెయ్యది యోగికు
లారాధ్య యెఱుఁగఁ జెప్పుమయ్య వినియెదన్॥

(శ్రీ)మదాంధ్రభాగవతము

ఒక్క యింద్రియమునకే సుఖసాధనప్రాప్తియగు వస్తువుల నేకములు కలవు. కాని ధనము ద్వారా నే యింద్రియ విషయము నడిగినను ప్రాప్తించును. సురామదము కొంచెము సేపటిలో దిగిపోవును. జాతిమదమును శిథిలమగును. విద్యామదము, అధికారమదము మొదలగు మదములన్నియును, మానవుని సదాచారమునుండి పతన మొనర్చును. కాని ధనమదమతి భయంకరమైనది. ధనమదమునకు వశమైనవాఁడు శీల, సంకోచ, సదాచార, కులాచార, సద్గుణము లన్నిటిని పోనాడును, ధనము చెడ్డ వస్తువుకాదు. దాని మదమే చెడ్డది. ధనవంతులలో విరళముగ నభిమాన రహితులుందురు. ధనికులలో కొందరుమాత్రమే ధనముండియును స్త్రీద్యూత సురాది వ్యసనములలోఁ బడని వందనీయు శ్రేష్ఠి నుందిరో యుందురు, కానున్న ధనము పెరిగిన కొలది యీవ్యసనములు

వెంటబడును. ఈవ్యసనములు తగుల్కొనగానే ధనము తగ్గి పోవును. ఈవ్యసనములు ఘోరాంధకారములోనికిని, నరకము లోనికినిఁ గొనిపోవును.

సూతుడిటులనెను:— "మునులారా! మీరు నన్నుఁ గుబేరపుత్రులగు నలకూబరమణిగ్రీవులెట్లువృక్షములయినదియును నారదుడు శాపమొసంగుటకుఁ గారణమును నడిగితిరి. దానిని నేను మీకు జెప్పెదను. నాలుగుదిశలును, నాలుగు ఉపదిశ లును గలవు. వీనిలో నుత్తర దిశకధిపతి ధనాధిపుడు గుబేరుడు. ఈతడు దేవతల యొక్క సమస్త సంపత్తునకును నధిపతి. యక్షరాక్షస, గుహ్యకరుద్రాదిగణముల కధిపతి. త్రిలోకము లందు గుబేరుని మించిన సంపచ్ఛాలి యింకెవరును లేరు. దేవతలకీతడు కోశాధికారి. సమస్త సంపత్తునకుస్వామి యగు టచే నీతని యొద్ద నేవస్తువునకును దమగు లేదు. లోకపాలు డగు గుబేరునకు నలకూబర మణిగ్రీవులను నిద్దరు పుత్రులు. వారు అతి సుందరులుగ నుండిరి. పైగా ఎన్నటికిని వృద్ధులుకారు. ఎల్లప్పుడును బదునారేండ్ల ప్రాయమువారివలె నుందురు. అందువలన వీరిని నిత్యయౌవనులందురు. కావున వీరి యౌవనమును స్థిరమైనదే. యౌవనము, ధన సంపత్తులును, ప్రభు త్వమును వీరికుండి వానికి తోడుగా నవివేకము కూడ యుండి నచో వీనిలో నొక్కటియే అనర్థములను గావింపగలదు. ఈనాలుగు నుండినచో నిక జెప్పవలసిన దేమున్నది? వీరికి నాలుగు విషయములును గలవు. అవివేకము వీరిని దనవశ మందుంచుకొనినది. వీరిద్దరును నత్యంత విషయాభిలాషులు. స్వర్గమునందలి సర్వశ్రేష్ఠసుందరులగు నప్సరసలను సదా వెంట నిడుకొని దేవోద్యానములందు విహారము నొనర్చుచుందురు.

సుందరములగు సరోవరములందు సుందరీ మణులను గూడుకొని జలవిహారము లొనర్చుచుందురు. వారితో వారుణీ మధుపానము నొనర్చి మదోన్మత్తులై నవ్వుచు నాడుచు పాడుచుందురు. శివుడు కుబేరుని సఖుడు. వాని బిడ్డలగుటచే శివుడును వీరిని దనసేవకులుగ భావించును, అందువలన వీరెవ్వరిని లెక్కపెట్టుటలేదు. వీరికైశ్వర్యమదము కలదు.

ఒకదినమున వీరిద్దరును స్వర్గమందలి సుందరులగు నప్సరసలను వెంటబెట్టుకొని వనవిహారమునకు బయలుదేరిరి. అచ్చట విభ్రాజక, చైత్రరథ, నందనకాననాది వనములందు స్వచ్ఛందముగ విహరించుచుండిరి. వీరిద్దరును వారుణియను మదిరను ఇష్టమువచ్చినట్లు త్రాగిరి. తమతోబాటుగా నప్సరసలకును త్రాగబోయించిరి. అందరును నిమత్తులో మునిగియుండిరి. వీరికి తమ దేహముల మీద నెఱుకదప్పు. సురను త్రాగుటచే వీరి కామాగ్ని ప్రదీప్తమగుచుండెను. కామాంధులై యుండగా కామిని యువతుల నుండి యేవో కుత్సిత చేష్టలను వాడు చేయ మొదలిడిరి. ఆ కుబేర కుమారు లాయప్సరసల వస్త్రములను సంపూర్ణముగ నూడదీయించి వారిని పూర్తిగ దిగంబరుల నొనర్చిరి. తామును దిగంబరులైరి. వారుణీమదమున వారికి శీలసంకోచములు లేకుండెను. మదకారణమున వారి నేత్రములు తిరుగుచుండెను. వారిద్దరును మదోన్మత్తులై కైలాసమున పరమ రమణీయములగు నుపవనములందంతటను తిరుగుచుండిరి. ఆ దిగంబరులగు నప్సరసలు ఆడుచు పాడుచుండిరి. వీరు వారి స్వరములో స్వరమును కలుపుచు గానము ననుకరించుచు మరల విరగబడి పకపక హా! హా! హా! అనుచు నవ్వుచు, త్రేలుచుండ నా పుష్పితవనము మిక్కిలి సుందరముగ నుండెను.

దానిలో సదా వసంతము నివసించుచుండెను. అచ్చట కలకల నినాదినియు, పుణ్యతోయయు, విష్ణుపాదాబ్జ సంభూత యగు గంగ ప్రవహించుచుండెను. భగవానుడగు చంద్రశేఖరుని జటాజూటమునుండి బయలుదేరి త్రిపథ యగు గంగ యిచ్చట నుండియే పృథివీ,పాతాళ, స్వర్గములకుబోయెను. అచ్చటచ్చట కైలాస యుపత్యకలందు గంగాజలమాగి గంగ నుధ్యయుందే హ్రదముగ నయ్యెను. యక్షాధిపుడగు కుబేరునికుమారులాకమ నీయ కమలములను గైకొనుటకు గంగయందుండిన నొక హ్రాద మందు ప్రవేశించిరి. ఆ యప్సరసలును వారిననుకరించిరి. జల ములందు వరుణదేవుడు నివసించుచుండును. జలమునకు ప్రస న్నత కలుగును. కామపీడితులగు నాయప్సరసలును కుబేర కుమారులును గలిసి యాహ్రాదములో ప్రవేశించిరి. ఇప్పుడు వారికి జలక్రీడ నొనర్పవలెనని తోచెను. ఇదమును తమ చేతు లతో నీళ్ళను వెదజల్లుకొనుచు స్నానమును జేయుచుండిరి. వారు వ్రీడాభావమును జూపించుచు పరువిడుచున్న వారిని గట్టిగ బట్టుకొనుచు వారిపైన జలమును చిలకరించుచు నిట్లు చాల ప్రొద్దెక్కువరకును జలవిహార మొనర్చుచుండిరి. దైవయోగ ముచే దేవర్షి యగు నారదుడు వీణావాదన మొనర్చుచు హరి గుణగానము నొనర్చుచు నాదిక్కునకు వచ్చెను.

నారదుడెవరి వైపును విశేషధ్యానముతో చూడడు. ఇది ప్రపంచము. ఇందు సమస్త విధములగు ప్రాణులునుందురు. అందరును తమతమ స్వభావసంస్కారములకువినను లైయుందురు. చెప్పిన నెవరు వినగలరు. మంచిమంచిసాధకుల కిష్టములేకున్నను పూర్వసంస్కారముల కధీనులై విషయములలో పడిపోవు

చున్నారు. పైగా దైవయోని భోగయోనియే. ఇందులో నింద్రియములను తృప్తిపరచుటయే ప్రధానోద్దేశ్యము. దైవవశమున నారదునకు వీరిద్దరిమీద దృష్టిపడెను. సర్వాంతర్యామియగు నారదుడు చూడగనే యీ కుబేరపుత్రులను గుర్తించెను. శివసభయందు సదావీరు కుబేరునితోగూడవచ్చి నారదుని దర్శించెడువారు. వీరి తండ్రి నారదుని గాంచగనే లేచి నిలుచుండెడివాడు. వీరిని వారి కాళ్ళమీద పడవైచెడివాడు. వీరును నారదుని ఎప్పుడు చూచినను చరణవందన మొనర్చెడువారు. నేడు వీరు తన్నుజూచి నవ్వుచుండుటను నారదుడుకాంచెను. ప్రణామ నమస్కారము లట్లుంచుడు. నన్నుచూచి వీరు వస్త్రములనైన ధరింపలేదు. దిగంబరులై, దిగంబరలగు నప్సరసలతో నేను జూచుచుండగనే నిర్లజ్జులై విహారమొనర్చుచున్నారు. ఓహో! వీరు వారుణీమదమున మత్తులై యున్నారు. ఐశ్వర్యమదమున మత్తులై యున్నారు. ఐశ్వర్యమదము వీరికి నేత్రములున్నను నంధునిగా చేసినది. సరే. నేను వీరి మదమణగించెదను. ”

ఇంతవరకు అప్సరసల దృష్టి నారదునిమీద పడలేదు. స్త్రీయెట్టిదైనగానిండు. కొంచెముగనో గొప్పగనో లజ్జయుండును. వేశ్యలయందయినను కొంచెముగ శీలసంకోచమును స్త్రీసులభ లజ్జయును, నంశమాత్రముగ నుండును. నారదుని జూడగనే పరుగిడిపోయి యాయప్సరసలు తమతమ వస్త్రములను కట్టుకొనిరి. కాని నలకూబర మణిగ్రీవుల కైశ్వర్యాభిమానము కలదు. వారిట్లనుకొనిరి :— “ ఈతాంబూరను పట్టుకొనితిరుగు భిక్షుకుడగు నారదుడు మనలనేమిచేయగలడు? మనము స్వతంత్రులము. ధనదుడగు లోకపాలకుని పుత్రులము. మాయిష్టము

వచ్చినట్లు చేయుదుము. నారదుడు మనకు శాసకుడును గాడు" అని యాలోచించి వారు నారదుని సమ్ముఖమున నటులే దిగంబరులై నిలుచుండిరి.

పైన విమానము మీఁద నెక్కిన యప్సరస లీకొలను క్రీడను జూచుచుండిరి. వారి మనస్సులలోను గామ భావముదయించెను. చాలమంది దేవసమూహమును నాకాశమున విమానముల మీఁదఁ గూర్చుండి యీజలవిహారమునుగాంచి యానందించుచుండిరి. కేవలము నారదుఁడే చింతితుఁడై దుఃఖితుఁడై నిలుచుండెను.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! నారదుఁడు దుఃఖియగుటకుఁ గారణమేమి? మహాభాగా! ఇది ప్రపంచము ఇందులో మంచిచెడ్డలు, మోసగాండ్రు, కోపిష్టులు మొదలగు జీవులందురు. ఎవఁడో ఏదో వాసనను బూర్తి కావించుకొనును. ఇంకేదో కార్యమున నారదుఁడు మొదలక శ్రీకృష్ణకీర్తన మొనర్చుచుఁ బోవుచుండును. అతఁడీ విషయముల మధ్యలోఁ బడవలసిన నావశ్యకత యేమున్నది? అందరును వారివారి స్వభావముల వలన వివశులై కార్యములొనర్చెదరు."

సూతుఁడిట్లనెను;- స్వామీ! ప్రాణి వివశుడగుట సత్యమే. అతఁడు తన సంస్కారమున కధీనుఁడై కార్యమొనర్చును. కాని సాధువుల స్వభావము పరోపకారము కొఱకే. దుష్టులెట్లు పరపీడ నొనర్పఁ జాలకుండ లేరో అట్లే సాధువు ప్రాణులపైఁ గృపను జూపకుండ లేఁడు. తమకేమి మంచైన స్వార్థము లేకున్నను వీరు ప్రాణులను బీడించి

యొక విధమగు నానందము ననుభవించెదను. అట్టే సాధు వులకు పరోపకార మొనర్చుటయందును. దీన దుఃఖితుల దుఃఖములను బోఁగొట్టుట యందును, మార్గము తప్పిన వారిని సుమార్గమునకుఁ దెచ్చుటయందును, అజ్ఞులకుపదేశ మొసంగుట యందును నానందము కలుగును. ఒకానొక్క చోట వారానందమును జెంది కృపను జూపించెదరు. మఱి యొక చోట శాపమునొసంగి యనుగ్రహించెదరు. వారి ప్రతి కార్యము నందును పరహితము నిహితమై యుండును. వారేది చేసినను ప్రాణుల కళ్యాణము నిమిత్తమే చేయు దురు. వీరి యీదుర్దశను జూడఁగనే నారదునకు దయ కలి గెను. మహోన్మత్తులైన వీ యక్షులకు నేదైన నచ్చఁజెప్ప బూనినచో వినరు. వీరిని శపించియే కృపఁజూప వలయును. రోగోపద్రవ మధిక బలవత్తరమైనపుడు, ముందుగా నను భవముకల వైద్యుఁడు ఉపద్రవశాంతి కొఱకు ప్రయత్నింప వలయును. అంత మెల్ల మెల్లఁగా నుపద్రవమునకుఁ గారణ మగు రోగమును మూలనష్టముగ నాశన మొనర్పవలయును. నేను ముందుగా శాపము నొసంగి వీరి ఐశ్వర్యమదమును నాశము చేయవలయును. వీరైశ్వర్యహీనులు కాఁగానే వీరు ప్రభు ప్రసాదమును బొందుట కధికారులగుదురు. అంతటి లోకపాలుని పుత్రులయ్యు వీరు నిర్లజ్జులైరి. ఇది చాల చింతింప వలసిన విషయము.” అని యిట్లాలోచించుకొని నారదుఁడు తనలోఁదాను ఆకాశచారులగు దేవతలును, నప్సర సలును వినునట్లు శూన్యమందు మాటలాడ సాగెను.

నారదుఁడిట్లనెను:— “చ్యవన మహాముని ఇంద్రునిఁ జంపుటకు ‘మదుఁ’ డను నొక పుత్రునిఁ బుట్టించెను. ఇంద్రుని

కీవిషయము అనఁగా దనను జంపుటకు 'సుహఁ' డను బుత్రుఁడుదయించినాఁడని తెలియఁగనే అతఁడు మునిచరణముల మీఁదఁబడి క్షమాపణమును గోరెను. అప్పుడింద్రుని యనుమతిచే ముని మదమును ననేక స్థానములకు బంచెను. ఏనుఁగులు, స్త్రీలు, సారాయిని ద్రాగువారు, ధనము, విద్య ద్యూతము లందును. యౌవన మదము, ఐశ్వర్యమదము, విద్యామదము, జాతిమదము, కులమదము, సురామదము, ధనమదము మొదలైన ననేక మదములయ్యెను. వీనిలో, నైశ్వర్య మదముతో సమానముగ బుద్ధిని భ్రష్టముచేయు మద మింకొకటి లేదు. ఐశ్వర్యమదమునఁ బ్రాణి స్వపర వివేకమును బోనాడును. హాస్యాదులు రజోగుణ కార్యములు కాని ఐశ్వర్యమదముచే కలుగు ననర్థములకు మితిలేదు. ఐశ్వర్యమదమున స్త్రీసంగము, ద్యూతము, మదిరాపానము ఇవి ప్రధానముగ నుండును. మదిరాపానము చేయువాని కవశ్యము మాంసముకావలయును. మాంసము హింసలేకయే లభింపదు. తన నశ్వర శరీర పోషణమునకై యితర ప్రాణుల హింసించువాఁడు తన శరీర మజరామరమని కొనుచున్నాడన్న మాట. దానికి పుష్టిని కలిగించుటకై ప్రాణులను వధించుచున్నాడు. ఈశరీర మెంతటి సుందరమైనదైనను, నెంతటి కులీనమయినదయినను నన్నిటికిని మూఁడుగతులుకలవు. బ్రాహ్మణ శరీరమగుగాక, చండాలశరీరమగుగాక, నల్లనిదగుగాక తెల్లనిదగుగాక. స్త్రీయగుగాక, పురుషుడగుగాక, కులీనుడగుగాక, అకులీనుడగుగాక, రోగయుక్తుడగుగాక, నీరోగియగుగాక, వీరందరకు మరణించిన తరువాత మూఁడేగతులు.

అగ్నిలోఁ గాల్పబడినచో గుప్పెడు బూడిదయగును. పూడ్చినచోఁ గ్రుళ్ళి పురుగులుపడును. వనమునందు, జలము నందును. బారవైచినచో మాంసభోగులగు జల జంతువులు దానినీదిని మలముగ నొనర్తురు. ఇట్టి నశ్వరమును ననిత్య మును క్షణభంగురము నగు శరీరము కొరకెవడు ప్రాణులను ద్రోహమొనర్చునో అతడు తనచేతుల తోడనే నరకమును బరివృద్ధి మొనర్చుకొను చున్నాడననలెను. అతడు తన వాస్తవిక స్వార్థము నెరిగినవాఁడేనా ?

నారదుడీ విధముగ మౌనమున బలుకుచుండెను. సమీ పముననే కుబేరపుత్రుల యంగరక్షకులగు యక్షులు దూర మున నుండిరి. వారిలోనుండి ఒకయక్షుడు వచ్చి చేతు లను జోడించుకొని వినయభావమున నిటులనెను:– " స్వామీ మీరీ శరీరమునిత్యము క్షణభంగురమని చెప్పుచున్నారు. అది నిజమే, కాని యీ శరీరము మాకు వంశ పరంపరచే బ్రాప్తించినది. మాతలిదండ్రులు దీని నుత్పన్నము గావించి నారు. దీనిమీద వారికే అధికారముకలదు."

నారదుడిటులనెను:– " సరే, ముందుగా నీశరీరము మీద నెవ్వరికధికారము కలదో నిర్ణయింపుడు. అన్నము దొరకకున్న నీశరీరము పెరుగదు. నిలువజాలదు. అధికార విషయమాలోచించినచో నీశరీరము మీద నన్నదాతకే అధికారమనవలెను. అన్నదాతను గూడ తండ్రియనిరి. "

యక్షుడిటులనెను:– "అన్నమును దినునది శరీరమేర్ప డిన తరువాతగదా. శరీరము నేర్పరచిన వారికినినధికారముండ వలయును. "

నారదుడిటులనెను:— " అన్నమువలననే వీర్యము కలుగును. పురుషుడు తనభార్యాయోనియందు వీర్యమును వదలును. తల్లియొక్క రజస్సును, పురుషుని వీర్యమును గలియుటచే శరీరముత్పన్నమగును. తల్లిదాని నుదరమునందు ధరించును. కావున వీర్యప్రదాతయగు దండ్రికిని, ఉదరమున ధరించిన తల్లికిని నీశరీరమందధికారము కలదు. ఈతడు మా పుత్రుడని వారనుచుందురు. తండ్రియొక్క తండ్రి అనగా తాత యిటులనును:— " నేను బుత్రుని బుట్టింపక పోయిన నోం బౌత్రుడెచ్చటనుండి రాగలడు. ఈ విషయమునే ఆతని తండ్రి యుననును. కావునఁ బూర్వజులందరకును దీనిపైనధికారము కలదు. తల్లి తల్లి అమ్మమ్మ యిటులనును:— " నేను నా పుత్రికను నేను గనకుండినచో నీతడెటు పుట్టగడు కావున నమ్మమ్మయును నీశరీరముపై నధికారమును వహించును. ఇదేవిధముగా తల్లిదండ్రి తాత ( మాతామహుడు ) యును దీనిని దన స్వస్వముగ భావించును. ఎవ్వరైనఁ గననిండు. ఈశరీరము నాకృపచే సురక్షితముగ నున్నది. నేను దలంచు కొనినచో దీనిని నిమిషములో నసింపచేయుదును. కావున దీనిమీద నధికారము నాకుగలదని బలవంతుడనును, నౌకరి చాకిరిచేయించుకొనుచు యిటులనును:— " నేనీ శరీరమును గొన్నాను. దీనిచే నాయిష్టము వచ్చిన పనిని చేయించు కొందును. నేనుదీనికి స్వామిని " అందరవాక్యములను విని కుక్క నక్క కాకి, గ్రద్ద, తాబేలు, పురుగులు మొదలగు జీవులును నగ్నిదేవుడును నిట్లనును:— " ఏవస్తు వెచ్చటికిఁ చేరునో దానికిస్వామి యాతఁడే. మీరు వాగుచుండుఁడు చివరకీశరీరము మాకడుపులోనికి రావలసినదే. కావున మేమే

దీనికి నిజమగు యజమానులము. ఇప్పుడు చెప్పుము. ఈ శరీరమెవరిదని చెప్పవలయును, ఎవరిని దీనికి స్వామి యన వలయును."

యశోదయిట్లడిగెను:- "అయితే స్వామీ! వాస్తవ మున నీశరీరమెవరిది? దీనికి స్వామి యెవరు?"

నారదుడిట్లనెను:- "ఓయీ! నాయనా! ఈ దేహము అవ్యక్తమునుండి యుద్భవించినది. సమస్త భూతముల కాది యందవ్యక్తమే కలదు. మధ్యలో వ్యక్తమైనది. చివరకును నవ్యక్తమందే కలియును. ఎచ్చటికి బోవలసిన వస్తువచ్చటికి బోయిన నిక శోకమును జింతను జెందవలసిన పనియేమి యున్నది. స్వప్నమున పామునుజూచి భయపడితిమి. స్వప్నము భంగము కాగానే భయము పోయెను. స్వప్నమునకు పూర్వ మును నచ్చట సర్పములేదు. స్వప్నాంతమందును దాని యస్తిత్వములేదు. కేవలము స్వప్నావస్థయందే దాని ప్రతీతి కలదు. ఈ దేహమునట్లే శరీరమేర్పడుటకు పూర్వం దానిసామ గ్రియంతయును బంచభూతములందు గలదు. చచ్చిన తరు వాతను నదే పంచభూతములలో కలిసిపోవును. ఈ దేహము అస్థిరము. ఇట్టి సాధారణవస్తువు కొరకే బుద్ధిమంతుడు జీవహింసాది పాపకర్మలొనర్చును. ఆత్మఒక్కటియే సత్యాధారము. అజ్ఞానియగువాడు శరీరము నాత్మగా భావించును. అందువల నవే యీ శరీరమును శాశ్వతముగ నుంచుటకును, సుఖముగ నుంచుటకును, సుఖముగ గడపుటకును, నిరంతరము ప్రయ త్నము చేయుచుండును. ఐశ్వర్యమదమున నున్మత్తులై పాప కర్మలొనర్చెదరు. తనసంస్కారముల ననుసరించి ఆత్మహంతకు డయి నరకయాతనలను భోగించును. ఐశ్వర్యమదమొక విధ

మగు రోగము. వాతరోగమునందు మానవుడసంబద్ధప్రలాపము లెట్లు ప్రలాపించునో, అటునిటు కాళ్ళను, చేతులను కొట్టుకొనునో అదేవిధముగా ధనమదమందును మానవుడు మోహావశుడై మూర్ఖకార్యము లొనర్చును. పెద్దల నవమానించును. సదాచారమునుల్లంఘించును."

యక్షుడిట్లనెను :- "స్వామీ! ఈధనమదమునకు ఔషధమేమైన కలదా?"

నారదు డిట్లనెను :- "ఎందులకు లేదు. 'సంపన్నాంధున కంజనంబు వినుమా దారిద్ర్యమూహింపగన్' దీనికి దారిద్ర్యము తప్ప వేరొక యౌషధము లేదు. ఐశ్వర్యమదము కన్నులకు పొరవలె కప్పును. కనుపాపలమీదకు పొరవచ్చినా మానవునకేమియును తోచదు. అతడంధుడగును. కన్నులలో నేర్పడిన యాపొరను నేదైన నంజనముచేగాని శస్త్రముచేగాని తీసివేసినచో మరల కన్నులకు చూపుకనబడును. అదేవిధముగ ధనమదాంధునకు దారిద్ర్యము నొసంగినచో వానిబుద్ధి కుదుటపడును. దారిద్ర్యమనుభవించిన తప్ప దరిద్రుల దుఃఖములు తెలియవు. తాను దరిద్రుడైనచో నందర దుఃఖములను తన దుఃఖముల వంటివే ననుకొనును.

యక్షుడిటులనెను :- "స్వామీ! వినినచే చాలు విషయము లనుభవమునకు రాగలవు."

నారదుడిటులనెను :- కొన్ని విషయములు వినుట చేతను తెలియవచ్చును. కాని స్వయముగ తనకే తగులును. అప్పుడాతని యనుభవము యధార్థమగును. తన కాళ్ళకు దెబ్బ తగిలినపుడు దానిబాధ అనుభవపూర్వకముగ బాగుగ తెలి

యును. తన కాలునకు ముల్లు గ్రుచ్చుకొని అది బాధ పెట్టిన పుడు ఆజ్ఞానమునలన నితరులకు గ్రుచ్చుకొన్నను నింతేయను జ్ఞానము కలుగును. ఎవరికి సమయమునకు కావలసిన దాని కంటె నధికముగ భోజన, వసన వాహన విలాస వస్తువులు ప్రచురమాత్రముగ లభించినచో, వారికి నిరధనులకు కావలసినవి యేవో, వాని యభావమున నేమి బాధ కలుగునో దానినెవరు తెలిసికొనగలరు? దరిద్రత దేవుడొసంగిన స్వాభావిక తపస్సు. దరిద్రునకును తపస్వికిని పైకి యేమాత్రమును భేదములేదు. నిరధనునికడ ధనబలముకాని, జనబలముకాని యుండదు. పొట్ట నిండినపుడే వ్యభిచారము, ద్యూతము, మద్యపానము ఇవి స్ఫురించును. నిరాహారి ప్రాణికి ఇంద్రియములు శిథిలములగును. సమ్ముఖమున భోగవస్తువులున్నను కోరిక యుండదు. అహంకారము మిడిసిపాటు మొదలైనవి ధనమదముననే యుండును. నిరధనుడేమి చూచుకొని యహంకరించును. దరిద్రతాదేవి దయచే నాతడు దుర్వ్యసనములనుండి స్వతః దూరముగ నుండును.

యక్షుడిటులడిగెను :- "స్వామీ! మీరు నిరధనుని తపస్వితో బోల్చితిరెట్లు?"

నారదుడిటులనెను :- "ఓయీ! తపస్వియింక చేయున దేమున్నది? నేమన్నమును తినము. కేవలము ఫలాహారము మీదనే యుండెదము. క్షౌరమును చేయించుకొనము. ఆహారమును వదలి కేవలము జలమును త్రాగి యుండెదము. చలికాలములో దిగంబరులమై యుండెదము. పంచాగ్నులలో తపించెదము. వీనిపేరే తపస్సనిన. నిర్ధనునకీతపస్సు దానికదియే సిద్ధిం

చినది. వానిమీద వస్త్రముండదు. ఏదో విధముగ కాళ్ళను ముడుచుకొని బొంతను గప్పుగొని రాత్రియంతయు మేలు కొనును. అన్నము దొరకదు. నీళ్ళను త్రాగియే యుండును. పగలంతయును పరిశ్రమ నొనర్చును. దైవయోగమున వానిక ప్రాప్తించిన కష్టమేదియో అదియేపరమతపస్సు. భేదమేమనగా నాతపస్సు తనకుతాను మనస్సుతో చేయును. ఈతపస్సు దైవేచ్ఛచే తనకిష్టము లేకున్నను లభించును. ఆ తపస్సు మాత్రము తనయిచ్ఛచే నేమి జరుగును. అదియును తమ పూర్వసంస్కారముల ననుసరించి ప్రాణి వివశుడై చేయును. అందరు నాతపస్సును చేయజాలరు. దానియందును పూర్వ సంస్కారముల వలన భాగ్యమున నేకొలదిమందికో ప్రవృత్తియుండును. దారిద్ర్యముచే దుఃఖముననుభవించినను పాపము పోవును. వానికిని నశుభనాశము కలుగును. కావున దారిద్ర్యమును భోగించుట ఒక విధమగు తపస్సు. అజీర్ణము, మందాగ్ని, సంగ్రహణి యున్నరోగుల కల్పాహారము నొసంగి దోషములను బచింప చేయుదురు. అజీర్ణమునకు ఉపవాసమెట్లుపచారమో, అటులే ధనమదముచే అంధుడయినవానికన్నులకు దారిద్ర్యమే సర్వశ్రేష్ఠమగు వ్యర్థముకాని ఔషధము. ఆకలిచే జర్జరుడైనవానికి సదా సర్వదా అన్నాపేక్ష కలవానికి సమస్తేంద్రియములు శిథిలములగును. వాక్కులో కరుణవచ్చును. ముఖమున దీనత్వము వ్యాపించును, ఆతడెవరిని కటువుగ మాటలాడజాలడు. ఆతనికి హింసనుచేయు సామర్థ్యముండదు.

యక్షుఁ డిట్లనెను:_ "స్వామీ! నిర్ధనత్వమునఁ జాల గొప్ప దోషము కలదు. ధనములేని వాని కడకు సాధు సజ్జనులునురారు. వారు సత్సంగమునకు వంచితులగుదురు.

సత్సంగ వంచితులైనవారికి సద్గతులును గలుగవు. కావున నిర్ధనత్వము నిహపర లోకములను రెంటిని జెఱచును.”

నారదుఁడిట్లనెను:_ “ఓయీ! ఈ విషయము సమదర్శు లగు సాధారణము విషయముకాదు. ధనికులకుఁ గ్రీతదాసులైనవారి విషయము. ధనికులు ధనమదమున సాధువులను బాగుగాఁ బలుకరించనైనఁ బలుకరింపరు. వారంధులగుదురు. తల్లి, తండ్రి, గురువుస్వజనులనుగూడ తిరస్కరించెదరు. ఈ విధముగ గర్విష్ఠులగు వారి కడకు సాధుజనులు పోయి ముఖస్తుతి మాటలనేలఁ బలికెదరు? వారిదృష్టిలో ధనికులును నిర్ధనులును సమానులే. వారికడకు బోయినవారి నందరను ప్రేమించెదరు. ధనికులు వారి పద ప్రతిష్ఠా మదమున వారి సమీపమునకుఁ బోవనే పోవరు. అట్టి అకించనుల సమీపమునకుఁ బోయిన నది తన కవమానమని భావించెదరు. వెళ్ళినను నమ్రతయుండదు. వారివద్ద శ్రద్ధతోఁ గూర్చుండరు. అభిమానమున బిఱబిగిసికొని యుందురు. నిర్ధనుఁడు భయపడు చుండును. ఆతఁడెచ్చటికైనను నిరభిమానుఁడై పోవును. నిస్సంకోచముగఁ బాదములంటును, సేవించును. ఈవిధముగ ధనికులకంటె నిర్ధనులకు సాధుసమాగమ మధికముగఁ బ్రాప్తించును, వారిసాంగత్య మొనర్పఁగా వారికిది వరలో నున్న విషయ తృష్ణయును, గ్రమక్రమముగ విడువఁబడును. ధనమిదివరకే నశించినది. సాధుసంగముచేఁ దృష్ణయుఁ నశించినచో జీవన్ముక్తుఁడగును. ప్రభువుయొక్క సర్వశ్రేష్ఠమగు ప్రేమ ఆతనికిఁ బ్రాప్తించును. ఈకారణమున నిర్ధనత్వము చెడ్డవస్తువుకాదు. అది సాధుసమాగమము చేతను, వంచితు నొనర్పదు. ధనలోభమున్న సాధువు సాధువు

కాఁడు. భగవచ్చరణారవింద రసరసికుఁడై. సమదర్శియగు సాధుపురుషునకును దుర్గుణయుక్తుఁడై ధనమదముచే మత్తులై యుండు దుర్జనులతో నేమి ప్రయోజనము? వారి కీ యవినయ, అహంకారు లుపేక్షణీయులే. ఈ కుబేరపుత్రులు వారుణీ మదిరాపాన మొనర్చి ప్రమత్తులై యుండిరి. ఐశ్వర్యమదముచే మదాంధులైరి. స్త్రీలయందత్యంతాసక్తిని జెంగి యుండిరి. ఇట్టియింద్రియ లోలురను, స్త్రీపరాయణులఁనగు యక్షులయొక్క అజ్ఞాన జనిత మదమును బోఁగొట్టెదను. వీరిని వీరిపదవినుండి భ్రష్టుల నొనర్చి స్థావరముల నొనర్చెదను."

యక్షుడిట్లనెను:- "స్వామీ! మీరు క్రుద్ధులరయ్యెద రేల? మీరు వీరిని స్థావర జన్మకు శాప మొసంగింప నేల గోరుచున్నారు?

నారదుఁడిట్లనెను;- "ఓయీ! సాధారణ విషయాసక్తుడగు బద్ధజీవుఁడై యుండినచో నేనువారినుపేక్షించెడివాఁడనే. వీరుప్రసిద్ధుఁ డగు లోకపాలుని పుత్రులు. దైవయోనియందుద్భవించుటచేఁ బూజనీయులును వందనీయులునై యున్నారు. జ్ఞానమునకును భగవద్భక్తికిని నధికారులు. ఇట్టి యుచ్చ అధికారులైనను వీరత్యంత మదకారణమున వస్త్రములనైన గట్టుకొను జ్ఞానమైన లేకుండునట్టజ్ఞానమున మునిగిఁ యున్నారు నాసమ్ముఖముననను దిగంబరులై వృక్షములవలె నిలిచి యున్నారు. కావున వీరు వృక్షములు కావలెను. వీరిద్దరికిని బరస్పరము మిక్కిలి ప్రేమకలదు. పరస్పరము ప్రేమకల వారేజన్మలోనైనను జన్మించి, కలసి యుందురు. కావున

వీరు వృక్షము లయ్యు, జంటగ నయ్యెదరు. ఇద్దరి మొదళ్లొక్కటిగఁ గలిసియుండు గాక దూరమునుండి చూచిన వీరు వేఱు వేరయ్యు నొక్కటిగఁ దోచెదరు."

యక్షుఁడు చేతులను జోడించుకొని యిట్లనెను:– "ప్రభూ! వీరు మా ప్రభువులు. వీరికవినయమున్నను మీరు క్షమింప వలయును. మీరు దయాసాగరులు. వీరికట్టి కఠోర శాపము నొసంగకుఁడు."

నారదుఁడిట్లనెను:– "నాయనా! నేనెగతాళికైనను నబద్ధమాడను. నావాక్క మోఘము. అది యెన్నటికిని మిథ్య కాఁజాలను. వీరు వృక్షములై తీరవలెను. నీవు అనునయ వినయము లొనర్చుచున్నావు కావున నేనొక పనిచేయగలను. నాయొక్క కృపచే వీరు వృక్షములుగనున్నను జన్మస్మృతి యట్లే యుండుగాక! నేనీదండను వీరికి మరల నజ్ఞానమున బడి యిట్టి యనర్థము లొనర్పకుండునట్లొనర్చుచున్నాను."

యక్షుడిటులనెను :– "స్వామీ! పూర్వజన్మస్మృతి యుండిన నింకను చెరుపే. సదా వీరికి తమ పూర్వదశ స్మరణకువచ్చి దుఃఖితులగుదురు."

నారదుడిటులనెను :– "ఇదియే తపస్సు. తమ పాపములను స్మరించుకొని చింతించుటయు, పశ్చాత్తాపమును చెందుటయు సర్వశ్రేష్ఠమగు సాధనము. పాపమును చేసి హృదయమున బశ్చాత్తాపమును చెందినచో నా ప్రాయశ్చిత్త స్వరూపమగు తపస్సువలన శీఘ్రముగ పాపములనుండి విముక్తుడగును. ఐశ్వర్యమదము వలన నిట్టియనర్థముజరిగినదని వీరికి సదా స్మృతి

యుండినచో వృక్షములుగనున్నను వీరి కి తపస్సు జరుగును. తపస్సునకు స్థానప్రభావముండును. పుణ్యస్థానములలో చేసిన తపస్సు, అన్యస్థానములలో చేసిన దానికంటె నూరురెట్లుగ నుండును. కావున వీరు వృక్షములయినను పరమ పుణ్యప్రద మగు వ్రజభూమిలో నుందురు. వ్రజమందయినను భగవానుని జన్మస్థలమగు గోకులమందు వీరికి జన్మము కలుగును. గోకుల మందును భగవంతుని వాకిటనుందురు, ద్వాపరాంతమున భగ వానుడు నందయశోదలకు పుత్రుడై వీరిక్రింద నాడుకొనగలడు.

యక్షుడిటులనుకొనెను :- "స్వామీ! వీరియుద్ధారము నకును నేదైన నుపాయమును చెప్పుడు."

నవ్వి నారద భగవాను డిటులనెను ;- "ఇంకను నుద్ధారోపాయము మిగిలియున్నదా యేమి? బృందావన ధామ మున వీరు నివసించెదరు. గోపబాలకులొనర్చు శ్రీకృష్ణనామ కీర్తనమును వినెదరు. భగవంతుని నవనీత చోరలీలలను వీరు చూచెదరు. ఆతని సుమధుర త్రైలోక్య పావన రూపమును వీరవలోకించెదరు. నామ, రూప, లీలా, ధామములను నాలుగు సాధనలువీరికబ్బినవి. కేవలము శ్రీకృష్ణధామమునందే విశ్వాస ముంచినను కేవలము శ్రీకృష్ణనామమును పలికినను, కేవలము కృష్ణరూపమందే మనస్సును నిలిపినను, శ్రీకృష్ణలీలలనే, చింతన, మనన, శ్రవణాదులొనర్చినను, నీనాలుగింటిలో నేదొకదాని నాశ్రయించినను నుద్ధారము కలుగును. వీరికి అన్ని యును ప్రాప్తించును. వీరి యుద్ధారమున కేసందేహము లేదు.

యక్షుడిటులనెను :- ఇన్నియున్నను వీరికి వృక్షయోని యెప్పుడు వదలును."

నారదుడిటులనెను :- "యశోద శ్రీకృష్ణుని వెన్నను దొంగిలించెనని కట్టినప్పుడు ఆతడపరాధియై యీ యపరాధుల మధ్యకుండా పోవును. అప్పుడు వీరియపరాధము క్షమింపబడును. వీరు వృక్షయోని నుండి విడివడుదురు. బ్రహ్మాది దేవతలకును లభింపని శ్రీకృష్ణప్రేమ వీరికి లభించును. దేవతా వర్షముల లెక్కతో నూరుసంవత్సరముల వరకు వీరు వృక్షములుగ నుందురు. తదనంతరము నూరుసంవత్సరములు దాటగనే ఆనందకంద, వ్రజచంద్రుడగు శ్రీకృష్ణచంద్రునియొక్క సన్నిధి ప్రాప్తించును. ఆసమయమున వీరు భగవద్భక్తిని పొంది మరల తమలోకమున కధికారులగుదురు. అంత కుబేరలోకమందుండి భగవత్సేవా, పూజా, పరిచర్యలొనర్చుచుందురు. ఈశాపమును నేను వీరి మేలుకొరకే యిచ్చితిని."

సూతుడిటులనెను ;- "మునులారా! ఈవిధముగ పలికి యిచ్ఛానుసారముగ లోకములందు తిరుగుచు దేవర్షియగు నారదుడు భగవంతుని దర్శించుటకు బదరీవనమునకు బోయెను. ఇచ్చట నాయిద్దరు కుబేరపుత్రులు యమళార్జునులై గోకులమున నందుని వాకిట నూరు దేవతావర్షములుండిరి. భగవానుడు వీరిమధ్యకురాగా వారికుద్ధారము కలిగెను. వీరు భగవంతుని స్తుతించి ఆతని యాజ్ఞను తీసికొని తమ లోకమునకు బోయిరి.

శౌనకుడిటులనెను :- "సూతా! తరువాత నేమయినది. భగవంతుడట్లే బంధింపబడియున్నాడా? ఎవరైన నాతని విడిపించినారా?"

నవ్వి సూతుడిటులనెను :- "స్వామీ! భగవంతు నెవ

నను బాధింపజాలరు. ఆతడు తన యిష్టప్రకారము బంధింప బడును. తన యిచ్ఛచేతనే విడివడును. తరువాత సంగతి తరువాత చెప్పెదను."

---

## శ్రీకృష్ణుని కుంబంధవిముక్తి

( ౧౬౫ )

ఉలూఖలం వికర్షంతం దామ్నా బద్ధం స్వమాత్మజమ్।
విలోక్య నందః ప్రహసద్వదనో విముమోచహ ॥

శ్రీభాగ. ౧౦ స్క. ౧౧ అ. ౬ శ్లో.

వ॥ అనియిట్లు పలికిన బాలకాలాపంబులు విని కొందరు మిథ్యారూపంబులనిరి. కొందరు నానావిధంబుల సందేహించి రంత నందుడు వికసిత వదనారవిందుండగుచు బట్టికట్టు విడిచె.

శ్రీమదాంధ్ర భాగవతము.

ఈ ప్రేమమార్గము విలక్షణమైనదని మాటిమాటికని చెప్పవలసి వచ్చుచున్నది. దీనిలో గలుగునది చాలును. పరాత్పరుడును, సచ్చిదానంద ఘనుడునగు శ్రీకృష్ణచంద్రుడు సంసార బంధనమునుండి ముకునొనర్చునని సమస్త వేదశాస్త్రములు చెప్పచున్నవి. అట్టివానిని కూడ తల్లి త్రాటితో బంధించినది. 'కర్తుం అకర్తుం అన్యథాకర్తుం శక్యః' అని సర్వసమర్థుడని చెప్పబడువాడు తన బంధనమును తాను విడిపించుకొన జాల

యుండెను. ఎవరైనను వచ్చి తనబంధనమును విడిపించెదరేమో యను ప్రతీక్షలో నాతడటునిటు తిరుగుచుండెను. ఎవడు ముక్కునకు త్రాడునువేసి యాడించునో ఆతని నెవరు రక్షింపగలరు? ఎవరు విడిపింప గలరు? ఎవరు కట్టిరో వారె విడిపింపవలయును. ఇక మూడవవానికి ఆతని బంధనమును బంధనమని చెప్పగల సామర్థ్య మెక్కడ నున్నది.

సూతుడిట్లనెను:– "మునులారా ! ఆయమళార్జున వృక్షములనుండి యిద్దరు దివ్యపురుషులు వచ్చుటను బాలకులు గాంచిరి. కాని వారేమిస్తుతివిగావించిరో శ్రీకృష్ణుడు వారితో నేమిచెప్పెనో యీవిషయమేమియును తెలియని యాబాలుర కేమి తెలియగలదు. ఆ ధనదకుమారు లిద్దరును వెళ్ళిపోగానే వృక్షములు పడినశబ్దము సావడిలో గూర్చుండిన గోపకులు విని కూర్చుండిన వారు కూర్చుండినట్లుగ బరువిడివచ్చిరి. నందుడును వారి వెంటనుండెను. ఎచ్చటనైనను బిడుగు పడినదేమో యని వారి యనుమానము. వచ్చిచూడగా నెన్నియో యుగముల నుండియుండిన నా పెద్దవృక్షములు విరిగిపడెను. వానిని విఱిచిన వాడు శ్రీకృష్ణుడెద్దువలెనై యాయులూఖలమునుబండివలెలాగుచుండెను. అందరును నావృక్షము లకస్మాత్తుగఁ బడుటచే జింతితులును భయభీతులునైరి. రాగానే వృద్ధ గోపకు లందరును సమీపమున నాడుచుండు బాలకుల నిట్లడిగిరి:–"బాలకులారా! ఈ వృక్షములకస్మాత్తుగనెట్లు పడినవి? గాలిలేదు. నీరులేదు. ఇంతటి పెద్దవృక్షములు వానికవియే యెట్లుపడగలవు? "

బాలకులు తమకు దెలిసిన విషయమును జెప్పుచు మిక్కిలి దృఢతాస్వరమునవిట్లనిరి:– "ఈకృష్ణుఁడీ ఱోటి నీడ్చు

చుండెను. ఈ రెండు వృక్షముల మధ్యగా నిది బయలుదేరఁగనే రోలు ఇరుకుకొనెను. ఈతడు గట్టిగలాగెను. ఈతడు బలముకొలది లాగగనే యీ రెండు వృక్షములును విఱిగి క్రిందబడి పోయెను. మేము చూచుచుండగ నీతడే యీ వృక్షములను బడగొట్టినాడు. దీనిలో నుండి మంచి సుందరులునుగిరీటమకుట ధారులునగు బరమతేజస్వులు వచ్చిరి. వారు కొంచెము సేపు కృష్ణునితో మాటలాడి చివరకాకాశమున కెగిరిపోయిరి. మాముందే యీతడీ వృక్షములను బడగొట్టినాడు."

పిల్లల మాటలను వినికొందరు నవ్వసాగిరి. కొందరట్లేల జరుగుననిరి. వీరు పిల్లలు కావుననసంబద్ధముగ బలుకుచుందురు ఒకానొకడత్యంత సంభ్రమమున నిట్లనెను. "ఈ పిల్లవాఁడు పడ వేయకుండిన మరియిది యెవరి కార్యము. తనకదియే యింతటి పెద్దవృక్షము ప్రబలమగు విసురుగాలిలేక బడిపోజాలదు. ఇదెట్లు జరిగినది? ఈవిధముగ వృక్షములు పడుట ఘోరానిష్టమునకుఁ గారణమని యింకొకఁడనెను.

పిల లాటలలో నొకఁడు గుఱ్ఱమగును. ఇంకొకవసువును బండిగాఁ చేయుదురు. అట్లే నేఁడును బాలకుడు శ్రీ కృష్ణుని నెద్దుగా చేసినారని గోపకులింత వఱకు ననుకొనుచుండిరి. అందువలన నొకఁ డిటులనెను:— "మీరీ కృష్ణునేల గట్టితిరి?"

అందులో నొక చపలపు కుఱ్ఱవాడిటులలెను:— మేమెందులకుఁ గట్టితిమి? ఈతని యశోదమ్మయే కట్టినది."

ఆతఁడిటులడిగెను:— "తల్లి యెందులకుఁ గట్టినది?"

ఆతఁడిట్లనెను:— "ఈతఁడు తల్లియొక్క వెన్నను దొంగిలించినాఁడట. ఆమె పురాతన కుండను బగులగొట్టినాడట. దీనికి కుపితయై తల్లి యీతని నడుమునకుఁ ద్రాటినిగట్టి ఉలూఖలమునకుఁ గట్టినది."

నందుఁడును నిలుచుండి దీనిని వినుచుండెను. ఇప్పు డాతడు వృక్షములు విరిగిన సంగతిని మరచిపోయెను. అతని దుఃఖముప్పొంగెను. యశోదమీఁద లోలోన మిక్కిలికోపము వచ్చెను. ఇంత సుకుమారుఁడగు నాపిల్లవానినిఁ గొంచెము వెన్నకొరకీ గోపిక కట్టినదా? ఆతని కన్నుల నశ్రువులు రాలెను. అంతనాతఁ డిట్లనుకొనెను:— "నేనేడ్చుచో శ్రీకృష్ణుఁడు నేనేడ్చుటను గాంచి బిగ్గరగ నేడ్వఁగలడు. ఆ దృశ్యము చాల కారుణికము కాఁగలదు. నేను బాలకుని ముందు నాదుర్బలతను వ్యక్తపరుపరాదు." అని యిట్లాలోచించుకొని హృదయమున దుఃఖమునుఁ బైకి నవ్వుచు శ్యామ సుందరుని సమీపమునకుఁ బోయి యిట్లనెను:— "కృష్ణా! నాయనా! ఏమిటిరా?"

ఆతఁడు తన యమాయకపు స్వభావమున నిట్లనెను:— "బాబు! బాబు! నన్నే అమ్మకట్టివైచినది."

నందు డత్యంత ప్రేమతో నిట్లనెను:— "నీవేమైన నపరాధ మొనర్చితివా యేమి?"

ఆతఁడత్యంతము తెలియని వానివలె నిట్లనెను;— బాబు! నే నేయపరాధమును జేసియుండలేదు. అమ్మపాలు పొంగెను. అమె తొందరగా దానిని దింపఁబోయెను. ఆమె

మెట్టెలు తగిలి కుండ పగిలిపోయెను. అందులకని నన్నుగట్టి వైచినది. పైఁగాఁగొట్టినది గూడ.''

నందుఁడిట్లనెను:_ ''ఏమియును లేదులే తండ్రీ! ఇప్పుడు నేను మీఅమ్మను గొట్టెదను లెమ్ము. రమ్ము. నీబంధనము నూడఁదీసెదను.''

ఇట్లు పలికి నందుఁడుదరమున బంధించిన త్రాటినూడఁ దీసెను. చంకకెత్తుకొని మాటిమాటికిని శ్రీకృష్ణుని ముద్దిడుకొనెను. త్రాడుబంధించిన చోట కంది యెఱ్ఱబడెను. నందుఁడు దానినిఁ దనచేతితో నిమిరి యిట్లనెను;_ ''వత్సా! అమ్మదగ్గరకు పొమ్ము.''

శ్రీకృష్ణుఁ డిట్లనెను:_ ''నాయనా! అమ్మ నన్నుఁ గొట్టును. నేనిప్పుడమ్మ కడకుఁబోను.''

నందుఁడేమియను దెలియనట్లుండిన కృష్ణుని ముఖమును ముద్దిడుకొని యిట్లనెను:_ ''నాయనా! అమ్మ నీకు పాలొసంగును. నేను నీకెచ్చటనుండి పాలను దెచ్చి యీయఁగలను?''

శ్రీకృష్ణుఁడిట్లనెను:_ ''నాయనా! నేను శ్యామగోక్షీరములను ద్రాగెదను. నీతోఁ గూడి సావడియందు నిద్రించెదను.''

వృక్షములు పడిన శబ్దమును విని యశోదమ్మయును వచ్చెను. రెండు వృక్షములును మూలమట్టముగఁ బడియుండుటను ఆమె గాంచెను. దానికి దగ్గరగ బాలకులును వృద్ధులును వేలకొలఁది స్త్రీపురుషులు నిలుచుండియుండిరి. వృక్షములు పడిన విషయమును గూర్చియే మాటలాడుకొను

చుండిరి. నందుని చంకలో సకుశలముగ శ్రీకృష్ణుఁడుండుటను గాంచి యశోదకుఁ బ్రాణముల లోనికి బ్రాణములు వచ్చెను. ఆమె చేయిసైగతో శ్రీకృష్ణునిఁ దన చంకలోనికి పిలిచెను. కాని శ్రీకృష్ణుఁడు తల్లివైపు నుండి తలను ద్రిప్పెను. మాతృ హృదయము దడ దడ గొట్టుకొను చుండెను. ఆమెకు తాను జేసిన పనికిఁ బశ్చాత్తాపము కలుగసాగెను. "అయ్యో! నా బుద్ధి యెట్లు బుగ్గియై పోయినది. కొంచెము వెన్నకొఱకై యిట్టి సుందర సుకుమార బాలకునిఁ దాటితో కట్టివైచితిని. కుండ మట్టిదే. అది యెన్నటికైనను బగులునదియే. నాబుద్ధి భ్రష్టమై పోయినది. నాకు గోపమను దయ్యము పట్టుకొన్నది పిల్లవాని కనిష్టము కలుగ కుండునట్లు నారాయణుడే రక్షించి నాడు. కాకున్న నింతటి పెద్దచెట్టు పడినది. పిల్లవాడు క్రింద నలిగిపోవలసినది. ఓభగవానుడా! మాపిల్లవానిని రక్షింపవల యును." ఈ విధముగ ననుకొను చుండగా తల్లి యొక్క హృదయమున దుఃఖముప్పొంగెను. ఆమె బాలకునివలె నేడ్వ సాగెను. గోపికలు వచ్చి ఆమె నిట్లోదార్చిరి:– "వ్రజేశ్వరీ! ఏమియును లేదమ్మా! నారాయణుడు బాగుగా రక్షించినాడు. పిల్లవాని కిసుమంతైన హాని కలుగలేదు, నీవుమనస్సునుబాధు చేసికొనకుము. భగవానుడు నీపిల్లవానిని యుగయుగములు జీవింపజేయును.

యశోదకు వృక్షములు పడినవను జింతలేదు. తానుజేసిన పనికి పశ్చాత్తాపము కలుగుచుండెను. ఆమె లోలోన దన్నుదాను దూషించుకొను చుండెను. మా పిల్ల వానికి నామీాద గోపమువచ్చినది. నా చంకకు వచ్చుటలేదు. నేను దల్లినని పిలుచుటకు యోగ్యను గాను. ఏమియును దెలి

యని పిల్లవాని మీఁదగోపించినతల్లియేమి తల్లి?తల్లి శాసనము ప్రేమగ నుండవలయును. ఇంకనుదంౘ్రడియైనఁ గోపించి కసరును గాని తల్లి తన ప్రేమచేతనే పుత్రుని వశపరచుకొనును. నా మనస్సున ప్రేమ ఇసుమంతైనను లేదు. నేను ప్రేమ హీనను.

ఇట్లాలోచించుకొనుచుండగా నామెకు ప్రపంచము శూన్యముగ గనబడుచుండెను. శ్రీకృష్ణుని దీసికొని నందుడు సావడిలోనికి వెడలిపోయెను. ఆతనికి యశోదపైఁ గోపము వచ్చుచుండెను. "ఏదోవిధముగ నీవృద్ధావస్థలో మాకుఁ బుత్రుని ముఖము జూచుట కలిగెను. దీనికది తెలియనే తెలియదు. పిల్లవానినిఁ గట్టివైచినది. నేటికాతఁడును లోపలకు భోజనమునకు రాలేదు. వ్రజరాజు సావడియందే యుండి శ్రీకృష్ణునకు శ్యామాగోవుపాలను బిళికి కలకండను గలిపి యిచ్చెను.

బలరాముఁడా సమయమున నెచ్చటికో పోయియుం డెను. తల్లి తనతమ్ముని గట్టినదనియు, నాతనిపై నగున తరు వులు పడినవనియు నాతఁడు వినగానే ఆతని దుఃఖమునకు మేరలేకుండెను. ఏడ్చుచు నాతఁడు నందుని కడకుపోయెను. నందుడాతని మాటి మాటికి బుజ్జగించెను. కాని బలరా మునకు వెక్కి వెక్కి యేడ్చుట ఆగ లేదు. శ్రీకృష్ణునిఁ గాంచి యాతఁడు రోహిణికడకుఁ బోయి కోపముతో నిట్ల నెను:- "అమ్మా! అమ్మ కృష్ణుని గాంచెను వెన్నకొరకు రోలునకు గట్టినది. నేనచ్చటలేకపోవుట మంచిదైనది. లేకున్న నాహృదయము బ్రద్దలయ్యెడిదే. ఇప్పుడుడామె తల్లియైపోయి నది. మన మేమియు ననఁ గూడదు. ఇంకెవరైన శ్యాముని

శ్రీయంగమును క్రోధముతోఁ దాకినచో నేను దానికి ఫలము చూపించెదు నాఁడనే ?

రోహిణి మిక్కిలి ప్రేమతో వాని యశ్రువులను దుడుచుచునిట్లనెను:– "ఏమియును లేదు నాయనా ! పిల్లలను గొంచెముగఁ గసరకుండిన పనియెట్లు సాగునయ్యా?"

ఈ విధముగ వ్రజమంతటను గోలపుట్టెను. వృద్ధగోపిక లిట్లనిరి:– "యశోద అతిగాఁ జేసినది. ఎచ్చటనైనను బిల్లవానిని గన్నులతో బెదరింపవలయును గాని బెత్తము తీసికొని కొట్టుట, కట్టుట చేయుదురా ? కొట్టుటచేతను గట్టుటచేతను. బాలకుడు బెదరిపోవును. ఈవిధముగ నెన్నిముఖము లుండిన నన్నిమాటల పలుకుచు నుండిరి. యశోదమ్మ ప్రాతఃకాలము నుండి నోటిలోనికి నీళ్లైనఁగ్రోలలేదు. ఆమె శ్రీకృష్ణుని కొరకు కొట్టుకొనుచుండెను. కొన్నిజాములామెకుయుగములవలె దోచుచుండెను. శ్రీకృష్ణుడెన్నడును గోపపడడు. ఆతడు కొంచెము సేపు తొలగియుండి యుత్కంఠాగ్నినిఁ దీవ్రమొనర్చును. వియోగము వలన ప్రేమ స్వారస్యమును వృద్ధినిఁ బొందించును. వియోగానంతరమున గలిగిన సంయోగమత్యంత సుందర మధుమయముగ నుండును.

తల్లి యొక్క యుత్కంఠ పరాకాష్ఠ నందుకొనెనని శ్రీకృష్ణుడు గ్రహించి వ్రజరాజుతో నిట్లనెను:– "నాయనా! నాయనా! నేనమ్మ దగ్గరకుఁ బోవుదును."

వ్రజరాజిటులనెను:– "ఓరీ! అల్లరివాడా! ఇప్పుడే కదా పావడిలో నిద్రించెద ననినది "

శ్రీకృష్ణుడిటులనెను:_ " నాయనా! నీదగ్గర పాలు లేనే లేవు. నేను పాలు త్రాగెదను. "

నందుడిటులనెను:_ " పోపోరా ధూర్తుడా! నీవు తల్లి జూడక నుండజాలవని నేను మొదటనే చెప్పితిని." అని పలికి శ్రీకృష్ణుని దీసికొని వ్రజరాజాంతఃపురమునకు బోయెను. యశోద మిక్కిలి ప్రేమతో గృష్ణుని ఒడియందు గూర్చుండ బెట్టుకొనెను. మాతృస్నేహ కారణమున జాలువారుచున్న తన స్తన్యములను ప్రేమతో శ్రీకృష్ణున కొసంగెను. శ్రీకృష్ణుడు ప్రాతఃకాలమున జరిగిన సర్వవిషయములను మరచి పోయెను. ఆతడు మరల నవ్వుచు నవ్వుచు మాటలాడసాగెను. విస్మృతియే సుఖమునకు జనని. పురాణవిషయములను మరచి మనము నూతన విషయములలో నిమగ్నుల మగుచో నిక నంతయు నానందమే.

సూతుడిటులనెను:_ " మునులారా ! వ్రజమందుండి శ్రీకృష్ణుడిట్టివి యనేక లీలలొనర్చెను. ఇప్పుడు వానిలో కొన్నిటిని నేను ముందు వర్ణించెదను. "



45)

# శ్రీకృష్ణని ప్రేమమయ లీలలు

(౮.౮౬)

శ్లో॥ గోపీభిః స్తోభితోఽనృత్యద్భగవాన్ బాలవత్ క్వచిత్।
ఉద్గాయతి క్వచిన్ముగ్ధ స్తద్వశో దారుయన్త్రవత్ ॥

శ్రీభాగ. ౧౦ స్క. ౧౧ అ. ౭శ్లో

శా॥ పాడున్ మందుని భంగి గోపవనితల్ పాణిధ్వనుల్ సేయగా
నాడున్ జంత్రము కైవడిం బరవశుండై హస్తముల్ ద్రిప్పుచుం
జూడన్నేరని వానిభంగి జనులం జూచున్ నగున్ బాలురం
గూడుం బెద్దలపంపు సేయఁ జనుడాగున్ మట్టిజిట్టాడుచున్.

శ్రీమదాంధ్ర భాగవతము.

భగవంతుని దన విద్యాబుద్ధులచే వశపరచుకొన గల ననుకొనుట వ్యర్థము. వేదములును నెవనిని తెలిసికొనలేక పోయినవో బ్రహ్మాది దేవతలును వేలకొలది సంవత్సరములు ఘోరతపస్సమాధులచే నెవని యథార్థమగు తత్వము నెరుగకుండిరో యాతని నీ యల్పప్రాణి, అల్పమతి, అల్పాయువు, అల్పగుణము గల మానవుడను జంతువు తనస్వల్పబుద్ధి, సాధారణ విద్యద్వారా యెట్లు పొందగలడు. భగవంతుని కంటె నధిక చతురుడెవడైన నుండినచో నాతడుతనచాతురిచే నాతని జయింపవచ్చును. కానియాతడు చతురులలో జతురుడు. ఆతడు చాతురిచే జయింపబడడు. ఆతనినమాయకత్వమున నెవడైన వశపరచుకొనవచ్చును. అమాయకులకు వశమై ఈతడును సాధారణ శిశువువలె నమాయకుడగును. నిష్కపటత్వము సరళ

త్వమెవరి యందుండునో వారికధీనుడగును. అట్లు వశమై శ్రవణమాత్రముననే చరాచర విశ్వమును బరమ పావన మొనర్చురసమయము లగు లీలల నొనర్చును. వ్రజవాసులకు మించిన యమాయకు లెవరు కలరు? భగవానుడు వారి యమాకత్వమునకు సంతసించి వారి కధీనుడయ్యెను.

సూతుడిట్లనెను;- "మునులారా! అర్జున తరువులు పడుటనే గోపకుల మనస్సునందు గొప్ప ప్రభావము పడెను. వారు పరస్పర మాశ్చర్య చకితులై చెట్లుపడిన విషయమును గూర్చి మాటలాడు కొనసాగిరి. కాని యశోద మనస్సునందీ ప్రభావ మేమియును బడలేదు. శ్యామసుందరుడు తనకడకు రాకున్నచో నామెకు దుఃఖము. శ్యాముని శరీరస్పర్శ తగులఁగనే, ఆతని హృదయముతో గౌఁగిలించుకొనఁగనే యశోద సమస్త విషయములన్ను మరచిపోవును. శ్యామ సుందరుని మోహన మూర్తియందు మిక్కిలి యాకర్షణముకలదు. ఒక్కసారి ఆతని వైపునకు జూచెనా అట్లు చూచుచుండ వలసినదే. తృప్తియుండనే యుండదు. శ్రీకృష్ణుని యాకర్షణ మందఱి యందును గలదు. కాని వ్రజవాసినులగు గోపికలు తమ సర్వస్వమును నాతని కర్పించిరి. వారికి శ్యాముని జూడకున్న నానందము లేనే లేదు. కొందరు మజ్జిగ కావలయునను నెపమునను గొందరు దీపమును వెలిగించుట కొరకనియో, ఇంకేవో కారణములను గల్పించుకొని నందగృహమునకువచ్చుచుందురు. గుంపులు గుంపులుగ గోపికలు శ్యామసుధా సాగరమున నవగాహన మొనర్చి ఆత్మవిస్మృతులై అటునిటు దిరుగుచుందురు. శ్యామసుందరుఁడు వ్రజమున నవతరించుటకుఁ గారణ మొక్క వ్రజ సుందరీమణులకు సుఖమొనఁ గూర్చుటయే. అందు

వలన నాతఁడొక యింటినుండి యింకొక యింటికి, ఆయింటి నుండి మూఁడవ యింటికి ఇట్లు తిరుగుచుండుటయే. అమాయకపు బాలకులవలెఁ జేష్టలొనర్చుచుండును. లోపలగొప్ప ధూర్తుఁడు, కాని పైకి గొప్ప అమాయకుఁడుగఁ గనఁబడును. గోపిక లాతఁడనిన సర్వసమర్పణ మొనర్చెదరు. ఆతని జూడగనే యింటిలోని సమస్త కార్యములను మఱచి యితనితో నానందించెదరు.

ఈతఁడాడుట నెచ్చట నేర్చినాడో తెలియదు. కాళ్ళకుఁ గట్టిన గజ్జెలు తల్లిచేఁ గట్టఁబడినవే. ఆతఁడు వానిని ప్రయోగించుచు గంతులు వైచుకొనుచుఁ బోవును. తల్లి యిట్లనును;— "కృష్ణా! నీ నృత్యమును జూపించుమురా?" అప్పుడాతడు రెండుచేతుల నెత్తుచు. నడుము నూపుచు, మూఁతినిఁ ద్రిప్పుచు గన్నులను ద్రిప్పుచు, భావమును జూపించుచు నృత్యము చేయ సాగెను. గోపిక లీతని నృత్యమును గాంచి కడు పుబ్బనవ్వుచు దొర్లు చుందురు. వృద్ధ గోపిక లిట్లందురు.— "యశోద రాణీ! నీకు మంచి నర్తక పుత్రుఁడుదయించి నాఁడమ్మా."

అప్పుడు తల్లి యిట్లనును:— "పిల్లవాడు కాదటమ్మా ఇల్లేదినమంతయును నాడుచుండును. గోపికలు సదా శ్రీకృష్ణుని నృత్యమును జూచుటకు సముత్సుకులై యుందురు. నందుడు వచ్చిన యశోద యిట్లనును:— "కృష్ణా! నాయనకు నృత్యమును చూపించుము. అప్పుడాతడు లజ్జితుడై తల్లివడిలో గూర్చుండి ఆమె పైటచెరగులో ముఖమును గప్పుకొనును. అప్పుడు ముఖమును ముద్దిడికొని తల్లి యిటులనెను;— "ఓరీ!

నీవు చాలా బిడియస్తుడవురా. ఎచ్చటనైన నింటిలో సిగ్గుపడె దరా ? ఇట్లు సిగ్గుపడినచో నీ సహవాసమెవరును జేయరు,!

శ్యామ సుందరుఁడు స్త్రీల కడ మర్మము విడిచి యాడును గాని మగవారిని జూడఁగనే సిగ్గుపడును. ఇంటింటికిని బోయి నాట్యమును చూపించుచుండును. గోపికలిటు లందురు:— "కృష్ణా! నీవు నృత్యమును చూపించినచో నిప్పు డిప్పుడే తీసిన వెన్నను బెట్టెదను," ఇంకేమున్నది. ఈతడు నవనీత ప్రియుడు కదా ! ఇక నాడును.

అంత నింకొకతె యిటులనెను:— "ఆటయే తెలియునా పాటయు దెలియునా ? అప్పుడాతడభిమానముతో నిట్లనెను:— "నాకు గీతమును బాడుటయు తెలియును."

గోపికలిటులనిరి:— "సరే ఒక్కగీతమును వినిపించుము రాగము తెలియునా ?"

ఆతడిటులనెను;— "అవును, రాగముగూడ తెలియును వినుఁడు;- "కాటుక కన్నుల కమలాక్షులార మీ గాదిలి రసమును గావలయు నిండిపుడు" ఇది విని గోపికలు నవ్వి నవ్వి దొర్లి గింతలు పెట్టుచుందురు. చిన్నని గుండ్రని ముఖము నుండి చిలుక పలుకులవలె నీశబ్దములు రాఁగా నవియమృత సిక్తములై వచ్చుచున్నట్లుండును. ఈవచనములను వినఁగానే గోపికలు తమ్ముఁదామే మఱచెదరు. శ్రీకృష్ణుఁడెట్లుపాడి నను నాతని ముఖమునుండి అది అత్యంత సుఖదముగ నుండును. పెద్దపెద్ద గోపకులాతనికిఁ గొన్ని గీతములను గంఠస్థము చేయించిరి. వాటినే ఆతఁడందఱ ముందఁడుగ నుండఁగనే బాడును. వానిలోని అర్థమేమో తెలియదు.

ఆతనికి తెలియదని యెట్లు చెప్పఁగలము. తెలిసియుఁ తెలియని వానివలె నటించును. ఆతఁడర్థము వెంటఁ బడఁడు. శబ్దముల కర్థములనేకములు కలవు. ఒక్కశబ్దమునకే అనేకార్థములు కలవు. అవి హృదయ పరకములు. ఇదిభావముతోఁ జెప్ప బడినది. వాని ప్రయోజన మింతమాత్రమే.

గోపిక లాతని మాట మాటకును నోదార్చుచుందురు. అమాయకుఁడు కావున నిమిషములో గోపికల వలలో పడును. ఒకతె యిట్లనును;— "కృష్ణా! నీవు నృత్యము చేసినచో వెన్నను బెట్టెదను." అప్పుడాతఁడు నృత్యమొన ర్చును. అప్పుడామె యిట్లనును:— " కృష్ణా! నీనృత్యము బాగుండలేదు." అప్పుడు మరల నాడును. ఒకవేళ నప్ప టికిని వెన్నను బెట్టకున్నచో నాతఁడేడ్చుచు వస్త్రములను బట్టుకొనును. పైకెక్కును. గోపికలు నవ్వుచుందురు. తన్మ యులగుదురు.

ఒకదినము నాతఁడొంటరిగఁ బోవు చుండెను. ఒక భావమయయగు గోపిక పేడవేయుచుండెను. ఆమెమనస్సులో నామదనమోహనుఁడే సదా వసించుచుండెను. శ్యాముఁడెచట వెళ్ళుచుండుటను గాంచి ఆమె కృష్ణునితో "కృష్ణా! ఎచ్చ టికిఁ బోవుచున్నావని యడిగెను.

ఆతడు పెడకట్టెగా " వదినె! మీ యింటికే పోవుచు న్నాననెను. గోపిక మనస్సు తన్మయమయ్యెను. ఆమె ఎందు కుఁ బోవుచుంటి " వనెను. ఆతడిటులనెను;— " నిన్న నీవ ప్పటి కప్పుడే తీసినవెన్నను బెట్టెదరమ్మన లేదా ? "

గోపిక యిటులనెను:— " వెన్నలకృష్ణా! తేరకు వచ్చు

నను కొంటివా ? కొంచెము పరిశ్రమ మొనర్పుము. పెట్టె దను.

ఆతడిటులనెను:_ " వదినె ! నీవెట్లుచెప్పిన అట్లు చేసె దను. "

గోపికయిటులనెను:_ "సరే! ఈపేడతట్టను నాకెత్తుము. నీవెంత పేడనెత్తఁగలుగుదువో అంత వెన్న బెట్టెదను. "

ఆతడిటులనెను:_ " సరే! మోసము చేయవలదు."

గోపిక యిటులనెను:_ " మోసమెందులకు? నీవెంత పేడనెత్తెదవో దానికి దగినట్లుగా నీ బుగ్గమీద నేను గుర్తులు వేయుచుండును. "

ఆతడు చనువలేదు. అంగీకరించెను. ఇప్పుడు గోపిక పేడను తట్టలలో నింపెను. ఆతడు తన చిన్నచిన్న చేతులతో బలముగనెత్తెను. ఆసమయమున నాతని చిన్నవియగు నరుణా రుణ కపోలములింకను నరుణములయ్యెడివి. గోపిక పేడ నావల బడవైచుటకు బోయిరాగానే పల్చని పేడతో నాతని బుగ్గ మీద నొక గీటును నాతని కపోలమున వానిమీఁదఁ భద్రముల నంకిత మొనర్చినట్లంకిత మొనర్చును. ఇప్పుడామె యెక్కు డుగ పేడనెత్తలేకుండెను. చితచోరుడామె చిత్తమును హరిం చెను. కొంతసేపటికి ' కృష్ణా ! ఇకజాలునని, గోపికయనెను.

ఆతడు వెన్నను పెట్టుమనెను.

' సఖి యెన్ని ముద్దలెనవి ' యనెను. ఆమె వ్రేళ్ళతో గపోలరేఖలను లెక్కపెట్ట దొడగెను. ఆమె పదియనెను.

ఆత డిటులనెను:_ " నేనెంత సేపటినుండి పేడయెత్తి నది పదియేనా ?

ఆమెయిటులనెను:- "ఎవరిచేత లెక్క పెట్టించుకొన్నను బదియే. నీవు పోట్లాటలకు దిగెదవేమి? ఇంకగొందరు ప్రోగైరి. వారుదీనికొరకే చూచుచుండిరి. ఆతడు తన అభియోగమును నందర గోపికల ముందర జెప్పెను. ఒక గోపిక యిటులనెను:- "నేను లెక్కపెట్టెదను" లెక్కపెట్టు నాటఅయిపోయినది. శ్రీకృష్ణుడు మిక్కిలి యుత్సాహముతో ముఖమును బెట్టెను. గోపికలు తన్మయానందమున నాతని సుందరములగు గుండ్రవియునగు గపోలములందు వేళ్ళను గ్రుచ్చుచు లెక్కించెదరు. ఈ విధముగ జాలసేపటివర కీయాట సాగెను. చివరకు శ్రీకృష్ణుడెంత చెప్పెనో అందరునంతే అంగీకరించిరి. గోపికలిష్టము వచ్చినంత వెన్ననొసగి ఆతని నానందింపజేసిరి.

శ్రీకృష్ణుని గోపికలు కొయ్యబొమ్మవలె నాడించెదరు. భగవానుడెప్పుడు భక్తుల వశమందుండును. ఆతని గోపికల నెట్లాడించిన నట్లాడును. వ్రజములో నన్ని విషయములును దలక్రిందులే. ఈశ్వరుడు జీవులందఱ నాడించును, కాని వ్రజములో వ్రజవాసులీశ్వరునే నర్తకునొనర్చి యాడించెదరు. అచ్చట సర్వేశ్వరుడమాయకుడై శిఖిపింఛమును ధరించి తలగుడ్డను జుట్టుకొని చొక్కాను దొడుగుకొని యెచ్చట కావలయు ననిన నచ్చట నాడదొడంగును. వ్రజమం దాతనికి లజ్జా సంకోచములు లేవు. తన నృత్య గానములచే వ్రజవాసుల నానందపరచుటయే తనకదృష్టమని యాతడు తలచును. ఆతని చేష్టలన్నియును వ్రజవాసుల నానందపరచుటకే.

సూతుడిటులనెను:- "మునులారా! ఈవిధముగ భగవానుడు వ్రజమందు బాలకుడై ప్రాకృత శిశువువలె వద్భుత

ముగను నొకదాని కంటె నొకటి చిత్తాకర్షకముగ నుండు మనోహార లీలలను జేయసాగెను. ఆలీల లనంతములు. నిరంతరము గాన మొనర్చినను శేష శారదులు పారము గానలేరు. అట్టియెడ నావంటి యల్పమతు లెట్లు పారము గానగలరు?

---

# భృత్యవశుండగు భగవానుండు

(౮౮౭)

శ్లో॥ బిభర్తి క్వచిదాజ్ఞప్తః పీఠకోన్మాన పాదుకమ్ ।
బాహుక్షేపం చ కురుతే స్వానాం చ ప్రీతిమావహన్॥
దర్శయం స్తద్విదాం లోక ఆత్మనో భృత్యవశ్యతామ్।
వ్రజస్యోవాహ వై హర్షం భగవాన్ బాలచేష్టితైః ॥

(శ్రీ)భాగ. ౧౦స్కం. ౧౧ అ ౮. ౯ శ్లో

వ. రాజా ! (శ్రీ)కృష్ణుడు లోకమందు జ్ఞానులకు దన భక్తవత్సల తనుజూపించుచు వ్రజవాసుల నానందింపచేయుచు వివిధ విధములగు బాలలీల లొనర్చు చుండెను. స్వజనులాజ్ఞాపింపగా బీట, పాదుకలు, త్రాసు మొదలగు వానిని గొని తెచ్చును. ఒకొక్కప్పుడు చప్పట్లు చరచి మల్లయుద్ధ మొనర్చుచు నీవిధముగ వ్రజవాసుల నందరను హర్షమున ముంచుచుండెను.”

పిల్లలు నడచుట ప్రారంభింపగనే వారికి నడచుటలో

నానందముకలుగును. వారికి మాటలు రాఁగానే ఏదో యొకా మాటలు మాటలాడుట కారంభించెదరు. వారి కే వస్తువు విషయమునైనఁ దెలిసికొనవలయునని జిజ్ఞాస కలుగఁ గానే వారే వస్తువును జూచి ప్రశ్నించెదరు. వారికి పని చేయు శక్తి రాఁగానే ఆయాపనుచేయుటకువ్విళ్ళూరుచుందురు. నడుచుచుందురు. పరువెత్తుచుందురు. ఆడుట ప్రారంభించినచో దానిలో దన్మయులై యుందురు. బాల్యావస్థ మంచి సుఖ కరమగు నవస్థ. బాలకులు సంస్కారము కలవారై తల్లి తం డ్రుల యెడల బాల్యకాలము నుండియే భక్తినిఁదర్శించి వారి యాజ్ఞాను సారము వర్తించినచోఁ దల్లి తండ్రులు వారికి ప్రాణములొసంగెదరు. వారికట్టి బాలకులయెడల నత్యధికాను రాగము కలిగియుందురు. యేదో సాధనలోఁ గొలఁదిగ జరి గిన పొరపాటువలన యోగభ్రష్టులై పవిత్రులగు శ్రీమంతుల గృహములందో యోగభ్రష్టులయిండడ్లలోనో బుట్టిన పుత్రుల విషయము ఆతని గుణముల వలన దల్లియును దండ్రియును నాతనిఁ గనుఱెప్పవలెఁ గాపాడు చుందురు. సమస్తసద్గుణ నిధియగు సర్వేశ్వరుఁడును జగత్పతియును బుత్రుఁడై ఆతఁడు చిన్న చిన్న సేవలొనర్చినచో వారికెంతటి యానందము కలు గునో దానిని మర్త్యధర్మముగల ప్రాణియెట్లు ఊహింపగలడు. ఇట్టివాని తల్లిదండ్రులను గూర్చి యెంతప్రశంసించినను నత్య ల్పమే కాగలదు.

సూతుడిట్లనెను - "మునులారా! ఇప్పుడు శ్రీకృష్ణు డందరును జూచి సంతోషించు పరమలీలల నొనర్చుచుం డెను. ఆతడు మార్గమునందు ముసలివానిని జూచినచో వారిని

బట్టుకొని యింటివద్ద వదలిపెట్టును. కొందరకుబేడనెత్తి నపెట్టును ఎవరి ఆవులైన బాలీయక దన్నుచుండిన దాని దూడను బట్టుకొని నిలుచుండి తల్లివద్దగడ్డితెచ్చి దూడలకు మేపునప్పుడాతడు పెద్దపెద్ద వస్తువులను నెత్తి అటునిటు బెట్టును.

తల్లి యిట్లనును:- "కృష్ణా! అక్కడ నుండి తరాజు తీసుకొనిరమ్మా" అనగానే వెంటనే తరాజును దెచ్చును.

యశోద ఆతనిని పీశరాయి తెమ్మనెను.

ఆతడు పీశరాయి నెత్తుటకు బలమునంతయు నుపయోగించును. గోపికలు నవ్వి యిట్లందురు:- "కృష్ణా! మీ అమ్మ నీకు కడుపునిండ పాలనిచ్చుచున్నట్లు లేదు. అందుకనియే నీవు పీశరాయి నెత్తలేక పోవుచున్నావు."

అప్పుడాతడు బలముకొలది యెత్తి తల్లికడకు దీసుకొని వచ్చి యిట్లనును:- "చూడమ్మా! నా అంతటనేనే పీశరాయి తెచ్చినాను."

తల్లి యిట్లనెను:- "నీవు రాజపుత్రుడవురా!"

అప్పుడు రోహిణి యిట్లనును:- "సరేకృష్ణా! ఆ పీటనిటు దీసికొని రమ్మా."

అప్పుడాతడుపోయి యేదో విధముగ దానిని దన తలమీద బెట్టుకొని ముందువెనుకలకుగాళ్ళను వేయుచుదెచ్చును. తల్లి పరుగెత్తుకొని పోయి పీటను దీసికొని యిట్లనును:- "ఇప్పుడు కృష్ణుడన్ని పనులను చేయుచున్నాడు. చూడు అక్కడనుండి ఒక్కడే తనకుతానే పీటను దెచ్చినాడు."

నందుడు బయటనుండి యింటిలోనికి భోజనమునకు వచ్చినప్పుడు యశోద అతని కాళ్ళను గడుగును. కాళ్ళు కడుగగానే పాదుకల నొసంగును. వాటిని దొడుగుకొని అతడు పీటకడకు పోవును. అప్పుడప్పుడు తల్లి యిట్లనును:– "కృష్ణా! అవిగో ఎదురుగా పాదుకలున్నవి వానిని దీసికొని రమ్ము." అప్పుడాతడు పరుగెత్తుకొనిపోయి నందుని పాదుకలను దల మీదఁబెట్టుకొని తెచ్చును. అప్పుడు నందుడిట్లనును:– "కృష్ణు డిప్పుడు గొప్పచతురుడైనాడే!" ఇదివిని ఆతడత్యంతానంద మును జెందును. ఇప్పుడిప్పుడు నందునకుకాళ్ళు కడిగినను జెప్పకయే పాదుకలను దెచ్చి యచ్చటఁ బెట్టును.

సూతుడిటులనెను:– "మునులారా! లోకపాలురందరు నెవని చరణములకు నమస్కరించు చుందురో, ఎవని చరణ పాదుకాస్పర్శ కొరకు బ్రహ్మాదు లువ్విళ్ళూరు చుందురో అట్టి భగవానుడు నందుని చరణ పాదుకలను శిరస్సునందు ధరించు చున్నాడు. ఇది యాతని భక్తవత్సలతయే. ఆతడు లీలలన్నిటిచే తాను భక్తుల కధీనుడని చెప్పుటకే చేయుచుండును. నాకనుగతు లైనవారికి నేను సర్వమును జేయగలను. వారిని సేవించుట నాకది అహోభాగ్యమని భావించుచుందునని చెప్పుటకే యిట్లు చేయుచుండును. ఆతడు వారికి క్రీత దాసునివలె నగును. ఈలోభముచే వారి వెనువెంట దిరుగుచుండును. వారి చరణ ధూళితనమీదబడిన దానుగృతార్థుడనగుదునని ఆతడుభావించు చుండును. ఇట్టి భగవానుడు నందుని పాదుకలను శిరస్సు మీదఁబెట్టుకొనుటలో నేమియు నాశ్చర్యము లేదు. ఆత డీసరస లీలద్వారా తన బంధువులను అన్యగోపికలను నత్యధికముగ నానందిప జేయుచుండెను.

ఒకానొకప్పుడొక గోపిక యిటులనెను:- "శ్యామ సుందరా! నీవు మీ యమ్మ పాలెన్ని త్రాగినావో చూతము. కుస్తీని జూపించుము."

ఇది వినఁగానే భగవానుఁడు గోచిపెట్టుకొని గోదా లోనికిదిగి మల్లులవలెఁ దాళ్ళ ములను దొడలును గొట్టును. తన తోడివారితోఁ గుస్తీనిఁ బట్టును. చూచువారందరును నోట స్వతః సాధు సాధు యను నట్లుగఁ దనతోడి గోపకుమారులతో ద్వంద్వ యుద్ధమొనర్చి వారినిఁ బడవేయును.

ఒక దినమున నొక ముసలిది వచ్చెను. ఆమె అతివాగుడు కత్తె. ముసలివాగుడుకత్తెలెవరియింటికి వచ్చెదరో ఆయింటి వారినిఁ బని చేసికొననీయరు. లోకవార్తలన్నియును చేతు లను త్రిప్పుకొనుచు చెప్పుచుందురు. వీఁడిట్లు చేసినాఁడు. వాఁడట్లు చేసినాడు. వీఁడిటనని వాగుచుండును. శ్రీకృష్ణు నకు బరచర్చయనిన బాగుండదు. వారిని గూర్చి ఎవరైన మాటలాడినచో నాతనికి విసుఁగు కోపము. ఆతనికి ముసలి దాని స్వభావము తెలియును. ఆమె యేరోజున నింటికి వచ్చునో ఆరోజున యశోదకు పనులేవియును సాగవు.

ఒక దినమున నామె వచ్చెను. యశోదమ్మ యిట్లనెను: "కృష్ణా! చూడు. నాయనమ్మ వచ్చినది. ఈమెకు గూర్చుండు టకుఁ కుదురును తీసికొనిరమ్ము."

శ్రీకృష్ణుఁడు దారములతో నేసిన పాత పీఠమును దెచ్చెను. దానికి తెగిన త్రాళ్ళు వ్రేలాడుచుండెను."

యశోదమ్మయిట్లనెను:- "ఓరీ! నాయనా! ఎంతటి పాత కుదురు తెచ్చినావురా."

ఆతడిటులనెను:- "అమ్మా! నాయనమ్మకు దీనిమీఁద సుఖముగ నుండును. నాయనమ్మ దీనిమీఁద గూర్చుండి మాటలాడు చుండిన నటునిటుఁబడదు."

ముసలిది యిట్లనెను:- "క్రొత్త పాతలతో నేమమ్మా! నేను గొంచెము సేపు కూర్చుండిపోయెదను."

కొంచెము సేపనిన నెంతకాలమగునో శ్రీకృష్ణునకు దెలియును గావున నాతడు పీటను దెచ్చివైచెను. వృద్ధురాలు మాటలాడు చుండెను. శ్రీకృష్ణుడు మెదలక నామె వెనుకనే గూర్చుండెను. ముసలి దాని కిసుమంతైనఁ గనబడుట లేదు. కావునఁ గృష్ణుఁడు పీఁటకు వ్రేలాడుచుండిన త్రాళ్ళతో ముసలిదాని వస్త్రమునకుఁ గట్టెను. ఆసమయమున నింటిలో నొక ఆవు ఈనెను. యశోద దానినిఁజూడ బోయెను."

శ్రీకృష్ణుఁడిట్లనెను:- "నాయనమ్మా! నీవు గూడ పోయి చూడుము. దూడయెంత అందముగ నున్నదో?"

ఇది విని ముసలిది లేచెను. ఆమె వెంట నాకుదురును వ్రేలాడుచు నచ్చుచుండెను. గోపికలిది చూచి పకపక నవ్వసాగిరి. శ్రీకృష్ణుఁడు గంభీరముగ నిట్లనెను:- "ఇందులో నవ్వుట కేమున్నది? నాయనమ్మకు గుదురు బాగున్నది. కట్టుకొని పోవుచున్నది. ఇది నాయనమ్మకు ముఖ్యము. అంతయును గడికువ్వయేకదా!"

దీని కందఱును నవ్వసాగిరి. ముసలిది తిట్టనారంభించెను. ఆదినమునుండి ఆమెకు బుద్ధివచ్చి, యిఁక నందభవనము

నకుఁ బోయిన శ్రీకృష్ణునిఁ జూచి వేడలిపోవుదును. ఆ యీ వ్యర్థపు పల్కులను బల్కవని నిశ్చయించుకొనెను.

సూతుఁడిటులనెను:_ "మునులారా! ఈవిధముగ సర్వ సమర్థుఁడగు ప్రభువు నేఁడు గ్రామీణుని వలె గోపులకధీనుఁడై ప్రాకృత శిశువువలె సమస్త క్రియ లొనర్ప సాగెను. తాను స్వాయముగ నవ్వును. స్వాయముగఁ దినును. తన సహచరులకుఁ బెట్టును. ఎవ రే కోరికతో నీతని కడకు వచ్చెదరో భక్తవత్సలుడఁగు భగవానుఁడాకోరికలను నెఱ వేర్చును. ఇది ధ్రువసత్యము. ఇందణుమాత్రమైన సందేహింప బనిలేదు."



# పండ్లనమ్ముదానిపైఁ గృప

(౮౮౮)

శ్లో॥ ఫలవిక్రయిణీ తస్య చ్యుత ధాన్యం కరద్వయమ్
ఫలై రపూరయద్రత్నైః ఫలభాండ మపూరిచ॥

శ్రీభాగ. ౧౦ స్కం ౧౧ అ. ౧౧ శ్లో॥

వ॥ పండ్లనమ్ముదానికి శ్రీకృష్ణుఁడుధాన్యము పోయగా నాచేతులలో నాపండ్లనమ్మ పడుచుఁ దన తట్టలోని ఫలముల నొసంగెను. అప్పుడు భగవానుఁడు దాని పండ్ల తట్టను రత్నములతో నింపివైచెను.

ఈజీవి యెప్పటి నుండి నీటి దాహమును, ప్రేమాహారముకొఱకాకలిని జెంది యున్నాఁడో తెలియదు. కడుపు నిండుగఁ దినుటయును, కంటినిండ నిద్రించుటయే జీవిత లక్ష్యమగుచోఁ బ్రచురముగ భోజన సామగ్రి కలవాఁడు దుఃఖితుడు కారాదు. దీనిని బట్టి జీవి అన్నాహారములను గాక యింక దేనిని కోరుచున్నాడని దేలుచున్నది? ఆతనికి నీటి దప్పిక కాక యింకేదియో అర్థమును గూర్చిన పిపాస కలదు. ఆ పదార్థమే ప్రేమ లేక అమృతమును ద్రావించినను బిపాస శాంతింపదు. ప్రేమతోఁ గూడిన విషము నొసంగినను వానికి మరణముననుశాంతికలదు. జీవుఁడు ప్రేమకొఱకై తిరుగుచుండును. ఆతడంధకారము నందటునిటు నన్వేషించు చున్నాఁడు. ఒకొక్కప్పుడు ధనమును ప్రేమించును. ఒకొక్కప్పుడు దారా పుత్రులను ప్రేమించును. ఒకొక్కప్పుడు మిత్రులందు దాని నన్వేషించుచుండును. ఒకొక్కప్పుడు ప్రేయసియొక్క కటాక్షము నందు దాని నన్వేషించును. కొంతకాలమచ్చట నిలచిపోయి, మరల ముందునకు బోవును. ఇది ప్రేమయొక్క శాశ్వత స్థానముకాదు. ఈ యన్వేషణ క్రమము జీవునకనంతకాలము వఱకును నడుచుచునే యుండును. చివరకు దైవవశమున యాదృచ్ఛికముగ ప్రభుప్రేమలభింపగనే యథార్థ ప్రేమాస్పదుని దర్శనము కలుగగనే జీవి కృతార్థుడగును.

జీవుఁడాత్మ సమర్పణ మొనర్చుటకు వెనుకాడును. ఆతఁడేదో మినహాయించుకొని ప్రేమించును. పరమ ప్రేమాస్పదుఁడగు ప్రభువు దీనిని సహింపఁడు. ఆతఁడు సమస్తమును గైకొనఁ గోరును. దన రెండుచేతులు నింపుకొన

దలంచును. జీవుడు ప్రేమావేశమునం దన సర్వస్వమును నాతని కర్పించినచో ... అతని రెండు చేతులను నింపినచో వానికిక కర్తవ్యశేషముండదు. భగవానుండు దాత. జీవుండు భోక్త. జీవుండు స్వార్థమును విడువంగానే శ్రీహరి అతనిరిక్త పాత్రమును బూర్ణము కావించును. అతని స్నేహ రత్న ధనముచే నింపివేయును.

సూతుం డిట్లనెను:_ " మునులారా! ప్రభువుయొక్క ప్రాకట్యమున కేకైక లక్ష్యము ప్రేమ దాన మొసంగుటయే. జీవుడనంత కాలమునుండి ప్రేమకొరకు తిరుగు చుండును. ఒక్కొక్కప్పుడు వెల్లువ వచ్చినప్పుడు దానియందు తీరమున నున్న యిండ్లు, చెట్లు, మొక్కలు ఆకులు మొదలగున వన్నియును మునిగిపోవును. అట్లే ఒక్కొక్కప్పుడు ప్రేమ వెల్లువ యుప్పొంగును. అతనిమీద నత్యధిక ప్రేమ పిపాసువులొక్కసారిగ నుత్పన్నమగు చుండును. వారందరియొక్క ప్రేమ పిపాసను శాంతింపచేయుటకు భగవానుడు స్వయముగ నవతారరూపమున ప్రకటితమై శాంతింపచేయును. ద్వాపరాంతమున నిట్టిదే ప్రబలమగు ప్రవాహము వెల్లువయైనది. ఆ ప్రేమ వెల్లువలో స్త్రీలు. పురుషులు, బాలకులు, యువకులు, వృద్ధులు గొప్పవారు, కొంచమువారు, పశుపక్ష్యాదులు, కీటకపతంగాదులందరును ప్లావితులైరి. వ్రజమందు కొంతకాలమిట్లు ప్రకటరూపమున ప్రేమ వెల్లువ ప్రవహింపగా దానినిట్లు నవగాహన మొనర్చి అందరును కృతార్థులైరి. ఈ ప్రవాహము శాశ్వతమైనది. నిరంతరమును ప్రవహించుచుండును. కాని అది సామాన్యగతితో సదా ప్రవహించును. ఆ సమయ

మున ప్రబల ప్రవాహము వచ్చెను. మర్యాదా సేతువులను ఛిన్నాభిన్నము కావించెను. దానిలో జాతి, కులాదుల హద్దు లేవియును లేకుండెను.

గోకులమున నంద నందనుఁడు బాలలీల లొనర్చుచు వ్రజవాసుల నానంద పరుచుచుండు దినములలో మధుర యందొక మిక్కిలి యనురాగవతియగు కూరలను బండ్లను నమ్ముకొనునది సుఖియ యనునది యుండెను. ఆమె కర్ణములకు శ్రీకృష్ణ కథా శ్రవణమను నొక రాజరోగము సంభవించెను. కాముకుల కెన్నటికిని గామమున దృప్తిని చెందరో లోభులు ధనమునకెట్లు తృప్తిని జెందరో ఆమె కర్ణములకు శ్రీకృష్ణకథ లెన్నిటిని విన్నను దృప్తిలేదు. ఆరోజులలో వ్రజమందింటింటను శ్రీకృష్ణుని ధూర్తత్వమును గూర్చియు నాతని సౌందర్య మాధుర్యమును గూర్చియు జర్చ జరుగుచుండెడిది. విషరోగమునకు జికిత్స జరుగకుండిన నొక యంగము నుండి యింకొక యంగమునకెట్లు వ్యాపించి దానిపై నధికారమును వహించునో అట్లే సుఖియ యొక్క కర్ణ రోగ మామె నేత్రములకును వ్యాపించెను. నేత్రములు నిత్యమా ధూర్తుని స్మృతిచే నశ్రువులనుగార్చుచు వానిని చూచుటకై వ్యాకులతను జెంది యుండెను.

ఎవరో ఆమెతో నిట్లు చెప్పిరి:— “శ్యామ సుందరుడేమంత దూరమున లేడు. ఆతడు గోకులములోనే నివసించుచుండును. నీవు ఫలములను దీసుకొని ఆతని ద్వారము కడకు బొమ్ము. నేత్రముల సంతాపము పోవును. ఆతని దర్శనమగును.”

సుఖియ యొక్క వృత్తి పండ్లనమ్ముటయే. ఇదివఱ కామె తనఫలములను గాసులకై యితరులకమ్ము చుండెడిది. ఇప్పుడామె యిట్లనుకొనెను :– "నేను నాఫలములను శ్యామసుందరునకే యొసంగెదను. ఆతనికి ఫలముల నమ్మెదను. నేను నమ్ముడు పోయెదను. ఇట్లనుకొని యామె నందభవనము చుట్టును దిరుగుచుండెను. "పండ్లు కొంటారమ్మా పండు" అని కేకలు వైచెను. కాని కేకలు వైచిన శ్రీకృష్ణుఁడు ఫలములను గొనఁడు. ఆతని కిచ్చుటకు హృదయ లాలస కావలయును. ఉత్కంఠత కావలెను. కొట్టుకొనవలయును. సర్వసమర్పణము చేయుభావన యుండవలయును.

సుఖియా నేత్ర రోగమును శాంతింపఁ జేసికొనుటకు వచ్చినది. కాని అచ్చటనుండి పైగా నొక క్రొత్త రోగమును గైకొనెను. కన్నులాతని యనుపమరూపలావణ్యములను గాంచి యమ్ముడు పోయెను. మనస్సాతని మనోహర రూపమున లగ్నమయ్యెను. చిత్తమందాతని మోహన మూర్తి పాతుకొనెను. సుఖియ అన్నిటిని మఱచెను. లోభముచే లోభము పెరుగును. గుణ శ్రవణమొనర్చుచు, లీలానుసంధాన మొనర్చుచుండ నాతని దర్శింప నుత్కంఠత కలిగెను. దర్శింపఁగనే ఆతనిఁ దాకఁ గోరిక కలిగెను. సుఖద స్పర్శలేని దర్శనమునఁ బూర్ణసుఖము లేదు. దీనివలన వికలత యింకను వృద్ధియగును. శ్రీకృష్ణుడు మిక్కిలి కోమల హృదయుడనియు, దీన బంధువనియు, కృపాళుఁడనియు, నామె వినెను. కాని దర్శనము చేయఁగనే ఆమె యూహ విపరీత మయ్యెను. "శ్రీకృష్ణుఁడతి నిష్ఠురుడని యామెకు

యనుభవమునఁ దెలిసెను. నేనెంతగా నాయన కొఱకు ఉవ్విళ్లూరుచుండినను నావైపునకుఁ జూడనే చూడఁడు. కను మఱేఁగి తప్పుకొని పోవును. ఆతఁడు ఘటఘటముల లోని సంగతి నెఱుగునని విని యుంటిని. హృదయభావముల నెఱుగునని విని యుంటిని. నేనాతనిఁ బ్రేమించుచున్నానని ఆతనికిఁ దెలియదా? తెలిసిన నిట్టి నిష్ఠురవ్యవహార మెట్లొ నర్చును? నేనిఁక నాతని నపేక్షింపను.”

ఆమె యిట్లాలోచించుచున్నది. కాని యిది అమెకు వశమగునా? ఆమె శ్రీకృష్ణుని నెంతగా మఱవఁ దలచు చుండిన నంతగా స్మృతి యెక్కువగుచుండెను. “ఈ గోల నా వెంట నేలఁ బడినని. ఈ నిష్ఠురుఁడు నాపాలిట నేలఁబడి నాఁడు. ప్రేమించిన నీదుర్గతి కలుగునని నాకుఁ దెలియును. అడుగడుగునకు వివశత్వం సహింపవలసియుండిన మొదటనే ప్రేమింపకుండెడు దానను. ఎట్టి నిష్ఠురుని పాలఁ బడితినిర్?” అని యనుకొనుచుండెను. కాని ఆమె బుద్ధి పూర్వకముగ బ్రేమింపలేదు. శ్రీకృష్ణుని నామగుణములలోని మాయ యిట్టిదే. ఒక్కసారి ఆ రసము చెవులకు సోకెనా ఆవైపున కాకర్షింపఁ బడక యెవ్వరు నుండఁజాలరు. ఇప్పుడు సుఖియా సమస్తమును మఱచిపోయి నిత్యమును మధురనుండి గోకుల మునకు వచ్చుటయు, శ్రీకృష్ణుఁడెచ్చటికి పోయిన నాతని వెనువెనుకనే పోయి “ఎవరైన బండ్లను గొందురా” యని యఱచు చుండును.

ప్రేమలో నొక విపరీతగతి కలదు. మనము హృదయ పూర్వకముగఁ బ్రేమించువారు మనయెడల నుదాసీనతను బ్రక

టించిరా ఉత్కంఠతయింకఁ బెరుగును. భగవంతుఁ డంద
ఱకును త్వరగా లభించిన నెవ్వరికిని భగవంతుని యెడల
నింతటి యుత్కంఠత యెన్నటికి నుండదు. ప్రేమియొక్క
యుపేక్ష యుత్కంఠతనువృద్ధిఁబొందించును, ఎంతటి యుత్కం
ఠత యుండిన నంతగాఁజివరకు దర్శనమగును; సుఖానుభూతి
అంతయెక్కువగ నుండును. ప్రేమరూపమగు మోదకమందు
ఉత్కంఠతయను మాధుర్యము నెంత యెక్కువగ వేసిన
నంత యధికముగఁ దీపిగనుండును. సఖియ యొక్క ఉత్కంఠత
యిప్పుడు పరాకాష్ఠనందుకొనెను. ఆమెకు రాత్రులందు
నిద్రవచ్చుటలేదు. పగలాఁకలి వేయుట లేదు. రాత్రియంత
యును తెల్లవారఁగనే నందభవనము వైపునకుఁ బోయెదనను
కొనుచుండును. అప్పుడు శ్రీకృష్ణుఁడు రత్నకంబళమును గప్పు
కొని నిద్రించుచుండ వచ్చును. తల్లి ఆతని మధుర మధుర
గీతములను పాడ లేపును. హారతినొసంగును. నాకడుండదు.
హారలొసంగుటకు ప్రాతఃకాలమునఁ జేరుకొందును. కృష్ణుని
యందమును జూచుచుండును. అంత యశోద అప్పుడప్పుడు
తీసిన వెన్నను నాతని రొట్టెపైనుంచును. దాని నాతఁడు
తన చిన్నచిన్న మెఱసెడు దంతములతోఁ గొరుకుకొని
తినును. తర్వాతఁ బిల్లలతో నాడఁ బోవును. నేను నాతని
వెనువెంటనే పోయెదను. ఆతఁడు గోపికల యిండ్లలో
ప్రవేశించును. నాకు గడ్డములు మీసములు లేవుగదా
గోపికల యిండ్లలోనికిఁ బోవుట కడ్డుకొనుటకు. పైగా నేను
పండ్లనమ్ము దాననుగదా! ఫలములను గొను వారికి
అమ్ము వారికిని నెచ్చటను నడ్డుండఁ జాలదు. అచ్చటకుబోను
కృష్ణుఁడు గోపికలతో మూరాము చేయును. కృష్ణుని కోమల

కరములను గట్టిగఁ బట్టుకొనుటకా మహాభాగులగు గోపిక లెంతటి భాగ్యవంతులో! శీలసంకోచములేక వారాతనిఁగౌగి లించు కొనుచుందురు. నేనొక అభాగ్యను. ఏలననఁగా నావైపునకు శ్రీకృష్ణుడు చూడనే చూడఁడు. ఇతరులతో నవ్వుచు మాటలాడును. నావైపున కాతఁడు చూడనే చూడఁడు. అది యుచితమే. నాలో నట్టి యోగ్యత యెచ్చ టిది? హతభాగినియు, నీచజాతిలోని దాననగు నాకాతని స్పృశించుటకు యోగ్యతలేదు. మరల నిట్లనుకొనును:- ఆతఁడు అశరణ శరణుఁడు. దీనబంధువు. దీనను, నీచు రాలనగు యీ యధమ స్త్రీపై నాతఁడెన్నఁడైనఁ గృపఁ జూపునా?" ఇట్లాలోచించుకొనుచు నారాత్రి యంతయును గడుపుచుండును. ప్రాతఃకాలమున ఫలముల గంపను నెత్తినఁ బెట్టుకొని గోకులమునకు వచ్చును. ఇదియే ఆమె యొక్క నిత్యవ్యాపారము.

ఆమె యుత్కంఠత హద్దులు దాటు నప్పటికి శ్రీకృష్ణుఁ డామె మనోవాంఛను నెరవేర్చి, ఆమె తన యనుగ్రహము నకుఁ బాత్రగాఁ చేసికొనెను.

ప్రతి దినమువలె నొకదినమున నామె గోకులము నకుఁ బోయి, తన స్వభావాను సారముగ "పండ్లోయమ్మ పండు" అని యఱచెను. ఇంకేమున్నది సమస్త ఫలముల నొసంగు ఫలదాత స్వయముగ నామె ఫలములను గొన వచ్చెను. ఆతఁడు దాత కావున రిక్తహస్తములతో నెట్లు రాగలఁడు? కృపణునివలెఁ జేతులను నలుపుకొనుచుఁ గొలఁదిగఁ దీసికొని వచ్చును. ఆతఁడెఱుఁగఁడు. వచ్చిన

బాగుగాఁ జేతులను నింపుకొని వచ్చును. లేదా ముక్త హస్తుడై దోచుకొని పాఱవైచుచు వచ్చును. శ్రీకృష్ణు డింటిలో నుండియే యిట్లు పిలిచెను:- "ఓ పండ్లనమ్ము దానా! అచ్చటనుండుము." ఇంకేమున్నది. శ్రీకృష్ణుఁడే ఆగుమనఁగా నామె యొక్క ఆగమన మాగిపోయెను. చిర కాలము నుండి యుండిన కోరిక నెరవేరెను. ఆమె దేనిని గోరుకొనుచుండెనో అది నేఁడు ప్రాప్తించెను: ఆమె మనో వాంఛ నెఱవేరెను. అభిలషిత వస్తువు దొరికెను. శ్రీ కృష్ణుడామెను బిలిచి, ఫలములను స్వీకరించుటకు సంకల్పించి ఆతని శ్రీముఖమునో నిలుపుకునెను. ఆమె ఆతని వాఁకి టనే నిలిచి పోయెను.

పూర్వకాలమున గ్రామములందు డబ్బుతో వస్తువు లను గొనుట చాల తక్కువ. తక్కువేమిటి? అసలు లేనే లేదు. గ్రామములలో సమృద్ధిగ ధాన్యముండెడిది. ఏదైన వస్తువు కావలసియుండిన దానికి బదులుగ గింజలను బోసి కొనెదు వారు. బెల్లము కొరకు వచ్చిన పిల్లవాఁడు బెల్లపువుండ కెన్ని గిద్దలు ధాన్యమని యడిగిన నాల్గు గిద్దెలనఁగా నాబాలుఁడు సోలెడు ధాన్యమును దెచ్చును. దుకాణదారుఁడు సోలెడు ధాన్యమును గొలుచుకొని బెల్లపు ముద్దను యిచ్చి పంపును. ముల్లంగి యెట్లనిన జొన్నలకు సోలెడు నడ్లకరసోలెడు సవాసేరనును. అట్లే వున్న ధాన్యము నొసంగి కావలసిన పదార్థములను గైకొను చుందురు. ఇట్లు సర్వకార్యములచ్చట ధాన్యముతోడనే జరుగుచుండును.

పండ్లనమ్మ దాని వలనఁ బండ్లను గొనుటకై శ్రీకృష్ణుఁడును దనరెండు చేతులలో దోసిలి యందు ధాన్యమును దెచ్చెను. ఆతని చిట్టి చేతులు కోమల కమల దళములవలె సుందరముగ నుండెను. ఆదోసిలిలో నిండుగ ధాన్యముండెను. ఇంకను దోసిలి నిండఁ దెచ్చుటయును బాగుగా దెలియదు. రెండు చేతుల సందులకుండా నిరంతరము ధాన్యము జారిపోవుచుండెను. అదిముక్త హస్తములతో దానిని వెద జల్లుచున్నట్లుండెను. ఆతఁడు తన దోసిలిలో ధాన్యమును నింపుకొని సుఖియా సమీపమునకు వచ్చి తన యమృతము లొలుకు వాక్యములతో నత్యంత ప్రేమపూర్వకముగ నిట్లనెను:– "వీనినిఁ దీసికొని నాకుపండ్లనిమ్ము. అనిపలికి తన దగ్గఱ నుండిన ధాన్యము నామెకు నొసంగెను. ఈకృపాసాగరుఁ డెవరి మీఁదఁ గృపఁ జూపునో వారికి సమస్తము నొసంగును. వారికింకఁ గొదువ యుండదు. ఇచ్చిన దానికంటె నధికముగఁ బొందును. ఇదిసిద్ధాంత విషయము. భగవానుఁడు తన సర్వస్వము నొసంగు నప్పుడు భక్తుఁడును నేఫలమును దనవద్దనుంచుకొనఁడు. ఆతఁడును ఫలదాతకుఁ దనసమస్త ఫలములను సమర్పించి రిక్త పాత్రుఁడగును. శ్రీకృష్ణుఁడుతనన్ను సరించిన వారి నెట్లు రిక్తులుగా నొనరించునో వారి రిక్త పాత్రలను రత్నములతో నింపును. భక్త భగవానులకే యాదాన ప్రదానములు నిరంతము జరుగుచునే యుండును. ఇందు వ్యవధానము లేదు. అంతరముండదు.

భగవానుఁడెప్పుడు పండ్లనమ్మదానికి గింజలన్నిటినిఁ బోయఁగా నామెయు శ్రీకృష్ణునకుఁ దన పండ్ల నన్నిటిని

నొక్కొక్కటిగ గోమలములగు నాతని చేతులనుస్పృశించుచు దీసియిచ్చుచుండెను. ఇప్పుడాతని చేయినిండి పోఁగాఁ దన పీతాంబరమును సవరించువారెవరు? కపోలములందున్న స్వేద బిందువులను దుడుచువారెవరు? ఇప్పుడు సుఖియాకు సంకోచము దూరమయ్యెను. శ్రీకృష్ణుని నడుముకట్టు వదులుకాఁగా నామె దానిని గట్టిగ బిగించెను. ఆతని సుందరని కపోలముల మీఁద నున్న స్వేద బిందువులను దనపైఁట కొంగుతోఁ దుడిచి ముద్దుగా నిట్లనెను:- "ఓ నాయనా! ఇంటిలోనికిఁ దీసికొని పొమ్ము.

ఆమె తన బుట్టలోని పండ్లనన్నిటిని దనకే సమర్పించుట గాంచి ఆతఁడామె బుట్టను రత్నములతో నింపివైచెను. ఆమె కృతార్థయయ్యెను. కృతకృత్యయయ్యెను. ఆమె తన జీవితఫలమును బొందెను. శ్రీకృష్ణుఁడామె ఫలములతోఁ గూడ ఆమె మనస్సును గూడ హరించెను. ఇప్పుడామె తన మనస్సున కధీనకాక మదన మోహానుని మనస్సునకల దయ్యెను.

సూతుఁడిటులనెను:- "మునులారా! ఈ విధముగ శ్రీకృష్ణుఁడు గోకులముననుండి నొకదాని కంటె నొకటిగ సరస సుఖప్రదమగు లీలల నొసంగెను. ఇప్పుడాతఁడు తన చరణకమల రజముచే బృందావనమును పరమపావన మొనర్చుటకు నిశ్చయించెను. గోకుల లీలలను సమాప్త మొనర్చి బృందావన లీలలొనర్ప నాలోచించుచుండెను. ఏలననఁగా గోకులము లోనివి బాలలీలలే. బాలలీలలు వాత్సల్య రసోపాసకులకు మిక్కిలి సుఖప్రదములుగ నుండును. శ్రీకృష్ణుడు

సర్వరస ప్రపాత. ఆతఁడు రసిక శేఖరుఁడు. సఖ్యమాధుర్య లీలలకు భూమి బృందావనము. అందరును వారివారి భాగ ములను బంచుకొనుచుందురు. గోకుల వాసుల ఉపాసన వాత్సల్య రసోపాసనము. బృందావనములోని వారికి వాత్సల్య రస మంతగాఁ దెలియదు. అచ్చట సఖ్య మాధుర్య రసముల ప్రాబల్యము కలదు. సఖ్యమున కైనను నచ్చట పరిమితి గానే కలదు. కాని అచ్చటమాధుర్య రస సామ్రాజ్యము కలదు. రాసరాసేశ్వరి పురములో శ్రీకృష్ణు నడుగువారెవ రున్నారు. భగవానునకు బృందావనమునకుఁ బోవబుద్ధి యెప్పుడు కలిగినదో అట్టిబుద్ధినే ఆతఁడు గోపకుల మనస్సు లలోఁ గలుగ చేసెను. అందరకును బరాత్పరుఁడగు ప్రభు వాతఁడే. జగత్తు ఆతని ప్రేరణచేతనే నడుచు చున్నది. ఇప్పుడు నేను శ్రీకృష్ణుని నిత్య భోజనాదిక లీలను గూర్చి చెప్పి బృందావన లీలలను వర్ణించెదను.



# క్రీడాప్రియులగు బలరామకృష్ణులు

౮౮౬

శ్లో॥ ఇత్థం యశోదా తమశేష శేఖరమ్
మత్వా సుతం స్నేహ నిబద్ధ ధీన్నృప ।
హస్తే గృహీత్వా సహరామ మచ్యుతమ్ ॥
నీత్వా స్వవాటం కృతవత్యథోదయమ్ ॥

(శ్రీ)భాగ. ౧౦ స్క. ౧౧ అ. ౨౦ శ్లో॥

(శ్రీ) శుకుఁడిటులనెను;- "రాజా! ఈవిధముగ నశేష శేఖరుఁడగు శ్రీహరిని దన పుత్రునిఁగా భావించి, పుత్రస్నేహ పాశబద్ధురాలై యశోదాదేవి, బలరామునితోఁ గూడ (శ్రీ) కృష్ణునిఁ జేయి పట్టుకొని తన యింటికిఁ దెచ్చెను. అంత వచ్చిన తరువాత నే యే మంగళ కృత్యములొనర్పవల యునో వాని నొనర్చెను."

ఏకాంత భోజనము త్యాగులకును, విరాగులకును సన్న్యాసులకును బాగుండునేమో కాని గృహస్థుల భోజన ములో నానందము తన విస్తరియందు బాలురు గూర్చున్న పుడే కలుగును. ఒక ముద్దను బిల్లవాని నోటబెట్టి తాను దినును. పిల్లలు పిల్లలే కావున విస్తరిలో మంచి వస్తువు కనబడెనా దానిని వెంటనే తిని వేయును. వారికి భయము లేదు. సంకోచము లేదు. మిథ్యాశిష్టాచారముండదు. వారి కేది మంచి దని తోచునో, దానిని జంకు గొంకు లేక చేసి వేయుదురు. వారికి రుచించిన వస్తువును దిని వేయు చుందురు.

అరణ్యవాస మొనర్చుచుఁ దపస్సు చేసికొను ముని పుత్రులకు గంభీరత మిక్కిలి ప్రశంసనీయముగ నుండు నేమో కాని గృహస్థ బాలకులకుఁ జంచలత్వము భూషణముగ నెన్నబడు చున్నది. బాలకుఁడెంతటి చంచలముగ నుండిన తల్లిదండ్రుల కంతటి యధికానందమును గలిగించును. బాలకుల చంచలత్వమును గాంచఁగనే తల్లి దండ్రులకును మిగిలిన పరిజనములకును రోమరోమ మానందమున నుప్పొంగును. వారి చంచల చేష్టలు మధువుకంటె మధురముగను తియగబోసిన రుచికంటె మిక్కిలి రుచిగను నుండును. భాగ్యశాలురగు గృహస్థులకే యిట్టి చేష్టలను జూచు భాగ్యము లభించును.

సూతుఁడిటులనెను:– "మునులారా! ఇప్పుడు శ్రీకృష్ణచంద్రుఁడు గోకులమునకు దూరముగ యమునాతటమున నాడఁ బోవుచుండెను. అచ్చటఁదడి యిసుక యందు కాలిని బాతుకొని, దానిమీఁదఁ దడి యిసుకను వేసి తపతపకొట్టి మరల మెల్ల మెల్లగఁ గాలిని లాగును. అప్పుడచ్చట నొక గుహవంటి దేర్పడును. శ్యాముఁ డిటులనును:– "చూడుడు. మాకు పొయ్యి యేర్పడినది. అంతదానికొక రంధ్రమును చేసి అగ్నిని వెలిఁగించును. ఇసుకను వేయించు నభినయము నొనరించును. మట్టితో నెద్దులను దూడలను చేయును. ఇండ్లు ప్రాకారములను నిర్మించును. గోలీలలాట, బిళ్ళము కోడు, దాగుడుమూత మొదలగు నాటలాడు చుండును. అడుటలో నాతడానందమున సమస్తమును మఱచుచుండును.

తల్లి చేయు పనులన్నియు కృష్ణబలరాముల కొఱకే

